# సాధన సామగ్రి

## తొలుమూట

[దుర్గాసప్తశతి ఆధ్యాత్మిక వివృతిసారము]

గ్రంథకర్త :

*శ్రీ శ్రియానందనాథుఁడు*

**ఈశ్వర సత్యనారాయణ శర్మ**





ప్రకాశకులు :

**సాధన గ్రంథ మండలి, తెనాలి.**



[ వెల రూ. 100-00

# పీఠిక

## శతావధానులు, శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారు

తంత్రశాస్త్రము పలు తెఱఁగులగు ఆగమములకు మహా సముద్రము. వీనిలో శైవ వైష్ణవాగమములందు ద్విజాతులకే అధికారము. కాని శాక్తాగమములు మానవులందఱకును తలుపులు తెఱచియుంచెను. వేదములు విడిచిపెట్టిన ఆఁడువారికి ఇవి అగ్రతాంబూలమిచ్చెను. అఱితేఱి పవిత్రురాలగు ఆచార్య యుండునెడల నామెకడ దీక్షగొనుట మేలుతర మనియు శీఘ్ర సిద్ధిప్రదమనియు నివి చెప్పను.

పలు తెఱఁగులగు నీ యాగమములలో నీ దిగువ అంశములు సాధారణములు : "మానవుఁడు, పరదేవతాంశము. మఱియు అతఁడొక సూక్ష్మబ్రహ్మాండము. అతనిలో సృజన శక్తియు నిద్రాణమై యున్నది. బ్రహ్మాండమునందున్న శక్తులన్నియు ఈ పిండాండమునందును ఉన్నవి. మానవుఁడు వీని నన్నిఁటికిని నిదుర బాపి తన దివ్యత్వమును తెలిసికొనవలయును. కర్మ వలయునేకాని నైష్కర్మ్యము తగదు. జీవితక్షేత్రము నందలి సందుల గొందుల చీకటి తొలఁగించి పరదేవతను తనలో నావిర్భవింపఁ జేసికొనవలయును."

సాధన చేసి అనుభవమునకు తెచ్చికొనుమని చెప్పుటే తంత్రశాస్త్రము. కావుననే దీనిని ప్రత్యక్ష శాస్త్రమని, సాధన శాస్త్రమని, ఉపాసనాశాస్త్రమని అందురు. ఈ శాస్త్రమునకు జ్ఞాన - యోగ - క్రియా - చర్యా - పాదములని నాలుగు పాదములు.

## జ్ఞానపాదము

జగత్కారణమును నిర్వచించునది జ్ఞానపాదము. బ్రహ్మము ఒక్కటన్న నొక్కటే. అది మాఱదు. ఎంగిలి కాదు. అది సచ్చిదానందము. జీవుల ననుగ్రహింప బోవుముందు ఉపాసనమునకు వీలుగా ఆనందము పెల్లుబికి అమ్మగను అయ్యగను అగును. అమ్మయే అయ్య, అయ్యయే అమ్మ వెరసి అమ్మయ్య లేక అయ్యమ్మ ఇదియే శక్తి శివుఁడు. ఈ శివశక్తి తత్త్వమునుండి సృష్టి ప్రవహించును. తంత్రసాధనకు మూల స్తంభము శక్తి. శక్తి స్ఫురణమువలన తత్త్వాంతరములతో పాటు పరమతత్త్వానుభూతి. శక్తి నిత్యము. దీనికి ఉన్మేషము, వికాసము, నిమీలనము అనునవి కలవు. ఇది అనాది అనంతము. శివ శక్తులకుఁగల సంబంధ మభిన్నము. శక్తిశివు నాశ్రయించి ఎడతెగని సృష్టికిని గతికిని కారణ మగును. శక్తికి నిర్విశేష, సవిశేష ప్రకాశము లున్నవి. శక్తి శివునం దుండి సవిశేష స్పందముచే నామ రూపాత్మకమగు విశ్వమును, నిర్విశేష స్పందముచే నామరూపా తీతమగు విశ్వమును ప్రకాశింపఁజేయును. శక్తి వికాసమునందలి ప్రాథమికావస్థ నిర్విశేషము, ప్రశాంతము. ఇచట శక్తికి పరిణామము లేదు. ప్రకాశము మాత్రము కలదు. ఇచటి శక్తి సముద్రములో తరంగము లున్నను వీని కంపనము ఒక మూర్తి గొనదు. నిర్విశేషమగు నీ శక్తి 'పరాశక్తి'. దీనికి ముందీశక్తి శివునిలో స్తిమితమయి యుండును. ఇది నిమీలనము. ఇదియు పరమశివతత్త్వము. శైవాగమము లీ యవస్థను శూన్యమని యనును.

## యోగపాదము

అజ్ఞానమును అడఁచి తనలో నిగూఢమైన దివ్యత్వమును వికసింపఁజేసి ప్రాణశక్తి కాధారమును శివశక్తి స్వరూపమును అయిన ఆనందములో తన జీవానందమును మేళగింపఁ దెలుపు నుపాయములు యోగపాదము. జ్ఞానపాదమునందు జెప్పఁబడిన తత్త్వముల నన్నిఁటిని అనుభవమునకుఁ దెచ్చికొనకున్న యెడల ఆ జ్ఞానము శాస్త్రముగానే శేషించును. కావున ఈ యోగపాదము పూర్వపాదమునందలి ప్రతివిషయమును అనుభవమునకు దెచ్చికొనుటకు ఎన్నియో సాధనముల నుపదేశించెను. అంతరంగ సాధనమనియు, బహిరంగ సాధనమనియు సాధనము రెండు విధములు. ఇవి రెండును జీవనక్షేత్రము నంతయు పవిత్రమొనరించును. దీనివలన సాధకుఁడు మనోవాక్కాయ కర్మములను మాతృమయముగాఁ గనుఁగొనును. ఇందు కుండలి నీయోగము ముఖ్యము. భక్తి బాసట.

## క్రియాపాదము

క్షేత్రదర్శనము, దేవదర్శనము, దేవళము, యాగము మొదలగువానిని జెప్పునది క్రియాపాదము. ఇవియన్నియు తన చుట్టుననున్న మానవ సమాజముతో సన్నిహిత సంబంధమును పోరాని చుట్టరికమును కల్పించును. చక్రపూజ వీనిలో నొకటి. దీనిచే భేద మను మాట లేకుండఁబోవును. - 'సంప్రాప్తే భైరవే చక్రే సర్వే వర్ణా ద్విజాతయః' 'చెడుగున కిది దారి' యని యొక యభిప్రాయము లేకపోలేదు. పెద్దవారి చేరిక వలనను,

చెడుపనులవలనను మేలుగూడ కీడగును. కడవెఁడు పాలు ఒక విషబిందువుతో కడవెఁడు విషము కాఁగలదుకదా ! కాని సమిష్టి సాధనలో వ్యక్తులకును, సంఘమునకును మేలున్నది. అది యటుండె. వైదికతంత్రములందలి అగ్నిగృహము దేవాలయ ముగను, యజ్ఞములు నవరాత్రములందలి దేవీయాగములుగను, కర్మకాండ ఆగమకాండగను, వైదిక దేవతారూపము మంత్ర రూపముగను, సగుణబ్రహ్మము గాయత్రిగను తంత్రసాధనలో మాఱెనని పెద్దలందురు.

## చర్యాపాదము

సాధకులు చేయువలయు పూజాప్రకారము సాంగో పాంగముగా వివరించునది చర్యాపాదము. సాధనలో ఇది చాల ముఖ్యము. 'పాణిని ప్రాఙ్ముఖముగా కూర్చుండి దర్భ పవిత్రపాణియై వ్యాకరణ సూత్రములఁ జెప్పునపుడు ఆ యాచార్యుల వారు రెప్పలల్లార్చినను, మోము చిట్లించినను, చేయి విదలించినను దాని కర్థముండు' నని మహాభాష్యమున పతంజలి. అటులే తంత్రము న్యాసముమొదలయిన క్రియాకలాపమును రూపకాతిశయోక్తి భాండారముతో నింపి ఉపాసనమును ఎంతయో పరిపుష్ట మొనరించెను. ఈ పాదమున ఎన్ని యోసాధన లెన్నియో రూపులతో నున్నవి. ఏలయనఁగా తలకొకబుద్ధి. అందఱకును ఒకే తెఱఁగు సాధన ఇందదు. కావున సాధకులను ముక్కుట మూఁడు విధములుగా తంత్రము విభజించెను. సత్త్వరజ స్తమోగుణభేదముచే భిన్నులయిన ఆ యీ దివ్యవీర పశుసాధకులకు ఇది తగిన ఉపాసనము బోధించెను.

'నేను కర్తను, భోక్తను, ఇది నాయిల్లు, అది నా పొలము' అని సంసారమును పట్టుకొని ప్రాఁకులాడువాఁ డధమ పశువు.

పశువు పలుపుచే కట్టఁబడును. సంసారి అవిద్యారజ్జువుచే కట్టఁబడును. కావున సంసారి పశువు. పరోక్షజ్ఞానము కలిగి సత్కర్మ పరాయణుఁడై అపరోక్షజ్ఞానముకొఱ కారాటపడువాఁ డుత్తమ పశువు.

అవిద్యారజ్జువును తెంపుకొని ఆనందహ్రదముదెస కుఱుకు వాఁడు వీరసాధకుఁడని చెప్పఁబడును. ఇతఁ డెఱుకదగిలి దానికై మేనినేని లెక్కింపక దానివెంటఁ బరుగులెత్తువాఁడు వీరుఁడు. ఎంత పర్యంత మాత్మసామర్థ్యమును పెనుపొందింపవలయునని ప్రయాసపడునో అంతపర్యంత మతఁడు వీరసాధకుఁడు. ఈ స్థితిలో అతని ద్వైతము కొంత అంతరించును. అతఁ డపు డీ విశ్వమును శివశక్తుల విభూతిగా తెలియఁగల యోగ్యత వడయును. అతఁడు చేయునది కర్మయోగము. అపుడు తన్నతఁ డీశ్వరయంత్రము నుగాఁ దలఁచును. కామవాసనల నడఁచి సంసారమునందు వీరునివలె విహరించును. ఈశ్వరునిమ్రోల కర్మలను కర్మఫలమును వాసనలను నివేదించి శుద్ధప్రవృత్తి పొందును. శివశక్తి ప్రేరణ చేతనే అవుడతని నడత. అతని వాననాహంకారబీజములు దగ్ధమయిపోవును. అతని యీ యవస్థ - "భోగో యోగాయతే ... ... మోక్షాయతే చ సంసారః." వీరసాధకుఁడు ప్రకృతిని నిగ్రహింపక దానియెడ నిర్లిప్తుఁడగును. కాని దాని నవలంబించియే సంశోధనమొనర్చి దానికి ఊర్ధ్వగతి చేకూర్చి దానితో పాటు శక్తి సాయుజ్యము వడయును. ఈ వీరసాధకుని 'కౌలమార్గ రహస్యము' చూచునది.

ఇంద్రియములకు లోఁబడకుండుటయకాక నిర్లేపముగా నుండుటయకాక భగవానునకు శరణాగతి చెందువాఁడు దివ్య సాధకుఁడు. అహైతుకమగు భక్తియు పరానురక్తియు దివ్య

భావమును పూర్ణమొనర్చును. అపు డా దివ్యసాధకుఁ డాద్యా శక్తికి లేక యీశ్వరునకు 'అతీవప్రియుఁడు'. ఐహికజీవనమునం దత్యుత్తమమగు నిట్టి జీవుని అవస్థలో ప్రకృతి శుద్ధభావమయ మూర్తితో కలకలలాడును. ఏలన మానవరూపియగు జీవుఁడు ప్రకృతిశ్రేష్ఠాభివ్యక్తి. దివ్యసాధకునందలి చైతన్యాభివ్యక్తి యెంతయో ప్రకృత్యభివ్యక్తియు నంతయే. ప్రకృతికి ప్రతినిధిగా ఒక మెట్టుమీఁదినుండి మఱియొక మెట్టుమీఁదికిఁ బోవునపుడు అతని వెంట అతని ప్రకృతియు ఊర్ధ్వగతితో అనంతముదెస నడచును. ఇదియ అభివ్యక్తి.

పశుమానవునిలో దేహప్రాణ మనోరూపముగా ప్రకృతి అచేతనమటులు నిదురించుచుండునంతవట్టు గతానుగతికముగా నతఁడు దేహయాత్ర చేయుచుండును. వీరసాధకుఁడు దేహప్రాణ మనోతిరిక్తుఁడగు ఆత్మ ననునంధించి ప్రకృతికి నిద్రాభంగ మొనరించి దానిపై తన యధికారము నెలకొల్పఁజూచును. దివ్యసాధకుఁడు తనలో పరమాత్మను చూచి తన ప్రకృతితోఁ గూడఁ దాను అతనికి శరణాగతుఁ డగును. అపుడు నిదురమంపులోనున్న ప్రకృతి పూర్ణముగా జాగరిల్లి పరమాత్మ స్పర్శకొఱకు పాదరసమువలె ప్రసరించును. ఆరోహణమున కిది అవధి.

సాధకుని క్రమక్రమముగా పైకిఁ దీసికొనిపోవుట తంత్ర సాధన మూలోద్దేశము. ఈ దివ్యభావసాధన సాధకుని దేహప్రాణ మనోనిర్మితములగు ప్రాకృత భువనములనుండి పరాప్రకృతి నిర్మితములగు భువనములకు తీసికొనిపోవును. జీవాత్మను జడ ప్రకృతిలోని కవతరింపఁజేసి మఱల చిజ్జగత్తునకుఁ గొనిపోవుట

మహామాయ లీల. దివ్యభావసాధనలో సాధకుని అంతరాత్మకు భగవానునితో ప్రత్యక్షయోగము కలుగును. కాన భగవంతుఁడు మాయకు పైనున్న విద్యాశక్తి నాకర్షించి జీవుని పైలోకములకుఁ గొంపోవును. అపుడు మేను తాల్చిన జీవుఁడు శివశక్తిమయమగు జగతిలో సమాధి ననుభవించును. అచటి యమృతము నతఁడు మాటిమాటికి అనుభవించును. సిద్ధపురుషుల జీవనమునం దీ సమాధిలక్షణములను మనము కనుఁగొందుము. వారు సమాధి వీడినపుడు జీవన్ముక్తులై ప్రపంచమున దేనికిని బద్ధులుకాక 'పరమహంసలై' 'పరమజీవులై' ఉందురు. వారీ ప్రపంచమునం దున్నంతవట్టు మహాశక్తి కేంద్రరూపముగనే ఉందురు. వారిలో కొందఱు జ్ఞానులుగా మఱికొందఱు భక్తులుగా ఇంకొందఱు ఉభయభావముతో నున్నను అంతరాత్మ యోగముచే నెల్లపుడును సర్వభావములయు కేంద్రమున సమాసీనులే. సిద్ధపురుషులు జాగ్రదవస్థలో నున్నపుడు ఈ జగత్తును, ఈ జగత్తునందలి ప్రతి పదార్థమును శివశక్తిమయముగాఁ జూతురు. వారి జీవనయాత్ర విశ్వశక్తి లీలాయంత్రము. విశ్వేశ్వరి ఇచ్ఛలో వారి యిచ్ఛ ఏకీభూతము. అప్పటి పరమాత్మతోడి జీవాత్మయోగము నీటిలో నీరివలె పాలలో పాయివలె నేతిలో నేవలె నుండునని కులార్ణవతంత్రము చెప్పును. సిద్ధులు అద్వయజ్ఞానము, పరాభక్తి లాభముతో ఈశ్వరకోటిలో చేరుదురు. బాలోన్మత్త పిశాచములవలె నున్నను వారు పరమేశ్వరిలోనే యుందురు. ఇదియే తంత్రము చెప్పు సిద్ధయోగుల అవస్థ.

## తంత్రము - ముక్తి

తంత్రసాధనలో ఆద్యాశక్తియే అభీప్సితము. పరమశివుఁడు నిష్క్రియుఁడు సమాహితుఁడు. ఐనను శక్తిలాభానంతరమే సాధకుఁడా స్థిరసమాధిస్థిత తత్త్వము పడయనగును. పురుషసాధనతో వేఱవనిలేదు. శక్తిలాభము శక్తిస్వరూపావ స్థితియేం పరమపురుషార్థమని తంత్రమతము. స్థూలప్రకృతి పరమ ప్రకృతి బాహ్యవికాసము. కాన ప్రకృతిని - జీవశక్తి నంతర్ముఖ మొనరించి బహిర్ముఖమగు ప్రకృతి స్పందనమును ఉన్మనీభావముచే ఊర్ధ్వగతి నొందించి ఆద్యాశక్తితో యోగస్థాపన మొనరింప వీలగును. ఈ యవస్థలో నిజప్రకృతితో జీవపురుషుఁడు ముక్తుఁడే. శివావస్థ వడసి ఆద్యాశక్తితో సదాతనమేళనమున కృతార్థత.

వేదాంతము కైవల్యము ముక్తి యనును. తంత్ర మటులనదు. జీవుఁడు జీవప్రకృతితో అపరాప్రకృత్యుపాదానములఁ గూడ ఊర్ధ్వభువనములకుఁ గొంపోవును. అంత జీవున కీశ్వర సాయుజ్యము, జీవప్రకృతికి మహావిద్య - మహామాయ - లేక ఆద్యాశక్తి సాయుజ్యము. ఈ సాయుజ్యము కైవల్యముక్తి కాదు, మఱి 'పరాముక్తి', పరాభుక్తి'. ఏలనఁగా తుదమొదళ్లు లేని శివశక్తుల ఆనంద మీ విశ్వము. ఈ యానందము విశ్వశక్తి విశ్వేశ్వరుల సాయుజ్య నిత్యధర్మము. ఈ పరమానంద లాభముచే జీవునకును అతని ప్రకృతికిని సార్థకత. దివ్యమానవుఁడపుడు శివసాయుజ్య లాభమున శివత్వ మొంది అనంతానందముతో చిన్మయధామమున విలసిల్లును. తంత్ర మీయవస్థకు ద్వైతమనికాని, అద్వైతమనికాని, ద్వైతాద్వైతమనికాని పేరు పెట్టదు. 'కొందఱు ద్వైతమును కొంద

అద్వైతమును నెన్నుదురుకాని నా తత్త్వ మీరెంటికి మిగులు' అని కులార్ణవతంత్రము. ౧-౧౧౦. ఇది యెటులు ? ప్రతి జీవుఁడును శివుని విభూతి. అవిద్యమీఁది మాయ దాఁటి విద్యాతత్త్వము చేరఁగనే జీవునకు స్వరూపోపలబ్ధి. ఆతఁ డాస్వరూపముతో శివునియే అనంత మూర్తులలో నొకమూర్తి. జీవుఁడు శివుని సనాతనాంశము. అంశమునకును అంశికిని స్వభావ మొకటే. కాన ఈశ్వరత్వము జీవుని నిత్యస్వభావము. ఈ స్వభావముచే నతఁడు శివునిలో అద్వైత స్వరూపముతో నిమగ్నుఁడై యుండనగును. లేక విశిష్ట చిద్ఘనమూర్తితో పరశివుని ఒక విశిష్ట కేంద్రరూపముగా నుండనగును. లేక ఆనందముకొఱకు పరమశివునితో ద్వైతాద్వైతలీలగా నానందింపనగును. ఇవన్నియు నవుడు సచ్చిదానందమునందలి తరంగముల భంగివిశేషమాత్రము. ఇచట ద్వైతాద్వైతబోధల భేదముమీఁద చూపు లేదు, ఉన్న దెల్ల లీలానందముమీఁద.

## ఆంధ్రదేశము - తంత్రము

తొల్లి తంత్రశాస్త్రము అధీతిబోధాచరణ ప్రచారణములచే కాశ్మీరములందును, గౌడములందును, కేరళములందును ప్రసిద్ధము. తెలుఁగు ఱేండ్లు తంత్రోపాసనలో సిద్ధి నొందిన కొందఱను ఆదరించి తమ ఆస్థానములందు నెలకొలుపుకొని యుండనియెడల దీని పేరయినను లేకుండఁబోయెడిది. ఇట్టి స్థితిలో గూడ నిపుడు సిద్ధులును సాధకులును మన దేశమున వ్రేళ్లమీఁద లెక్కింపఁదగినవారున్నారని వినుచుందుము. పరన

పాఠనములు లేక నివుఱుగప్పియున్న యీ శాస్త్రమును కొందఱు !
పండితులతోడ జదివి విమర్శించి, ప్రపంచమునకు వెల్లడించిన
పేరొక Sri John Woodroff కే దక్కెను.

ఆంధ్రదేశమునందు తంత్ర శాస్త్రము తెలిసి సాంప్రదా
యికముగా దీక్షనంది, ఉపాసనలో అమ్మతో ముచ్చటలాడి
ఆడించుచు నున్నవారు శ్రీ ఈశ్వర సత్యనారాయణశర్మగారను
శ్రియానందనాథులు. తెలుఁగుబాసలో స్వతంత్ర తంత్ర శాస్త్ర
రచనమునకు (నా యెఱిఁగినంతవట్టు) వీరిదే శ్రీ. 'అమ్మతో
ముచ్చటలు' అను పద్యరచనము వీరికి శబ్దబ్రహ్మముతోడి
బ్రహ్మణితోఁ గల యెఱుక నెఱుకపఱచును. ఇది సజీవమైన
గ్రంథము. ఇది అమ్మ తలపై వాడని పూవు. ఇది ఇంద్రనీలము
మీఁది చెక్కడము.

## సాధన సామగ్రి

ఈ సాధన సామగ్రి సులభముగా జీర్ణించుకొనఁ దగిన
మేలిగ్రంథము. ఇది యెన్నియో చాటుమాటల తెరను తొలఁగించి
వానికి వెలుఁగొసఁగెను. 'సాధనకు లక్ష్యమేమి ? దాని నెందులకుఁ
జేయుదురు ?' ఈ మొదలగు విషయములను ఎంతయో
నిపుణముగా సమగ్రముగా నిరూపింప దొరకొనినది. తంత్రము చెప్పు
జ్ఞానపాదమునందును, యోగపాదమునందును, క్రియాపాదము
నందును గల కొన్ని విశేషములనేకాక చిజ్జడములయు
జ్ఞానక్రియలయు ఏకత్వమును, కర్మజ్ఞాన సముచ్చయమును
తాంత్రికదృష్టితో వివరించినది. ఈ సాధన సామగ్రి మొదటిపుట
మొదలుకొని చివరపుట వఱకును సాధకుల కొక క్రొత్త వెలుఁగును

జూపుచు కరదీపికవలె నిది మనతో పయనించును. మొత్తముమీద నిది తంత్రశాస్త్ర ప్రవేశిక యేయయ్యు చక్కని తంత్రకావ్యమువలె మనచే చదివించును. శ్రీ సత్యనారాయణశర్మగారు ఇపుడు మన కీ మూట ఇచ్చిరి. దీనిని విప్పి యిందలి సామగ్రిని వినియోగించుకొనుట పాఠకుల పని. సాధన సామగ్రి రెండు మూఁడు భాగములుగూడ త్వరలోనే ప్రకటితములు కాఁగలవు. దీని సంపూర్ణస్వరూపము తంత్రశాస్త్రమున కొక అలంకారముగను సాధకులకు కంఠమణిగను ఉండఁగలదు.

ఈ శ్రీ ప్రియానందులను దీక్షానామము కల శ్రీసత్య నారాయణశర్మగారు భవవైద్యులే కాక అయుర్వేదమును గూడ లెస్స జదివిన వైద్యులు. ప్రబోధ చంద్రోదయ మద్వైతమును, సంకల్ప సూర్యోదయము విశిష్టాద్వైతమును, ఉభయగ్రాస రాహూదయము ద్వైతమును దెలుపునటులు జీవానందన మను నాటక మాయుర్వేదమును దెలుపును. దీని నానందరాయమఖి రచించెను. ఈ జీవానందనమును వీరు 'నహిప్రతి' గా తెలిఁగించిరి. వీరు _'అమ్మ బిడ్డ నెయ్యపుంజవిని వేసారులు చవి చూచిన యొక వెట్టి నాగమ్మ' అనియు _'వాగ్రూపమున నుచ్చరించు నమ్మయంగ ములను పద్యరూపము లను సాధకలోకమునకుఁ జూపు వేడుక చిన్ననాఁటఁగోలెఁ గల వీని దొక తీరు తిక్క' అనియు __

చ. వెలఁదుల రిమ్మయున్ ధనము పిచ్చి యశమ్ముసఁ బిచ్చ కూటివి
ద్దెల బలుతిక్క యిట్లు పలుతీరుల వెఱ్ఱుల కాసుపత్రియౌ
నిలను త్వదీయసత్కృప గడించు నుమాదము నాది, దీనిఁ బోఁ
దొలఁచెడు వెజ్జెవం డొరుఁడు దోఁచఁడు; మందును లేదు శాంభవీ !

అని తఱచు తమ వెఱ్ఱితనము చెప్పుకొనుచున్నారు. ఇట్టి వెఱ్ఱి, తిక్క, పిచ్చ, ఉన్మాదము మనకు లేకపోయెనే యని నాగోడు. తంత్ర శాస్త్రము చదివి ఏకాగ్రభూమికలో ఉపాసింపఁ గలిగి పండిత కవులయినవారు ప్రత్యక్షముగా నెఱిఁగియున్న వారు - శ్రీ శ్రియానందనాథాపరనామధేయులగు శ్రీ సత్యనారాయణశర్మగారిని నాకంటె లెస్సగా దెలుపఁగల్గుదురు. వారు నాయెడఁ జూపిన ప్రేమకు శిశువువలె వివశుఁడనై నే నింతమాత్ర వ్రాయగలవాఁడ నైతిని.

చిరివాడ
6-7-64

వేలూరి శివరామశాస్త్రి



శ్రీః

శ్రీమాత్రే నమః

# అభిప్రాయము

ఆధ్యాత్మిక వివేచనలో తత్త్వావగతికి అతిప్రధానమైన స్థానమున్నది. తత్త్వమును దర్శించి, అనుభవించిన సాధకుడు ప్రవృత్తిపరుడై లోకకల్యాణమునకు యత్నించుననుటకు మనకు నిదర్శనము లనేకము లున్నవి. ఈ అనుభూతికి ప్రయత్నము చేయువాడు సాధకుడు. కొన్ని అర్హతలు కలిగియున్న సాధకుడు తన కుపకరించు సాధన సామగ్రిని చేపట్టవలసి యున్నది. ఈ సామగ్రి ద్వారా శ్రవణ, మనన, నిదిధ్యాసనల నందగలడు. పూజ, జపము, తపస్సు మొదలగువాటిని సాధనములందురు. జప తపాదులలో మాతృమూర్తిగా తత్త్వమును అన్వేషించుట ఒక అతిప్రాచీన సంప్రదాయము. మాతృస్వరూపిణియైన పరాశక్తిని ఉద్దేశించిన స్తోత్రాదికములు బహుపురాతన పురాణేతిహాసములలోను, వైదికవాఙ్మయమున కలవు. కాని వాటి అర్థమును సరిగా తెలిసికొనుటకు కేవలము భాషాజ్ఞానము సరిపోదని మన కందరకును తెలిసినదే ! సరియైన అర్థమును కొంతవరకు మనకు చెప్పిన యోగేశ్వరులు పూర్తిగా వివరించకుండిరి. గురుముఖతః కొన్ని మెలకువలను తప్పక తెలిసికొనవలసిన అవసర ముండుటచే వీటిని వదలి మిగిలినవాటిని మాత్రమే చెప్పినారు గనుక సామాన్య ప్రజల కవి అంతగా ఉపకరించవు.

రెండవ విషయము. పురాణేతిహాసాదులలో అంతర్గతమైన కొన్ని భాగములను మంత్రభాగములని, ఉపనిషద్భాగములని

సంప్రదాయము చెప్పుచున్నది. మహాభారతములోని భగవద్గీతను ఉపనిషత్తుగా వ్యవహరించి, ప్రామాణికముగా దార్శనికులు స్వీకరించినట్లే, మార్కండేయపురాణాంతర్గతమైన దుర్గా సప్తశతిని మంత్రభాగముగా వ్యవహరించిరి. ఆయా గ్రంథములలో కన్పించు ఇట్టి భాగములు అత్యంత ప్రాచీనములేగాక, శ్రుతితుల్యము లగుచున్నవి. వీటిని మార్చుటకుగాని, సవరించుటకుగాని మనకు అధికారము లేదు. వీటి అర్థమును సాధకుల ద్వారాగాని, స్థితప్రజ్ఞుల ద్వారాగాని మాత్రమే మనము గ్రహించగలము. ఇటువంటి సందర్భములో దుర్గా సప్తశతిని వివరించుటకు సిద్ధపడిన శ్రీ శ్రియానందనాథు లనబడు శ్రీ ఈశ్వర సత్యనారాయణశర్మగారి కృషి చిరస్మరణీయము.

శ్రీ శర్మగారు మార్కండేయపురాణాంతర్గతమైన దుర్గా సప్తశతికి ఆధ్యాత్మికార్థ వివృతిని రచించినారు. వ్రాతప్రతిలో రెండు వేల అరతావులుగల ఈ గ్రంథము ఎప్పుడు పాఠకులకు, సాధకులకు అందగలదో అని ఉత్కంఠ ఎక్కువగాక తప్పదు. శ్రీ దేవీసూక్త పరమార్థము, దేవపూజా రహస్యము, శ్రీ రాజవిద్యాగీత, శ్రీ సిద్ధాంతశిఖామణి మొదలగు గ్రంథముల నీవరకే మనకిచ్చి మనలనందరను ఋణగ్రస్తులను గావించిన శ్రీ శ్రియానంద నాథులు ప్రచురణావకాశము లేక ఊరకుండిరని చెప్పుట పాఠకలోకమునకే తలవంపులను తెచ్చినది. విస్మృతమైన ఆధ్యాత్మికపు విలువలను బహిర్గతముచేసి ప్రచారముచేసి భారతావనిని పునరుద్ధరించుట మన కర్తవ్యము. కావుననే శ్రీ శర్మగారు సప్తశతీ వివృతిలోని సాధనోపయోగి భాగములలో కొన్నిటిని

ఉద్ధరించి సాధన సామగ్రి అను తొలిమూటను మనకిపు డిచ్చినారు. గ్రంథమందలి ప్రథమ చరిత్రలోగల సాధన విషయములను ఇట సంగ్రహించి చెప్పినారు. ఈ వివృతిని చక్కగా చదివినవారికి దుర్గా సప్తశతి స్థాణువుమోయు బరువువలె కన్పించనేరదు. శ్రీ శర్మగారి వివృతిలో క్లిష్టభాగములు సుస్పష్టము లగుచున్నవి.

మూలగ్రంథమందలి ప్రతిశబ్దమునకును ఆధ్యాత్మికార్థము చెప్పబడినది. ఇది అవసరమా ? అని కొందరు ప్రశ్నించవచ్చును. కాని ఇది చాల అవసరము. పరతత్త్వమును శక్తిగా జపించి, అర్చించుట వైదిక సమ్మతమని తెలసినపుడే దుర్గా సప్తశతి పరమ ప్రామాణికము కాగలదు. అందువలననే శ్రీ శర్మగారు "భర్గస్సు - గాయత్రి" అను శబ్దముల వివేచనతో ప్రారంభించి, సావర్ణి, సురథులను గూర్చి వివరించినారు. ఈ వివరణలో శాక్తేయ దర్శనము ఔపనిషద దర్శనముగా కన్పించగలదు. పురాణాదులలో అంతర్గతమైన మంత్రోపనిషద్భాగముల ప్రామాణ్యము, ఇట్టి వివృతుల మూలముగా సుదృఢ మగుచున్నది.

శ్రీ శ్రియానందనాథులు కమ్మని తేట తెనుగులో నిగూఢ విషయములను సహితము కరతలామలకమువలె చేసినారు. వీరు రచించిన పూర్తివివృతిలోని ఇతర భాగముల రాకకు వేయి కన్నులతో నిరీక్షించి, వాటినికూడ గ్రహించి, పఠించవలెనను ఉత్కంఠ అందరకు ఇనుమడింపగలదు. ఆధ్యాత్మిక విషయములను సులభశైలితో వివరించుటలో వీరు సిద్ధహస్తులనుట అతిశయోక్తి కాదు. నిర్దుష్టమైన సప్తశతీగ్రంథమును తెలుగులిపిలో వీరే ప్రచురించదగినవారు. వీరి గ్రంథముల నన్నిటిని సహృదయులగు

పాఠకులు ప్రచురింప చేయగలరను ఆకాంక్ష సమంజసమే యని భావన. సాధన సామగ్రి వంటి గ్రంథరాజములు శిరోధార్యములు.

నాగపుర విశ్వవిద్యాలయము,
నాగపూర్.
క్రోధి, వైశాఖ పూర్ణిమా,
బుధవారము.

పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి



# అభిప్రాయము

శ్రీ దువ్వూరి నరసింహమూర్తిగారు, ఎం.ఏ., బి.ఇడి.,
శ్రీకాకుళం.

"శ్రీగురుః సర్వకారణభూతా శక్తిః"

శ్రీ శ్రియానందనాథ గురువరేణ్యుల శిష్యులు వేయి మంది యున్నను, నిరంతర గురుసాన్నిధ్య భాగ్యము నా కబ్బుటచే, కృతజ్ఞతా భక్తిపూర్వక ప్రశంసావాక్యములు, ఈ "సాధన సామగ్రి" పేర శ్రీవారి రచనమునకు వ్రాయ సాహసించితిని.

అనేక జన్మసంసిద్ధులై, యావృత్తచక్షువులై, బ్రహ్మ చైతన్య సాక్షాత్కారము నొంది, జీవన్ముక్తులైన మహాత్ముల రూపమునఁ బరమేశ్వరుఁడు, బ్రహ్మవిద్యాప్రవచనము లోక సంగ్రహార్థము చేయుచుండును.

శ్రీ శ్రియానందనాథులు తేఁట తెనుఁగు మాటలతో గుహ్యాగమముల సారమును సాధక భక్తులకుఁ బ్రసాదించుట యాంధ్రుల భాగ్యము.

''సాధన సామగ్రి'' యను నీ చిన్ని గ్రంథము సర్వోపనిషత్సారము. నారాయణాభిన్నయగు కృష్ణసహోదరి నుపాసించి తరించు యోగరహస్యములు దాపరికములేక వివరించిరి.

'భోగమోక్షకరీ విద్యా' యను ప్రసిద్ధోపదేశము వీరి యెడ సార్థకము శ్లాఘ్యము. 'కర్మయోగో విశిష్యతే' యను భగవద్వచనానుసారము బ్రహ్మదర్శులైన ఋషులు త్రొక్కిన యవ్యయసరళమార్గము చతుర్విధపురుషార్థప్రదము, విశ్వశాంతి విధాయకమునగు పరదేవతోపాసనకు సరళమార్గమును వీరు బోధించిరి.

చంటిపాపఁడు తల్లితోఁబల్కు ముద్దుమాటలవలె, వీరి రచనము నవనవోన్మేషశాలియై, పరామృత నిర్ఘరమువలె సాగినది.

మహర్షుల పురాణములలోని వ్యంగ్యార్థము సామాన్య ప్రజానీకమున కందఁజేయుట వీరి లక్ష్యము.

వీరు వ్రాసిన ప్రతివాక్యమును వేదవాక్యమే యని నిరూపించుటకుఁ గొన్ని యుదాహరించుచున్నాను.

సురథుఁడు, సమాధి, మనువు, మన్వంతరము, మనుజుఁడు స్వారోచిః మొదలగు పదముల పరమార్థములను, ఆధ్యాత్మిక తత్త్వముల పరిణామమని యనుభవమువలన గ్రహించి తురీయాతీతమగు "అమృత మభయ మనంతం నిర్బీజ" మనునేక వస్తువుతోఁ జేరుకొను మార్గమును వీరు సులభశైలిని జెప్పిరి.

ఈ గ్రంథమందలి ప్రత్యేకభాగము నొక యాంధ్రోప నిషత్తు. ఈ యనుభవములు సుకృత వేద్యములు.

1. "అమ్మయే, అమ్మను బూజించు" ను. జప ధ్యాన పూజా హోమ తర్పణ కీర్తనములు భిన్నభిన్న రూప కర్మలు. మన స్వభావమునుబట్టి యేకత్వానుభూతికి సాధనములు." ఇది బృహదృచోపనిషత్సారము.

"సచ్చిదానందలహరీ మహాత్రిపురసుందరీ బహిరన్తర మనుప్రవిశ్య స్వయమేకైవ విభాతి."

"యదస్తి సన్మాత్రం, యద్విభాతి చిన్మాత్రం, యత్ప్రియ మానందం, తదేతత్సర్వాకారా మహాత్రిపురసుందరీ."

"సో ఽహమస్మీతివా, యో ఽసౌ సో ఽహమస్మీతివా యా భాష్యతే, సైషా షోడశీ శ్రీవిద్యా పంచదశాక్షరీ."

"త్వం చాహంచ సర్వం విశ్వం, సర్వదేవతేతరత్సర్వం మహాత్రిపురసుందరీ."

2. బుద్ధిత త్త్వసాక్షాత్కారముచే నాంతరనాదము లయమగును. "బ్రహ్మాహమస్మీతి స్మృతిరేవ వేధా" ఈ స్మృతియే అమ్మయొడిలో నుండుట, యని వీరి వ్యాఖ్య.
3. "కామక్రోధములు తల్లి, ఆఁకలిదప్పులు తల్లి" మున్నగు వీరి వాక్యములు సప్తశతీ వ్యాఖ్య. "యాదేవి సర్వభూతేషు తృష్ణారూపేణ సంస్థితా" ఇత్యాది దేవకృత దేవీస్తుతి వ్యాఖ్య.
4. "ఈ కానవచ్చు జగము అమ్మ ప్రకటవిగ్రహమే." విశ్వమందలి ప్రత్యేక పరమాణువునందును, మాతృమూర్తిని జూడఁగలము. లోవెలుల హరి.
5. "ధర్మసంస్కారములే ప్రబల శత్రువులు". బాహ్యార్చనలే సర్వస్వమని భావించి యంతర్ముఖుఁడు గాక, యష్టాదశ కర్మరూపములగు నదృఢములగు నావలలో సంసార సాగరముఁ దరింపఁ జూచుట యజ్ఞానము. "నిస్త్రైగుణ్యో భవార్జున" యను భగవద్వాక్యానుసారము "నాస్తి అకృతః కృతేన" అను శ్రుతివలనను "నేను నిత్యానందమయ మహాచైతన్య స్వరూపుఁడనే" యను తెల్వినొందుటే సాధనసమాప్తియని వ్రాసిరి.

శ్రుతి ॥ "బంధమోక్ష విహీనోస్మి, శుద్ధం బ్రహ్మాస్మి, సో ఽస్మ్యహమ్ । సర్వప్రకాశరూపో ఽస్మి, చిన్మాత్ర జ్యోతి రస్మ్యహం ॥"

6. "అమ్మ సాన్నిధ్యభోగము పంచకోశముల కాహారము." ఇది "తస్యాను తృప్తిం తృప్యతి" యను ఛాందోగ్యోపనిషద్వ్యాఖ్య.

7. సావర్ణి, హిరణ్యగర్భుఁడు, రుద్రులు, ఆదిత్యులు మున్నగు వైదిక శబ్దముల వ్యంగ్యార్థమును నేఁటి మనస్తత్త్వ శాస్త్రముతో సమన్వయించి, (Pshyeho Analysis) తో యుపాసనారహస్యములు, భావనభేదములు, యోగధర్మములు, అనుభవ రహస్యములు కమ్మని తెనుఁగు భాషలో వ్రాసిరి. వేయేల ? ఉపనిషత్సారమంతయు బాలురకుఁగూడ సుగమమగునట్లు వ్రాసిరి.

సౌభాగ్యలక్ష్మ్యుపనిషత్తు : "యత్ర యత్ర మనోయాతి తత్ర తత్ర పరామృతం । తత్ర తత్ర పరం బ్రహ్మ సర్వత్ర సమవస్థితమ్ ॥ అంతే ఽనంతం సమారోప్య ఖండే ఽఖండం సమర్పయన్ । భూమానం ప్రకృతిం ధ్యాత్వా కృతకృత్యో ఽమృతో భవేత్ ॥"

ఇట్టి యుపనిషద్రహస్యములన్నియు నీయుగమందలి సాధక లోకమునకు సాధ్యమగురీతిని బోధించిరి.

"జ్ఞాన జ్ఞేయం జ్ఞాతౄణా మభేదభావనం" అను భావనోపనిషత్సారమును బోధించిరి.

"యస్య దేవే పరా భక్తి ర్యథా దేవే తథా గురౌ ।
తస్యైతే కథితా హ్యర్థాః ప్రకాశన్తే మహాత్మనః ॥
ఇత్యేత న్ని ర్వాణానుశాసన మితి వేదానుశాసనమ్ ॥

ఈ యుపాసనారహస్యమును వీరు విపులముగా వ్యాఖ్యానించిరి. "జగద్యజ్ఞేన తృప్యతు". ఇది వీరి సంకల్పము.

ఓం శాన్తిః శాన్తిః శాన్తిః.

'చండీ సప్తశతీ' ఆంధ్ర వివరణమను మహాగ్రంథమును వీరు తపోబలముచే ననేక సంవత్సరముల యాంతరోపాసనా ఫలముగ సాధించిరి. గ్రంథము యథాస్థితముగా వెలువరించు నార్థికబలము లేమిని, సప్తశతీ చరిత్ర త్రయమందలి సారమును 'సాధన సామగ్రి' యను పేర మూడు మూటలుగాఁ బ్రకటింపఁ బూనిన, వానిలో నిది తొలుమూట.

పరదేవత దుర్గాంబ యేదియో రూపమునవచ్చి యార్థిక సహాయవేషముతో వెలసి, తన ముద్దుబిడ్డలైన సాధక జీవుల తెలివి పంటకై, సప్తశతీ సమగ్ర వ్యాఖ్యను దానే ప్రకాశింపఁ జేయునని గ్రంథకర్తగారి పూర్ణవిశ్వాసము. ఆ విశ్వాసము వేగ ఫలింపఁ జేయ శ్రీమాతను మేము నిరంతరము వేడుకొనుచుందుము.

రచయితృ ప్రియశిష్యుఁడు

దువ్వూరి -నరసింహమూర్తి

శ్రీః

# కృతాజ్ఞతాంజలి

"సాధనసామగ్రి" తొలుమూట సాధన గ్రంథమండలి యందొక గ్రంథ కుసుమముగ ప్రకటింపగల్గి నందులకు మే మెంతయు హర్షించుచున్నాము. పరమానంద ప్రదమగు సాధన పరంపరా సౌరభమును గూర్చి ఆధ్యాత్మికానంద మకరందమున కాలవాలమైన యీ గ్రంథకుసుమ మెల్లరకు సంసేవ్యమైనది.

ఈగ్రంథమును రచియించిన పితృపాదులు గురువరేణ్యులు బ్ర.శ్రీ. ఈశ్వర సత్యనారాయణశర్మగారి సాధనావిజ్ఞతలు లోకమునకుఁ బరిచితపూర్వములే. అట్టి శ్రీ శర్మగారి విజ్ఞతయు సాధనయు గంగా యమునా స్రవంతులై సంగమింపగాఁదోచిన సరస్వతీనది యీ "సాధనసామగ్రి" యనుటయం దతిశయోక్తి లేదు. ఇట్టి గ్రంథరాజమును మా మండలియందు ముద్రించుట కనుమతించుటయే గాక, ముద్రణమునకుగూడ సముచితరీతి అర్థసహాయముగూడ చేసి సహకరించిన శ్రీ శర్మగారికి మేము కృతజ్ఞతాంజలి సమర్పించుచున్నాము. సాధక పాఠకలోకము యథాపూర్వముగా మా యీ కృషిని సమాదరించి మాకు సహకరించవలయునని కోరుచున్నాము.

తెనాలి — బులుసు సూర్యప్రకాశశాస్త్రి
క్రోధి - ఆషాఢము — వ్యవస్థాపకుడు
6-7-64 — సాధన గ్రంథమండలి.

శ్రీ మాత్రేనమః

ద్రవ్యదాత

శ్రీ రఘుపాత్రుని రవికుమార్, హైదరాబాదు.

వీరి తండ్రిగారు శ్రీనివాసరావుగారు. వీరు గతంలో శ్రీకాకుళ నివాసులు. ప్రస్థుతం హైదరాబాద్‌లో ఎలక్ట్రికల్ ట్యూబులైట్లు తయారుచేయు కంపెనీ స్వంతముగ నడుపుకొనుచు జీవయాత్ర సాగించు చున్నారు.

వీరికి అకస్మాత్‌గ శ్రీమాతయందు, శ్రీవిద్యయందు అభిలాషకల్గి అనేకరకముల గ్రంథపఠనము గావించినారు - తమిళనాడు ప్రాంతములో మంత్రదీక్షగ్రహించి సరియైన గురువును ఆశ్రయించువలెనని కోరికకల్గినది - అచటివారు - మీశ్రీకాకుళంలోనే శ్రీవిద్యాదక్షిణాచార సంప్రదాయులు శ్రీశ్రియానందనాథ ఈశ్వర సత్యనారాయణ శర్మగారి శిష్యులు శ్రీవిద్యానందనాథ బ్ర.శ్రీ.వే. సునరాపు దుర్గాప్రసాదశర్మగారున్నారు. వారు మాతమిళనాడు ప్రాంతమువచ్చి మాకందరికీ ఉపదేశము గావించినారని ఒక పుస్తకవ్యాపారి సలహాయివ్వగా శ్రీకాకుళం వచ్చి శ్రీదుర్గాప్రసాదశర్మగారి దగ్గర 8 మాసములనుండి సేశ్రూషచేయుచూ శ్రీవిద్యాదీక్ష స్వీకరించి, శ్రీవిద్యారహస్యములన్ని తెలిసికొనుచు కృషిచేయుచున్నారు - హైదరాబాద్ నెల కొక సారివెళ్లి వ్యాపార వ్యవహారములు చక్కపెట్టుకుని వస్తూయుంటారు. మానవునకు శ్రద్ధ, భక్తి, విశ్వాసమున్నచో లౌకికమునకు ఆధ్యాత్మికమునకు అడ్డురాదను సత్యము తెల్పినారు. చి॥ రవికుమార్‌గారు. వీరి అభిష్టములన్ని నిర్విఘ్నముగ ఫలించవలెనని ఆశీర్వదిస్తూ శ్రీమాత పాదములకడ ఈచిరంజీవిని వదలనుచున్నాను.

భవదీయుడు

శ్రీ. శ్రియానందనాథ గ్రంథపునర్ముద్రణాభిలాషి

బులుసు సూర్యప్రకాశశాస్త్రి,

సాధన గ్రంథ మండలి - తెనాలి.

శ్రీ మాత్రేనమః

## ద్రవ్యదాత

బ్ర.శ్రీ. పెంట వెంకట రమణశర్మ 10 సంవత్సరాలపాటు శ్రీవిద్యానందనాథ శ్రీనుసరాపు దుర్గాప్రసాద శర్మగారి దగ్గర శ్రీవిద్యాభ్యాసము, వేదవిద్య లనభ్యసించి శ్రీ అద్వైతానందనాథ బ్ర.శ్రీ. పెంట సత్యనారాయణ శర్మగారివద్ద శ్రీవిద్యాపూర్ణ దీక్ష గ్రహించి విశాఖపట్నం జిల్లా అనకాపల్లి శ్రీగౌరీ పంచాయతన దేవళములో ప్రధాన అర్చకస్వామిగ జీవనము గడుపుచూ షుమారు 50 మంది శిష్యులకు అగమ, వేద విద్యలు చెప్పుచు పురుషార్థములను సాధిస్తూ పవిత్రజీవనం గడుపుచున్నారు.

విశేషగురుభక్తి, సౌమ్యవర్తనము గలవారు. పెంట గోపాలశర్మ శ్రీమతి సుబ్బలక్ష్మిగార్ల గర్భశుక్తిముక్తాఫలము - వీరిసోదరులు శ్రీ.చి. కామేశ్వరశర్మగారికి, శ్రీ.చి. సుబ్రహ్మణ్యశర్మగారికి, సోదరి శ్రీమతి శ్రీరాజరాజేశ్వరమ్మకు ఆయురారోగ్యైశ్వర్య ఆధ్యాత్మిక శక్తి నభివృద్ధి గావించ వలెనని ఆశీర్వాదిస్తూ శ్రీమాత వీరిని గాపాడవలెనని ప్రార్థించుచున్నాను.

భవదీయుడు
శ్రీ. శ్రీయానందనాథ గ్రంథపునర్ముద్రణాభిలాషి
బులుసు సూర్యప్రకాశశాస్త్రి,
సాధన గ్రంథ మండలి - తెనాలి.

శ్రీ మాత్రేనమః

# పద నిర్ణేజనము

ఈ గ్రంథము "సాధన సామగ్రి" అను శుభనామము గలది. సామగ్రి అనగా వస్తు నిర్మాణమున కగు పరికర సమూహము. శ్రీ శంకరులు "మోక్షసాధన సామగ్ర్యాం భక్తిరేవ గరీయసీ" అనిరి. దీని అర్థము మోక్షమున కుపకరించు వానిలో భక్తియే గొప్పదని. మోక్షప్రాపక మగు మార్గములలో భక్తికే తొలిస్థాన మిచ్చిరి. భక్తి జ్ఞానములు వేరుకావు. అవ్యభిచరభక్తియే తనకు తానుగా మోక్ష ప్రాపక మగును. ఈ విషయమును శ్రీ శంకరులు తమ గీతాభాష్యములో సిద్ధాంతితము చేసిరి. శ్రీ శంకరుల పై ప్రమాణ వాక్యములో గల మూడు పదములలో సాధన సామగ్రి అను పదద్వయమును తీసికొని ఈ గ్రంథకర్తలగు శ్రీ శ్రియానంద నాథ దీక్షానా మాంచితులు, బ్రహ్మీభూతులు నగు ఈశ్వర సత్యనారాయణ శర్మగారు తమ రచనకు నామసార్థకత, ప్రామాణ్యము, పూర్వాచార్య గౌరవమును కనపఱచిరి. ఆధ్యాత్మశాస్త్రము దేనికైనను మోక్షమే పరమ ప్రయోజనము. ''జ్ఞానాదేవతు కైవల్యం'' అను ప్రశస్త వాక్యమునకు "భక్తిరేవ గరీయసీ" అను శంకరుల మాట విరోధిగ కనిపించును. పై చూపునకు కర్మజ్ఞానభక్తి యోగములు భిన్నముగ నున్ననూ పరమార్థమున ఇవి ఉచ్చావచనములు కాక అన్యోన్య సాపేక్షములను పరమసత్యమును నిరూపించు టకే శ్రీ శంకరులు గీతోపనిషద్భాష్యములను రచించి రని నా

అభిప్రాయము. ఈ నిశ్చయజ్ఞానముతో వారి బ్రహ్మసూత్ర భాష్య రచన పరిశీలించినచో ఆచార్య హృదయము అవగత మగును. విషయ సమన్వయమున శ్రీశంకరులదే పై చేయి.

ఈ గ్రంథ కర్తలగు శర్మగారునూ పై సత్యమును మనసున నిడుకొని ఈ "సాధన సామగ్రిని" సాధక సౌకర్యము కొరకై నాలుగు మూటలుగ కట్టి మోక్షప్ర స్థానమునకు పాథేయము సమకూర్చిరి. వీరు శిష్యహితైషులై ఆధ్యాత్మ శాస్త్రములో యోగసాధన ప్రధాన మగు మంత్రశాస్త్రమున గల అనేక రహస్యములను వివరించిరి. ఆచార వైయాత్యముచే అపార్థ తాడితములైన అనేక విషయముల యొక్క కల రూపును స్పష్టపరచి మంత్రశాస్త్ర గౌరవమును నిలిపిరి. ఈ గ్రంథము మంత్రశాస్త్రమునకు ప్రమాణీభూతమై ప్రత్యక్ష ఫలముగలదై భారతదేశమం దంతట ఆదరముగొన్న "సప్తశతి" (చండీపాఠము) నకు ఆంధ్ర వివరణము. దీనికి వీరు రచించిన "శ్రీ సప్తశత్యుపాసన క్రమము", "శాస్త్రసాధనము", అను రెండును పూర్వపీఠిక లనదగినవి. సాధన గ్రంథ మండలి వీటిని ప్రచురించినది. "సప్తశతి సమగ్రజ్ఞానమునకు ఈ రెండును" అవశ్యములు. వ్యాకరణ శాస్త్రమునకు పశ్పశాహ్నికము, ధ్వన్యాలోకమునకు "లోచన" వ్యాఖ్యయు ఎట్లు ఉపకరించునో అట్లే ఈ రెండును. శ్రీ శర్మగారు అనేకము లగు సాధన రహస్యములనే కాక మంత్రశాస్త్ర మహోదధిలోగల అమూల్య రత్నములను వెలికి తీసి స్వాను భవముతో సాధక లోకమునకు అనేక సత్యము లందించిరి.

ఈ గ్రంథము నాలుగు మూటలది. ముడిలేనిదె మూట కాదు. ముడియన గ్రంథి. గ్రంథియనగ లక్షణ యారహస్యమని అర్థము. శబ్ద శాస్త్రమున గల రహస్యములను గ్రంథులని నైషధ కావ్యకర్త యగు శ్రీ హర్షుడన్నాడు. తాను సప్రయత్నముగనే ఈ గ్రంథులు గ్రథించితి ననుచు గురు వద వదవీ పరిణద్ధచిత్తులై, గుర్వనుగ్రహము బడసి ఈ గ్రంథులు విడదీసికొని సాహిత్యానంద సముద్రములో మునుగ మన్నాడు. సాహిత్య శాస్త్రములో గల వ్యాకరణ, అలంకార ధ్వన్యాదుల మర్మము లన్నియు నైషధమున నిక్షేపించినాడు. "నైషధం విద్వదౌషధం" అనుమాట చాల అర్థముగలది. దీనిలో కావ్యత్వము కంటె శాస్త్రత నాలుగింద లున్నది. రహస్య మనగ వెలిచూపున కానక స్వయంకృషితోను గురుసహాయము తోను తెలియ దగినదనుట. ఇది ముఖ్యముగ మంత్ర శాస్త్రమున ప్రాథమిక నియమము. శ్రీ విద్యారహస్య వేత్తలు, ఉపాసనాసిద్ధులైన మేధావు లెందరో "సప్తశతి"కి సంప్రదాయాను సారముగ అసంఖ్యాకము లైన వ్యాఖ్యలు వెలయించిరి. గౌడ, దాక్షిణాత్య సంప్రదాయములు రెండున్నవి. ఇది వేరుమాట. మంత్రశాస్త్ర గ్రంథము లన్నియు వైదిక ప్రామాణ్యము గలవి. శ్రీ విద్య మూలతత్త్వము పరమార్థమున వైదికమైనను సాధన విషయములో అనుభవ ప్రమాణ మగు విషయ మగుట సంప్రదాయ భేదము చూపడును. శాస్త్రసిద్ధి నొంది, విద్యాసిద్ధులై సంప్రదాయ సాంపరాయ సమ న్వయము, సామరస్యము ఎరిగి

వ్యాఖ్యాభాష్యములు వ్రాయుట చాల క్లిష్టమగు విషయము. అందులకే ప్రసిద్ధ శాస్త్ర గ్రంథములకు పూర్వవ్యాఖ్య-లే నేటికిని శరణ్యము లగుచున్నవి. శ్రీ శంకరగౌడపాదులు అద్వైత సిద్ధాంత ప్రవర్తకులై తదభిన్నమగు .... శ్రీ విద్యా ప్రతిపాదకము లైన "సుభగోదయము" శ్రీలలితా త్రిశతీవ్యాఖ్య", "సౌందర్యలహరి", "ప్రపంచసార తంత్రము" మొదలగు గ్రంథములను రచించి శ్రీ విద్యకు వేదసమాన ప్రతిపత్తిని కల్పించిరి. అర్చావిధిలో ఈ నాటికిని శంకరపీఠము లన్నిటిలో శ్రీ విద్యా సంప్రదాయమే ఆదరింప బడుచున్నది.

ఇట్టి గ్రంథము లనేకములను మథించి స్థూలసూక్ష్మ పరోపాసనలలో సంప్రదాయ మేదైనను సాధకునికి పొడసూపు ఎన్నో సందేహములకు సహేతుకము లగు సమాధానములు సాధించి శ్రీ శర్మగారుమనకందించిన నాలుగు ముల్లెలే ఈ "సాధన సామగ్రి". గ్రంథి విశ్లేషము కష్టము కాకుండునట్లు భాషలోను విషయ వివరణలోను శీర్షికా క్రమములోను ఔచిత్యము చూపి పదలాఘవ లాలిత్యములతో ఒక కావ్యముగ మలచిరి. దీని రచనమునకు ఎనిమిదేండ్లు పట్టినది. చేవ్రాతలో రెండువేల అరటావుల బరువు. ఆయన వయస్సు ఎనుబది సంవత్సరములముదిమి. "కూర్పరిమనవి" అను తొలిమూట ప్రాగ్వచనములో వారే ఇట్లన్నారు. "ఈ యంత్రములో నుండి అమ్మ ఏమిపల్కి వ్రాయించినదో అమ్మాటలే ఈ కూర్పు" అనియు వ్రాసియున్నారు.

కాలవశమున శ్రీ విద్య, దానితత్త్వము, ఆచారవక్రతవలన ఖిల మగుచున్నది. ప్రమాణ గ్రంథములన్నియు సంస్కృతభాషా గ్రథితము లగుట దుర్బోధముగ నుండును. విడమరచి బోధించు సద్గురువుల లేమియు కొంత కారణము. ఇట్టి స్థితిని గ్రహించిన శ్రీ శర్మగారు తెనుగున ఈ "సాధన సామగ్రి" రచించి ఆంధ్రదేశమునకు మహోపకారము చేసిరి. ఇవి నా మాటలే కావు. సారస్వతోపాసకులై, మంత్రతంత్ర రహస్యముల నెఱిగిన పలువురు విజ్ఞుల మాట. దీని తొలిమూట కభిప్రాయ మిచ్చిన భారతీపుత్రులు, అరవిందయోగ సిద్ధులు నగు కీ॥శే. శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారి ఈ క్రింది మాటలు కితాబులు. "ఇది తంత్రశాస్త్రమునకొక అలంకారముగను, సాధకులకు కంఠమణిగ నుండి ఒక క్రొత్త వెలుగు చూపుచు కరదీపికవలె మనతో పయినించుచూ ఒక కావ్యము వలె చదివించును. ఇక శ్రీషోడశీరామయణ గ్రంథకర్తలు, మంత్రశాస్త్ర రహస్యజ్ఞులు, భాషా వరశేషులు నైన శ్రీ గుంటూరు శేషేంద్రశర్మగారి అభిప్రాయ మిట్లున్నది. "సప్తశతి" హృదయమెరుగుట ముముక్షువుల అవశ్య కర్తవ్యము. ఇట్టి నిగూఢ రహస్యములు వివరించిన శర్మగారు లోకమునకు మహోపకారము చేసిరి. ఇది ఇంగ్లీషులోను, సంస్కృతములోను అనువదింవతగిన అపూర్వకావ్యము." ఇదే గాక ఈ గ్రంథమువలన కలుగు లాభము లైదింటిని పేర్కొనిరి.

ఇక నా మాట "సాధన సామగ్రి" రచన మిషగ శ్రీ శర్మగారు ప్రత్యేకముగ "సప్తశతీ" రహస్యములు శ్రీ విద్యాశాస్త్ర

రహస్యములే కాక అధ్యాత్మ శాస్త్ర ప్రపంచమున తత్త్వము, సాధనము అను రెంటిని నేడు ఆవరించియున్న పలు మబ్బు తెరలు తొలగించి మనచే ఆత్మనూర్యావలోకమునకు సాయపడిరి. 1. విషయము 2. ప్రయోజనము 3. ఉపాయము 4. సంబంధము అను నాలుగు శాస్త్రాంగములు సమగ్రముగ పోషింపబడినవై అధ్యాత్మశాస్త్రమునకు పరమ ప్రమాణముగను పారిభాషిక పదసమగ్ర వివరణము గల గ్రంథముగను దీనిని నేను భావించుచున్నాను. గ్రంథస్థ విషయమును సమగ్రముగ పరామర్శించుటకు నేను చాలను. గ్రంథకర్తలగు శ్రీ శర్మగారు నాకు పితామహులు, విద్యాదాతలును పుత్ర నిర్విశేషముగ నను సాకిరి. గ్రంథ ప్రకాశకుల ఆజ్ఞతో గురు, పితౄఋణము తీర్చుకొను అదనుగ మాత్రమే దీనిని భావించి ఈ నాల్గు మాటలు వ్రాయసాహసించితిని. దొసగులు మన్నింప ప్రార్థన.

ఈ గ్రంథ ప్రచురణమునకు స్వచ్ఛ గురుభక్తితోను, శిష్య సాహాయ్యముతోను ఉద్యమించిన దైవజ్ఞులు శ్రీ విద్యానందనాథ దీక్షా నామాంచితులు, ప్రత్యక్షీకృత రాజరాజేశ్వరులు నైన బ్ర.శ్రీ.వే. నుసరాపు దుర్గాప్రసాద శర్మగారు కృతార్థులు. గురు కటాక్ష భాగ్యులు.

ఈ సాధన సామగ్రియెగాక తమ శ్రీ విద్యాగురువులైన శ్రీ శ్రియానందనాథుల రచనములలో 1. శ్రీ విద్యాంధ్ర భాష్యము 2. దేవ పూజా రహస్యము 3. శ్రీ సప్తశత్యుపాసన క్రమము ఇటీవలనే పునర్ముద్రణము చేయించి కృతార్థులైరి. ఈ అక్షర

యజ్ఞమునకు గురు, సంప్రదాయగౌరవముతో ఆర్థిక సహకార మందించిన శ్రీ దుర్గా ప్రసాదశర్మగారి శత శిష్య, ప్రశిష్య వర్గమునకు విద్యాభిమానులకు శ్రీ మాతృ కృపాభాగ్యము కలుగుగాక.

1. శ్లో॥ శ్రీ విద్యాపారదృశ్వా ఽయం శ్రీ విద్యానందదేశికః ।
మను విచ్ఛతశిష్యో ఽయం జీయాల్లోకహితేరతః ॥

2. శ్లో॥ యువాపిపరిపక్వంయత్ జ్ఞానమాజానసంభవం ।
అమౌనీదక్షిణాస్యోయం భూచరోదైవవిగ్రహః ॥

3. శ్లో॥ గ్రంధప్రకాశనాత్తస్య భూయాద్గ్రంధకృతస్సమా ।
శ్రీవిద్యానందనాథస్య కీర్తిరాశామరీమృజా ॥
అని నాఆశాసనము.

ఈ గ్రంథములప్రూఫ్సులు దిద్దుటలోగల బహుశ్రమను, సహించి సహకరించిన శ్రీవిద్యాదీక్షితులు, శ్రీశుకానందనాథ దీక్షానాములైన సాధకోత్తములు శ్రీభాస్కరభట్ల నరసయ్య శర్మగారు. వీరు శ్రీకాకుళం పురపాలకోన్నత పాఠశాలలో ఆంధ్రభాషా పండితులు. వీరికి సాధకలోక పక్షమున, సాధన గ్రంథ మండలి పక్షమున కృతజ్ఞతాభినందనలు.

శ్రీ శర్మగారి గ్రంథములన్నిటికి పలుసార్లు పునర్ముద్రణ యోగము కల్గించి సాధక లోకమునకు చిరకాలముగ అక్షరరూప సరస్వతీ దర్శనముచేయించుచున్న సాధన గ్రంథమండలి వ్యవస్థాపకులు బ్ర.శ్రీ.వే. బులుసు సూర్యప్రకాశ శాస్త్రిగారు

కృతార్థులు. ఆంధ్రదేశములో షుమారు 56 సంవత్సరముల నుండి ఆధ్యాత్మగ్రంథ ప్రచురణమే దీక్షగ నిర్వహించుచున్న శ్రీశాస్త్రిగారి వయస్సు తొంబదినాల్గు పంటలు. తమసంస్థ నామమును కృతార్థము చేయుచున్నారు. ఈ సరస్వతీ యజ్ఞములో వీరు చిరాధ్వర్యులు. నాకు సోదరనిర్విశేషులు. వీరిని శతాయురారోగ్య భాగులజేసి ఇట్టి ఆధ్యాత్మిక గ్రంథము లనేకము లింకను ప్రచురింప జేయుగాత మని నా ఇష్టదేవత నర్థించుచున్నాను.

1. శ్లో॥ శ్రీమచ్ఛంకరసద్గురోఃకృతిచయంముద్రాపయిత్వాభృశం
ప్రాగాచార్యకృతాన్యనేకరచనాన్యేతాన్యపిశ్రద్ధయా ।
సూర్యాలోకసుభాగధేయవిభవాన్యాధత్తుమయాసతే
సోయంసాధనమండలీకులపతిః జీయాచ్ఛతంవత్సరాన్॥

2. శ్లో॥ నిత్యావగాహినంయుష్మత్పదనిర్ణేజనాంభసి ।
సూర్యప్రకాశనామానంతనుజంపాహిచండికే ॥

అరసవిల్లి పోస్టు
శ్రీకాకుళంజిల్లా
532401
తేది : 20-11-2001

ఇట్లు
గురుపదపాంసువు
డా॥ ఈశ్వరసీతారామధన్వంతరి.
వ్యవస్థాపకాధ్యక్షుడు 'మహతి'
సాహితీసాంస్కృతిక సేవాసంస్థ

# శ్రీ రాజ రాజేశ్వరీ పీఠ సంగ్రహ చరిత్ర

యాదేవీ సర్వభూతేషు బుద్ధిరూపేణ సంస్థితా ।
నమ స్తస్యై నమ స్తస్యై నమ స్తస్యై నమో నమః ॥

సర్వ జగన్మాత యగు లలితా త్రిపుర సుందరీ పరాభట్టారికయే శ్రీ రాజరాజేశ్వరీదేవి, ఆమె విలసనమే ఈ విశ్వమంతయు, విశ్వమంతయు తానై, విశ్వాధికయై, విశ్వమునకు సర్గ స్థితి లయములనే కాక తిరోధాన అనుగ్రహములను పంచకృత్య పరాయణ శ్రీరాజరాజేశ్వరీ దేవి - ఆ దివ్యశక్తి మంత్ర తంత్ర యంత్రము లందు నిత్యసన్నిహితమై గురుకృపాలాభమున ఉపాసకులకు కొంగు బంగారమై కల్పతరువై అభీష్టముల నొసంగు చుండును. ఆర్తులు లాభకాములు - జిజ్ఞాసువులు మనశ్శాంతిని కోరువారు, విశ్వకల్యాణాపేక్షులు నిరంతరము దూరదూరముల నుండి తరలివచ్చి, తమ తమ అభీష్టముల నెరవేర్చుకొను దివ్యశక్తి సంపన్నమైన పవిత్ర స్థలము - శ్రీకాకుళంలో నెలకొల్పబడిన శ్రీ రాజరాజేశ్వరీదేవీ పీఠము - ఇది యొక ఆధ్యాత్మిక శక్తి కేంద్రము.

ఏ మంత్రమైనా ఉపాసకుల నైష్ఠికతను బట్టి ఫలప్రదము కాగలదు. శ్రీ విద్యానందనాథ దీక్షా నాములు శ్రీ శ్రియానందనాథ శ్రీపరసుఖానంద నాథుల శిష్యులు నైన వేదమూర్తులు శ్రీ సుసరాపు దుర్గా ప్రసాదశర్మ గారు - శ్రీ రాజరాజేశ్వరీదేవి పీఠ, స్థాపకులు - నిర్వాహకులు. వీరు ఉత్తమ వైదిక దంపతులైన బ్రహ్మశ్రీ సుసరాపు అప్పన్న సిద్ధాంతి అలివేలమ్మ దంపతుల గర్భశుక్తి ముక్తాఫలము. బాల్యంలో తండ్రిగారి యొద్ద అభ్యసించిన వైదిక, జ్యోతిష శాస్త్రము

లందు విశేషకృషి యొనర్చుచూ బ్ర॥శ్రీ॥ వనమాలి వెంకటరామయ్య వఝ్ఝలు గారి వద్ద స్మార్తము, వాటితో పాటు ఉర్లాం వాస్తవ్యులైన శ్రీ, బంకుపల్లె సింహాచల భాగవతార్ గారి వద్ద, సంస్కృత, - భరత శాస్త్రములను, పిమ్మట నరసన్నపేటలో శ్రీ తాళాభక్తుల కామ లింగాచారి గారి వద్ద మృదంగవాద్యమును, బంకు పల్లె లక్ష్మణశాస్త్రిగారి వద్ద కావ్య పాఠములను అభ్యసించిరి. అనాదిగ వీరి కుటుంబము శ్రీదేవీ ఉపాసకులు. అందున అపవర్గదాయిని దుఃఖహంత్రి యగు శ్రీ దుర్గాదేవి వీరి ఇలువేల్పు. ఈ వంశమున నేటికిని పెక్కురు దుర్గా నామములు కలవారున్నారు. వీరి ధర్మపత్ని, శ్రీమతి మహాలక్ష్మి ఈమె శ్రీదేవి ఉపాసకులైన ఇప్పిలి వారి యింట పుట్టిన సాధుశీల – 1972 సం॥లో శ్రీ దుర్గా ప్రసాద శర్మగారు శ్రీ కూర్మం నుండి శ్రీకాకుళం విచ్చేసినారు. ఉత్తరాంధ్రలోనే సుప్రసిద్ధమైన వేద సంస్కృత ఆర్షధర్మ ప్రబోధమున కైనెలకొల్పబడిన "ఉపనిష న్మందిరము"లో వీరు వేదస్మార్త పండితులుగా ప్రవేశించేరు.

"ప్రపేదిరేప్రాక్తన జన్మ విద్యాః" అన్న రీతిగా దుర్గాప్రసాద శర్మగారిలో శ్రీ విద్యాభిరుచి మెండు కాగా అప్పటికే శ్రీ విద్యలో లబ్ధ ప్రతిష్ఠులైన శ్రీ శ్రియానందనాథ ఈశ్వర సత్యనారాయణశర్మగారి వద్ద పంచదశీ ఉపదేశమును పొంది అటు పిమ్మట వారి ఆదేశము మేరకు వారి శిష్యులలో ప్రథమ గణ్యులైన శ్రీ పరసుఖానందనాథ శ్రీదువ్వూరి నరసింహమూర్తి గారి వద్ద పాదుకాంత దీక్షయూ స్వీకరించి తన ఇంట భూపుర శ్రీ చక్ర ప్రతిష్ఠ గావించి శ్రీదేవీ ఉపాసన దీక్షగా చేయుచూ, శ్రీ విద్యానందనాథ దీక్షానామమును స్వీకరించి "భోగమోక్షకరీవిద్యా" అను నానుడి సార్థక మగునట్లు పెక్కు రార్తులకు శ్రీ చక్రార్చనద్వారా శ్రీ సుబ్రహ్మణ్య నవావరణార్చన ద్వారా ఐహికములైన ఇబ్బందులను తొలగించుచూ మంత్ర

శాస్త్రమునందు ప్రజలకు విశ్వాసమును పాదుకొల్పిరి. 1978 లో గురువుల యొక్క ఆదేశము అనుగ్రహము కారణముగా శ్రీచక్రమేరు ప్రతిష్ఠ మహావైభవముగా సుమారు 30 మంది ఋత్త్విక్కులతో జరిపించిరి. ఆనాటి నుండి దినదిన ప్రవర్ధమానముగా చండీయాగములు, మత్స్యయంత్ర ప్రతిష్ఠలు మొదలగు వైదిక కార్యక్రమము లను జరుపుచున్నారు. వీరు పరసుఖానంద నాథులతో కలిసి దక్షిణ దేశమునగల సుప్రసిద్ధ పట్టణములను ఆలయములను దర్శించుటయే కాక ఆయాయీ చోట్ల ఆసక్తిగల వారికి ఉపదేశముల నొనర్చుచూ తిరువాయూరు, చిదంబరములలో దాక్షిణాత్య పండితులచే ఘనసత్కారము లందుకొన్నారు.

వీరు 1978 నుండి దేవీ నవరాత్ర ఉత్సవములను కడు శ్రద్ధతో జరుపుచు అనుదినము సుమారు 200 మందికి అన్నసంతర్పణ గావించుచున్నారు. వీరు తమ గురువులైన శ్రీ శ్రియానందనాథులవారి స్వప్న సాక్షాత్కారమును పొంది సిద్ధనాగ క్షేత్రమైన శ్రీశైలంలో సామయిక మిత్రులతో కలిసి షోడశీ మంత్ర పురశ్చరణమును గావించినారు. శ్రీశైలంలో వీరి దీక్షాదక్షతలను చూచిన జగద్గురు శ్రీ శృంగేరీ పీఠాధిపతులు శ్రీవాసుదేవానంద భారతీ స్వాములవారు శ్రీ షోడశీ మంత్రదీక్షా పత్రమును వీరి కందించి ఆశీర్వదించినారు.

1985 లో వీరు శ్రీకాకుళం కృష్ణాపార్కు తూర్పు వీధిలో నూతన గృహ నిర్మాణం చేసి అందు శ్రీ రాజరాజేశ్వరీ దేవీ పీఠమును నెలకొల్పినారు. శ్రీ రాజరాజేశ్వరీ దేవి సన్నిధిని ప్రతి పూర్ణిమా దినమునను, విశేష పర్వదినములయందును సాంగోపాంగముగా శ్రీ చక్రార్చనమును జరుపుచున్నారు. వీరి ఆధ్వర్యంలో

శ్రీ విద్యానందనాథ (పరమ గురువులు) ద.వే. లక్ష్మీదత్తుగారి జయంతియు, శ్రీ శ్రియానందనాథ (స్వ గురువులు) శ్రీ ఈశ్వర సత్యనారాయణ శర్మగారి యొక్కయు, పరసుఖానంద నాథ (గురువులు) శ్రీ దువ్వూరి నరసింహమూర్తిగారి యొక్కయు జయంత్యుత్సవములు కడు శ్రద్ధాభక్తులతో జరుపబడుచున్నవి.

పై ఉత్సవములకు రాష్ట్రం అంతటినుండి వీరి శిష్యులు, అభిమానులు అధికసంఖ్యలో పాల్గొనుట విశేషము.

2000 సం॥లో వారణాశీ క్షేత్రంలో శిష్యసహచరులతో కలసి త్రిపుర భైరవీఘాట్‌లో మండలదీక్షగ శ్రీ చక్రార్చనమును చేసి పూర్ణాహుతిని సమర్పించిన ధన్యులువీరు. వీరిని ఇటీవల విశాఖ పట్టణంలో లలితా పరాభట్టారికా పీఠాధిపతులు శ్రీ యద్దనపూడి అయ్యన్న పంతులుగారు. "మహాకామేశ్వరీ పురస్కారం" 24 పండితులతో పాటు వీరికిచ్చి గౌరవించిరి.

పలు తావులనుండి వచ్చు శ్రీవిద్యా జిజ్ఞాసువులకు వారి సందేహములను తొలగించుటయేగాక సౌందర్యలహరి, సప్తశతి, భావనోపనిషత్తు మున్నగు శ్రీవిద్యా గ్రంథములను బోధించుట వీరి అలవాటు.

ప్రతి సంవత్సరం ఫాల్గుణ శుద్ధ పంచమీ దినమున శ్రీరాజరాజేశ్వరీ దేవీపీఠ వార్షికోత్సవమును జరిపించుచూ పండితులను, కళాకారులను సత్కరించుచున్నారు. శ్రీ విద్యానందనాథ, శ్రీశ్రియానందనాథ శ్రీ పరసుఖానందనాథ గురువుల సంపూర్ణ అనుగ్రహమున వారి కుటుంబ సభ్యుల సహకారముతో నిర్విఘ్నముగా, అవిచ్ఛిన్నముగా, శ్రీరాజరాజేశ్వరీ పీఠము భక్తుల కోర్కెలను తీర్చునదై సహస్రానేక శిష్య ప్రశిష్య వర్గముతో అలరారుగాక.

వీరు సంకల్పించిన లోకహితంకరమైన, అపురూపమైన శ్రీ శ్రియానందనాథులవారి శ్రీ విద్యా గ్రంథముల పునర్ముద్రణము జరిగి జిజ్ఞాసువులకు కరభూషణములుగను. కంఠభూషణము లుగను వెలయుగాత యని ప్రజ్ఞారూపిణియైన శ్రీమాతను ప్రార్థించుచున్నాను.

దుర్గా ప్రసాద శర్మాణం
శఠమర్షణ గోత్రిణం
దుర్గే ! త్వం కరుణాసారై
రభిషించస్వ కింకరమ్ ॥

శ్రీ చక్రార్చన నిరతం । శ్రీవిద్యాశేవధిం గురూత్తంసం ।
శ్రీ శఠ మర్షాణ గోత్రం । వందే దుర్గాప్రసాద శర్మాణమ్ ।

శ్రీ విద్యానందనాథం నిరవధికరుణా వార్నిధిం నౌమి భక్త్యా
శ్రీ విద్యా దానదీక్షం పరమ గురువరం శ్రీ శ్రియానందనాథం ।
శ్రీమాతుః ప్రీతి పాత్రం నిరతిశయదయా శేవధిం సర్వవంద్యం
సేవే ౨ స్మద్దేశికేంద్రం సతత పర సుఖానందనాథం ద్విజేంద్రమ్॥

ఇట్లు
ఉభయ భాషాప్రవీణ,
**ఆరవెల్లి లక్ష్మీనారాయణాచార్యులు,**
కార్యదర్శి,
ఉపనిషన్మందిరం,
శ్రీకాకుళం.

శ్రీమాత్రే నమః

# కూర్పరి మనవి.

శ్రీ దుర్గాసప్తశతి, చండీపాఠము, దేవీమాహాత్మ్యము ననెడి పేళ్ళతోఁ బ్రసిద్ధమై మార్కండేయ పురాణాంతర్గతమగు భాగము కేవల ప్రయోగ గ్రంథమని, శాంతిపాఠరూపమని మాత్రమే పలువురి యభిప్రాయము. చరిత్రముల నెపమున నిది కేవ లాధ్యాత్మిక పరమార్థబోధక మనుమాట యెఱింగినవారి సంఖ్య యల్పాల్పము.

మనదేశమం దావన్ని వారణాది శాంతిక్రియలుగా శ్రీమద్రామాయణ సుందరకాండము, విష్ణుసహస్ర లలితా సహస్ర నామస్తుతులు, నలచరిత్రము మున్నగువాని పాఠము చేయఁబడునటులు, ఉత్తరదేశమందు సర్వోపద్రవ సర్వబాధానివారక శాంతిక్రియగా, నీ దుర్గాసప్తశతీ పారాయణమే చేయఁబడుటె ఱుఁగుదును. అచటి పురోహితవృత్తిగల బ్రాహ్మణుల కిది కంఠస్థమై యుండును. రెండు రూపాయిలు చేతఁ బెట్టినపుడు, శాస్త్రోక్త సప్తశతీపాఠ నియమములు పాటింపకయే, కనులు మూసికొని వల్లించి లేచిపోవుచుందురు.

భారతదేశమందు భారతి యేమూలనో యొకచోట ముసుఁగు వేసికొని, తనకు భారతులు చేసిన యవజ్ఞను సూచించు మలిన వేషముతోఁ గానవచ్చుచున్నది. భారతులు మఱియన్వర్థనాములు కాఁజాలరా ? యని దుఃఖించుచున్నది.

"భాయాం - స్వయంప్రకాశవస్తుని, రతాః - ఆసక్తాః" అనుమాటయు నెఱుంగరు. ఏ కర్మ మొనర్చినను, స్వప్రకాశ వస్తుసంధాన మిందుఁ గావలయు ననువార్తు మృగ్యులు. పురాణ

పఠనరతులును, "ఇతిహాస పురాణాభ్యాం పరమార్థః ప్రకాశ్యతే" అను వ్యాసదేవుని మాటయుఁ బాటింపకున్నారు.

పదునైదేండ్ల వెనుకనే సప్తశతీసర్వస్వమనుపేర నీ దేవీ మాహాత్మ్యము నుపాసనక్రమము, మంత్రార్థములు, శబ్దముల వ్యుత్పత్త్యర్థములు, దేవీసూక్త రాత్రిసూక్తాదుల వివరణము, మధుకైటభాద్యసురోత్పత్తి చరిత్రములు మున్నగునవన్నియు శ్రీమాత్రాజ్ఞగా వ్రాసితిని. అది యట్లుండగా, నందులకై శాంతనవాది వ్యాఖ్యలును జదువు పనిపడెను. దుర్గాసప్తశతీ పారాయణము తఱుచు చేయు నలవాటును నుండెను.

అపుడు మాటిమాటికి నాధ్యాత్మిక రహస్యములపైనే నా నిగా నిల్చిపోయెడిది. కొన్ని తావులందు మబ్బులు విడలేదు. ఒకనాఁడు మాతృచరణములం దాత్మార్పణము చేసి నిస్సీమజిజ్ఞాసతోఁ దొంగుంటిని. అపుడొక స్మరణము - అంతకుమున్న ముప్పదియేండ్ల క్రిందటనే యుత్తరదేశ పండితుఁ డొకఁడు, ఇరువది ముప్పది పుటలలో వ్రాసిన "చండీతత్త్వము" అను చిన్న పుస్తకమును జదివినమాట. యౌవనమందు సంసార నిర్వహణశ్రమముతో శ్రీవిద్యాధ్యవసాయము నీరసముగా సాగు చుండిన దినములవి. ఆ పుస్తకమా - నాతో లేదు. విషయమా - విస్మృతము. రచయిత పేరుజాడలుం దెలియవు. ఉన్నాఁడో, లేఁడో? అపుడు బహుప్రయత్నములు చేసియు ఫలము నందని నన్ననుగ్రహించు బాధ్యత నొందిన యమ్మయే, యాఱు నెలల నాఁటికి, ఆపుణ్యపురుషునిజాడ తెలిపినది. పేరు - పండిత శివనారాయణశర్మ, ఒక పాఠశాలలో భాషోపాధ్యాయుఁడుగ నుండి యేనాఁడో విరమించుకొన్న యెనుబదియాఱేండ్ల ముదుసలి-.

అగ్రాజిల్లాలో నొక కుగ్రామము నివాసము. వారేనాఁడో వ్రాసిన "చండీతత్త్వము" ను దయతోఁ బంపఁగోరుచు నా వ్రాసిన జాబు చూచి "నాయనా! చండీపాఠమున కాధ్యాత్మిక రహస్యార్థమున్నదని మా దేశమందే యనేకులు సాధకులెఱుఁగరు. ఆంధ్రప్రదేశమం దొక మూల నణగియున్న నీవీ నాఁటికి నన్నడిగితివి. ముప్పదియేండ్లకు మున్ను నా వ్రాసిన "చండీతత్త్వము" అను చిన్న పుస్తకము పంపుచున్నాను. అందు విశేషవివృతి లేదు. దాని నాధారము చేసికొని నీ యాంధ్ర వివరణోద్యమము సాగించుచు, నీకు విశేషాంశములు వలసి యున్న చోటుల నన్నడుగుచుండుము. యథాశక్తిగఁ దెల్పుచుందును." అని యభయమిచ్చి - "ఈ బహుదూరగత శాక్త బంధుసంధానము దుర్గాంబాకృపాబలమున లభించిన యుభయ తారకఫలము. మన యీబాంధవ్యము జన్మాంతరానుబంధి. అఘటనఘటనపటీయసి, అమ్మ చిత్రలీలావతి. మనకు నిత్యవంద్య." అని వ్రాసిన శ్రీవారి బదులందుకొన్న నాఁటి నా యానందము నానందమయి శ్రీమాతయే యెఱుఁగును. తన చిత్రచరిత్రముల తత్త్వము నెఱుఁగఁగోరి తపించు తనయుల కోర్కె తీర్చుట దయామృతసాగరయైన తల్లి పనిగాక మఱెవ్వరిది ?

అది మొదలు నాసంశయములు, వారి సంశయచ్ఛేది లేఖలు రెండేండ్లు నడిచినవి. అవి నూఱుపుటల గ్రంథమయ్యెను. మొత్తము సప్తశతికి నా యాధ్యాత్మికాంధ్రవివృతి పూర్తియగునరికి, అయిదేండ్లు పట్టినది. రెండువేల యరటావుల వ్రాఁత. శ్రీ చండీరహస్యవివృతిని వ్రాయు సౌభాగ్యము శ్రీరాజరాజేశ్వరి కొలువున నొక లేఖకమాత్రుఁడనైన నాకబ్బినది.

అబ్బెను. పో. పుట్టిన గ్రంథము పుట్టినట్లు ప్రకాశింపబడని దౌర్భాగ్య మీనాఁటికిని దొలఁగదయ్యె. ముద్రితరూపమున దానిని సాధకుల చేతఁబెట్టగల సామర్థ్యమునకు వెలియగుటచే, దానికి ముద్రణాలయ ముఖమును జూపుట యీ నాఁటికిం గాకపోయె. వయస్సా-యెనుబది; గ్రంథమా-బహువిపులము; గానఁ గింకర్తవ్యతామూఢుఁడనై నిర్వేదమునొంది యూరకుండుటకంటె (నిస్సారమనుచు నొకవాక్యమైన నందు లేదయినను) సాధనోవయోగిసారవిషయములను గొన్నిఁటినైనమూడు చరిత్రములనుండియునెత్తి, మూడు మూటలుగాఁ గట్టి సోదరసాధకుల చేతఁబెట్టుట మేలు కాదా, యని సాహసించి తిని. సాధకులనో, తదితరులనో చేసాఁచి యడిగి యభీష్టసిద్ధి నొందు నలవాటు లేదు. ఇమ్మాట నా వ్రాసిన 'వాసవీ కన్య కాంబా స్తుతి' యనెడి గ్రంథమున -

"వ్రాయుట నాదువంతు; అది భక్తవరుల్గనిమెచ్చ నచ్చులో
వేయఁగజాలు పుణ్యు వెనువెంటనె నిల్పుట నీదు వంతుగా
నే, యలవాటు చేసితి; విఁకేటికిఁ జింతలు ? తల్లి మేఁపు న
బ్బాయికిఁ జేయి యంటగునె ? భక్తసురద్రుమ ! దేవి ! భారతీ ।

యని తెలుపుకొంటిని. ఏక్షణమందో యెక్కడునో యీ వ్రాత యంత్రము నిలచిపోవు టయ్యెనా - మూల మూల్గ రచనములన్నియు భూగర్భమునం దణఁగిపోయెడివే కాదా ? ఇఁక దీనిని గూర్చి యేమి వ్రాసినను జీవత్వాహంకారపు నిక్కినతల వంగలేదను నింద తక్క మతేమియు మిగులదని, లోనుండి యెవరోహితోపదేశము చేయుచున్నట్లయి, యీ తొలుమూట వెలువరింపఁ దెగించు వృత్తి శ్రీదేవీరూపమే యని మురిసితిని. అమ్మా ! సేవకు సంసిదుఁడు నీబిడ్డఁడని కై మోడ్పుతో నిల్చినపుడెల్ల,

గలుగల్లుమంచు నీయంత్రములోనుండి యేమిపల్కి వ్రాయించినదో, యమ్మాటలే యీ కూర్పు. సాధక పండితప్రకాండుల యభిరుచికిఁ గాకపోదని కడునమ్మి బయల్పెట్టఁ దెగించితిని. మంచిచెడ్డలకు వారే ప్రమాణము.

ప్రసిద్ధ పత్రికాగ్రంథ సమీక్షకులయు సాధక పండితులయు రుచిబోధవాక్యములను జూచికొని వారి యాశీర్వాదమే బలముగఁ దక్కిన రెండు మూటలను వెలువరించుపని నిఖిలాంబ కృపపైనే నిర్భరంపడి యున్నది.

ఈ సాధన సామగ్రి తొలుమూటను, ముద్రణ పూర్వమును, ముద్రణానంతరమును ననుశీలించి, యనుకంపతో పీఠిక వ్రాసి యిచ్చిన నా నిరంతర శుభచింతకులు, శతావధానులు, బ్రహ్మశ్రీ వేలూరి శివరామశాస్త్రులును,

నా శాస్త్రసాధన - సిద్ధాంతశిఖామణ్యనువాదములను గూర్చి యయాచితముగ నవ్యాజప్రేమతో సదభిప్రాయ వాక్యములను వ్రాసిన బ్రహ్మశ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రులు M.A., Lit., Phd., Nagapur University - సాధకోత్తములు ఈ సాధన సామగ్రికిని బరిచయవాక్యములను వ్రాయ నధికారులుగ నెంచి ప్రార్థింపఁగా నెనరున ననుఁ గృతార్థునిఁ జేసినందులకు, వారును, నాకు నిరంతరవంద్యులు.

సార్థకాంతేవాసులు, శ్రీమాతృకృపాపాత్రులు, శ్రీవిద్యా పూర్ణదీక్షితులు నైన శ్రీ చి॥ దువ్వూరి నరసింహమూర్తి ఎం.ఏ., బి.ఇడి. గారు, శ్రీమాతృశక్తి పరిచాలక (నర) సింహమే యనఁదగినవారు - అభిమానముతో నీ తొలుముల్లె ననుశీలించి వ్రాసిన మాటలయందలి యాథార్థ్యము నెఱుంగఁ జదువరులధీనంపదయే ప్రమాణము. వారికి నా నిరంతర శుభాశాసనములు.

సాధన గ్రంథమండలి పక్షమునఁ బ్రకటింపఁగోరి మండలి వృద్ధి నుద్దేశించియే, యథాశక్తి ముద్రణ వ్యయములతో నాపంపిన గ్రంథములను బ్రకాశింపఁజేయుట తమ పనిగా నెంచి శ్రమఁగొని నను ధన్యునిఁ జేయుచున్న మండలి సంస్థాపకులు విద్వాన్ శ్రీ చి॥ బులుసు సూర్యప్రకాశశాస్త్రులు, నిరంతరము శ్రీమాతృ కృపావీక్షతో వర్ధిల్లుచు, గ్రంథమండలి నామమును సార్థకము చేయఁగల యథార్థ సాధనగ్రంథజాలమును బ్రకటించు నైశ్వర్యమును మహామాయానుభావమున నొందుచుందురు గాతమని యాశాసించుచున్నాను.

ఇఁక నింతలోనే వెలువడు మలుమూటయందుఁ బ్రాణ ప్రతిష్ఠాసాధనము - విష్ణుగ్రంథిభేదము - సంచితకర్మక్షయము, రజోగుణము - తజ్జన్యసంస్కారములు అవి నశించు నుపాయములును బ్రధాన విషయము. ఇందు వివిధ శీర్షికలతో సాధన సామగ్రి నూటిని మించినది కనఁగలరు. అది యనతికాలములో వెలువడ సాధకాశీర్వాదము నపేక్షించుచున్న,

శ్రీకాకుళం — శాక్తబంధుఁడు, పండితవిధేయుఁడు

30-5-64 — శ్రీ శ్రియానందనాథుఁడు

ఈశ్వర సత్యనారాయణశర్మ

## శ్రీమాత కిది యంకితము

ఈం కారవాచ్య ! ఐం హ్రీం
క్లీం కమనీయాంగి ! ఇత్తుఁ గృతి నీకే; కా
మ్మోంకృతితో; నీ యమృత మ
యాంకమ్మునఁ జోటు నుంచుమా ! చాముండా !

శ్రీకర శ్రీకరమ్మునఁ ద్రిపుటి బోధ
మును సడల్చు త్రిశూలముఁ బూని, మహిష
నామక రజోగుణప్రవినాశిని వగు
నమ్మ, విమ్మాటలెల్ల నీ కచ్చుకొందు.

ఏయమ, అబ్బి ! వ్రాయుమని యీ పరమార్థ రహస్యబోధముల్
వ్రాయఁగ నెన్మిదేండ్లు పనిపట్టఁగఁ గట్టడచేసె, నమ్మహా
మాయవు, నాత్మవున్, సకలమాతవు; నీకృతులెల్ల నిత్తు నీ
కే; యవి యందుకోఁ దగు మహేశ్వరి ! యర్హులు లాఁతులెవ్వరే ?

తిరముగ నాత్మదృష్టులు త్వదీయముఖమ్మున నిల్పు సాధనన్
బొరపడనట్టి నీప్రియతనూజులు నాకవరుల్ పవిత్రు లీ
సరకులె దారిబత్తెముగ, జన్మరుజాపహ శర్మదౌషధో
త్కరముల పైఁడి సంచికలుగాఁగని సద్గతిగాంత్రు, చండికా !

తల్లితనమ్ముఁ జూపి, యిడి ధన్యునిఁ జేసితి; చూచి యిచ్చితిన్
ముల్లెలు మళ్లి నీకె; ప్రియపుత్త్రుల కంటనుబెట్టు బర్వు, నా
వల్లనుగాదు మోయ; సదుపాయముచూడుము నీవె; యాఢ్యులౌ
పిల్లలు కొల్లగాఁ గలరు; పేదఱికమ్మటె నీకు ? శ్రీమతీ !

- శ్రీ శ్రియానందనాథుఁడు

# విషయ సూచిక

# మీనాక్షీ పంచరత్నమ్

శ్లో॥ ఉద్యద్భాను సహస్రకోటి సదృశాం కేయూర హారోజ్జ్వలాం
బింబోష్ఠీం స్మిత దంతపంక్తి రుచిరాం పీతాంబరాలంకృతాం।
విష్ణుబ్రహ్మసురేంద్ర సేవితపదాం తత్త్వ స్వరూపాం శివాం
మీనాక్షీం ప్రణతో ఒస్మి సంతత మహం కారుణ్యవారాంనిధిం ॥ 1

శ్లో॥ ముక్తాహార లసత్కిరీటరుచిరాం పూర్ణేందు వక్త్రప్రభాం
శింజన్నూపుర కింకిణీమణిధరాం పద్మ ప్రభా భాసురాం।
సర్వాభీష్ట ఫలప్రదాం గిరిసుతాం వాణీ రమా సేవితాం
మీనాక్షీం ప్రణతో ఒస్మి సంతత మహం కారుణ్య వారాంనిధిం ॥ 2

శ్లో॥ శ్రీవిద్యాం శివవామభాగ నిలయాం హ్రీంకారమంత్రోజ్జ్వలాం
శ్రీచక్రాంకిత బిందు మధ్యవసతిం శ్రీమత్సభానాయకీం।
శ్రీమత్ షణ్ముఖ విఘ్నరాజజననీం శ్రీమజ్జగ న్మోహినీం
మీనాక్షీం ప్రణతో ఒస్మి సంతత మహం కారుణ్యవారాంనిధిం ॥ 3

శ్లో॥ శ్రీమత్సుందరనాయకీం భయహరాం జ్ఞానప్రదాం నిర్మలాం
శ్యామాభాం కమలాసనార్చిత పదాం నారాయణ స్యానుజాం।
వీణావేణు మృదంగ వాద్యరసికాం నానావిధాడంబరాం
మీనాక్షీం ప్రణతో ఒస్మి సంతత మహం కారుణ్య వారాంనిధిం ॥ 4

శ్లో॥ నానాయోగి మునీంద్రహృన్ని వసతిం నానార్థ సిద్ధిప్రదాం
నానాపుణ్య విరాజితాంఘ్రి యుగళాం నారాయణేనార్చితాం।
నాదబ్రహ్మమయీం పరాత్పరతరాం నానార్థతత్త్వాత్మికాం
మీనాక్షీం ప్రణతో ఒస్మి సంతత మహం కారుణ్యవారాంనిధిం ॥ 5

— శ్రీశఙ్కరాచార్యకృత మీనాక్షీ పంచరత్నమ్

ఓం ఈం నమః

శ్రీమాత్రే నమః

# సాధన సామగ్రి

## భర్గస్సు - గాయత్రి

సూర్యుఁడు జగత్తును బ్రసవించువాఁడు-సవిత. అతఁడు ప్రాణశక్తి కాదరువు. అనంత బ్రహ్మాండములందును బడుగు బేకవలె నల్లుకొనియున్న ప్రాణశక్తియొక్క (అదే వరేణ్యమైన భర్గస్సు - బ్రహ్మజ్యోతి) విశిష్టక్షేత్రమే సూర్యుఁడు. "భేతి - భాసయతే లోకా౯, రేతి - రంజయతే జనా౯, గ ఇత్యాగచ్ఛతే ఽ జస్రం భరగో భర్గ ఉచ్యతే" అని భర్గః శబ్ద నిర్వచనము. జగములను వెలువరించి (ప్రకాశింపఁజేసి) రంజింపఁ జేసి తనలో మఱలఁ జేర్చుకొనునది యని యర్థము. కావుననే దాని నెల్లరు మూడు సందెలయందును గాయత్రీమంత్రముతో నుపాసింతురు. (గాయత్రీ = తన్నుఁ గూర్చి గానముచేయువారిని రక్షించునది; గాయమును = ప్రాణమును రక్షించునది కావునను గాయత్రి) అనఁగా దీర్ఘాయురారోగ్యములనిచ్చి రక్షించునది. అదే సంధ్యాదేవి. లెస్సగా ధ్యానింపఁబడునది; భ్రూఘ్రాణముల సంధియగు నాజ్ఞాచక్రమందు ధ్యానింపఁ బడునదిగాన సంధ్య. ఆమెయే సవర్ణ. బ్రహ్మముతో సమాన. 'అక్షరం బ్రహ్మ సమ్మితమ్' నాశనరహితయు, బ్రహ్మముతో, అధిష్ఠాన, అవస్థాన, అనుష్ఠాన నామ రూపములందు సమాన; కావున నామె బ్రహ్మసమ్మిత. ప్రతి శ్వాస ప్రశ్వాసమందున, ప్రతివాగుచ్చారణమందును, సర్వేంద్రియ సంచాలనమందును, ఇంతేల -

ప్రతిస్పందనమందును వ్యయమగుచున్న ప్రాణశక్తిని, మనము మఱల సూర్యునివల్లనే పొందుచు సురక్షితుల మగుచున్నాము. కనుక బాహ్యజగత్తునందేమి, సాధనక్షేత్రమైన శరీర జగత్తునందేమి, ఆ సూర్యుఁడొక్కఁడే జీవులకు ముఖ్యమైన ప్రాపును, ఊఁతయునై యున్నాఁడు. నాభిచక్రము (మణిపురము) నందు సూక్ష్మసూత్రముగా నా జ్యోతిర్ధార వచ్చుచున్న ఫలముగానే బ్రతుకుచున్నాము. జీవుఁడు (మనుజుఁడు) మనుత్వము నొందునపుడు, ఈ సూర్యుఁడే ప్రాణశక్తి స్థానీయుఁడని తెలియఁగలఁడు.

సావర్ణి - సవర్ణ యను నామె కొడుకు. సవర్ణనే వేదము 'సరణ్యు' నామముతోఁ గొనియాడినది. సవర్ణ యనఁగా సూర్యశక్తి. ఆ ప్రాణశక్తికీతఁడు ప్రతినిధి. సూర్యుఁడు బ్రహ్మతేజః ప్రతినిధి యైనటులే, సవర్ణయు సౌరతేజః ప్రతినిధి. ఈ శక్తి ప్రభావముచేతనే వసుంధరయు గ్రహమాలయు సూర్యమండలముయొక్క నాల్గు వైపులనుండియు నాకర్షింపఁబడి యవయవ పరివర్తనములనెడి ప్రదక్షిణ నమస్కారములను జేయుచు, వరేణ్య భర్గః ప్రతినిధియైన సూర్యదేవునే సేవించుచున్నవి. ఈ మహాశక్తి గర్భమునుండియే మనువు పుట్టినాఁడు (సావర్ణి).

## మనువు-మనుజుఁడు

మనువు - మ్న ధాతువువలన సిద్ధమైన మాట. ఆ ధాతువునకు - బోధము - జ్ఞానము అనియు నర్థము. జీవభావము నొందిన కల్పిత శిశుచైతన్యము (క్షుద్రజ్ఞానము) సమష్టి మానవ చైతన్యముగా దీపించునపుడు, అది 'మనువు' అనఁబడును. అనంతకోటి బ్రహ్మాండచైతన్యము హిరణ్యగర్భుఁ డెటులయ్యెనో,

యటులే మనుష్యజాతియొక్క సమష్టి జీవచైతన్యమే మనువు. ఈ సమష్టిచైతన్య మనువునుండి విడివడిన యణువులే వ్యష్టిమనుజులు. ప్రతిమనుష్యునిలోను "నేను మనుజుఁడను - మానుషుఁడను - మానవుఁడను" అనెడి జ్ఞానము సదా ప్రకాశించుచుండును. ఆ తెలివికే "వ్యష్టి మనుష్యుఁడు" అని పేరు. సమష్టి మానవజాతిని గ్రమ్మియున్న సమష్టిమానవ చైతన్యమే మనువు. మనము "నేను మానుషుఁడను, మానవుఁడను" అనెడి తెలివితోనే వెలఁగునంత కాలము, మనము మానుషత్వమునే, మానవత్వమునే, మనుజత్వమునే యనుభవింపఁ గల్గుదుము. మన దేహమందలి యసంఖ్య జీవాణువులు, మన చైతన్యముచేతనే సచేతనము లగుచున్నటులే, సమస్త మానవజాతియు మనువుసత్తాచేతనే సత్తావంత మగుచున్నది.

తాత్పర్యమేమి ? భగవంతుఁడైన మనువుతోనే మానవ జాతికి సాక్షాత్సంబంధ ముండుటచేతనే 'పిత' యనఁబడెను. కావుననే మనువు పిత యనియు, బ్రహ్మ పితామహుఁడనియుఁ బేర్కొనఁబడిరి. "బ్రహ్మాత్మభూః సురజ్యేష్ఠః పరమేష్ఠీ పితామహః" (అమరకోశము).

మనువే బ్రహ్మ ప్రథమసృష్టియైన కొడుకు. వానివలనఁ బుట్టిన మనము మానవులము (మనుజులము). సాధనాబలము చేత మానవుఁడు మనుత్వము నొందినపుడే, తాను లోకములను గన్నట్టి సూర్యశక్తియైన సవర్ణ యొడిలోనే యున్నట్లు కనుగొనును. కావుననే మనువును, సూర్యసుతుఁడు - సావర్ణియనిరి.

## మనుత్వలాభము - దానివలని ఫలము

మనము వ్యష్టిభావము నొందిన క్షుద్రమానవ చైతన్యమును వీడి, మనుత్వమనెడి మహామానవ చైతన్యమందు మెలఁగుటకును, క్షుద్రమును బరిణామియు నైన యజ్ఞానసీమను దాఁటి, యొక విశాలానందమయ జ్ఞానమందుఁ జేరుటకును, మనుజత్వమును వీడి మనుత్వము నొందుటకును, అభిలాషంపడ వలదా ? ప్రతిక్షణమందును జన్మమృత్యుభయశంక నొందుచునే యున్నాము; గాన సుస్థిరమును గొప్పదియు నైన దాని (క్షుద్రత్వమున కాధార భూతమైనదాని) సంధానము లేక మనఁజాలము. నిశ్చలము, నిర్వికల్పయు, శ్రీకృష్ణరూపిణియు నైన మనయమ్మ ప్రబలాకర్షణముచేత నెన్నఁడో యొకనాఁడు, ఈగొందినుండి వెలిఁబడుటకై మన ప్రబలవాసన తలయెత్తును. ఏమన స్థిరత్వ మహత్త్వములే మన యవ్యయ స్వరూపము. నిత్యస్థిరత్వము నొందినపైనే, మన మనుజత్వము పోయి మనుత్వము కలుగును.

'నమో వివస్వతే' యనుచు సౌరశక్తి సవర్ణయనెడి తల్లియొక్క ప్రేమమయ స్పర్శముచే నొడలు తెలియకున్నపుడే 'భర్గో దేవస్య ధీమహి' యనుచు, నమృతమును జిమ్ము ననంతజ్యోతియందు మునిఁగి పోయినపుడే, 'తత్త్వే పూషన్న పావృణుసత్యధర్మాయ దృష్టయే' యనుచు, సూర్యునందు సత్యప్రతిష్ఠ చేసి, యమ్మహాసత్యతరంగము ననుభవించునపుడే, 'యోసా వసౌ పురుషః సోఽహమస్మి' యంచు, వైదికయుగ మందలి బ్రహ్మర్షులవలె సూర్యునందాత్మ ప్రతిష్ఠ ననుభవించి, జీవభావమును బూర్తిగా మఱచునపుడే మన మనుజత్వము విడిపోయి

మనుత్వలాభమున కధికారుల మగుదుము. బ్రహ్మదర్శులైన ఋషులు త్రొక్కిన యవ్యయ సరళమార్గమును బట్టి, సద్గురు సహాయమున మెల్లఁగా ముందంజవేసినపుడు తప్పక మనుత్వము మన కబ్బును.

సాధకుఁడా ! చూడు. మనము దేవకార్యాదిని 'ఆసన శుద్ధి' యనుచు నొక ప్రక్రియ నడుపుచున్నను దాని నవలంబించియే సౌరశక్త్యనుభవమునకైన దారిని ముందునకుఁ బోవుచున్నాము. ఇక్కాలమున, ఆ ప్రక్రియ యొక శ్లోకమును జదువుచు, నాసనమును దులిపి పఱచుటతోనే సరిపడుచున్నది.

## ఆసనాస్తరణ మంత్రరహస్యము

"పృథ్వి త్వయా ధృతా లోకా దేవి త్వం విష్ణునా ధృతా ।
త్వం చ ధారయ మాం దేవి పవిత్రం కురు చాసనమ్ ॥"

నీ వొక కాలియాట బంతివలె (Foot-ball) గుండ్రనైన భూమిపైఁ గూరుచున్నావు. సమకాయశిరోగ్రీవుఁడవై యే భావముతోఁ గూర్చున్నావో, కొంతసేఁపు స్థిరముగా నుండఁగల్గుదువో యట్లు కూర్చుండుము. అపుడు నీ క్రింది మీదుల, ముందు వెన్కల, గుడియెడమల మహాశూన్యము వెలయుచున్నదికాదా. ఆ మహాకాశమండలమందు నీవు పృథ్వీ రూపిణి తల్లి ఱొమ్మునందే యున్నావు. ఎదుట సూర్యభగవానుఁడు తన తేజు నమ్మహాశూన్యమున నించుచున్నాడు. అతని ఘృణి (దయ) తోడి యాకర్షణశక్తిచేతనే నీ వీ భూమిపైఁ గూర్చుండఁగల్గితివి. చూడుము. పృథివి నిన్నుఁ దన ఱొమ్మున నిడుకొనియే, యాత్మప్రదక్షిణములు చేయుచుఁ

గడువడిగా సూర్యునకుఁ బ్రదక్షిణములు చేయుచున్నది. ఇపు డా మంత్రమునకుఁ జైతన్యమును గల్గించి పఠింపుము. అనఁగా - "నెన్నిటినైన మోయఁగల విశాల శరీరముగల పృథ్వీరూపిణీ ! తల్లీ! నీ చేతనే యీ లోకసంచయము ధరింపఁబడుచున్నది. నీవు మా యెదుటనున్న సూర్యరూపవిష్ణునిచే ధరింపఁబడుచున్నావు. దేవీ! నీవు నన్ను ధరించి యుంచుకొని, మఱి నా యాసనమును బవిత్రముచేయుము." అనఁగా "సూర్యాకర్షణశక్తిచే గిరగిరం దిరుగుచున్న నీతోనే గిరగిరం దిరుగుచున్న నా యాసనము - పద్మాసనమో, స్వస్తికాసనమో, వజ్రాసనమో - సడలిపోకుండ స్థిరపెట్టి కాపాడు" యని యహంకారమును జంపుకొని ప్రార్థింపుము. ఇది దీని భావము. అంతెకాని, యాసనమువంటిన దుమ్ము, చీమలు, నల్లులు మున్నగువానిని డుల్చి కాపాడుమని యర్థముకాదు. ఆసనశబ్దముచే నీవు పఱచి కొన్న చేలాజినకుశా స్తరణాత్మకమైన యాసనముకాదు. పైనిఁ జెప్పిన శారీరక విన్యాసరూపమైన స్వస్తికాద్యాసనములే.

ఇట్టి భావనతో నిత్యము సౌరజ్యోతియందుమునుఁగుచు, సూర్యునందు సత్యప్రాణప్రతిష్ఠ చేయుచు జ్యోతిర్మయాకాశమండల మందు స్థిరముగానుండ నభ్యసింపుము. దానిఫలముగా నీ లోపలను నీ వెలిని జైతన్యమయజ్యోతియే ప్రకాశింపఁగా, అయ్యనంతవ్యాపి చిన్మయమండలమందుండి నిన్ను నీవే మఱతువు. అపుడే నీవు సౌరశక్తి (వరేణ్య భర్గస్సు) యొడియందే కూర్చుంటినని తెలిసికొనఁగలవు. తరువాత మెల్లమెల్లఁగా "నేను మనుసంతతివాఁడ" ననెడి సత్యజ్ఞానమునకుఁ జేరువగాఁ బోయి, ధారణశక్తి రూపిణియైన సవర్ణయొక్క సాటిలేని కృపకై ప్రార్థింపుము.

"భర్గో దేవస్య ధీమహి" యనుము. ఏ విరాడ్రూపమనుచైతన్యము నుండి యీ చిన్న చిన్న బుడగలు లేచుచున్నవో, యవి అనఁగా 'నేను మానుషుఁడ' ననెడి క్షుద్రజ్ఞానము, ఆ విరాణ్మను చైతన్యమునందే యణఁగిపోవును. అపుడే మనుత్వాభ్యానము చేయఁగల్గుదువు.

ఈ మనుత్వము నొందిన నేమి ఫలము ? మనమును అష్టముల మగుదుము. అష్టముడనఁగా నేమి ? "అష్టౌ సిద్ధయః - ఐశ్వర్యాణి మీయంతే అస్మిన్నిత్యష్టమః" అష్టైశ్వర్యములు - సిద్ధులు. చేరి నిల్చినవాఁడే, అష్టముఁడు ఎనిమిది విధములైన యీశ్వరభావముల నొందుననియు లజ్జా భయ నిందాదులైన యష్టబంధనములవలన విముక్తుఁడగుననియు భావము.

మనుజత్వమునుండి మనుత్వమును, మనుత్వమునుండి బ్రహ్మత్వమును శ్రీమాతృకృపచే లభించును. తండ్రియొడిలో నున్న బిడ్డడు నవ్వుచు నానందక్రీడ సలుపుచు నిట్టిదనరాని తృప్తి నొందునటులే, జీవుడు "సదా నేను నా తండ్రియొడిలోనే యున్నాను. జన్మ మృత్యు రోగ శోక బాల్య యౌవన వార్ధకా వస్థలే కానిమ్ము; నాకెట్టి పరిణామమును గాదు; క్షుద్రుఁడనో, దీనుఁడనో, పాపినో, యవిశ్వాసినో, హీనుడనో, శ్రద్ధాహీనుఁడనో, నే నానంద స్వరూప జనకుని యొడిలోనే యున్నాను" అనుచు నానందాను భవమును రేవగళ్ళు వీడక, నిత్యముక్తత యనుభూతమగునట్లు మర్త్యమందుండియు నమరత్వాస్వాదము చేయును. దుఃఖమయజగత్తు నానందమయముగ భోగించుచు సాటిలేని శాంతి నొందును.

మనుత్వము నొందుటచేత మఱియొక యలౌకిక లాభము - మన్వంతరాధిపత్యము. ఏ యఖండజ్ఞానము మను చైతన్యముగా వెలయునో, ఆ సమష్టి మానవ చైతన్యము అధిష్ఠానమై యుండుటచే, వ్యష్టిమానవ చైతన్యము దానికి లోఁబడియుండును గదా. మనుష్యజాతి మనువులోనిది. మనువైనచో మన్వంతరాధిపతి యగును. సర్వ మానవజాతి యొక్క జన్మ స్థితి లయము లాతని యానచే నగును, గాన నాతఁడు ప్రత్యేకమానుష సూక్ష్మకారణ పర్యన్తముఁ జూడఁగలఁడు. దాని ఫలముగాఁ బ్రతిమనుష్యునిలోను దాఁగియున్న భావరాశిని జూడ సమర్థుఁడగును. మనము మనుజులము. మనలో జన్మజన్మాంతరసంచితమై దాఁగియున్న భావరాశిని మనము చూడఁజాలముగాని, మనము మనుత్వము నొంది మన్వంతరాధిపతుల మగుదుమేని, మన మనఃసంస్కార రాశిని గనఁగల్గుదుము. అంతేకాదు. ప్రతిమనుష్యుని బహు జన్మసంచిత పాపపుణ్య జన్మ జాత్యాదులను సమస్తముఁ గాంచఁ గల్గుదుము. అపుడపుడు మనము మన మనస్సులోని భావములను జెప్పక మున్నే తెలిసికొనఁగల్గు మహాపురుషులను జూచుచున్నాము. అది వారి యాంశిక మనుత్వలాభమున నైనఫలమే. వ్యష్టి మానవుఁడు మనువులోనివాఁడే. ఆతఁడు, ఆంతరరాజ్యాధిపత్యము నొందఁగల్గెనేని బ్రతిమనుష్యునిపైని దన యిచ్ఛాశక్తిని బఱపి, వాని స్వాభావికమైన నీచగతిని మాన్పఁగలడు. అధ్యాత్మికోన్నతి సాధనమును జేయింపఁగలఁడు.

## మహామాయ యన నేమి ?

మనుజుఁడు మనుత్వమునొందుటయు, జ్ఞానమయ క్షేత్రమును (బ్రహ్మమును) జేరుటయు, సమస్తజగత్తు నాయందే యున్నదని తెలిసికొంటయు నసునదే యథార్థమన్వంతరాధి పత్యము. అది మహామాయయొక్క అనుభావము (అనుకూలేచ్ఛ) చేతనే లభించును.

మహామాయ యన నేమి ? అను విషయమున నొకరు జడప్రకృతి యని, ఒకరు మిథ్య యని, ఒకరు భ్రాంతి యని పలువిధముల ననిరి. వారివారి మతభేదములను బట్టుకొని కుతర్కములను జేయరాదు. అవి విచారలభ్యములు కావని మన మెఱుఁగుదుము. మనము శ్రీమాతృస్నేహమును గోరువారము. మాతృస్వరూప విచారముతో మనకేమి పని ? అమ్మ చెంత, అమ్మా ! యంచు నిల్చునపుడు, ఆమె స్వభావము నెట్లు విచారింపమో, అమ్మా ! యనుచు నామె వాత్సల్య ధారలచే నెటు లభిషిక్తుల మగుదుమో, యటులే సంచరింతము. మన ముఖ్యాశ్రయ స్వరూపయైన జగదంబ - మహామాయ యెదుట తల్లీ! యని నిల్తుము. ఆమె యెట్టి భావముతోఁ దనస్వరూపమును జూపునో, తన సంతానము నానందమయ స్నేహధారలతోఁ దడుపునో చూతము.

మహామాయయే సత్యమని కనుగొందము. మహామాయ తక్క వేఱొండెచటను నేదియు లేదు. మహామాయయే జీవులను గన్నతల్లి. ఆమె కడుపునఁ బుట్టినారము. ఆమె ఱొమ్మునందు

న్నారము. ఆమె జ్ఞానమయ స్తన్యముచేఁ బెరుగుచున్నారము. ఆమె కృపచేతనే మాతా పుత్త్రసంబంధము లేని యద్వితీయమైన, దేని నంటని, సత్తను జేరుకొనుచున్నాము. మహామాయయే జీవుఁ డనియు, నీశ్వరుఁడనియుఁ దెలియుచున్నాము. ఆ మాయ లేనిచోట సత్యమును లేదు; మిథ్యయులేదు. త్రికరణము లుండుదాఁక, సచ్చిదానందము లుండుదాఁక మాయయు నుండును. నిర్గుణచైతన్యమందు బహుభావములతో వ్యక్తమగుటకుఁ గామముదయించునపుడు, ఆ చైతన్యమే మాయారూపమునఁ బ్రకటమగును. అనేక భావములను గర్భమందు ధరించుటకుఁ గారణ మా తల్లియే, జగద్రూపముతోఁ బ్రకటయై, యనఁగా నవ్యక్తబీజములను బ్రసవించి, మఱల నిర్గుణత్వమందుఁ జేర్చుటకై, తానే మహాక్రియరూపమునఁ బ్రకటిత యగును. తన యొడిలోనున్న జీవజగత్తును మఱల నేకమందు (బహ్మత్వమందు) లీనము చేయును. గనుక మహామాయ యొక్క తెయే సృష్టిస్థితి ప్రలయాధీశ్వరి; ఆ యమ్మయే జగద్విధాత్రి; జగత్పాలయిత్రి; జగత్సంహర్త్రి; ఆమె ప్రేమ ననుభవింపఁ గల్గినచో, జీవుఁడెంతటి పదవినైన ననుభవింపఁ గలఁడు. మన్వంతరాధిపతి యగుట యొక వింతా ?

సాధకా ! అమ్మహా మాయా స్వరూపమును నీవు నీలోనే యాంశిక భావముతో ననుభవము చేయలేవేని, దేనికి వెఱచి యీ సూర్యుఁడు యథాకాలమున బొడుచుచున్నాఁడో దేనికి భయంపడి వాయువు యథాక్రమమున వీచుచూన్నఁడో, దేని యానకు లోఁగి దిగీశులు పాలించుచున్నారో, దేనికడలి యగ్ని ఋతూచితముగా

మండుచున్నాఁడో, దేని సెలవును బట్టి మృత్యువు పరుగెత్తుచున్నదో, యా చండి తత్త్వమును దెలిసికొనఁజాలవు. కనుకనే తల్లియొడిలోనే యోమఁబడి, తల్లి పాలతోనే పెరిగి, తన్నుఁ గన్నతల్లి నెఱుంగలేని కొడుకు, అభ్యుదయ సంపన్నుఁడు కాఁజాలఁడని, తెలివిమెట్టు లెక్కలేఁడని, సమ్మానితుఁడు కాఁదగఁడని, దయాపాత్రుఁడే కాఁడని, పెద్దలందురు. మహామాయయే మనయమ్మ యనుచు నెఱుంగ లేనివాఁడు ఉన్నతుఁడు కాఁడు. వానిపుట్టువు తల్లికడుపుఁజేటు.

ఎవ్వరు నీయూపిరి తీయుట మొదలు నిర్వికల్ప సమాధి పర్యంతముఁ గ్రియాశక్తి రూపముగాను, సంకల్ప వికల్పాకారముతో మనోరూపముగాను, గామ క్రోధాద్యాకారముతో నవస్థారూపము గాను, జనన మరణరూపమున మహాపరివర్తనా కారముగాను, నీ చేరువనే సదా వెలయుచున్నారో, ఆమెయే మన తల్లి మహామాయ. నీ సాధనమందు దేనిని నీవు బహువిఘ్నరూపముగా నెంచి, నీ యెడ దయ సూపఁగలదానినే నీ కుటిల కటాక్షముతో విడవఁ జూతువో, దేనిని నీవు మాయయని, మిథ్యయని, భ్రాన్తియని, బంధనమని కన్ను తెఱవకే యెన్నుచున్నావో, ఆ స్వయంప్రకాశయే చుమా, పది దెసల, లోవెలుల నెటు చూచినను వెలయుచున్నది; మన తల్లి మహామాయయే చుమా. తన యీ నెయ్యపుబిడ్డలను గని ముగ్ధయగుచున్నది. మనయమ్మ మహామాయయేగాని, మఱెవ్వరుంగాదు. కామినీ కమనీయాంగ స్పర్శముచే మైమఱచుచున్నది. మహామాయ తల్లియే, మఱెవ్వరుంగాదు. కాంచనాశచే దప్పిగొన్న లేడివలె నిటునటు పరువెత్తునది మహామాయ తల్లియే. పూఁదావిచే ముక్కును దనుపుచున్నది మహామాయ తల్లియే, భక్ష్యభోజ్యాదులచే జిహ్వాతృప్తి నొందించుచున్నది, మహామాయ తల్లియే చుమా. నీ యాఁకలి

దప్పులు తల్లి. కామ క్రోధములు తల్లి. సుఖదుఃఖములు తల్లి. పాపపుణ్యములు తల్లి. జనన మరణములు తల్లి. స్వర్గనరకములు తల్లి. జ్ఞానాజ్ఞానములు తల్లి. తల్లి తక్క మతేదియులేదు. నీలోను వెలిని దల్లి యొక్కతే పూర్ణభావముతో వెలయుచున్నది. నీవు కోరుకొనుచున్నది, నీవు ప్రేమించుచున్నది, నీవు వెదకికొనుచున్నది ఆమహామాయ తల్లినే. నిన్ను వాత్సల్యముతో ఱొమ్మునఁ జేర్చికొని యనంతజన్మ మృత్యు ప్రవాహమందు, వెఱ్ఱిదానివలె జుత్తు విరియఁబోసికొని, రారా ! కొడుకా ! రమ్ము, అని తిరుగుచున్నది. అతి ప్రేమతో అతి ప్రయత్నముతో నిన్నొక పరమాణువు నుండి, శ్రేష్ఠమానవకులమునకుఁ దెచ్చి యుంచినది. మహామాయను దల్లిని నీవింతకాలము గుర్తింపకున్నను హాని లేదు కాని, యిపుడు మనుష్యుఁడ వైతివి. అమ్మను గుర్తించి చూడకుండుట మానవత్వమా ? నీవొక్కసారి, అమ్మా ! యని పిల్తువో యని, విన నెంతో యువ్విళ్లూరుచున్నది. కాని నీవు మాత్రము, అమ్మా ! యనకున్నావు.

చూచుకో, నీవేమి కోరినను నీకుఁ దెలియునట్లో, తెలియనటులో, యపుడే యమ్మ, యా రూపముతోనే, నీ భోగ్యవస్తురూపముతోనే నీ యెదుట నుండును. ప్రేమమయి తల్లి, ప్రసన్నముఖియై, నీ ప్రకృతిరూపముతో నిల్చి, దాసివలె నీ యభిలాషములను దీర్చుచున్నది. నీవు పూవులు, పండ్లు, మున్నగునవి కోరినపుడు, వాని రూపముతోనే నీ యెదుట నుండును. అయ్యో ! అమ్మను నీవు గుర్తింపలేకున్నావు. ఫల

పుష్పాకారముతోఁ, గామకాంచనాకారముతో, నీ యెదుట నున్నది, తల్లియే యని నీవు విచారపూర్వకముగాఁ జూడవు. కేవల నామరూపములకే మోహపడుచున్నావే, ఆ నామరూపము లెవరివోయి ? బహునామములతోఁ దన్ను వెల్లడించుకొన్న దెవ్వరో బొత్తిగాఁ దెలియలేకున్నావు. ఇవి పెద్దల మాటలనుచు గట్టిగా గంతపాతము చేసి, దానిని మిథ్యయని, భ్రాన్తి యని, యెగురఁగొట్టఁ జూచుచున్నావా ? ఆమె మిథ్య కాదు; భ్రాన్తి కాదు; స్వప్నము కాదు; అధ్యాసము కాదు. జడముకాదు. అమ్మయే; సత్యము. ఆమెయే బ్రహ్మము; అభయము; అమృతము; ఆమెయే ఆత్మ. ఆ మహామాయ, తల్లియే 'నేను'.

ధర్మశీలుఁడై యొకఁడు ధర్మమాచరించి, ధార్మిక ప్రసిద్ధి నొందఁగోరుచున్నాఁడు. చూడు; వాని ప్రకృతియై యా ధర్మరూపమున వెలసినది, మహామాయ యమ్మయే. అధర్మశీలుఁడై యొకఁడు సదా పాపపూర్ణాభినయము చేయుచున్నాఁడు. వాని నింద్య ప్రకృతియై పాపపంకిలమార్గమున విచరించుచు, మాసిన చినిఁగిన గుడ్డలు కట్టుకొని, వాని నొడిలో వేసికొని, కూరుచున్న దెవ్వరో, చూడు. అది మహామాయ అమ్మయే. హింసా ద్వేష నిష్ఠుర తారూపముగాను, నిద్రాతంద్రాలస్య రూపముగాను, ఉత్సాహ రూపముగాను తీవ్రప్రయత్న రూపము గాను, విషయభోగ రూపముగాను, సన్న్యాసరూపముగాను, ధనార్జన పరిపాలన రూపముగాను, జప ధ్యాన యోగాది పూజా రూపముగాను వెలయుచున్నది. మహామాయ, అమ్మయే.

నీ దేహాత్మ బుద్ధిరూపము తల్లి; సుఖదుఃఖభోక్తృ ప్రాణరూప తల్లి; శుద్ధబోధరూప తల్లి; బంధనరూపముతోఁ దల్లి; ముక్తి రూపముతోఁ దల్లి; ఇంత నికటమున, ఇంత యంతరమున మఱెవ్వరున్నారు ? 'నావాఁడు' అనునంత నెయ్యము మఱెక్కడనున్నది ? ఇంత స్నేహమయ మధురాలింగనముచే మఱెవ్వరు వైవముఱపింపఁగలరు ? ప్రియురాలి సౌభాగ్యభరాలింగనముచే ముగ్ధులగుచుందురు; పో, అందు రెండు మేనులకు నెడవే; పూర్ణముగాఁ జేరిపోవుట కాఁజాలదు. మహామాయ, తల్లి, ఆత్మవిస్మృతితోఁ జేయు నాలింగనమం దింతయు నెడ ముండదు, ఆమె సర్వప్రేమాదిభావముతోఁ దన్నుఁ దామఱచి మనలోఁ జేరిపోవును ఆమె వాత్సల్యముచే మైమఱచి, యానంద నిగూఢాలింగనమునే చేయును. అనుభవించును. ప్రేమానందములే యామె రూపము. నీ ప్రకృతియై నిమ్నతర దీనతాసోపానమునకు దిగి, మలినపరిచ్ఛేదముతో జీవత్వా భినయము చేయుచున్న తల్లికి, బరమాత్మరూపమైన తల్లికి, జగద్రూపిణి తల్లికి సమ్ముఖమున నిల్చి, యొక్కసారి అమ్మా ! యని పిల్చి, కృతజ్ఞతాపూర్ణమనఃకుసుమముతోడి పుష్పాంజలి సమర్పించు నపుడు, మనల నేవిధముగా ననేకరూపములతో, ననేక మూర్తులతో ముగ్ధులను జేసి, 'కొడుకులారా ! రండు రం' డని యఱచునో చూడుము, మహామాయ తల్లికి మనయెడనెంతో ముద్దు. ఆమె, మనుజపుత్త్రకులకు మనుత్వమనెడి యున్నతిని గలిగించును.

అష్టములను జేయును. మన్వంతరాధి పత్యము నిచ్చును. ఆమె శ్రీ రాజరాజేశ్వరి. సంతానదైన్యమును జూడఁగలదా ? మన క్షుద్రత్వముఁ దొలఁగించుటకే, మన పరిణామిత్వమును బాచుటకే, రాజరాజేశ్వరి యైయుండియు, నామె దీనవేషముతో మన వెనువెంటనే తిరుగుచున్నది. మన యుచ్చైఃస్వనముతోడి, అమ్మా ! యను నొక్క పిల్పునకే యామె ప్రసన్నముఖి యగును. మనము మహాభాగుల మగుదుము. సూర్యాతనయుల మయ్యెదము. అనంతజగత్తులను గన్న సవర్ణ (భర్గః) పుత్రులమని తెలిసికొందుము. ముక్తుల మగుదుము.

విశుద్ధచైతన్యమే, యెవుడనేకరూపములతోఁ దాను బ్రకాశించునో, యపుడదే "మాయ" యనెడి పేరితోఁ బ్రసిద్ధము.

## శక్తి - జగత్తు - సత్త - మహామాయ

ఒక చెట్టును జూచునపుడు,. "చెట్టున్నది - ఇది చెట్టు" అనునపుడు కొంత జ్ఞానము బయల్పడినది. ఉన్నది - అనఁగా 'అస్తి' రూపముగాఁ బ్రకాశించిన యా జ్ఞానాంశమే, ఆ యస్తిత్వమే, వృక్షమనెడి విశేషణముతో ఁగూడి ప్రతీతి గోచరమగుచున్నది. చెట్టు ఒక శక్తి. పై చూపునకుఁ జెట్టు ఒకశక్తి రూపముగా ననుభవింపఁ బడకున్నను, ధీరముగా జూపు సారించినచో, స్థిరముగా నిల్చియున్న చెట్టు వాస్తవముగా స్థిరము కాదనియు, నొక శక్తి ప్రవాహమే యని తెలియ వచ్చును. ఒక శక్తి పరమాణువులను దృఢముగాఁ గూర్చుచున్నది. ప్రతిక్షణము నకర్మణ్య (కర్మసమర్థములు కానివి) పరమాణువులు వెలికివచ్చుచుండఁ గ్రొత్తపరమాణువులు

చేరుచుండును. లోన నిండియున్న రసప్రవాహము శాఖా పత్ర పుష్పాదికము నందుఁ బ్రవహించు చుండును. పృథ్వియొక్క మధ్యాకర్షణ శక్తికి విరుద్ధముగాఁ జెట్టు నిల్చి యున్నది. ఇట్టి పలువిధముల క్రియాశక్తులు చెట్టునం దున్నవి కనుకనే, యొక శక్తిప్రవాహము 'చెట్టు' అను పేరితో నొక చోటఁ బరిచిత మగుచున్నది. ఈ శక్తి ప్రవాహము మూడు విధములుగా నున్నది. ఒకటి చెట్టునకు రూపకల్పనము చేయుచున్నది. రెండవది చెట్టు నిల్కడకగుచున్నది. మూడవది దానివినాశమున కగుచున్నది. అనఁగా దానిరూపు మార్చుచున్నది. ఈ సృష్టి స్థితి లయ శక్తి యొక్క సాధారణ నామమే జగత్తు. పదార్థము. ప్రత్యేక పదార్థమందును సదా యీ మూడుశక్తుల చేరిక గోచరించుచునే యుండును. అస్తిత్వవిశేషణయుక్తమై తెలియఁబడుచుండును. ఈ విశేషమే శక్తి ప్రతీతమైనదే జగత్తు. జగద్వి శిష్టమైన యొక సత్తాజ్ఞానము కలదు. దాని నుండి జగత్తు యొక్క యంశమో, విశేషమో దూరమగుటచే సాధారణముగా ఆ సత్తాంశము తెలియఁదగి యుండదు. మఱి జగత్సత్త ప్రతీతము కాకుండుటచే, ఆత్మసత్త - 'నే నున్నాను' అను తెలివియు నుండదు. ఆసత్త - అస్తిత్వాంశము, సదా శక్తి యొడి యందే - శక్తి కధీనమయియే యుండును. దీనిచే 'జగత్తు' అనఁగానే, మనము ఒకశక్తియు, ఒక నత్తయు నని గ్రహించుచున్నాము. వానిలో శక్త్యంశము మన యింద్రియములచే గ్రహింపఁదగియుండి, స్థూలభావముతోఁ బ్రకాశించుచుండును. ఈ యంశమునకే సాధారణముగా నామరూపములని సంజ్ఞ. రెండవయంశము : అనఁగా సత్త, మన స్థూలేంద్రియములకుఁ

గానరాకున్నను, అప్రత్యక్షముకాదు. ఈ శక్తియు, ఈ సత్తయు వాస్తవముగా భిన్నములు కావు. శక్తియొక్క సత్తయే యనుము. సత్తయొక్క శక్తియే యనుము, శక్తి సత్తయే యనుము. శక్తి సత్తయే సత్తాశక్తి, శక్తి శక్తిమంతుల కభేదము. జీవప్రతీతి యగుచుండుదాఁక శక్తియే సత్తను ధరించు చున్నదని తోఁచును. ఈ శక్తి జడము కాదు. చైతన్యము మాత్రమే. దాని పేరే మహామాయ. కనుకనే జీవజగత్తులు మహామాయ యొడిలోని సంతానమనుట.

ఈ శక్తి (మాయ) మిథ్యకాదు. సత్యమే. బ్రహ్మమును మఱుఁగు పఱచునది కాదు. ఆవరకము కాదు. ప్రకాశకమే. స్వయంప్రకాశ బ్రహ్మము యొక్క విశిష్టప్రకాశము. అదే శక్తి. అదే మాయ. యనునది సగుణ బ్రహ్మము కంటెను వేఱేమియుంగాదు. ఈ మహామాయ - అమ్మ, మఱల బహుత్వ స్పందనముతోఁ గంపిత కాకయుండి, యనేక భావములతోఁ బ్రకాశించు తన శక్తి నుపసంహరించుకొని స్థిరత్వము నొందునపుడు, అదే బ్రహ్మము, నిరంజనము, నిర్వికల్పము మున్నగు పేళ్లతోఁ బ్రసిద్ధమగుచున్నది. అది యాస్థితియందు మనోవాక్కుల కతీతము. జీవజగత్తు లుండుదాఁక, ఉపాసన ముండు దాఁక, మహామాయ యుండనే యుండును. ఎంతవఱకు మాతృలాభ ముండునో యంతదాఁక, మహామాయారూపము గానే ప్రకటిత యగుచుండును. ఇమ్మహామాయ స్వేచ్ఛతోఁ గల్పించుకొన్న శిశుచైతన్యమే జీవుఁడు. ఆకాశమందలి పరమాణువు మొదలుగా హిరణ్యగర్భపర్యంతము సమస్తమును మహామాయ యొడియందున్న సంతానమే. అనఁగా

మహామాయయే జీవజగదాకారమున నిత్యము ప్రకాశించుచున్న దనుట.

మనము పూవులలోఁ బూవును జూడలేదు - అమ్మనే. పండునందుఁ బండును జూడలేదు. జలమందు రసమయియైన యమ్మనే. వాయువు వాయువుకాదు; స్పర్శమయి యమ్మయే. చంద్రసూర్యులు చంద్ర సూర్యులుకారు; అమ్మ కన్నులే. మెఱుపు మెఱుపు కాదు. అమ్మ క్రేగంటి చూపే. నిర్మలాకాశము ఆకాశముకాదు, ఉదారమును బ్రశాంతమునైన యమ్మతొమ్మే. మేఘసముదాయము అమ్మ తలకట్టే. ఈ కానవచ్చు జగము అమ్మ ప్రకటవిగ్రహమే. ఈ జగత్తును బరికించియుఁ దల్లిని గుర్తింపలేనివాఁడు, జగదతీతయు భావాతీతయునైన యాతల్లిని ముట్టికోఁ జాలఁడు. మన తల్లియే దయచేసి, గురు రూపముతో హృదయమం దావిర్భవించి యెవని యజ్ఞానాంధ నేత్రమును జ్ఞానాంజన శలాకతో విప్పునో (అజ్ఞానమనెడి నేత్ర రోగమునకు జ్ఞానమనెడి కాటుకయే మందు.) వాఁడు మాత్రమే విశ్వమందలి ప్రత్యేకపరమాణువునందును మాతృమూర్తిని జూడఁగలడు. మతి సదానందమయుఁడు కాఁగలఁడు.

అంతటను దన యిష్టవస్తువే స్ఫురింపనపుడు సాధకుని తపస్సు కేవల తపస్సే "అంతర్బహిర్యది హరి స్తపసా తతః కిం, నాంతర్బహిర్యది హరి స్తపసా తతః కిమ్" లోవెలుల హరి యున్నవానికి (హరిని గాంచువానికి) తపస్సువలని ప్రయోజనములేదు. లోవెలుల హరి లేని వానికిని దపస్సువలని ప్రయోజనము లేదు.

## అనుభావము

మహామాయయొక్క యనుభావముచేత (అనుకూలేచ్ఛచేత) జీవుఁడు మన్వంతరాధిపతి కాఁగలఁడు.

అనుభావమనఁగా - "అను-పశ్చాత్ భూయతే ఇత్యను భావః" అవ్యవహితముగా (ఎడమలేక) భావరూపమునఁ బ్రకటితయగుట మహామాయ చైతన్యమయి. శక్తిస్వరూప. కావున దుర్విజ్ఞేయ. (కష్టముచేఁ దెలియదగినది) ప్రతిక్షణము మనలోఁ బుట్టుచు నణఁగిపోవుచుండు భావపరంపరయే, మహామాయ యొక్క యనుభావము. కామక్రోధాది వృత్తులు, రూపరసాది విషయములు, దయాక్షమాదులు, అను నిట్టి సర్వము మహా మాయయొక్క యనుభావమే. ఈ భావరాశి మహామాయ యందే పుట్టి, మఱల దానియందే యణఁగిపోవును. మన యమ్మ యవ్యక్తావస్థవీడి, వ్యక్తావస్థతో నావిర్భవించునపుడు, ఆమె భావాకారముతోనే ప్రకటిత యగుచుండును. ఆ భావ రాశి ఘనీభూతమై యీ స్థూలజగదాకారముతో వెలయు చున్నది. భావముల ఘనీభూతావస్థయే స్థూలము. మహామాయ యనుభావాకారముతో నుండునంత దాఁకఁ గేవల మానస గ్రాహ్యయే. ఆమె ఘనావస్థ నొందినంతనే స్థూలేంద్రియ గ్రాహ్య యగును. భావమే మహామాయ యొక్క పశ్చాద్వర్తియైన (వెనువెంటనగు) రెండవ రూపము; మహా మాయా నిర్విశేష స్వరూపము. జీవులకుఁ దఱుచుగా నవ్యక్త మైయున్నను, భావమయియు, అనుభావస్వరూపయునై, యా యమ్మ ప్రతిజీవుని నికటమందును బ్రతిక్షణము వెలయుచునే యున్నది. భావమే తల్లి;

భావభావమందును భావినియై (చక్కనిదై) తల్లి యెల్లప్పుడు వచ్చుచునే యున్నదని తెలిసికొన్నచో నిశ్చయముగా మహామాయయొక్క యనుకూలేచ్ఛను (స్నేహమును) అనుభవించి, మనము మనలనే మఱతుము.

కాలిలో ముల్లు విఱిగినది; నొప్పి కలిగినది. ఆ భావ మెక్కడిది? ముంటి యందలిదా? మన యంతరమునందలిదా? మామిడిపండు తిన్నాము; తీయఁగా నున్నదన్నాము. ఆ తీపి మామిడిపండు నందలిదా? మనలోని భావముయొక్క యనుభవమా? ఆ భావము మనలోనే యున్నది. పైకి జగత్తనఁగానే, యేదో యున్నదో లేదో, దాని నెఱుంగుటకు వేఱొక్క వెరవులేదు. అంతటను బరమపద మొక్కటే యున్నది. దాని యర్థము-రాశి = భావసమూహము. ఎల్లపుడును మన యాంతర రాజ్యమందు, ఒక దాని వెనుక నొకటి తలసూపుచునే యుండును. దాని యభిప్రాయము బయల్పడినపుడు, దొరుకును. ఈ మంచిమాటయే (పరమపదమే) మహామాయ. మఱి, యా పదము నర్థమే పదార్థము. అదియే భావము. కనుకనే యమ్మహా మాయ కనుభావమని పేరు.

మహామాయ పరాశక్తి రూపిణి. చిన్మయి. పరాప్రకృతి. తల్లి, మనలను బూర్ణత్వమందుఁ (బ్రహ్మత్వమందు) జేర్చుటకే పరిచ్ఛిన్న విషయములనుండి - అజ్ఞానమునుండి, విశుద్ధమును అపరిచ్ఛిన్నమునైన జ్ఞానమునందుఁ జేర్చుటకే, యెవుడే భావములతో భావుకుల మగుటకే మన యాధ్యాత్మికగతి తీవ్రమగునో, యెప్పుడే భావముతో భావింపఁబడుటచే భావాతీత మహామాయను 'తల్లి' యని, సులభముగ నెఱుంగఁ గలమో

యపుడు మన యమ్మ, యా భావముతోనే వెలయును. కొంచెము నిదానించి చూచినచో, ఆ భావరాశి యొకానొక యవ్యక్త క్షేత్రమునుండి, ఒకానొక యిచ్ఛతోఁ బుట్టుననియు, మఱల నా యవ్యక్త క్షేత్రమందే చేరిపోవుననియు బాగుగ నెఱుంగఁ గలము. కాని దాని యావిర్భావమును దిరోధానమును గేవల స్వతంత్రములు. జీవభావీయపు హద్దును మీఱినవి.

## భావచాంచల్యము, అది తొలఁగు నుపాయము

ఈ భావరాశికేంద్రము నన్వేషించుటకు దేవులాడుచు, భావభావమందును మహామాయా కేంద్రమును గుర్తించుచు, భావమునే 'తల్లీ!' యనుచు, 'ఆత్మ' యనుచు నా భావము వెంటఁ బరువెత్తు సాధక పుత్త్రుఁడే మహామాయయను దల్లి నెఱుంగఁగలఁడు.

అనేకులు సాధకులు సంపూర్ణభావముతోఁ దమ తమ యిష్టదైవమును ధ్యానించునపుడు, కొంతతడవు సాగిన తర్వాతఁ దమ యిష్టమూర్తికి మాఱుగా నేదోయొక లౌకిక వస్తువు పొడ కట్టుచుండును. శివధ్యానము కొంతసేపటికి వానరధ్యానమై పోవును. రాజరాజేశ్వరుని యాసనము (మనస్సు) మీది కేదే నొక లౌకికధూళి (ధన దార పుత్త్ర దాసకీర్తి ప్రతిష్ఠాదులం దొకటి) వచ్చిపడును. అపుడే యొక చీకాకుపుట్టి, బిట్టునిట్టూర్చి, "అయ్యో ! నా కేమియు లాభము లేకపోయెనే; అమ్మను ధ్యానింపఁ గూర్చుండ వ్యర్థమైన ధూళి (అనేక భావములు) ప్రోగై హృదయమున నిండిపోయెనే, నాకిఁక భగవత్ప్రాప్తి బొత్తిగా నసంభవము. ఇంత

చంచలమైన మనస్సుతో భగవంతుని ధ్యానించు సాధన మెట్లు సాగును ? సంసారమును వీడి యడవిలోనుండు మహాపురుషులకే, గాని, సాధనా వ్యాపారము నా వంటి సంసారిగృహస్థునకుఁ గాదు.' అనుకొనును. అక్కటా ! 'ఆ చాంచల్యరూపముతో, ఆ లౌకిక ధనవనితాది రూపముతో, అమ్మయే వచ్చినది. అమ్మ భావమాత్రముగానే యున్నది. అని తెలిసికొనఁ గల్గినచో మోహరూపిణి, బహువేషప్రియ, లీలావిలాసిని మా యమ్మ యెంతదాఁక నీ యానందలీల జరుపునో, యంతదాఁక మాటి మాటికి నామె భావమయమూర్తి పలురూపముల నొందుచునే యుండును.' అని తెలియఁగల్గినచో మఱి హతాశుఁడు కాఁడు.

అమ్మా ! యని దీనముగ నఱచుచుఁ దన హృదయ సింహపీఠికయందు మాతృచరణములను బ్రతిష్ఠించు వేళ, ననంత కోటి బ్రహ్మాండములందును నెట్టివానికిని, ఆ సింహాసనమును దాకుటకును హక్కులేదు. అమ్మా ! యను సాధకుని యఱపు విన్నంతనే, బ్రహ్మవిష్ణుమహేశ్వరాది దేవతాగణము సైతము కిక్కురు మనక దారియిచ్చి తొలఁగవలసినదే. ఈ జాగతిక తుచ్ఛధూళి యెగిరిపోవుట యన నెంత ? తల్లి సింహాసనమును దాకుటకుఁ దల్లికిఁదక్క నొరులకెట్టివారికిని హక్కులేదు.

భగవచ్చింతకుఁ బూనుకొన్నపుడు జాగతికభావము లెన్నియో భంగము గలిగించుచున్నవని వగవరాదు. ఆ భావములను లక్షించి వానియందే సత్యప్రతిష్ఠ చేయుచు, మన యిష్టమూర్తియే యా మాఱువేసముతో వచ్చెనని యాదరించి, యాభావములకే, అమ్మా! అమ్మా ! యని మ్రొక్కుచు సాధనతీవ్రతను వీడకున్నచో

భావచంచలయైన మన యమ్మ నగుమోముతోఁ గానవచ్చి, చిత్తమును స్థిరముచేయును.

మఱొకమాట - "చిత్తము చంచలమైనపుడు సాధనము సాగదు; చిత్తము స్థిరపడినపుడే సాగును" అనుట కేవల భ్రాంతిమూలకము. తల్లిని జేరుటకు మున్నెవ్వరి చిత్తమును స్థిరపడదు; స్థిరపడఁ జాలదు. ప్రొద్దు పొడిచినంతనే చీఁకటి తనంతటఁ దాఁదొలఁగునట్లు, తల్లి వచ్చినంతనే చిత్తము తనంతట స్థిరపడును. మాతృలాభమునకు మున్నే, హఠక్రియ వల్లఁగాని, ప్రాణాయామాదులవల్లఁగాని చిత్తవృత్తులు నిరోధింపబడినను, విశేషలాభ మేమియుఁ గల్గదు. అది యొక విధమైన నిద్రావిశేషమే. జడసమాధి మాత్రమే. వాస్తవ ప్రజ్ఞ ప్రకాశించినపైనే చిత్తస్థిరత కల్గును. అపుడు మనమెట్టి ప్రయత్నమును జేయనక్కర లేదు. ఇట్టి ప్రజ్ఞాప్రాప్తి యగుటకు మున్నే, వృత్తిప్రవాహము, ఏదేనొక విషయము నవలంబించి, దృఢభూమికయైనచో, సంసారి జీవునియెడ నది యమంగళకరమే. కామక్రోధాదులు రేకెత్తుటయు, శోకదుఃఖాదులు మొలకెత్తుటయు నైనచో నది యెంత హానినైనను చేయును. చిత్తచాంచల్యము కారణమై యది యంతలోనే యణఁగి పోవును. సాధారణావస్థ యందుఁ జిత్తము దృఢభూమిక యైనచో నా యుపద్రవమువలన నెంత దుర్దశయైనను సంఘటిల్లును. ఒక్కసారి విచారించి చూడుము. చిత్తచాంచల్యము తల్లి యాశీర్వాదమే.

మహామాయానుభావమే యనుము. అనుభావ స్వరూపిణి మహామాయయే యనుము. ఆమెయే మనుత్వమును జేకూర్చునది.

అపుడు సాధకుఁడు మనుష్య దేహముతోనే యుండి "నేను మనువనైతిని. నేను సూర్యుఁడనైతిని" అని తలఁపఁగలడు. ఇది భాషాఝుంకారము కాదు, సత్యము.

హృదయరాజ్యమం దేవో భావములు, రేవగళ్లు నొక దాని వెనుక నొకటి పొడముచునేయుండును. ఇది మంచి, ఇది చెడ్డ యనక, ఇది గొప్ప, ఇది కొలఁది యనక, ప్రత్యేకభావమును దల్లియే యనుచు, నా భావములన్నియు లీనమై పోవు స్థానమును జేరుకొనుటకై, భావరూపిణియైన యా యమ్మ కాళ్ల పట్టుకొని యేడ్చునవుడు, కన్నీళ్లతో గుండె తడియునంత జాలిలో మునుఁగవలయును. కృతార్థుఁడవు కాకపోవుదువుగాక. మాటిమాటికి నిష్ఫలత్వమే కనవచ్చునుగాక. కాతరభావముతో 'అమ్మా ! అమ్మా !' యను నీ యఱపు మాత్రము మానకు. భావములు మనలను వీడిపోవును. నిరాశ తగదు. క్రమక్రమముగా విఫలతయే సఫలతకుఁ గొనిపోవును. ఇట్లు కొన్నాళ్ళు మొండిపట్టుదలతో సాగినచో, మహామాయ యొడిలోనే సర్వదా మనము లాలింపఁబడుట యనుభవింతువు. భావరూపిణి మన యమ్మయే మనలను, భావములు వుట్టి, మఱల నవి చేరిపోవుచోటయిన భావాతీత క్షేత్రమునకుఁ గొంపోవును.

సంక్షేపముగా సారాంశము వినుము :- బ్రహ్మ మొదలు, ఆకాశ పరమాణుపర్యంతము, నంతట మహామాయా ప్రకాశమే. సచ్చిదానందమయి మహామాయ లేని చోటే లేదు. అయమ్మగారి యనుభావమే యుూతగా ముందంజవేసినవుడు అనఁగా, జాగతికభావములెల్ల మహామాయయే యని తెలిసినపైనిఁ జీవుఁడు

మన్వంతరాధిపతి కాఁగలఁడు. శుద్ధబోధ రూపమున నిల్వ సమర్థుఁడగును. అపుడా వరేణ్య భర్గః శక్తి బిడ్డఁడనని తెలిసికొని యనుభవించును. మహాభాగుఁ డగును. "మహాః=భాగ్యః=వీర్యః యస్య సః మహాభాగః" భగ ఏవ భాగః వా భగసంబంధీ భాగః ('భగః శ్రీ కామ మాహాత్మ్య వీర్య - యత్నార్కకీర్తిషు') (కోశము) , అపు డాతఁడు అనంత శ్రీవీర్య మాహాత్మ్య కీర్తిమంతుఁ డగును. అష్టముఁ డగును. 'అష్టమాతీ త్యష్టమః' అష్టసిద్ధీశ్వరుఁడును, అష్టపాశ విముక్తుఁ డును నగును. భగవత్సారూప్యము నొందును.

అమ్మ (ఆత్మ) తన తత్త్వమందుఁ బ్రవేశించు బలమును బెంపొందించి యాకర్షించును. ఆకర్షణసీమలోఁ బడినవాఁడే ధన్యుఁడు. నిష్కామమైనచో మెల్ల మెల్లఁగాఁ దల్లి యొడివంకకే జరిగిపోవును. చూడుము. మన మెన్నిసార్లో మనకుఁ గోరిక లేకయే, కొన్నికొన్ని మంచిపనులు చేసివేయుచున్నాము. అటులే మన తల్లి యాకర్షణసీమలోఁ బడఁగానే మనము కోరకయే, యవశముగాఁ దల్లివంకకే నడిచిపోవుట యారంభమగును. తనయందీ యవస్థను నెమ్మదిగా ననుభవించునపుడే, వాని యజ్ఞానాంధకారము తొలఁగును. చెదరని క్రొత్తయుత్సాహానుభవముతో సాధన క్షేత్రమునందు విజయ మొందఁగలఁడు.

## స్వర్గజ్యోతి - స్వారోచిస్సు

ఇదే, ఆంతర తేజము. ఈ దివ్యజ్యోతిచేఁ బ్రకాశింపఁ జేయఁబడునపుడు జీవుఁడు సురథుఁడగును. సురథుఁ డనఁగా మంచిరథము గలవాఁడు. రథము - శరీరము. (నా దేవపూజా

రహస్యమందు 'రథయాత్ర' రహస్యమును జూచునది.)
మున్ముందింకను వివరింపఁబడును.

సర్వమందును సత్యప్రతిష్ఠఁ జేయుచు, సర్వమును మహా మాయ తల్లిరూపముగా ననుభవించుచు, నానందముతోఁ దన్నుఁదా మఱచువాని యంతర రాజ్యమే శుభ్ర దివ్యజ్యోతిః ప్రకాశితము. గురు కృపాదర్శితోపాయములకు బుద్ధియోగమును దోడుచేసి, సర్వత్ర మాతృదర్శనాభ్యాసి యగు వాని యంతర మిట్టే స్వారోచిషమగును.

## యథార్థకుండలినీ జాగరణము

ఇదే యోగ శాస్త్రమందు సుషుమ్నా నాడీభేదము; తంత్రములందుఁ గులకుండలినీ జాగరణము. దీనినే పతంజలి "విశోకా - జ్యోతిష్మతీవృత్తి" యనెను. వేదాంతము దీనిని చిదాభాస శబ్దముతో వ్యవహరించెను. అందఱ మాటయు సత్యమే యోగులు కఠోరయోగ సాధనముతోను, సన్న్యాసులు కఠినవైరాగ్యప్రతిపాలన, దుస్సాధనిదిధ్యాసనముతోను, ఏ జ్యోతిరాభాసమును గాంచి ధన్యులగుదురో, తాంత్రికులు కులకుండలినీ జాగరణము నొకవిధమైన కాల్పనిక వ్యాపారముగా నెంతురో, ఏ సుషుమ్నా ప్రవాహమును బ్రకాశింపఁజేయుటకు, రాజయోగులు యమనియమాదికాభ్యాసము చేసి జీవనము ధన్యము చేసికొందురో, యా స్వారోచిషత్వ ప్రాప్తి సత్య ప్రతిష్ఠాసహాయమున నతిసులభమై యనాయాసముగా నగును. దీనికై యెట్టి దృఢసంయమముల ప్రయోజనము నక్కఱలేదు. సన్న్యాసమనెడి దుస్సాధత్యాగ మార్గము నక్కఱలేదు. నీరస విచారభరితమైన

యన్వేషణము నక్కఱలేదు. ఎట్టి కళాకౌశలము నక్కఱలేదు. కేవల సరళవిశ్వాసముతో వైదికయుగ మందలి ఋషులవలె జగన్మయ బ్రహ్మసత్తాదర్శన మలవడుట తోనే నిర్మల చిదాకాశము ప్రకాశించును. శాంతిమయమైన యా మాత్రంకజ్యోతి యెంత ప్రత్యక్షము ! ఎంత సధనము ! దాని ఘనీభూత సత్తయందు జగత్సత్త విలుప్త ప్రాయమై పోవును. ఇదే యథార్థకుండలినీ జాగరణము. ఇదే యథార్థ సుషుమ్నాప్రవేశము. మేరుదండాంతమందొక సర్పకల్పనముఁ జేసికొన్నంతనే కుండలినీజాగరణము కాదు. మేరుదండమం దొక స్నాయువును గల్పించుకొని, దాని దారిని బ్రవేశించి నంతన సుషుమ్నా ప్రవేశముకాదు. వాస్తవమైన యీ విశోకా జ్యోతిర్దర్శనముచే జీవుని సర్వవిధ శోకమోహాదుల కూకటి వేరు తెగిపోవును. అపుడు పూర్ణత్వమువైపే పిచ్చివానివలెఁ బరువెత్తును. ఈ జగత్తులో నుండియు జనసామాన్యము గాన లేని, యంతర్జగత్తునఁ జొచ్చుటచే ననిర్వాచ్యమైన తృప్తి నొందును. చైతన్యమయజ్యోతిఃసముద్రస్నానము చేసి జీవుఁడు కృతార్థుఁడగును. ఎల్లపుడును జ్యోతిర్మయమూర్తిని ధ్యానించుటచే నంతరము దివ్యజ్యోతిఃప్రకాశిత మగుననువారు కొందఱు; మనస్స నాహతమందు నిల్పెనేని ఈశ్వరజ్యోతి కనవచ్చు నను వారు కొందఱు; మణిపురమందు (నాభిపద్మమందు) ధ్యానించినచో జ్యోతిర్దర్శన మగుననువారు కొందఱు; అందఱి మాటలు నిజమే. కాని యొక జడజ్యోతిని జూచియే తృప్తినొందినంతనే సరియా ? సఫలకాములు కాఁగలరా ? అది ముక్తి నిచ్చునా ? ప్రజ్ఞాప్రకాశము గాక, జ్యోతి, ప్రాణమయము - చైతన్యమయము గాక, అజ్ఞానము

తొలఁగునా ? అంతరజ్యోతిని దర్శించువాఁడు, ఆ యాంతరవస్తువు నెఱుంగకున్న యథార్థ స్వారోచిషత్వము లభించునా ? అంతరదర్శనశక్తి గలవారికి బహుజన్మనంచితాజ్ఞానము తొలఁగిపోవును.

## అంతర బాహిర భేదము తొలఁగవలయును

అంతరమనఁగానే మన శరీరమందలి మనసుమీదనే లక్ష్యము పడును. ఇది యొక ఘోరమైన యజ్ఞానము. వాస్తవముచే, నాంతర బాహిరము లనఁగానే యొక స్థానభేదము లేదు. సరిగదా, అంతయు నంతరమే యనవలయును. మనము భోగించు జగత్తు, మన యంతరమాత్రమే. ఆ బహుదూరవర్తి యాకాశము, ఆ జ్యోతిర్మయ సూర్యచంద్రాది గ్రహమాల, ఆ విశాల సముద్రము, ఆ యున్నత పర్వతపంక్తులు సమస్తము మన యంతరమే. ధన దార పుత్ర పరివారాదికము, సమస్తము మన యంతరమాత్రమే. ఈ రస రక్త మాంసాదికముతో నైన యీ స్థూలదేహము మన యంతరమే. ఈ 'నేను' ఎంత గొప్పది ! ఎంత విశాలము ! ఎంత దూరవ్యాప్తి గలది !

దేహములో మనస్సున్నది. మనస్సులో దేహమున్నది. మనస్సు యొక్క యొక యంశమే ఘనీభవించి స్థూలదేహాకారము నొందినది. జలము కొంత ఘనీభవించి మంచుగడ్డ యైనటులే, యని యెఱుంగునది.

భావవేం జగత్తని యున్నంటివి. రేవగళ్లు మన మింద్రియములు దారిని గ్రహించుచున్నదియు, భోగించు చున్నదియు, భావమాత్రమే, భావము మనోధర్మము. కనుక

నీ కానవచ్చు జగమంతయు మన మనస్సే. మన యంతరమే. ఒక పూవును జూచునపుడు, అది వాస్తవముగా వెలుపలలేదు. మన మనస్సే పుష్పాకారమును ధరించినది కనుకనే మనకుఁ బూవును జూచుట యనెడిపని సంఘటితమగుచున్నది. ఇటులే సర్వత్ర యెఱుంగునది. ఆలు బిడ్డలే యనుము; ధనాదులే యనుము; దవ్వులందున్న సూర్యచంద్రులే యనుము; అంతయు మన యంతరమే. వేదాంతదర్శనములందును విషయయుక్త చైతన్యము, అంతఃకరణయుక్త చైతన్యము, ప్రమాణకారక చైతన్యము, ననువాని యేకత్వమువల్లనే విషయజ్ఞానము కలుగునని చెప్పఁబడెను. అది యుండనీ. ఇఁక న్యాయశాస్త్రమును జదివినవారి మనఃపరిమాణ మణుమాత్రము గదా. "ఇంత పెద్దజగత్తు మనసే యైనచో దాని కణుత్వము సిద్ధము కాదే" యను సంశయము కలుగవచ్చును, సరే, బాగున్నది; "అ యౌగపద్ జ్ఞానానాం తస్యాణుత్వ మిహోచ్యతే.' ' ఒక్కసారి రెండు జ్ఞానములను గ్రహింపలేని కారణమున మనస్సు నణువనిరి. నిజముగా మనస్సు అణువుకంటె నణువు; మహత్తుకంటె మహత్తు. అణుపరిమాణమే యైనను దాని విశాలత్వవ్యాపిత్వములు సర్వశాస్త్రసిద్ధములును బ్రత్యక్షాను భూతములునై యున్నవి. ప్రత్యక్ష విషయమందు శాస్త్ర ప్రమాణము లెందుకు ? ఇంద్రియములచే మనము గ్రహించు నదియు, వెలుపలిది యని తలంచునదియు వాస్తవముగా మనలోనే యున్నది. మన యంతరరాజ్యమందే రేవగళ్లు విచరించుచున్నదనెడి యనుభవము కానంతదాఁక జీవుని మృత్యు భయము తొలఁగదు. "ఈ జగత్తు నా యంతరమే." యనెడి ధారణ

చేయునపుడు, తొలుదొల్త జీవభావీయమైన "నేను" అనుదాని స్మరణమే యైనచో నది యసంభవముగానే ప్రతీత మగును, (తోఁచును) గనుక సాధనరాజ్యమందు "నేను" అనుమాటను విడిచి 'అమ్మ' యను పదమో, భగవంతుని యొక పేరో వ్యవహరించినచో సాధనమార్గము సుగమ మగును.

"యథాపూర్వ మకల్పయత్ ॥" శ్రుతి, ఈ జగత్తు అమ్మ కల్పనమాత్రమే. కల్పన అంతరమందలిదే. అది మనో ధర్మము కావుటనే " జగత్తును జూచుచున్నాను" అన్నంతనే అమ్మ మనస్సును జూచు చున్నానని యెఱుంగవలయును. సూర్యుఁడు సూర్యుఁడు కాఁడు. అమ్మ మానసిక భావమే. అమ్మ "నేను సూర్యుఁడ" ను అనుచున్నది; చంద్రుడు చంద్రుఁడు కాఁడు. అమ్మ "నేను చంద్రుఁడ" ననుకొనుచున్నది. చెట్టు చెట్టుకాదు. అమ్మ "నేను చెట్టు" ననుకొను చున్నది. అటులే పృథ్వి, వాయువు, కామినీ కాంచనాదులనన్నిటి నెఱుంగునది. జగత్తు తల్లిమనసే, మన మనోభావములు అల్పక్షణ స్థాయులు. అమ్మ మనస్సు హద్దు లేనిది. అనంతవీర్యము. కనుక నా భావములు భావములనుచు గ్రహింపఁజాలనంత దృఢములు. చిరస్థాయులు. నిజముగా మనము, అమ్మ యంతరమందే పుట్టుచున్నారము. చరించు చున్నాము. అమ్మ యంతర మందే చచ్చుచున్నాము. సర్వా వస్థలందును అమ్మ యంతరమందే యున్నాము. ఈ జగత్తునం దసంఖ్య భేదములతో నసంఖ్య నామరూపములతో నసంఖ్య వస్తువులు కానవచ్చు చున్నను, అన్నియు నమ్మ యంతరమనెడి యింటనే యున్నవని యెఱుంగునది. ఇట్టి ధారణవల్లనే బహుత్వ బుద్ధియు భేద బుద్ధియు మెల్ల మెల్లఁగా నేకత్వము వైపు

నడుచుటచే, అంతర వస్తుజ్ఞానము సరిగాఁ గల్గును. ఈ యంతర జ్ఞానమును బట్టియే మహామాయానుభావము మాట మున్ను చెప్పఁబడినది.

ఇందొక రహస్యము - ఏది దేని యంతరమో యది దాని కాశ్రితము. ఈ జగత్తు అమ్మ కంతరము గాన, అమ్మ కాశ్రితము. మనము మాయకు (అమ్మకు) అంతరము, గాన సర్వవిధముల అమ్మ కాశ్రితులము. అమ్మ యాశ్రయము. ఇట్టి యాశ్రయాశ్రిత భావము సాధనపథమందు ముఖ్యమైన యూఁత. మన మప్పుడప్పుడు "భగవల్లాభము లేకున్న (మాతృదర్శనము కాకున్న) మనకేమి హాని ? భగవంతుని యపేక్ష లేకయే పనులన్నియు సాగిపోవు చున్నవే" యనుకొందుము. ఇది కేవలా జ్ఞానము." "చెట్టును బండు తగుల్కొనియున్నది. చెట్టు లేకున్న మనకేమి హాని ? దేహమున్నపుడు ప్రాణము లేకున్న నేమి కీడు ? వాయువున్నపుడు అకాశము లేకున్న నేమి నష్టము ?" అనుట యెట్టి యజ్ఞానమూలకసిద్ధాంతమో, అట్టిదే భగవంతుని విడిచిపెట్టి, తమ యునికిని నిలువఁబెట్టఁ జూచువారి సిద్ధాంతము. వారిని దెలివిలేని చంటిబిడ్డలవంటివా రనవలదా ? ఆంతరము, బాహిరము నను భేదము తొలఁగి సర్వత్ర మన యంతరమే యను ననుభవము కలుగవలయును.

## రథయాత్ర

ఆ యనుభవము కలిగినపుడే - మన యంతరము శ్రీ మాతృమంగళమయాంగ ప్రభతోఁ బ్రకాశితమగుట తెలిసినపుడే,

జీవుఁడు సురథుఁడగును. "అత్మానం రథినం విద్ధి దేహంతు రథమేవ చ" (కఠ) ఆత్మ రథి. దేహము రథము. "రథస్థం మాధవం దృష్ట్వా పునర్జన్మ న విద్యతే" దేహమందే యున్న పరమాత్మను జూచువారికి మఱి పుట్టులేదు. ఈ సిద్ధాన్త పరమార్థమే, యుత్సవమూర్తులను రథముపై నుంచి యూరేగించునపుడు జరుగు రథయాత్రోత్సవముచేఁ దెలియఁదగినది. జీవుఁడు దేహమనెడి రథముతోఁ జేయు సంసారయాత్ర, రథయాత్ర. ఈ యాత్రయందు నేననెడి జీవుఁడు తనను మాధవునిఁ గానే నిశ్చయించి యనుభవించుటే రథస్థ మాధవుని జూచుట. దాని ఫలముగానే (అహం బ్రహ్మాస్మీతి మహావాక్యార్థ సాక్షాత్కార ఫలముగానే) అపునరావృత్తి లాభము. స్వర్గీయ జ్యోతి హృదయమున వెలుఁగనంతదాఁక మహామాయను జగన్మూర్తి విశ్వాసముతో మనసున ధరింపఁజాలనంతదాఁక, జీవుఁడు సురథుఁడు కాఁజాలఁడు. వాని రథయాత్ర యొడిదుడుకుల తోడిదేయై తుదముట్టదు.

## జీవుఁడు సురథుఁ డెట్లగును ?

అనేక విచిత్రయోనులందుఁ బరిభ్రమించి, యొక జడ పరమాణువునుండి క్రమముగా గుల్మలతా వృక్ష కీట పతంగ పక్షి పశు ప్రముఖములైన యసంఖ్య యోనులందును, అసంఖ్య వంశములందును దిరిగితిరిగి జీవుఁడు మనుష్యుఁడగుచున్నాఁడు. భగవత్సత్తయందు విశ్వాసవంతుఁడు కానంతదాఁక, ఈ జగన్మూర్తిని మహామాయగాఁ దెలియలేనంత దాఁక నతఁడు దేహరథుఁడుగానే యుండునుగాని సురథుఁడు కాఁజాలఁడు.

ఎవరు మనల నొక జడపరమాణువునుండి జ్ఞానవికాస క్షేత్రమగు మానవకులమందుఁ జేర్చిరో, యెవరు మన యంతర దేశమును స్వారోచిషముగాఁ జేసివైచిరో యెవరి స్వారోచిషముచే మన హృదయరాజ్యము ప్రకాశితమో, యెవ్వరు మన పనులన్నిటిని దనచేతితోనే సుసంపన్నములుగాఁ జేయుచుండియుఁ దన కర్తృత్వమును జాటునఁ బెట్టిరో, యెవరు చాటున నుండియే తన యపారస్నేహమును జూపుచుఁ గానరాకున్నారో, ఆమెను అమ్మా! యని యొక్క నాఁడయినను నోరారఁబిలువ లేకున్నాము. సరళభావముతో నొక్కసారియైనను యథార్థ పుత్త్రులమై యామె స్నేహాదరముల ననుభవింపలేకున్నాము. ఎవరు మన యీ దేహరథమునకు సారథియెూ యెవరి శుభేచ్ఛచే మనము మనుష్యులమై సురథులమైతిమో, అమ్మహా మాయ తల్లివైపు తిరిగి కృతజ్ఞతాపూర్వకముగా నొక్క నిట్టూర్పు విడువలేకున్నాము. ఏమి మనుష్యత్వము ? కాల్పనా ? అంతయుఁ గృతఘ్నత. పోనీ; ఎవరిని విడిచిన, మఱి మన కేమియు లేదో, యెవ్వరి యస్తిత్వమువల్లనే మన యస్తిత్వ మున్నదో, ఆమె యస్తిత్వమందు నేఁటికిని బూర్ణవిశ్వాసము లేకున్నామే. అకటా ! అమ్మ తన సాటిలేని నెయ్యమునకు బదులడుగదే. స్నేహస్తన్యదానమే యామె పని; చేయుచున్నది; చేయఁగలదు. మనము కృతఘ్నులమైనను, నేవగించి చూడఁజాలదు. సరిగదా, తన యమృతమయ సంజీవనీ ధారలతో సదా మనల నాడించును; ఏమి స్నేహము ! ఏమి మాతృత్వము ! దానిఁ బ్రకటింపఁగల మాటలున్నవా ?

## పుత్రులే శత్రులు

సాధకజీవుఁడు సురథుఁడైనను, బ్రజాపాలనమందు వ్యగ్రుఁడైయుండియుఁ గొన్నాళ్ళకు వారే శత్రులౌట కనుగొన్న బాగుపడును.

భావసమష్టియొక్క సాధారణనామమే 'నేను'. చెట్టు అనఁగానే మూలస్కంధ శాఖాపత్రఫలాదులే గాక, దానిపై నున్న పక్షులు మున్నగు వానితోఁ గలిపియే చెట్టు అని తోఁచు నటులే, 'నేను' అనఁగానే సర్వభావములతోను విడని సంబంధ మొకటి యుండును. 'నేను' అనఁగానే మనోబుధ్ధ్యహంకారాదులు, చక్షురాదీంద్రియములు, ధన దార పుత్ర విద్యాదులు, సుఖదుఃఖ పాపపుణ్య దయాక్షమాదులు, నన్నియు నేనుతో నల్లుకొని యున్నవి, గాన వీనినన్నిఁటిని గలిపి 'నేను' అనుచున్నాము. ఈ భావముల నన్నిఁటిని విడిచిపెట్టినను, 'నేను' అనునదేదో యుండనే యుండును. ఇది మనము తొల్తనే తెలిసికొనలేము. కనుక 'నేను' అనుదాని తృప్తికై భావపోషణము చేయుదుము. (కన్నబిడ్డలను బాలించుట). ప్రజలనఁగా భావములు. "ప్రకర్షేణ జాయన్తే ఆవిర్భవన్తి వా ఇతి ప్రజాః" ప్రజా శబ్దార్థము భావములు.

జీవభావీయమైన అహం జ్ఞానము సంతిమసీమను జేరునపుడు సర్వమనోవృత్తులను (భావములను) ఔరసపుత్త్రులను (ఆత్మజులను) వలె భావించి పాలించును. లో వెలుల నెన్ని భావము లుదయించినను 'అవన్నియు నా భావములు; ఆత్మజులు; అన్నియు నానుండి పుట్టినవి, గాన వానిని బాలించుట నా ధర్మము.'

అనెడి కర్తవ్య జ్ఞానముతో వానిని బోషింప సర్వవిధప్రయత్నములు మానక చేయును. ఏలన భావములే మహామాయానుభావమని యిప్పటికిని దెలిసికొన లేఁడయ్యెను.

ఈ జాగతికసుఖములు నెఱవేఱుటకై వానిని బోషించుచుండినవాఁడు. 'అన్నా ! ఇవన్నియు నన్నాత్మరాజ్యమునకు దూరముచేసిన పగవారే' యని కొన్నాళ్లకు మదికిఁ దట్టినపుడు 'వారే నన్నుఁ బరిపాలించిరి; నేనే పారిపాలితుడను' అనుకొనును.

అసంఖ్యభావము లుదయించుచోటు చిత్తము. ఆ భావములే (ప్రజలు, ఆత్మజులు) వానినే పోషించెను. ఇపుడు ప్రజా వర్గము సుఖముకొఱకే సర్వము ధారవోసితిని. గాని వారికిఁ దృప్తిలేకపోయెనే యని తోఁచెను.

పై పెచ్చు నా భంగమునకే నడుముగట్టినారే, యని వగచును. ఇట్టి స్థితికి వచ్చిన జీవుఁడు నిశ్చింతముగాఁ గడపఁ గలఁడా ? ఆత్మజులే (భావములే) నా చిత్త క్షేత్రమును విధ్వస్తము చేసివైచిన వనుకొనఁడా ? ఈ యాత్మజ (భావ) సమూహముయొక్క విరోధిత గురుకరుణచే నగ్నివలెఁ బుట్టునపుడు, అదే వాస్తవ విషాదయోగము. దీనికిని, పార్థుని విషాదయోగ మునకును జాల భేదమున్నది.

మన గృహస్థ సంస్కార సమూహము, పెనుబరువు గాడిదనువలె, మనలను వంచివేయుచున్నది. "విషయవాసనల ననుభవించుటకై, యీ ధనదారపుత్రాది భావముల నత్యాదరముతోఁబెంచి కాపాడితిని. ఇపుడు వారే నా చిత్తశాంతి

విరోధులని తోఁచినది. వీనితో నాకేమి సంబంధము ? నిత్య శాంతి విఘ్నకారులు, ఈ యాత్మజులే (భావములే). ఇపుడు వారు నా శత్రువులు. కేవల శత్రులై స్వాధీనులైనట్లుండి, నన్నే స్వాధీనునిజేసి నా చిత్తక్షేత్రము ధ్వంసముచేసిరి. చేయుచున్నారు." అని కొట్లాడుస్థితియే, సురథుని (జీవుని) దుర్దశ, ఈ దుర్దశానుభూతియే సుదశకు గణేశపూజ. క్రమముగా, ఆత్మజ(భావ) వియోగము, వినాశముకాఁగా, ఏకాకియై నేను నేనై మనుభాగ్యము సమీపించును.

ప్రబలపరాక్రమముగలవాఁడై నను, అల్పులైన వారితోఁ బోరి తొలుత నోడిపోవును. "అబ్బా ! వీరి బాధ పడలేను. ఆత్మజులే (భావములే) శత్రువులై" రనుకొనుచు, సంబంధము విడఁగొట్టుకొను ప్రయత్నములో దిగి యనేక విధములయోగము, హఠక్రియ, ప్రాణాయామము, ఉపాసనము, జ్యోతిర్ధారణము, సాత్త్వికాహారము, బ్రహ్మచర్యము, గృహత్యాగము, సన్న్యాసము మున్నగు నుద్యోగములతో భావ నిర్మూలనమునకు బూనుకొనును. గాని తఱుచు వ్యర్థ మగుచుండును. ముగ్ధుఁడు జీవుఁడు. భావసమూహము, మహామాయానుభావమే యని (ప్రభావమే) యని యెఱుఁగఁడు. మహామాయా కృప లేక యీ యాత్మజ (భావ) సమూహము తోడి యుద్ధమందు గెలువలేఁడు.

తొలుదొల్త నాత్మబలమును నమ్ముకొని, యభి మానమురేగి యీ భావబంధములను ద్రెంచుటకుఁ బూనును, గాని అమ్మ భవాని కృపాణముఁదాల్చి యుద్ధభూమికి దిగి నప్పుడుగాని యీ భావము లనెడి యసురులు తొలఁగరని తలఁపఁడు. రోగ శోక

దారిద్ర్య విషయ చాంచల్య జనన మరణాది భావముల వంకనే చూపు నిల్పియుంచి, భవానిని జూడనంతదాఁక మనమే కోరికొని భావవిద్రోహమునకుఁ బాలగుచున్నామని యర్థము. అమ్మ యీ విధముగా మనలను భావపరంపరారూపమున బాధించుచు, నపూర్ణులుగానే యుంచి వేయునందురా ? లేదు, లేదు. ఇది సంతాన విద్రోహము కాదు. అమ్మయొక్క మంగళమయేచ్ఛకు మున్ను గఠినముగాఁ దోఁచు నుద్యోగమే.

అమ్మ యాశ్రయమే, అమ్మ దర్శనమే శరణ్యమని తోఁపక హఠాదిప్రక్రియలలో నొకదాని నాశ్రయించును. అంతతోను గృతార్థుఁడుగాక వగచును.

ఇపుడు భావసమూహాక్రమణమునుండి యెట్లు తప్పుకొనుట యనునదే, యిప్పటి ప్రశ్నము. మాతృముఖుఁడై మాతృలాభమే ముఖ్యోద్దేశమని స్థిరపఱచుకొన్నవాఁడు, ఇట్టి నమస్యా పూర్ణక్షేత్రమందు హతాశుఁడు కాఁడు. అమ్మ ప్రతికూల వేదన రూపముతో భావసమూహాక్రమణము చేయుటయే మహాభాగ్యము.

మఱొక మాట - ఆ యాక్రమమును నిరోధించుటకు, అమ్మ యడుగులను గట్టిగాఁ బట్టుకొనుటమాని మఱియొక వెరవూని, తన యాధ్యాత్మికగతిని సడలనీరాదు. అమ్మకు వెనుజూపరాదు. మాతృలాభమే విఘ్ననివారణోపాయము. ఏవేవో వ్రతములు పూని బాధపడక, మాతృచింతావిముఖుఁడు గాక, మన సర్వదుఃఖములను నివారించుకొను తావు, అమ్మ పాదముతక్క మఱియొకటి కాదని నమ్మి, భిన్నభిన్న మనోభావములు మహామాయానుభావములే యని

యాదరించి, యమ్మ చరణములందె యశ్రుసిక్తపుష్పాంజలి నిడవలయును. అమ్మా ! ఈ తుచ్ఛతుచ్ఛ భావములతో (గాక) మహా మూర్తితో దర్శనమిమ్మని యేడ్వవలయును. కొలది కాలములోనే యీ భావవిద్రోహము తొలఁగుట కనుగొందుము. వృత్తివిరోధము ప్రయత్నాంతరము చేనైనను, మాతృలాభము మాత్రము కాదు, మనము కోరుకొన్నది చిత్తచాంచల్యమే ఏదికోరిన నదేలభించును చిత్తచాంచల్యనివృత్తి జీవనోద్దేశ్యము కాదు. అది గాఢనిద్రావస్థయందు సైతము అప్రయత్నముగా నగును. చిత్తమునకుఁ జిత్సముద్రమును జూపి, మనస్సునకు మాతృదర్శనము చేయించి, భావములకు భావినీమూర్తిని జూపినపుడే శాన్తిధన్యతలు.

జీవుఁడు భగవన్ముఖుఁడగుటచేఁ బలువిధముల విఘ్నములు గలుగుటేల ? యని ప్రశ్నము పుట్టును. ఇది యమ్మ చేయు పరీక్షయని కొందఱును, కర్మఫలభోగమని కొందఱును నందురు. మన మేమనుకొనవలయును ? జీవుఁడు మాతృముఖుఁడగుటవల్లనే, వాని పూర్వజన్మసంస్కారములు - ఏ సంస్కారముల క్షయమునకై మన మనేకజన్మము లెత్తుచున్నామో, వాని నన్నిటిని దయామయి యమ్మ యొక్క జన్మమునందే చేర్చి క్షయింపఁజేయును. అనేక జన్మములందు నశింపజేయఁ దగిన కర్మముల నొక్కసారియే ఫలోన్ముఖములుగాఁ జేయును. ఇపుడీ మహాలాభమునకై యనేక బాధలను సైఁపవలసివచ్చును. గాన దల్లి కృపచే జన్మప్రవాహము తగ్గిపోవును; లేదా నిల్చిపోవును.

## మన మంత్రులు - మన బంగారు సంకెలలు

హృదయగుహలోఁ బ్రవేశించి చేయు విధి నిషేధరూపమయిన శాస్త్రీయా దేశములను బాలించుట, ఆశ్రమోచిత ధర్మానుష్ఠానాదులు ననునవే శ్రీ రాజరాజేశ్వరీ పుత్త్రులమైన మన మంత్రులు. అవే ప్రబలవిఘ్నములు. ఇంతదాఁక మంత్రులే, హితులే యైనను, వారి నలహాలనుబట్టియే ధర్మరాజ్యప్రతిష్ఠ, యశోలాభము సంపాదించినను ఇపుడు శత్రువులు. అనఁగా, ఆత్మరాజ్యము నొందుటకైన ప్రబల వాసనలు రేఁగఁగా, జీవుఁడు, అమ్మ ధర్మాధర్మములకును గర్మములకును అతీత. ఇపు డా యమ్మను వెదకుస్థితికి వచ్చినాఁడు సాధకపుత్త్రుఁడు. తొల్త ధర్మరాజ్యము, పిదప ఆత్మరాజ్యము; తొలుత ధర్మము, తరువాతఁ దల్లి; కనుకనే ధర్మములను ముక్తి సోపానములుగా నెన్నిరి. స్వభావముచే నపరిచ్ఛిన్నుఁడును, ఆనందమయుఁడును బూర్ణుఁడునైన జీవుఁడు పరిచ్ఛిన్నము, అపూర్ణము, క్షణికానందదాయకము నగు ధర్మసీమలో నెంతకాల మిమిడియుండఁ గలఁడు ? నిత్యముక్తుఁడైన జీవుఁడు ధర్మకర్మములనెడి బంగారు సంకెలలు తగిలించికొని యస్వతంత్రుఁడై యెంతకాల ముండఁ గలఁడు ? ఒకనాఁ డెప్పుడో మధుమయ మాత్రంకమున నుండ వలసినవాఁడే, దానికైన యుద్యోగము జరుగవలసినదే "ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశే ఽర్జున తిష్ఠతి" "తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత" యనెడి శాన్తిమయాభయ మహావాణి, జీవునిలో ధ్వనితమగుచునే యుండును. తన మంత్రులు (విధ్యుక్త కర్మజనితసంస్కారములు) తన్ను గట్టిగా బంధించిరని తెలిసికొనును. అధర్మసంస్కారములను దొలఁగించుకొనుట,

యంతకష్టము కాదుగాని, శాస్త్రోక్త ధర్మసంస్కారములను దొలఁగించుకొనుట కడుఁ గష్టతరము. సారాయి త్రాగువాఁడు తన త్రాగుడు నిట్టె విడువఁగలఁడు, గాని త్రికాల సంధ్యావందనమున కలవాటుపడిన నైష్ఠికుఁడు ఈ ధర్మసంస్కారముల నిట్టె వీడలేఁడు. అటులే, అధర్మసంస్కారములను బట్టి చూడఁగా, ధర్మసంస్కారములే ప్రబలతర శత్రువులు. అగుఁగాని మాతృకరుణాప్రభావముచే నీ ప్రబలసంస్కారములు గడ్డి వఱకలవలె నెగిరిపోవు శుభదిన మాకస్మికముగా వచ్చును.

'క్షీణే పుణ్యేమర్త్యలోకంవిశన్తి' యను గీతా వాక్యము జీవుని గుండెను నాటుకొన్నవుడు, కామ్యకర్మములను ధర్మ సంస్కారములను శత్రువులు, దుష్టులు, ననకుండఁగలఁడా! ధర్మములందుఁగాని, కర్మములందుఁగాని, ఆత్మరాజ్యము - మోక్షము లేదని తెలియఁడా ? ఆ ద్వారముల నడ్డగించునవి యి - వేయని బాధపడఁడా ? నా కోశబలము లపహరింపఁబడెనని యేడువఁడా ? మన యానందమయ కోశమందు అమ్మ హిరణ్మయ మందిరమున్నది. అదే మన శాన్తినికేతనము. దానినే యీ మంత్రులు = హితులు (ధర్మకర్మసంస్కారములు) కొల్లగొనిరి. విధివత్కర్మ సంస్కారములు తుచ్ఛానందమునకే తోడ్పడును. అమ్మయొడి నిత్యానందధామము. అంతవఱకుఁ బోఁగల్గితిమేని, అమ్మయే రెండు చేతులతో నందుకొని యొడిలోఁ బెట్టుకొని రొమ్మునఁ జేర్చుకొని సర్వసంతాపములఁ బూర్తిగ నణఁచివేయును.

## సాధన మన నేమి ?

ఆత్మ యానందమయకోశమునకుఁ బరమైనది. దానిని గోల్పోవుటవలన హానియేమి ? యని కొందఱనవచ్చును. ఆలోచించి చూడుము. ఉపాసనా సాధనారూపవ్యాపారము లుండు నంతదాఁక, నానందమయ కోశమందే దాని విశేష సాక్షాత్కార మొందుచుండును. ఆనందమయ కోశమునకు నాత్మ బోధమును గొనిపోవుటే సాధనము. అన్నమయాది స్థూలతర కోశములందు ఘనీభూతమైన యాత్మభావమును వానినుండి యుపసంహరించి యానందమయ కోశమునకుఁ గొనిపోవుటే సాధనసమాప్తి. 'నేను' నిత్యానందమయ మహాచైతన్యరూపుఁడనే యనెడి జ్ఞానమునొందుటే సాధనసమాప్తి. ఉపాసనవలన నంతవఱకుఁ జేరుటగును. అదే హిరణ్యగర్భుఁడు, పరమేశ్వరుఁడు నను పేళ్లతోఁ బ్రసిద్ధము. అదే జగత్సంస్కారములు బీజరూపముగా నుండుచోటు. 'వటకణికాయాం వృక్ష ఇవ' శ్రుతి. అదే, అక్షరపురుషుఁడు. అచటఁ జేరుకొనఁ గల్గినచో, మఱి జగద్బీజరాశి జీవుని బంధింపఁజాలదు. ఆ యక్షర పురుషుఁడు సృష్టిస్థితిలయాది కార్యనిరతుఁడైనను నిత్యముక్తుఁ డైనటులే, జీవుఁడును, ఆనందమయకోశమందు నిలువఁగల్గినచో జగద్భావము లాతని బంధింపఁజాలవు. అతకిని సంసారము స్వాధీన లీలామాత్రమే. సాధనమువలనఁ బొందఁదగిన యథార్థ శాన్తినికేతన మిదియే. దాని యావలిగట్టు మాటకందదు; మనసున కందదు. సాధన కతీతమై స్వసంవేద్య మాత్రమే; ఆనందమయకోశము నారోహింపఁగల్గినచో నాపైని రాఁబోవు నవస్థయందు ననాయాసముగాఁ జేరుకొనును. అది తనయం

తనే వచ్చు నవస్థావిశేషము. అది యొక యవస్థ యనుటకును దగదు. బ్రహ్మలీలావసానము. అదియే వేదా న్తమందు బరాంతకాలమని ప్రతిపాదింపఁబడినది.

జీవుఁడు స్వపురమందుఁ బ్రవేశింపఁగానే, ఆనందమయ కోశపర్యంతము నీ ధర్మసంస్కారముల పరిచ్ఛిన్నతచే సీమ బద్ధుఁడనై పోతినని తెలిసికొనును.

శాస్త్రములందు "ఎఱ్ఱపూవులతో విష్ణుని బూజింపకుము. శివమూర్తిపై మారేడుపత్రి దట్టముగా నెక్కింపుము; కుడిముక్కు బొక్క గట్టిగానొక్కి గాలిని పీల్చుము, ఎడమ కాలిపైఁ గుడికాలు స్థిరముగా నుంచుము." అను నిట్టి శాసనములను బాలించుటతోనే నా జీవనము కడచిపోయినది. ఈ మంత్రుల నలహాల ననుసరించుటతోనే నా యుత్సాహ మణఁగి పోయినది. ఆత్మానుభవానంద విలాసము నా కెన్నఁడు లభించునో, అక్కటా నడుము కట్టుటతోనే నా బ్రతుకు తెల్లవాఱి పోయినది. ఇఁక నమ్మయొడి నెప్పుడెక్కుదును ?" అనుచు నీ లాగున, శాస్త్రవిధి నిషేధములు మాతృప్రాప్తిపక్షమునఁ దొలుదొల్త హితకరములైనను, ఇవియు బంధనములే యనుచు, స్వాధీనతను గోరు జీవుఁడు, తల్లి యొమ్మనెడి యున్ముక్త క్షేత్ర మందుఁ జరింపఁగోరు బిడ్డఁడు, ముందంజవేయ నుంకించునా ? లేదా ? దాని నుపేక్షింపలేఁడే. జీవుఁడు తల్లి నెయ్యముచే విముగ్ధుఁడు కాఁజాలనంతదాఁక నీ వైధకర్మ సంస్కారములు వానిని బీడించుచునే యుండును. అనుష్ఠానమందు యథార్థా నందము నొందలేఁడు; మఱి వానిని విడువనులేఁడు. ఇంతే కాదు, జీవునకు సహజమైన శుద్ధబుద్ధము

క్తత్వాది సామర్థ్య మంతయు మంత్రులవలనఁ గొల్లగొనఁబడెను. ఏమన - వారే "జీవుఁ డనిత్యుఁడు, అశుద్ధుఁడు, అజ్ఞాని" యనుచుఁ జాటుచు వచ్చిరి. కోశబలపర్యంతము లాగికొనిరి. తన వాస్తవిక స్వరూపము పౌరాణికకథానీములో నణఁగిపోయినదని తెలియునపుడు, తన ప్రబలశత్రువు లెవ్వరో తెలిసినదన్న మాటయే. పాతంజలి దర్శనమందు "స్వల్ప ప్రతిపక్షాః స్థూలా వృత్తయః । క్లేశానాం సూక్ష్మాస్తు మహాప్రతిపక్షాః" అని సరిగా నిమ్మాటయే కానవచ్చును. స్థూలవృత్తులు సాధారణ శత్రువులు; సూక్ష్మవృత్తులు ప్రబల శత్రువులు. జీవుని యాత్మరాజ్య ప్రాప్తికి, వైధకర్మసంస్కారము లనెడి సూక్ష్మవృత్తులవలెఁ గామక్రోధాదివృత్తులు ప్రబల విఘ్నములు కావు. ఈ ధర్మ శత్రువుల చేతినుండి తప్పుకొనుట బహుకష్టము. ఇక్కడనే జీవునకుఁ జరమ విషాదయోగము సిద్ధమగును.

## చరమ - విషాదయోగము.

ఈ తరువాత మఱి విషాదయుక్తుఁడు కా నక్కఱలేదు. గీతయందలి కురుక్షేత్రయుద్ధమందు, అనాత్మీయుల నాత్మీయు లనుకొని, విముగ్ధుఁడై యుద్ధవిముఖుఁడైన యర్జునుని విషాద యోగసమాప్తి యిందేయున్నది. సాధకజీవునకు మంత్రి విద్రోహము, విషాదమును దెచ్చిపెట్టినది. దాని తీవ్రత కడు నధికము. ఏలన - అర్జునుని యుద్ధమును విషాదమును, మనోమయ క్షేత్ర సంబంధులే; కాని యీ మంత్రి (ధర్మకర్మసంస్కార) విద్రోహము విజ్ఞానమయక్షేత్రసంబంధి దానికి మిగులఁ బైది.

సాంసారికములైన సాధారణ దుఃఖములకును సాధన జగద్దుఃఖములకును నెంత వాసియో సాధకునకే తెలియును. యాప్యరోగపీడితుఁడైన రోగి దుఃఖమును, గుణవద్యువకుఁడైన యేకపుత్త్రుని గోల్పోయిన విధవమాతకుఁ గల్గు దుఃఖమును, పెండ్లి పసుపుతో నె మునుఁగు భాగ్యము పట్టిన బాలవిధవ దుఃఖమును, ఆఁకటి బాధచే నస్థిచర్మావశిష్ట దేహుఁడైన పేద దుఃఖమును, దానితోఁ బోల్చినపుడు స్వల్పములే. విజ్ఞానమయ కోశమునఁ జేరనీయని విఘ్నముల వల్లనైన సాధకుని దుఃఖ మట్టిది. ఈ విషయమునందొక యాత్మసంవేదనము__ "అనౌ పమ్య మనిర్దేశ్య మవ్యక్తం నిశ్చలం మహత్। యథా బ్రహ్మ తథా తస్య విరహవేదనం భృశమ్ ॥" బ్రహ్మ మెటులు సాటి లేనిదియు దెలియరానిదియు, గొప్పదియునై యున్నదో, యట్టిదే సాధకజీవున కాబ్రహ్మముతోడి విరహమునవైన వేదనము. వైష్ణవ గ్రంథములందుఁగల కృష్ణవియోగార్త శ్రీరాధాదేవీ బాహ్యలక్షణ వర్ణనమునందు, ఒక్కయక్షరమైనను గపోల కల్పితము కాదు. నిజముగా నామె యట్టియవస్థ నొందినది. శ్రీమతి యారాధిక రాధికయే శ్రీకృష్ణ ప్రేమానుభవము చేసినది. చేయఁగలది. ఒక్కసారి చేసినదిగాన, మఱి యాకృష్ణ విరహ మెంత దుర్భరదుఃఖదాయకమో యాశ్రీమతికే తెలియదు. అది మాటలతోఁ జెప్పనలవికాదు. ఆకునందుఁ, జెట్టునందు, ధూళిపరమాణువునందు, సర్వజగత్తునందు మన ప్రాణమునకుఁ బ్రాణమైన శ్రీకృష్ణుఁడు వెలయుచున్నాఁడు. ఐన నంతతో మనదప్పి యెట్లుతీఱును ? అపరిచ్ఛిన్న ప్రత్యక్ష కృష్ణ ప్రేమ సాగరమందు మునుఁగవలయును. ఈ పరిచ్ఛిన్న గుప్త ప్రేమ

బిందుమాత్రమున నామరూప విశిష్టచైతన్యముతో నెట్లు తనియఁగలఁడు ? అకటా ! యీ జీవుఁ డా కృష్ణ ప్రేమ సాగరమం దేపుడేని మునుఁగునా ? తాను శ్రీరాధికయై ధన్యుఁడగునా ?

గీతలలో నర్జునుని విషాదమువలె జీవుని యీ విషాదము పైకిఁ గనఁబడదు. ఇది కల్గుట జీవ సౌభాగ్యమునకే, కావున నట్టివాఁడు మహాభాగుఁడే. గీతలలోఁ బార్థుని విల్లు జాఱుట, వణకు, ఒడలుమంట, నోరెండుట మున్నగు విషాదయోగ బాహ్యలక్షణములే వర్ణింపఁబడినవి. ఇట్టి జీవుని విషాదలక్షణ ములు సూక్ష్మకారణ దేహములకుఁ జెందినవిగానఁ బైకిఁ గానరావు. భావ విరోధిత విజ్ఞానమయ కోశమునకును, ధర్మ కర్మ విద్రోహము ఆనందమయ కోశమునకును జెందినవి. చేతిలోని పంచదారబొమ్మ విఱిగినచో బాలుఁడు బావురని యేడ్చును. తనచేతికందిన కొడుకు చచ్చినను జ్ఞాని చలింపఁడు.

సురథుఁడైన సాధకుఁడు తొలుదొల్త నాత్మప్రాప్తికైన యుద్యోగము చేయును. చిత్తవృత్తి నిరోధమునకై ప్రయత్నించును. బాహ్యవిషయములవలనఁ జిత్తము నడ్డగించి యోగ కౌశలాద్యుపాయములతోఁ బాటుపడివడి, యమరత్వపుజాడ దొరకక, యథార్థశాంతి (ఆనంద) కేంద్రమును వెదకియు సర్వసంస్కారములవలనఁ బీడింపఁబడుచుండునవుడు, స్నేహమయి శ్రీమాత తనబిడ్డ నొక సరళమార్గమునకుఁ గొంపోవును. ఇంతదాఁక నతఁడు తల్లిని గోరక, సంయమము, యోగ ధ్యానము, సిద్ధిశక్తులు మున్నగువానినే కోరినవాఁడగుటచేత ఋషి సేవిత సరళమార్గము కానరాలేదు. పలుసారులు దెబ్బ తిని విఫల

ప్రయత్నులు కాఁగా యథార్థమాత్రన్వేషణము హృదయమున వికసించును. ఒక గురువునకై యాశించును.

"దదామి బుద్ధియోగం తం యేన మాముప యాంతితే" అను గీతావాక్యముచేఁ దెలియు బుద్ధియోగమిదే. గీతయందు మోక్షఫలము నిచ్చు కల్పవృక్షబీజము నాటఁబడి, యిపుడు పుష్పఫల సమృద్ధ వృక్షముగాఁ బరిణమింపనున్నది. సాధకుని గృతార్థుని జేయ సిద్ధమైనది, చేయఁగలదు. ఇప్పుడు ప్రత్యేక విషయమందును మాత్రనుసంధానమందే జాగరితుఁడై యుండును. బుద్ధియోగ ప్రథమావస్థయందు విషయములు మాతృరూపము కావనుకొనును; గాని క్రమముగా స్థూలవిషయము లందు సైతము మాతృబోధ మగుచుండఁగా, యథార్థ మాతృప్రాప్తి మొదలైనదనుటేకదా.

## బుద్ధియోగము. సత్య ప్రతిష్ఠాభ్యాసము

అది యెటులంటేని-ఏమి కన్నను, ఏమి విన్నను, ఏమి తిన్నను, ఏమి చేసినను, అది యంతయు మహామాయా మూర్తిగా నిశ్చయించికొనుఁడు, జగద్భోగమేకానిమ్ము. కాని అమ్మరూపమే యనుచుఁ జేయుచో "యత్కరోమి జగన్మాత స్తదేవ తవ పూజనమ్" అయిపోవును. 'జపో జల్పః శిల్పమ్' అనెడి శ్రీశంకరాచార్యుల సౌందర్యలహరియందలి యుపదేశము నిపుడైనను గంఠస్థము చేయుము. ఇదే బుద్ధియోగమనెడి కౌశలకర్మము. ఇదే మోక్షమార్గమునకుఁ గొనిపోవును.

సర్వవేదశాస్త్రదర్శనాదులు నీ యొక్కమాటనే చెప్పినవి. "ఈశావాస్య మిదం సర్వమ్, స ఏవ సర్వమ్ యద్భూతం యచ్ఛ

భవ్యమ్, ఆత్మై వేదగ్ం సర్వమ్, సర్వం ఖల్విదం బ్రహ్మ" ఇట్టివి వేనవేలు ప్రమాణములు. భగవంతుఁడు సర్వవ్యాపి యనుట మనుజుఁడుమాత్రమే తెలిసికొనును పలుసారులు వినును; గాని యనుభవము వెలితి. నేర్చుకొన్న దానిని విన్నదానిని, దెలిసినదానిని గార్యరూపముగాఁ బరిణమింపఁ జేయుటయే యథార్థసాధనము.

బుద్ధియోగమే చిత్తచాంచల్యము నణఁచు నమోఘాస్త్రము. తొలుత నీ మనసు చెట్టును జెట్టుగానే చెప్పను. బుద్ధి మాత్రము, అది వృక్షరూపిణి తల్లియని చెప్పివేయును. అదిగో - ముందుగా ఛలముగా గానఁబడినను, అవిశ్వాసి మనస్సు, ఒక్కసారిగా మహామాయయేం ఊ జగదాకారముతో నున్నదని చెప్పివేయఁజాలదు. అమ్మను బుద్ధియోగమును బ్రసాదింపఁ బ్రార్థించితివేని, వృక్షాకారముగా (జగదాకృతితో) నున్నది, మీ యమ్మయే యని చెప్పివేయును. సత్య ప్రతిష్ఠా భ్యాసముచే సర్వవ్యాపి మాతృస త్తను నమ్ముదువు. దాని పరిణామ మెంత మధురము !

"యో మాం పశ్యతి సర్వత్ర సర్వంచ మయి పశ్యతి ! తస్యాహం న ప్రణస్యామి స చ మే న ప్రణస్యతి॥" దీని వివరణము నా వ్రాసిన 'శ్రీసత్యనారాయణశర్మ సాధనము' నందు విపులముగాఁ గానఁగలరు. మాతృలాభేచ్ఛయే జీవులకుఁ గల్గినపుడు మఱి వితర్కజ్ఞానయుక్తులజోలికిఁ బోక, నిష్కపటచిత్తముతో జగత్తును దల్లిగాఁ జూచును. మాతృరూపముగానే యనుభవించును. పంచభూతములను విడిచి, భావరాశిని విడిచి తల్లిని దెలియు దినము చాల దూరమందున్నది. తొలుదొల్త స్థూల మం దమ్మను

బట్టుకొమ్ము, పిదప సూక్ష్మమందు; అటులే యవ్యక్త క్షేత్రమందును అగ్రసరులు కావలయును.

ఇష్ట వస్తువును సముపార్జించుట కగునంత శ్రమము భగవద్వస్తూపార్జనమున కక్కఱలేదు. అన్నిటికంటెను సులభ వస్తువమ్మయే. కఠోర యోగ ధ్యాన సన్న్యాసాదులు లేక అది లభింపదనువారిమాటలు పుస్తకములందుఁ జూచినవే. ఒరులవలన విన్నవే. సర్వవ్యాపియై సర్వత్ర సర్వదా సుప్రకటమై యున్న దది యొక్కటే. మఱొకటి లేనే లేదు. దాని దర్శనము దుర్లభ మెట్లగును? సర్వత్ర వెలయుచున్న దదొక్కటే యనెడి విశ్వాసమే దుర్లభము. అదిగో, అది ప్రత్యక్షమే యనెడి విశ్వాసమే సాధకుని విశ్వాసిని (విగతశ్వాసుని) జేయును. అనఁగా శ్వాసము నడ్డగించును. అనఁగాఁ బ్రయత్నములేక యే కుంభకము సిద్ధమగును. విశ్వాసియైననే విశ్వాసి యగును. ఇది తెలిసికొనక యనేకులు, ప్రయత్నములో శ్వాసము నడ్డగించి చిత్తమును స్థిరపఱచుకొనఁజూతురు. కాని తల్లిని గోరరు. తల్లి కల్పకవల్లి. కోరినంతన తానే వచ్చి కోరిన దెల్ల నిచ్చును.

## ఏకము నొందుటకు ఏకాకియే కాఁదగును.

మఱొకమాట. బుద్ధియోగ మలవడినపుడు వేఱొండు సాధన మక్కఱలేదు. తన సహజకార్యములు జరుపుకొనుచునే, యనుష్ఠానవిశేషము లేవియు లేకయే మనుజుఁడు తానొక్కఁడే మనసుతో సత్యప్రతిష్ఠ చేయఁగల్గును. సాధకులు ఆత్మాను సంధానమనెడి పేరితో నొంటిగానే విషయారణ్యమున విచరింతురు. అమ్మ

ఏక. కావున మనమును ఏకాకులమే కావలయును. అటులగునపుడే, అమ్మను జేరఁగలము. అద్వితీయ వస్తువు నొందుటకై యేకాకియే కావలయును. ఏకాకి యగుటకే సాధనము. సంసారాదుల విడిచి నిర్జనారణ్యమునకుఁ బోవుటచే నేకాకి కాఁడు. మనస్సుండునంతదాఁక నేకాకియగు నుపాయమే లేదు. అమ్మను గనుగొని, అమ్మయందుఁ దనను మఱచిపోయి 'నేను-అమ్మ' వేఱు కాదని యనుభవించుచు, నొక యఖండ ఘనసచ్చిదానంద స్వరూపమందు నిల్చినపుడే యేకాకి యగును. ఈ యవస్థయం దేకాకిత్వజ్ఞానమును నుండదు. పలుమాటలేల ? అమ్మ యొక్కతే వచ్చినది. ఒక్కతే పోవును. జన్మము లెత్తునపుడు తోడ నెవ్వరును రాలేదు. మరణించునాఁడు తోడ నెవ్వరును రారు. అటైన నీ బహుత్వోపద్రవముఁ దెచ్చికొనుట యెందులకంటే, నీ బహుత్వజ్వాలలు రగుల్చుకొని, యందుఁ బడుచుంట యామె లీల.

మనము వేయిమంది బంధుమిత్రాదుల నడుమ నున్నను 'నేను ఏకాకినే' యని తలంచుట యలవాటు చేయవలయును. అమ్మ మనసునకు వచ్చినపుడెల్ల నితరమంతయుఁ దుడుచుకొని పోయి యొక్కఁడవే యుందువు. ఈ యభ్యాసమువల్లనే విషయాసక్తి సడలిపోవును. మాటిమాటికి మరణవిచారము చేయు టయు నీ విషయమున విశేష సహకారి.

సాధకుఁడు, కొన్నాళ్లకొక మేధాసంపన్నుఁడైన గురువు నాశ్రయింపఁ గోరునని వ్రాసియుంటిని. మేధా = స్మృతిశక్తి "బ్రహ్మాహ మస్మీతి స్మృతిరేవ మేధా" (శ్రీశంకరాచార్యులు.) ఈ మేధాజననమే యుపనయనకర్మ సంస్కృతు లపేక్షించునది. అది స్వయంప్రకాశ

బ్రహ్మశక్తి. ఉపనీత ద్విజ బాలుర కుపదేశింపఁబడు ప్రత్యేక ప్రక్రియ యందును, దీని లాభమున కగు నంశములే యున్నవి. సరే; అది యుండనిండు, దుర్భాగ్యమునఁ బూర్తిగా నుపేక్షింపఁబడి విస్మృతమైన యీ కర్మప్రణాళిని మఱల నాచరణమునకుఁ దెచ్చి, నీ సంతానమునకు జ్ఞానసౌభాగ్యమును గూర్పుమమ్మా ! యని ప్రార్థించుట తక్క వేఱొండు వెరవులేదు. "మేధాదేవీ జుషమాణా న ఆగాద్విశ్వాచీ భద్రా సుమనస్య మానా" శ్రుతి॥ విశిష్ట బుద్ధితత్త్వమే మేధ. బ్రహ్మముయొక్క ప్రథమప్రకాశ మన్నిఁటి కంటె ముందు బుద్ధితత్త్వమందే యగును. గాయత్రీ మంత్ర జపాదుల వలన నీ ధీశక్తి నలవఱచుకొన్న ద్విజుఁడే జగత్పూజ్యుఁడు.

ఈ బుద్ధిమయక్షేత్రమందే బ్రహ్మజ్ఞానముం జేరుటకై తెఱచిన వాకిలి యున్నది. సాధకుని సుషుమ్నా ప్రవాహము ప్రకాశించుటతోనే, యీ తావున నిలుచుట సులభము. సాంఖ్యులీ స్థానమునే మహత్తత్త్వ మందురు. మహత్తత్త్వ సాక్షాత్కార మైనంతనే జీవుని యజ్ఞానగ్రంథి విడిపోవును. తాంత్రికుల కులకుండలినీ జాగరణమున కిదియే లక్షణము.

## భావచాంచల్య మడఁగును.

జీవుఁడు బుద్ధితత్త్వమందుఁ జేరఁగానే, మున్నొకదాని వెనుక నొకటిగాఁ దమంతనే యుపస్థితములై, యాతనిం గ్రిందు మీదులు చేయుచుండిన భావములు, బుద్ధిజ్యోతి వికాసము వలన, నాతని నొక సాక్షిమాత్రునిఁ గాను, నుదాసీనుని గాను నెఱింగి, తమపాటవిక

చాంచల్యమును గోలుపోయి ప్రశాన్త భావముతో ఛాయవలె నిల్చిపోవును. కామక్రోధాది వృత్తు లీ బుద్ధితత్త్వ సాక్షాత్కారము వలన నిల్చి పోవును. వాని మూలమెక్కడ ? శబ్దమందే. శబ్దములేక భావములేదు. ఒక చెట్టును గూర్చిన విచారము చేయునపుడు నీ మనస్సున 'చెట్టు, చెట్టు' అను నొక శబ్దమగుచుండును. పాట వినుచున్నావనుకో, నీమనసునం దాపాట సాగుచున్నట్లు నీవు కనుగొందువు. వేదా న్తపరిభాషలో భావమనఁగా నామరూపములు. లోపల నేభావము రేఁగినను, అది కొన్ని శబ్దముల సమూహమే. శబ్దముతోనే భావముపుట్టుట. వెలికి వినరాకున్న నది నీరవతా శబ్దమే, యన సందియము లేదు. మనస్సు రేవగల్లు పిచ్చివాని వలె వాగుచునే యుండును. బుద్ధితత్త్వసాక్షాత్కారము చేతనే దాని వాగుట కట్టిపోవును. లోపలి మఱేదియు వినరాదు. భావములు నిల్చిపోవుటే శబ్దములు నిల్చిపోవుట. ప్రత్యేక పదార్థమందును, ఆత్మబోధము ఘనీభూత మైనపుడు, విశిష్టశబ్దములతో మఱి భావము లుబుకవు. ఒక స్థిరసత్త యందు జగత్తు ఛాయవలె నిల్చిపోవును. ఇదె "దర్పణదృశ్య మాన నగరీ తుల్యం నిజాంతర్గతమ్." అని శ్రీదక్షిణామూర్తి స్తుతియందలి శ్రీశంకర వాక్యము.

గీతాభాష్యమందు శ్రీశంకరులు "బ్రహ్మాహమస్మీతి స్మృతిరేవ వేధా'' యనిరి. బుద్ధిమయక్షేత్రమందుఁ జేరఁ నవుడే జీవబ్రహ్మముల కభేదమనెడి స్మృతి గలుగును. పుస్తకములందుఁ జదివి, యొరులవలన విని 'అహం బ్రహ్మాస్మి' యనువారిని చిలుకపలుకలే. మహత్తత్త్వమందుఁ జేరనంత సేపు పరోక్షజ్ఞానము

గలుగదు. ఈ పరోక్షజ్ఞానము సాధన సాపేక్షమే. సాధనముయొక్క అంతిమఫలరూపముగా నపరోక్షానుభూతి తనంతనే యగును. నా బుద్ధిచేత నది సాధనఫలమునుంగాదు. అమ్మ కరుణించి సంతానస్నేహముగ్ధయై యా రూపమునఁ దానే వచ్చును.

సారాంశ మేమనఁగా, సత్యప్రతిష్ఠ యనెడి సుగమ మార్గము నవలంబించి, గురువు చూపిన తెరవున ముందంజ వేసినచో బుద్ధితత్త్వమందుఁ జేరవచ్చును. సంధ్యావందనక్రియ యం దిదే తొలినుండి తుదివఱకు నుపదేశము. అచటఁ జేరఁగానే సాధకుఁడు "నేను దేనికై సాధనము చేసితినో, దేని నొందుటకై వ్యాకులంపడితినో 'అది నేనే'. అయ్యో! ఇన్నాళ్ళు నది తెలియకపోయెనే యనుకొనును. ఇదె బుద్ధియోగ సాధనముచేఁ జిక్కు నమృతమయఫలము. ఈ బుద్ధియోగ మహత్త్వ వర్ణనముతోనే గీత సమాప్తమైనది.

## బుద్ధియోగ మహత్త్వ వర్ణనము.

మున్ను లేనిదేయైన బుద్ధిజ్యోతి ప్రకాశించుటచే "నేను ముక్కాలములందు నుంటిని; సత్యమను" అను బోధము గల్గుటచే సత్కృతుఁడు. "నేను బ్రహ్మమను" అనెడి నిశ్చయాత్మిక స్మృతి గల్గునపుడు, ఇట్టిదనరాని యానందము గలుగును. ఏలన "ఉన్నది కేవలసత్త; కేవలజ్ఞానము; కేవలానందము; కేవలాఖండ పూర్ణబోధము. కనుక జీవత్వము, క్షుద్రత్వము, మృత్యుభయము, శోకము, అనిష్టము, దుఃఖము అనునవి లేనే లేవు. అట నొకసారి చేరిన జీవుఁడు దానిని విడువఁ గలఁడా ? చిరము చీఁకటి

క్రమ్మియున్న చిత్తాకాశము ఒక్కసారి నక్షత్ర కాన్తివలెఁ దోఁచినది. అది కొంతసేఁపు జీవు నానందముగ్ధునిఁ జేయును. తొలుత క్షణస్థాయియైన స్వరూపస్థితి, వ్యాజకృత సత్తాను సంధానము వల్లనే చిరస్థాయి యగును. నేను, ఎన్ని జన్మములం దెట్టి పరివర్తనములతో రాకపోకలు చేసినను, ఇంద్రియగ్రాహ్యవస్తువులు నా కెంతభయముఁ గొల్పినను, ఒక యఖండ నిత్యస్థిర సత్తయం దున్నాను" అని యనుభవించును. (యోగి యాజ్ఞవల్క్యుఁడు.)

"లలాటమధ్యే హృదయాంబుజేవా యః పశ్యతి జ్ఞాన మయీం ప్రభాంతు । శక్తిం సదా దీపవ దుజ్జ్వలంతీం స పశ్యతి బ్రహ్మ తదేకదృష్ట్యా" ఆజ్ఞాచక్రమందును, అనాహతమందును జ్ఞానస్వరూపకాన్తిని (దీపమువలెఁ బ్రకాశించు శక్తిని) సదా కాంచువాఁడు, తదేకదృష్టితో బ్రహ్మమును జూడఁ గలఁడు. సద్వస్తువు సర్వవిధ పరివర్తనములలోను, నిత్యమును బరివర్తనములేని యవస్థయందును బడుగుం బేకగా నున్నది. అ తావునం దిట్టి దీని యనుభవము నొందుటే జీవుని బుద్ధియోగ క్షేత్రము. ఈ సద్వస్తు స్మారకచిహ్నము పేరే, అమ్మ యొడి. మున్నెన్నిసారులో 'తల్లియొడియందున్న శిశువు' అని చెప్పఁ బడినది; దాని తాత్పర్యమిదే. బుద్ధియోగమందు సత్కృతుఁడు కానంతసేపు తల్లి యొడి జాడయేదొరకదు. సత్కృతుఁ డగుట యనగా - "నేను సత్ వలనఁ బుట్టితిని. సద్వస్తువునందే యున్నాను. సద్వస్తువే నాయంతిమస్థానము. నేను ముక్కాలము లందును నిత్యవర్తమాన సత్ స్వరూపమందే యున్నాను" అనెడి స్మృతి బుద్ధియోగముచేఁ గల్గుటే.

## యథార్థ స్వరూపానుభవమే జీవత్వావసానము

జీవత్వావసానము వచ్చినదన్నమాట. భావవిరోధిత, ధర్మకర్మవిరోధితయుఁ బ్రబలమైనవి. మాతృప్రాప్తియందైన యాశ, వ్యాకులపెట్టునపుడే యిట్టి కృతార్థతగలుగును. అపుడు మన యమ్మ నిశ్చితస్మృతిరూపమున వెలసి, "నేను సచ్చిదా నందమయ మాతను; నీవు నా ప్రియతనూజుఁడవైన జీవుఁడవు; అజ్ఞానముతోనో, జ్ఞానముతోనో ఒక్కసారి అమ్మా ! యని యఱచినపుడు, నిన్ను అసత్ గానే యుంచివేయుదునా ? కొడుకా ! నీవు నిదానించి చూడు; నా యొడియందే - నిత్య సత్యమందే - సదా యున్నావు. నీకుఁ బుట్టువులేదు; చావు లేదు; బాల్యము లేదు; జవ్వనము లేదు; ముదిమి లేదు; జాతి లేదు; వర్ణము లేదు; ధర్మము లేదు; అధర్మము లేదు; ఎట్టి పరివర్తనము గాని, వివర్తము గాని, వికారము గాని, భ్రాంతి గాని నీయందు లేదు. నేను నీ సచ్చిదానందమయ మాతను; నీవు నా సచ్చిదానందమయ పుత్త్రుఁడవు. నీ వా సత్ స్వరూపానుభవమే చేయుము. క్రమముగా నీ దప్పిగొప్పను జూచి సచ్చిదానందమయ స్వరూపమును బ్రతీతియోగ్యముగాఁ జేసి వేయుదును. నేను గాయత్త్రిని. నాలో నిన్నుఁ గల్పికొందును. నా స్నేహమయ వక్షమందే సదాశ్రయము నొందుదువు. నీ జీవత్వబోధము పూర్తిగాఁ దొలఁగును. ముక్తి యనెడి నా నెయ్యపుం జీరచెఱఁగుఁ జాటున నిర్భయముగా నుండగలవు. మఱి నిన్ను నీవు క్షుద్రుఁడననుకొని, అసత్ అనుకొని, పరిణామి ననుకొని, దౌర్బల్యము నందవు. నేను మీ యమ్మను. నీ దౌర్బల్యమును

బూర్తిగాఁ దొలఁగించుటకే నిన్ను నా గుండె కత్తించుకొని యుంచితిని" అని చెప్పివేయును.

## ఆత్మానుభూతిలేని సాధనము మృతకర్మమే

ఇదె యథార్థ స్వరూపానుభవము. సద్వస్తువు ప్రత్యక్షము గనుకనే, స్వరూపానుభవ మగుచుండును. ఈ ప్రత్యక్ష తయే సరసమధుర సాధనఫలము. ఈ ప్రత్యక్షత యింతో, యంతో యగుచున్నపుడే, యా సాధనము సజీవ కర్మము. లేకున్న నది మృత కర్మానుష్ఠానమే. మృతకర్మము బొత్తిగా ఫలప్రదము కాదని నేననను; ఏమన జీవమాత్రుఁడే సాధకుఁడు. కర్మమే సాధనము. సాధనానురూపసిద్ధి తప్పకగును, గాని, చేయు కర్మమును జైతన్యమయము చేసినచో, సర్వము నరసమును మధురమునై పూర్ణఫలప్రద మగునందును. అమృత మయాత్మలాభాను భూతియే సజీవకర్మఫలము. సౌర, గాణపత్య, శైవ, వైష్ణవ, శాక్త, జైన, బౌద్ధ, యవన, మ్లేచ్ఛాదు లైన సాధకు లెల్లరు, సంప్రదాయసిద్ధమైన యీ యమృతము జాడకే దేవులాడి, దాని నొందఁ జూతురు. గాని తమ సాధన ప్రణాళి సత్యభిత్తిపైఁ బ్రతిష్ఠింపఁబడి ప్రాణమయ మైనచో నాశాతీతఫలము నిట్టె పొందుదురు. ఏ సాధన సంప్రదాయ మైనను, ఒక్క యద్వితీయవస్తు లాభముచేఁ బర్యాప్తమగును. ఈ యాత్మానుభూతిలేని సాధనము ప్రాణహీనము శవాలంకారము.

నచ్చిదానందస్వరూప ప్రాప్తియే సాధనోద్దేశ్యము. ఆ స్వరూపము వేఱొకచోటఁ బొందవలసినది కాదు. అది మన లోపల

నున్నదే. ఆయప్రకట బ్రహ్మభావమును బ్రకాశింపఁ జేయుట పేరే సాధనము. ఎల్లరును "మన యస్తిత్వము లోపింపరాదు. మన మనంతకాలము నుండవలయు" నని కోరుటపేరే సదుపాసనము. "నేను జిరకాలమందు నున్నా" నని యెఱుంగుట పేరే చిత్తసాధనము. 'నే నున్నాను' 'నా యునికి యానందమయము' అని యిట్లు ప్రత్యేక జీవుఁడును సచ్చిదానందాన్వేషణమందే యుండును. ఈ యన్వేషణము తెలివితోఁ జేయఁ బడనపుడు అది సాధారణ లౌకిక కార్యమే.

## అపుడే అమ్మ చేయూఁత నిచ్చును.

పైనిజెప్పినట్లు సత్కృతుఁడైన సాధకుఁడు ఆ బుద్ధిమయ క్షేత్రమందు చిరకాలము నివసింపలేఁడు. ఏలనఁగా - అనేక జన్మ సంచిత సంస్కారములు కారణముగా, మఱల దేహాత్మ బుద్ధి పుట్టుచుండును, గాని కొంతసేపు బుద్ధిమయక్షేత్రమం దాత్మబోధ సంగ్రహ మగుచుండును. ఆ సుఖమయస్మృతి యల్పమైనను మనుజుని మైమఱపొందించును. అది మొదలు సాధకుని జీవనము ఉత్సాహమయమగును. కర్మసమూహము మధుమయము నగును. కొన్నాళ్ళిట్టి యభ్యాసము ఫలముగా, సూక్ష్మతత్త్వమందు జీవుఁడు నిల్చుకాలము దీర్ఘమగుచుండును. కాఁగా "బ్రహ్మాహ మస్మి" యనెడి స్మృతి ఘనీభూతము కాఁగలదు.

జీవుఁడు శాంతో దాసీన బుద్ధిజ్యోతియందుఁ జొచ్చినను బ్రారబ్ధవశమున నచటినుండి మనోమయక్షేత్రమునకో, అన్న మయకోశమునకో దిగును. అనేక జన్మములనుండి స్థూలా

మానిత యలవాటయియుండుటయే కారణము. కావున నొకసారి నసూక్ష్మమందుఁ జేరుటయు, నొకసారి నస్థూలమందు విచరించుటయు నగుచుండును. ఈ యెక్కుట దిగుట యనెడి, అమ్మచేయు నానందక్రీడ యనుభవమునకు వచ్చునపుడే, యథార్థ సాధన మారంభ మగుననుమాట. ఒక్కక్షణము ఈ యపారానంద స్పర్శమును, మఱుక్షణమే జీవత్వబోధమును జరుగు నపుడు సాధకుఁడు స్వర్గమునకుఁ బోయినట్లును, ఒకసారి నరకమునకు దిగినట్లును దలంచును. ఇదిగో, ఈ సమస్యాపూరణావస్థ పేరే, యెక్కుట దిగుట. ఇది నిజముగా నసహ్యయాతన. ఒకసారి వెలుఁగు, ఒకసారి చీఁకటి. ఇది మాతాపుత్త్రులయానంద లీల అమ్మ యొకసారి చేయూత నిచ్చి నిల్వఁబెట్టును. ఒకసారి చేయి విడుచును. ఇటులే మెల్లమెల్లఁగా బిడ్డనికి నడక నేర్పును.

ఇపుడు జీవునకు బుద్ధిమయ క్షేత్రమందు నిల్చుశక్తి కల్గినను, మమత్వబోధముచే లాగఁబడి పలువిధముల స్థూల విచారము చేయును. చాలాకాలము పంజరమందు బంధింపఁ బడిన పక్షిని బైకి విడిచినపుడు, ఒక్కసారి గగనమందెగురు సుయోగము పట్టినను, మఱల నది తనకు బహుకాలనివాస స్థానమైన యా పంజరమునకు మఱలి వచ్చునటులే, అమ్మ కృపచే సూక్ష్మతత్త్వ సంధానము లభించినను, దానియందెంతోసేఁపు నిల్వఁజాలఁడు. ఇట్లే యమ్మ జీవునిచేత గమనా గమనములు చేయించి చేయించి క్రమముగా సంకీర్ణతను దొలఁగించి, బలవృద్ధిచేసి విశాలతవైపు ముందంజవేయించు సుయోగమును గలిగించును.

# సదసద్ జ్ఞానము

పురుష (మనుష్య) మాత్రున కప్పుడు నొకవిచారము కల్గుట స్వాభావికము. అన్నిటికంటె ముందు దేహవిషయక విచారమే కలుగును. జీవాత్మ యీ నవద్వార పురమందుండును. అతనిని బురుషుఁ డందురు. అతఁడు దేహపురమును వీడి బుద్ధిమయ క్షేత్రమందుఁ జేరెను. ఆచట బుద్ధిజ్యోతిర్దర్శ నముచేఁ "గొంతకాలము సర్వసంకోచములును దొలఁగినవి. కాని బహుజన్మసంచితమైన మమత్వజ్ఞానము తొలఁగలేదు. ప్రారబ్ధక్షయము కానంతదాఁక, త్రివిధకర్మఫలము సమూల ధ్వస్తము కానంతదాఁక మమత పూర్తిగా నశింపదు. మే నున్నంతదాఁక మమత తప్పదు. ఈ మమతయందు దోషదర్శనమైనవుడే, యది మొదలంటఁ దెగవలయు" ననుకొనును. తొలిపుట్టువునందలి దేహవిషయక దృఢసంకల్పమే, మన మరణానంతరము వేరొక క్రొత్తదేహ సంఘటనమునకుఁ గారణము. చచ్చునపుడు, అనిచ్ఛతో దేహమును విడుతుము. మఱొక దేహము నందుటకై తీవ్రవాసనలను గొని పోవుచున్నాము. ఇంద్రియములు దురాచారిసేవకులు. ఇవి మిథ్యావిషయములను గోరుటచే అసద్వృత్తులు అందుము. అసత్ (సద్విరోధి) యనున దెప్పుడును లేనేలేదు. అసత్ అను పేర నొకవస్తువు లేనేలేదు. ఇచట నఞ్ అల్పార్థమునందుఁ బ్రయోగింపఁ బడినది. సర్వత్ర సమభావముతో నున్న యొక యఖండవస్తువు, తా నల్పభావముతో వెలయునపుడే అసత్ అనఁబడును. అనఁగా నామరూపవిశిష్టమై పరిచ్ఛిన్న భావముతో సత్ యొక్క ఒక విధమైన లీలయే అసత్పదవాచ్యము

ఇంద్రియములు నామరూపవిశిష్ట ససీమ విషయములవలన ముగ్ధము లైనవి, కావుననే అసద్ వృత్తులు. ఇంద్రియములు విషయములను విషయములుగానే గ్రహించునంతకాలము దేహము ధర్మానుసార ప్రతిపాలితము కాదు. అసత్తును సత్తుగా నెంచి గ్రహింపకున్నచో సత్తుజాడ దొరకదు. సత్సంధానము కాకున్న జీవునకు మృత్యుభయము తొలఁగదు.

సురథుఁడైన జీవునకు బుద్ధిజ్యోతిర్దర్శనమైన దనఁగా - అతనికి యథార్థ సద్వస్తువుజాడ దొరికినదన్న మాట. ఆ జాడ దొరికినపుడే "విశ్వరూపమందు భగవత్స్వరూపమును గానని కన్నులు కన్నులు కావు. అవి నెమలిపురి కన్నులే. శబ్దమును అమ్మ పిలుపుగా గ్రహింపలేనిచేవులు వట్టి రంధ్రమాత్రములే. ముక్కు సుగంధమును గ్రహించునదపుడది, యమ్మ మేని నెత్తావిగా గ్రహింపకున్న నది లోహకారుని చేతి తిత్తియే. నాలుక తల్లినామము నెడ విముఖమైనపు డది కప్పనాలుకయే." అని జీవుఁడు నిదింపఁజొచ్చును. కనుక విషయముగ్ధేంద్రియములే యసద్భావము గలవయి ధర్మపూర్వకముగా దేహమును బోషింపఁజాలవు. సత్సంధానము నొందిన జీవుని మానసక్షేత్ర మునం దిట్టి విచారమే సహజమగుచుండును.

ఒక్కమాట - ఇట్టి సదసద్జ్ఞానమును గల్గించుటకే ద్విజబాలురకుఁ జిన్ననాఁడే, ఉపనయన సంస్కారమనెడి బ్రహ్మ విద్యోపదేశకాలమున, పంచశిఖలుంచుటయు, మేధాజననము కాఁగానే, గోష్పాదమంత యఖండశిఖయుంచి యల్పములైన యా పంచశిఖలను గౌరిగించుటయు నగుచున్నది. శిఖా = జుత్తు; అగ్నిజ్వాల జ్ఞానము అగ్నిగానే రూపింపఁబడుట ప్రసిద్ధము.

"వటుఁడా ! పంచవిషయముల జ్ఞానము, అఖండజ్ఞాన స్వరూ
బ్రహ్మజ్ఞానమేసుమా. మహాజ్ఞానస్వరూప సద్వస్తువే బహుత్వ
సంకల్పముచేసి, అల్పాల్ప విషయపంచకజ్ఞానముగా నయి అస
అనిపించుకొన్నది. ఈ యసత్తును, అల్పవిషయక జ్ఞానము
శిరస్సనెడి శివాగ్నియందు, (శిరసేస్వాహా) ఆహుతి గానిమ్ము. అపు
మిగులునది అఖండజ్ఞానాగ్ని శిఖయే సుమా. హృత్ + అయమ్
హృదయమ్. ఇదంతయు అఖండ జ్ఞాన స్వరూప సద్వస్తువు యొక్క
సంకల్పము (మనస్సు) చే నైన అసద్జ్ఞానమే (అల్పాల్పజ్ఞానమే
చుమా. ఈ జ్ఞానమే సుమా, నీహృదయమున మాటిమాటి
జరుగుచుండు కామాది ప్రబల శత్రువులతోడి యుద్ధమం
నీకుఁగవచమై కాపాడును. ఈ జ్ఞానమేసుమా నీజీవనయాత్రయం
నాయకుఁడై (నేత్రము) నడిపించుటే కాక, అస్త్రమై ధీరతగో
సంరక్షించును. అఖండ జ్ఞానస్వరూప సద్వస్తువే, ఖండ ఖం
జ్ఞానస్వరూప విషయపంచకముగా వెలసి నిన్ను ముగ్ధుని జేయును
అని యుద్బోధించునదే - సంధ్యావందనవేళ ద్విజులు చేసికొ
షడంగన్యాసభావము. దుర్భాగ్యవశమున, ఆ క్రియంద
వైదికమహర్షుల భావముఁ దెలియఁజెప్పక మన బిడ్డలను
జేఱచుచున్నాము; తెలిసికొనక మనము మున్నే చెడితి
ఉపనయన కర్మోద్దేశ్యము లక్ష్యమందేలేక జ్ఞానదూరులైన ద్విజుల
జగత్తుచే నీచతమ సోపానమునకు నెట్టివేయఁబడు చున్నా
వింతలేదు.

## దేహాభిమాన విచారము

దేహవిషయక వృత్తితోనే, అహం వృత్తివిషయక విచారము నుండును. అభిమానము సర్వవృత్తు లందును ప్రధానము. అభిమానమే లేకున్న దేహమే యుండదు."నేను దేహిని" అనెడి యభిమానము మనకెల్లప్పుడు నున్నది. కనుకనే దేహము క్రియాశీలమై యున్నది. ఈ దేహాభిమానము లోపించు గడియయందే దేహము నిశ్చలమైపోవును. కనుకనే యహంకార మన్నిఁటను ప్రధానము. మఱియు నీ దేహాభిమాన యహంకార మెన్నఁడునుం దొలఁగ నొల్లక సదా మత్తమై యుండును. దేహాత్మబోధము సదా సుఖగర్వానుభవ కారణమగును, గాన దానిజయించుట బహుదుస్సాధము. కనుకనే దీనిని గంభీరవేది హస్తితోఁ బోల్చిరి. ఏనుఁగు బహుబలశాలి యైనను దుర్బల మానవునకు లోఁగి, తన బలమెంతో మఱచి దాస్యము చేయునటులే, యీ 'నేను' ఒకప్పు డమితబలసంపన్నమై యుండియు, నాఁడు విరాడహం రూపముతో (పరమేశ్వర రూపముతో) సృష్టి స్థితి లయ కర్తృత్వముండియుఁ దాను గోరికొనియే బహుత్వలీల సభిలషించినది. అదే - ఆ విరాడహంతయే నేఁడు, అతిక్షుద్రమును అకించిత్కరమునైన మాంసపిండమయ దేహమందుఁ గట్టువడి, తనశక్తిబలాతి శయమును మఱచినది. దేహదాసత్వముతోనే (విషయసేవతోనే) సంతుష్ట మగుచున్నది.

జీవుఁడు బుద్ధిమయక్షేత్రమును జేరినను బహుజన్మ సంస్కారవశమున దేహాభిమాన విషయకవిచారము వచ్చి పడుచుండును. ఈ యేనుఁగారగించు నణిమాదిసిద్ధులు

స్వర్గసుఖము మున్నగునవి గొప్పవి. కామ కాంచన యశః ప్రతి ష్ఠాదులు చిన్నవి. అవి కోరకుండలేఁడు. అనింద్యమును, అతి లలితమును చిద్ఘనమును మోహనమునైన, యమ్మ మూర్తిని దర్శింపఁజాలనంతసేఁపు పైనిఁ జెప్పినవానిని భోగించు నాఁకలి తొలఁగదు. "యం లబ్ధ్వా చాపరం లాభం మన్యతే నాధికం తతః" ఏది లభింపఁగా మఱి దేనిని బొందఁగోరఁడో (గీత 6-22) దాని నొక్కపరి దర్శించినం జాలు, అవన్నియు నంత మొందును. చూడుఁడు. మన దేహాత్మబుద్ధి విషయకమైన 'అహమ్' వైపే చూడుఁడు. దాని యఁసంతృప్తియే, మనల నొక విషయమునుండి మఱియొక విషయమునకును, ఒక జన్మము నుండి మఱియొక జన్మమునకును, మృత్యువునుండి మృత్యువు నకు మనకుఁ దెలియ కయే మనల లాగికొని పరుగెత్తుచున్నది. దానితృప్తికొఱకే యనేకజన్మములు కడచిపోయినవి. ఈ భోగకాంక్ష యెపుడుతుదముట్టునో తెలిసియుం దెలియలేకున్నాము. "నః" తో "అహం" ను జేర్చి వేయునపుడే, వాస్తవిక రూపానుభవ మగునపుడే, అమ్మ స్వరూపము ననుభవించు నపుడే, నిత్యానందమయిని గాంచునపుడే, యీ నిత్య నవాశ లంతః మొందును.

## కర్మకాండ విషయక చింత.

దేహాభిమాన చింతతోఁగూడి కర్మకాండ విషయక చింతయు నుండును. జ్ఞానవికాస మగుచున్న కొలఁది, కర్మ కాండము నెడనైన యాసక్తి నడలిపోవుచుండును. కాని యది బహుజన్మ

సంచితమైనదిగాన, నొక్కసారి తొలఁగదు. కనుక ఉదాసీనబుద్ధి జ్యోతియందు నిలిచినను, విధ్యుక్తకర్మములను గూర్చిన చిత్తచాంచల్య ముదయించుచునే యుండును.

వ్రతనియమోపవాస పూజాహోమజపాది కర్మకాండము జరుపుటచేత నొకయసాధారణ చిత్తప్రసాదముకలుగును. కామకాంచనాదులను సేవించి జీవుఁడొందు తనివినిబట్టి యొక విశిష్టమైన తృప్తి నొందుటకు శాస్త్రీయాదేశములను బాలించుట కుద్యోగించును.

ధనము (ఇష్టవస్తువు). అదే సిద్ధిశక్త్యాదులయిన మాతృ విభూతులు. ఐహికోన్నతి, స్వర్గాదిసుఖము, మోక్షము, ఇందేదో యొకటి కోరియే మనుష్యుఁడు విధ్యుక్తకర్మములు చేయును.

అమ్మ సాన్నిధ్యభోగము పంచకోశములకును ఆహారము, తొలుదొల్త కర్మసహాయముచే మాతృసుఖానుభవమే యారంభ మగును. "సర్వతః సంప్లుతోదకమ్" కానంతదాఁక (మాతృ కృపాసాగరమందుఁ జక్కఁగా మునుఁగఁజాల నంత దాఁక) కర్మ విశేషానుష్ఠానమనెడి బావులందును జెరువులందును దిగి దగఁ దీర్చుకొనుచుండును. కనుకనే పూర్వాచార్యులు ప్రతిమాసమందును బలువిధములైన పూజావిశేషముల వ్యవస్థ చేయుట మన పరమకల్యాణము కొఱకే. ఈ విద్యుక్తకర్మములు మనుజుని దేహప్రాణమనోజ్ఞానానందములను బోషించు చుండును. కనుక నవి పంచకోశాహారములు. అవి యాత్మాభి ముఖవిచారశక్తికిఁ దోడ్పడును. కనుక జ్ఞానప్రా ప్తిమార్గములు. కర్మశ్రద్ధా తీవ్రతనుబట్టి జ్ఞానలాభ ముండును. దానిని బట్టియే యానందసంధానముండును.

ఇది సాధకుని యథార్థభోజనము. నేఁడు భారతభూముఖము
జరుగుచున్న కర్మకాండము శ్రద్ధా హీనముగా నున్నది. పైని
వివరించిన ధన భోజనాదులయెడ లక్ష్యముంచకే చేయుచున్నారు.
పురోహితులు (భావి వేలును గోరువారు) అనెడి
యయ్యవారులును నటులే చేయుచున్నారు. కావున నది
మృతకర్మమై పంచకోశపోషణమును జేయఁజాల కున్నది. దాని
ఫలముగానే రోగ శోక క్షామ మహామార్యాదులు, వాయు
జలాద్యుత్పాతములు దేశమును జీర్ణశీర్ణముగాఁ జేయుచున్నవి.

కలికాలమందు శాస్త్రోక్తకర్మముల ఫలము యథోక్తముగా
లభింపకున్నదని కొందఱును, కర్మానుష్ఠానము అజ్ఞానులకే యని
కొందఱును, నామసంకీర్తనము దక్క నన్యకర్మము కలియుగమందు
నిష్ఫలమని కొందఱును బల్కుదురు, తత్త్వ మెఱిఁగి విధులయందైన
నవ్యగ్భావముతోఁ జేయఁబడునపుడవి నేఁడును
సత్ఫలదాయకములే యగును.

అమ్మ శంకరరూపమున నవతరించి, కర్మమును జ్ఞాన
మాత్రముగాను, గౌరాంగరూపముననవతరించి కర్మకాండము
ననావశ్యకముగాను గీర్తించినది. ఉజ్జ్వలజ్ఞానము, పరాభక్తి యనెడి
త్రోపుడులచే నొక కాలమున సంకుచితమును మృత ప్రాయము
నైపోయినది. శంకరసమజ్ఞానియు గౌరాంగ సమ ప్రేమియు
నైనపుడు కర్మకాండము తెగిపోవుననుట సత్యమే, కాని వారి
యనుగాములు జ్ఞానప్రేమముల జాడయు నెఱుంగక
కర్మకాండము ననావశ్యకమనుచుఁ బరిత్యజించినచో, వారు
భ్రమపూర్వకమార్గముఁ ద్రొక్కిరనుకొనక తప్పదు. వేదముల

కర్మప్రవర్తకములు. అపౌరుషేయములు. భ్రమప్రమాదములు లేని మహర్షుల యాత్మసంవేదనమునఁ బుట్టినవి. గాన నవి నిష్ఫలములు నల్పఫలదములు ననుట యజ్ఞాతృపరిచయము. కొందఱు శిక్షకొఱకుఁ గర్మము లాచరింతురు. కొందఱూరక విడుతురు. జ్ఞానపరిపాకదశయందుఁ గర్మము తనంతనే సడలి పోవును. కప్పపిల్లతోఁక కొన్నాళ్లకుఁ దనంతనే జాఱిపోవును. కాని యా కాలము రాకమున్నే దానిని త్రుంచినచో దాని చావు తప్పదు.

ప్రతికర్మమందును మునుజెప్పిన ప్రాణసంధానము చేసి నచోఁ జిత్తప్రసాదము, మాతృవిభూతి, మాతృలాభము నబ్బును. అట్టి లాభము కొలదియో గొప్పయో కానప్పుడు, ఆ వ్రత నియమ పూజాదులు కర్మములే కావు.

మన చిత్తమెంత ప్రసన్నమైనదియు, మన మెంతగా మాతృమహిమమును దర్శించినదియు, మన మెంతసేపు ఈ జగత్తును మఱచి అమ్మను జేరియుండి ధన్యులమైనదియు, మన ప్రత్యేకకర్మమందును గనుఁగొనుచుఁ గర్మమును సార్థకము చేయవలయును. ఈ సార్థకతవైపు నజరు లేనపుడు మన కర్మ మంతయుఁ బ్రాణహీనమే. "మనము చేయు నిత్యక్రియలైన సంధ్యావందనాదుల వలనను, మనచేయు పూజా వ్రతాదుల వలనను మనకు భగవత్ప్రాప్తి కాకున్నది. భగవత్ప్రాప్తికై యొక యోగికడకో, సన్యాసికడకో పోయి గుప్తోపదేశము నొంది దాని ననుసరించియే సాధనచేయుచున్నాము. కొంత కాలమునకు భాగ్యవంతులకుఁ గొందఱకు భగవత్సాక్షాత్కార ప్రాప్తి యగును." అను నిట్టిధారణ బహుకాలమునుండి సాగుచున్నది. కాని,

వైదికయుగమం దిట్టిది లేదు. ఇప్పుడును మన దైనందిన కర్మము భగవల్లాభమునకే యధికముగానగుచున్నది. ఆచమనము, ఆసనశుద్ధి, సూర్యార్ఘ్యము, ఇష్టమంత్రజపము, మున్నగువానియం దేదైనను యథారీతి, నిర్దిష్టభావముతో సంపన్నమగునేని మనుజు డమృతసంధానము నొందఁగలఁడు. నందియము లేదు.

## ఆచమన రహస్యము

చూడుఁడు. ఆచమించునపుడు ముమ్మాఱో, నలుమాఱో నీరు త్రాగుటయు, నది మినుపగింజ మునుఁగునంత మాత్రమే యగుటయు మాత్రమే చూచుకొన్నచో లాభము లేదు. "తద్విష్ణోః పరమం పదం సదా పశ్యన్తి సూరయః । దివీవ చక్షురా తతమ్" అను మంత్రము నుచ్చరించుచు 'పుండరీకాక్ష' యని ముమ్మాఱు పలుకుచు భావసంధానము చేసికొనవలయును. విద్వాంసులు సర్వవ్యాపకుఁడైన సూర్యమండలాంతర్గతుఁడైన నారాయణుని శ్రేష్ఠమైన తేజస్సును దమలో, మనుజదృష్టి యాకసమున వ్యాపించునంత వడిగావ్యాపించి లీనమగునట్లు భావించుచు "పుండరీకం అక్ష్ణోతీతి పుండరీకాక్షః" హృదయ పుండరీక మందు వ్యాపించువాఁడు; అను నర్థయుక్తితో నాచమింతురు. ఆచమనపదము 'చమ్' ధాతువు వలనఁ బుట్టినది. అంతటను శీఘ్రముగా వ్యాపించుట యని యర్థము. అట్టి భావముతో జలమందుఁ బరమపద ప్రతిష్ఠచేసి యాచమించునపుడే యా కర్మమువలని లాభము నొందఁగలరు.

## ఇ౯ ద త్త్వాచమనము.

విరజాహోమ మంత్రార్థ తాత్పర్యముతోనే చేయవలయును. "శివాదిక్షితి పర్యంతమైన యిరువది నాలుగనాత్మ తత్త్వములతో నైన స్థూలదేహము 'నేను'గాదు అనియు, ఏడు మిశ్రతత్త్వములతో నైన సూక్ష్మదేహము 'నేను' గాదనియు, అయిదు జ్ఞానతత్త్వములతో నైన కారణదేహము 'నేను' గాదనియు, ఈ మూడిఁటిని బరాహంతారూపమైన పరమశివతేజ స్తత్త్వమందు వ్రేల్చు చున్నానియు, 'నేను' మహాకారణ శరీరనామక పరమశివుఁడనే, బ్రహ్మమనే, యని పరిశోధించితి" ననెడి భావముతోనే యాచమనము చేయవలయును. ఇది మొదలు సర్వకర్మములు "అహం బ్రహ్మాస్మి" "అయమాత్మాబ్రహ్మ" "సర్వం ఖల్విదం బ్రహ్మ" యనెడి మహావాక్యార్థ జ్ఞానము స్థిరపడుట కే యుపదేశింపఁబడినవి. జీవత్వాహంకారము తొలఁగుటకే యుద్దిష్టములైనవి. సర్వకర్మలు మహావాక్యార్థ జ్ఞానముతోనే యారంభమగును. తదర్థజ్ఞాన సమాహితత్త్వము తోనే పర్యవసించును. ఇఁక ఆసనశుద్ధి మంత్రతత్త్వమును నా "దేవపూజారహస్య" గ్రంథమందును "శ్రీసత్యనారాయణ శర్మ సాధన"మను దానియందును జూచు కొనునది. ఇట్టి భావ శుద్ధితో నేదేనొక్క శాస్త్రోక్తకర్మము నాచరించినం జాలును. మనుజుఁ డమృతసంధానము నొందఁగలఁడు.

ఇన్నేల ? 'తద్దినము' పేర ద్విజులుచేయు శ్రాద్ధకర్మముఁ బరిశీలింపుఁడు. తద్దినము అనఁగానే ఆ తనతండ్రిదో తల్లిదో మృతిదినమను భావముతోనే సాగుచున్నది. శోచనీయము కాదా ? "ఓం తత్సదితి నిర్దేశో బ్రహ్మణ స్త్రివిధః స్మృతః"స్మృతి. తచ్ఛబ్దముచేఁ

జెప్పఁబడు పరమాత్మను గూర్చిన తెలివి నిలుచుటకైన పని చేయబడు దినము అని యర్థము. 'శ్రద్ధయా కృతమ్ శ్రాద్ధమ్' పరిపూర్ణ విశ్వాసముతోఁ జేయబడు కర్మము గావున శ్రాద్ధము. భోక్తలుగా నిమంత్రితులైన బ్రాహ్మణుల యడుగులు కడుగుట మొదలు "బ్రహ్మార్పణం బ్రహ్మ హవిర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతం। బ్రహ్మైవ తేన గంతవ్యం బ్రహ్మకర్మ సమాధినా" యనెడి మంత్రముతో దుదముట్టు కర్మమంతయు కర్తవగు నీవు, నిమంత్రితులై పితృ దేవస్థానమందును విశ్వేదేవస్థానమందును క్షణము గైకొన్న బ్రాహ్మణులును, పాకద్రవ్యములను, లభించినచో నావహింపఁబడిన యతియు, సర్వమును తచ్ఛబ్దవాచ్యు(డై) అంతట నాత్మస్వరూపమున వ్యాపించియున్న విష్ణువ నెడి బ్రహ్మవస్తువే కాని వేఱొండు కాదని స్మరింపఁజేయుటకై వ్యవస్థచేయఁబడిన దినముగాన 'తద్దినము'. ఇక్కర్మయందలి మంత్రములన్నియు స్వరూపజ్ఞానదాయకములై, కర్తకేగాక, ఆనాఁడు సహపంక్తి భోజనమునకై యాహూతులైనవారి కెల్లరకు, నాత్మజ్ఞాన దానమందు సహకారులై మధుమయములే కదా. సమష్టి మానవచైతన్యము మహాచైతన్యమె యని (బ్రహ్మమేయని) ప్రతిపాదించునవియే కదా. ఏ నెవమునఁ బూర్ణశ్రద్ధతో బూజింపఁబడినను, అమ్మహాచైతన్య స్వరూప పరమాత్మ నీ కెన్నిమేళ్లో చేయునను ఫలస్తుతిని విశ్వసింపనివారి వంశములు వృద్ధినొందవు. అమృతముతో వారు విచ్యుతులే. అక్కటా! ఇక్కాలమున నెందఱో, యీ సులభజ్ఞానదాన సమర్థ కర్మమును వీడిరనుట యసత్యోక్తి కాదు. వీడక చేయువారి చేత నైన, నది

ప్రాణహీనమై పోయి, తద్దినము గారెముక్కల దినముగా మాఱిపోయినది.

మన శాస్త్రములం దనేకవిధముల కర్మకాండ విధానములు కానవచ్చును. అధికారి భేదముచే నైన కర్మభేదమిది. హిందూ దేశమందిదే విశేషము. దేశాంతరములం దుపాసనా ప్రణాళి యెల్లరకు నొక్కవిధమే. ఇక్కడనో - సంప్రదాయ భేదము, వ్యక్తిభేదము, అధికారిభేదము కారణముగా భిన్న భిన్నోపాసన ప్రణాళికలు నిర్ధేశింపఁబడుటవలన, బహుత్వమందపూర్వమైన యేకత్వమును, దానితోడి మధుర మేలనమును లభించుటచే, నిట్టిదనరాని ప్రాధాన్యము నెలకొన్నది. గుణకర్మ విభేదముచేఁ బ్రత్యేకమనుజుని ప్రకృతియు వేర్వేఱు భావము లతోఁ గూడియుండును, గాన నెల్లర సాధన ప్రణాళియు నొక్కవిధముగానే యుండక భిన్న భిన్నముగానే సాగుచుండుట కడు స్వాభావికము. ఇదిగాక, బహుప్రకార కర్మకాండవిధాన ములకు మఱియొక యుద్దేశ్యము గలదు. మన మనస్సతి చంచలము. ఏదే నొక కార్యప్రణాళికిఁ బూనుకొని, ఒక్క యూఁ పునఁ జాలసే(పు మనస్సును స్థిరపఱచుట దుష్కరము. నిత్యము నొక్కవిధమైన రసాస్వాదముచే మనస్సునకుఁ దృప్తియుండదు. ఒక్కవస్తువునే క్రొత్త క్రొత్త భావముల ననుభవించుటగును. జపము, ధ్యానము, పూజ, హోమము, కీర్తనము మున్నగు భిన్నభిన్న రూపముల కర్మకాండము మన మనస్సునకు స్వాభావికమైన పరివర్తన ప్రియత్వమునే తెల్పును. అదియుండనిండు.

ప్రసాద ధన భోజనములు (మున్ను వివరింపబడినవి) విధ్యుక్తకర్మములను బోషించునవియే. ఈ మూడుద్దేశ్యములు

విశిష్టతతో సంస్థాపింపఁబడునపుడు కర్మకాండము మనకను
కూలముగానే యుండును. జీవుఁ డొక్కొక్కదానితోనే ప్రజ్ఞ
నంధానము చేయును. బుద్ధిమయక్షేత్రమందే ప్రజ్ఞ
యాభాసించును. అపుడు కొంతకాలము తన కర్మసమూహము
స్థూలాభి మానీంద్రియవృత్తులు, స్థూలపార్థివభావములను
సేవించుచున్న వని తెలియక నరిగాఁ దాఁ జేయు
నంధ్యావందనాదికము సాగుచున్నదనియే తలంచునుగాని
ఒక్కసారి చైతన్యనంధానము నొందుటచే నించుకంత
ప్రజ్ఞాప్రకాశమైనచో గర్మముల యందైన యీ దోషమును
గుర్తింపఁగలుగును. అపుడు జీవుఁడీ కర్మకాండమందలి
స్థూలాభిముఖదోషమును జూచి, మిగుల నొచ్చుకొని "యింక నే
నే యుపాయముచే సర్వకర్మములను జ్ఞానమయములుగాను
మధుమయములుగాను, ఆత్మానుసంధాన యుక్తములుగాను
జేయఁగలుగుదునో యనుచు దానికై ప్రయత్నించును.

## కర్మ రహస్యము

ఇచటఁ గర్మరహస్యమును గూర్చిన యాలోచనము
ఆవశ్యకము. వైధకర్మము జ్ఞానమయము కానంతదాఁక సాధకుఁడు
కృతార్థుఁడు కాఁజాలఁడు. వైధకర్మమేకాని, వ్యావహారిక కర్మమే
కానీ అది యే కేంద్రమునుండి వికసించు చున్నదో, యే
స్థానమునఁజేరునో, దానిని లక్షించి చేయనప్పు డది యథార్థముగా
నజ్ఞానమాత్రమే. కర్మముయొక్క ప్రత్యేకాంగమును
మాతృమయముగాఁ జేసినపుడే యది సార్థకమగును. "బ్రహ్మార్పణం
బ్రహ్మహవిః బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతమ్" అనుచుఁ గర్మము

నాచరింతురు. కర్త, కర్మము, కరణము, సంప్రదానము, ఉపాదానము, అధికరణము అను నాఱిటిరూపముతోను బ్రహ్మమే. అమ్మయేకర్త; అమ్మయే కర్మము; అమ్మయే కరణము; కర్మముయొక్క సర్వాంగములును మాతృసత్తగాననుభవించు నపుడు ఆకర్మము జ్ఞానమయమగును. ధ్యానించునపు డమ్మయే అమ్మను ధ్యానించుచున్నదని తెలిసికో; పూజించుచున్నపుడు అమ్మయే అమ్మను బూజించుచున్నదని తెలిసికో; అమ్మయే పూజోపచారములుగా వెలయుచున్నది. హోమకార్యమునందగ్ని రూపముగా నమ్మ; అర్పణము రూపమున నమ్మ; హవిస్సు రూపముగా నమ్మ; యని తెలియుము. జాలిగొలుపు స్వరముతో అమ్మా! యనుచు నఱవ నారంభించి చూడుము. శబ్దరూప ముగా నమ్మ; నీ జాలిరవావముగా నమ్మ; అమ్మయే అమ్మను బిలుచుచున్నదని, యిటులు కర్మముయొక్క సర్వావయవము లందును అమ్మనే చూడ నభ్యసింతువేని, నీ కర్మము జ్ఞాన మయ మగును.

జ్ఞాన కర్మము లొక్కటే వస్తువు. కర్మ మజ్ఞానము కాదు. జ్ఞానముయొక్క ఘనీభూత వికాసమే. ఏ జ్ఞానమును నీవు సంధానింతువో, యే జ్ఞాన మమృతనిదానమో యా జ్ఞానమే కర్మాకారముతో నీ యెదుట, నీచేత వెలయుచున్నదని, యనుభవింపఁగల్గుదువేని, నీ 'బ్రహ్మార్పణ' మనెడి మంత్రము సిద్ధించును. చైతన్యమయమగును. అపు డేమి లాభమందువో - "బ్రహ్మైవ తేన గంతవ్యమ్" నీవు బ్రహ్మత్వము నందుఁ జేరఁగలవు. జీవత్వమనెడి విడనిముడి యిట్టె విడిపోవును. కర్మమం దిట్టి

యఖండజ్ఞానమును నెలకొల్పనంతదాఁక, నీ కర్మము కేవల
పార్థివభావములనే యనుగమించును.

కర్మదోషము కానవచ్చినపుడే సాధకునకు మంచి దినములు
వచ్చినట్టు లెన్నఁదగును. అంతదాఁక అవి ఆత్మను, జ్ఞానమును,
సచ్చిదానందరూపమును సేవింపకున్నవి. కర్మము లక్ష్యము;
కర్మము మధువు. కర్మము జ్ఞానమయము కాక, దేనియందలి
దృష్టితో, దేని నొందు నాసక్తితోఁ గర్మములు చేయుచున్నా
దానిజాడ దొరకకయే కొంతకాలము కడచి, ఈశ్వరానుగ్రహము
బుద్ధి యోగలాభము కాఁగా పైఁ జెప్పిన భావములు తప్ప
యుదయించును. అతికష్టార్జితమైన ప్రాణమయకోశము
క్షీణించుటచేత అన్నమయకోశము సైతము క్షీణించును. అమ్మ
నొందుటకు మున్ను దేహపతనము నెవ్వఁడును గోరఁడు.
"కుర్వన్నేవేహ కర్మాణి జిజీవిషేత్ శతం సమాః" "జగత్తున సర్వ
పరమేశ్వర సత్తాదర్శన మనెడి కర్మకాండమును నెఱపి,
పూర్ణాయుష్కాలమైన నూఱేండ్లును బ్రతుక నభిలషింపుము.
ఆత్మఘాతకుఁడవు గాకుము." పురుషాయుః పరిమాణమునకు
మున్నే యపరిమిత ప్రాణవ్యయ ఫలముగా, నకా
దేహపతనమైనచో మఱల గర్భయంత్రణాద్యనేక దుఃఖానుభవము
తప్పదు. సదా ప్రాణశక్తిహాని యెడ జీవుఁడు కనుగల్గియుం
వలయును.

**ప్రాణశక్తి హానికాకుండఁ జూచుకొనుము.**

మన మెంతో కష్టపడి, యెంతో శోకదుఃఖమర్మపీడను
బహుజన్మ మృత్యుయాతనను సహించి మెల్లమెల్లఁగా సుదీర్ఘ

కాలము ప్రయత్నించి యీ మనుష్యశరీరము నొందితిమి. అది తలంచుకొన్న భయమగును.

జీవు డింద్రియహీనమును గంపనమాత్ర ధర్మమును గల క్షుద్రతమ జీవాణురూపమాత్రముగాఁ దొలుతఁ బ్రకటితుఁ డగును. దీనికి మున్ను బహుకాలము జడపదార్థముగానే యుండెను. దానికిఁ బరిమాణమే లేదు. తొలుత నీ చైతన్య వికాసమగునపుడు, దానికంటెఁ బ్రబలములైన జీవులచే ముట్టడింపఁబడి, తప్పుకొను నుపాయము లేక, హృదయమం దించుకంత దుఃఖానుభవము నొందును. ప్రాణరూపిణి మన యమ్మ దానిని దలఁపించు చుండును, గానఁ దొలిజన్మమునకంటె నధిక బలముగల శరీరము నిచ్చును. ఒక పేడవురుగు, ఇంద్రియ హీనము; దానియందించుకంత కదలికమాత్రమే కానఁబడును. గాన దానియందు జీవుఁడు గలఁడని తెలియును. కండచీమలు దానిని నాల్గువైపులఁ గఱవఁగా, నా కాటువలన నొప్పి నొందుచుండియుఁ దన కాపీడ యెవరివలనఁ గల్గినదో యెఱుఁగఁ జాలదు. దాని వ్యాకులపాటును, మాట నూవులు లేని యా దీనస్థితియు నమ్మగుండెకు నాటి, దాని మఱుపుట్టువునఁ గన్నులు గల జీవునిగాఁ జేయును. అపు డది కన్నులుండియుఁ దన్నుఁ బీడించుదానివలనఁ దప్పించుకొను శక్తి లేకుంటం గని, కలఁత నొంది, యది ప్రార్థింపఁగా, అంతర్యామినియైన యమ్మ గుండె కరఁగి, దాని మఱుపుట్టువున నడువఁగల, వరుగెత్తఁగల కీటముగాఁ బుట్టించును. ఈ విధముగా నమస్తేంద్రియములయు సర్వమనోవృత్తులయుఁ బెంపు సేయుచుఁ జేయుచు, నవస్థలను మార్చుచు మార్చుచు గ్రమముగా మనుష్యకులమందుఁ దెచ్చి

పెట్టుసరికి, ఎనుబదినాలుగు లక్షల యోనులగును. ఇమ్మాట
ప్రసిద్ధము. చెప్పెడి దేమనఁగా, నెన్నోలక్షల జననమరణముల దాటి
లెక్కలేని యెడ పెడ దెబ్బల కోర్చి, యీ ప్రాణమయ కోశమును
(మానవ దేహమును) సంపాదించుటైనది. ఇందు సందేహములేదు
కనుకనే మనుష్యుఁడు సురథుఁడు.

ప్రాణమయకోశ మనుచితముగాఁ దఱిగిపోవును. మాతృ
గర్భమునుండి నేలఁబడిన నాఁటఁగోలె నీ కోశక్షయమారంభ మైనది
సంపూర్ణక్షయము కాఁగా నొకనాఁడు మృత్యువు సిద్ధమగును. మన
మేపని చేసినను, అందెంతో కొంత ప్రాణ శక్తి వ్యయమగుచునే
యుండును. మహద్విరాట్ ప్రకృతి, యపారమైన విచిత్రమైన
విషయసామగ్రితో నిండిన, యుప హార మనెడి దుస్తులను ధరించి
యెల్లపుడును నీ ముందు వెన్కల బరిచారికవలె నిల్చియున్నది
మఱియు నీ వాసనల కనురూపమైన విషయములను గూర్చి
పరితృప్తి నొందించు చున్నది. జీవుఁడా ! ఎట్టి మూల్యమును ఖర్చు
యది నీ వొందుచున్నావు. తెలిసికోలేకున్నావు. ఎట్టి బదులును
గోరకే, ప్రకృతిసుందరి యీ జగద్భోగ సుయోగము నిడుచున్నదని
నీ వెఱుఁగ లేకున్నావు. నీవు పూవునుజూచి, పండునుజూచి, నీకు
తెలియకయే నీ ప్రాణశక్తిని వ్యయపెట్టుచున్నావు. నీవు దారపుత్ర
ధన కీర్త్యాదులను బ్రేమించుచున్నావు; దీనికి బదులుగ నీ వేమి
యిచ్చుచున్నావో విచారించితివా ? అది ప్రాణశక్తియే చుమా. దేని
గూర్చుకొనుటకై నీ మనుష్యోచిత దేహేంద్రి యాది శక్తుల
నొందుటకు, నీకు లెక్కలేని చావు పుట్టుకల వెతలవలని సైఁపరాని
నలుగుఁబాట్ల నోర్చుకొనుటైనదో చూచుకొంటివా ? ఆ ప్రాణశక్తి

ప్రతినిమేష మందును నిఃశ్వాస రూపమునఁ దొలఁగి పోవుచున్నది. అయ్యో ! జీవుఁడా ! సురధుఁడవై యతికష్టముతోఁ గడించుకొన్న యీ ప్రాణమయ కోశము ననుచితక్షయమును జూచి యెన్నఁడు నీవు క్షోభ మొందుదువో ! నానాఁటికిని నీకుఁ దెలియకయే మృత్యువు వంక ముందంజ వేయుచున్నావు. నీ యీ మృత్యుగతి నడ్డగించు నాత్మీయులు బంధువులు నెవ్వరు లేరు. ఆహార నిద్రా కామనా సేవలనేచేసి, దుర్లభమనుష్య జీవసమును గడపివేయుట కంటెను దుఃఖకరవిషయ మేమి కలదు ? ఇంద్రియసేవ చేయుచునే యడుగడుగున మృత్యువువాడి నాశ్రయించుటగు చున్నది. కేవల మృత్యువేకాదు. జీవితకాలమందుఁ బ్రాణశక్తి యపరి మితముగాఁ దఱిగిపోవుటచేఁ బలుతెగల తెగుళ్లచే నలిగి మరణకష్టము నొందుచుండుట. నీవు సర్వవిధముల జాగతిక సుఖముల ననుభవించుటకే సదా ప్రాణవ్యయమనెడి మృత్యువు యొక్క భయంకరచ్ఛాయను నొందఁగోరుదువేని, ప్రాణశక్తి యనుచితముగాఁ దఱుగకుండఁ జూచుకో.

అందులకై ధర్మజగత్తునందుఁ బ్రాణాయామము, హఠ యోగము, నాభిక్రియ మున్నగు కౌశలసాధనములు పెక్కు లున్నవి. భిన్న భిన్న కర్మముల నాచరించుటచే మన నిఃశ్వాస గతియందు భేదము గానవచ్చును సాధారణముగా మన ప్రతి శ్వాసమందును వెలిగాలి నెంత పీల్చుచున్నామో, ప్రతి నిఃశ్వాసమందును నంతకంటె నధికపరిమాణముగానే వాయువు దొలఁగుచున్నది. ఈ యధిక పరిమాణమే మన సంచిత ప్రాణ శక్తి యొక్క యంశము. సరిగా వాయువే ప్రాణశక్తి కాదు. ప్రాణముయొక్క స్థూలవికాసము

మాత్రమే. సుస్థశరీరమందు స్వాభావిక ప్రాణగతి నిద్ర, రతిక్రియ యధిక భోజనము, ధావనము (పరుగు) మున్నగు పనులచే నధికతరమగుచుండును. ఆ యధికక్షయము గాకుండఁజేయుటకే యాహార నిద్రా మైథు నాదుల సంయమన ముపదేశింపఁబడినది. మఱి స్వాభావిక గతిని దగ్గించి క్రమముగా నాసాభ్యంతరమందు శ్వాసప్రతిశ్వాసముల యభ్యాసము చేయుదురు. తుదకుఁ గుంభక సహాయముతో నొకసారి వాయునిరోధపూర్వకముగాఁ జాలసేపు కూర్చుండు టభ్యసింతురు. కఠోరమైన యభ్యాసముచే సుస్థ మగును. చాలాకాలము క్రియావంతుఁడైన గురువుకడ నుండి దా నభ్యసింతురు. తత్ఫలముగా సుస్థశరీరము దీర్ఘజీవితము, ఒకటి రెండు సిద్ధులును గలుగును. పో. మనుజుఁ డంతమాత్రముచే సంతుష్టుఁడు కాఁగలఁడా ? ఎన్ని ప్రయత్నములు చేయనీ, ఎన్ని యోగకౌశలము లవలంబింపనీ మృత్యువు చేతి నుండి తప్పించుకొను నుపాయ మేదియు లేదు. కావున నే వెర్ధ నూనుటచే మఱి మృతి రాదో, దేని నొందుటచే మృత్యుభీ మింతయు నుండదో ఆ యభయము, నమృతము నైన మాతృస్నేహము ననుభవించటకే పూర్ణాభ్యాసము చేయుట కని నుచితము.

ప్రాణేశ్వరి, మహాప్రాణమయి, మహామాయయైన అమ్మపూజను మాత్రమే, అనఁగా నీ విరాడ్బ్రహ్మ యజ్ఞపూజను జూచు సాధకుఁడే యీ యమరత్వము నొందఁగలఁడు. మఱియు నెవ్వని ప్రత్యేక చేష్టయుఁ, బ్రత్యేకవిచారమును, బ్రత్యంగసం

లనమును, ప్రతిశ్వాసప్రశ్వాసమును మాతృపూజగానే సిద్ధమగునో, యెవ్వని రోమరోమకూపమందును, "ప్రాతః ప్రభృతి సాయాంతం సాయాహ్నాత్ ప్రాతరంతతః । యత్కరోమి జగన్మాత స్తదేవ తవ పూజనమ్" అనుమాట పట్టి పోవునో, యట్టి సాధకుఁడే యీ కోశక్షయమువలనఁ దన్ను రక్షించు కొనఁగలఁడు. ఎవ్వని సర్వకర్మములును మాతృమయము లగునో, యెవ్వఁడు 'బ్రహ్మార్పణం' మంత్రగుతోఁ బూర్ణాభి షిక్తుఁడగునో, యా సాధకుఁడే జననమరణ భ్రమణమునుండి పూర్తిగాఁ దప్పుకొనఁగలఁడు. దీనిచేఁ గోశక్షయము నడ్డుటగు నని, యట్టివారొక కౌశలమును బూనక్కఱ లేదు. ఎంత దనుక ధర్మములు కేవలదర్మకర్మములు కావో, మఱియు సర్వకర్మములు జ్ఞానమయములు కావో, అనఁగా నొక్కజ్ఞానమే కర్మాకారమునఁ బ్రకాశితమగుచున్నదనెడి జ్ఞానము వికసింపదో, యంతదాఁక సర్వకర్మములు నహంబుద్ధితోనే సాగు చున్నవన్నమాట. అహంబుద్ధితో ధర్మ మాచరింపఁబడుటచే నది ప్రాణక్షయమునే చేయును. ఏమన, నీ జీవుఁడు క్షరపురుషుఁడు. క్షకరణము = అవచయము, జీవుని స్వాభావిక ధర్మము. నిష్కామావలంబనమే చేయుము; లేదా ప్రాణాయామమే చేయుము. అక్షరపురుష సంధానము కానంతదాఁక నీక్షయము నడ్డగించు నుపాయమే లేదు.

ప్రాణమయకోశమును యథోపయుక్తముగాఁ జేసి యుత్కర్షముగాఁ జేయుటకే పలు జన్మముల నెత్తుచు నేడ్చుట పలుజన్మములను గోరికొనుట, యసంఖ్య మృత్యుపేషణము నోర్చుకొనుట యగుచున్నది. విచారింపఁగా నిది వృథావ్యయ

మగుచుండుటనే, జీవుఁడు సంకుచితుఁ డగుచున్నాఁడు. కేవల
మింద్రియ వృత్తుల సేవకే, మనసుపెట్టు నాజ్ఞలను బాలించుటకు
యిది వ్యయమగుచుండు టెంత శోచనీయము ! జీవుఁడు
మహాభాగుఁడు, సురథుఁడు నగునపుడే తన దేహ ప్రాణ మన
ఇంద్రియాదుల వ్యాపారము లేవిధముగా సంఘటితము లగు
చున్నవో లక్షింపఁగల్గును. అపుడే యతఁడు, ఆత్మప్రాప్తికగు
ప్రతికూల ఘటనముల నెదుర్కొనఁ బూనుకొనును. మఱియు
"ఈమనసెప్పుడును బరిచ్ఛిన్న విషయ సుఖముచే మోహిత
మైపోయినది ఇంద్రియ చరితార్థతకొఱకే ప్రాణశక్తి క్షయించినది.
అంతయుఁ బ్రతికూలమే. ఇఁక నాదేమున్నది ? ఇంకెవరి
నాశ్రయించి మాత్మలాభ మార్గమున ముందడుగు వేయఁగలను?
అని దుఃఖించును.

## సాధకచింతలు

"అమ్మా ! నీ ముద్దుబిడ్డలైన సాధకులు బ్రహ్మచర్యముచే
మనఃపరిశుద్ధిని జేసికొన్నారు. ప్రత్యాహారముచే నింద్రియ
సంయమనము చేసినారు. ప్రాణాయామముచేఁ బ్రాణవ్యయము
నడ్డగించుకొన్నారు. అమ్మా ! యని పిలుచునపుడు, తమ మన
ప్రాణేంద్రియముల నొక్కస్వరమున బాడించుచున్నారు. వారి
పిలుపు నిన్నాకర్షింప, స్వయముగా వచ్చి, వారి యఱుతలఁ బవిత్ర
విజయమాల వేయుచున్నావు. కాని, మా కేమి గతి ? తల్లీ ! మా
కెటు చూచినను జీఁకటియే. ఒక్కసారి మా చచ్చు కంఠముతో
అమ్మా ! యని పిల్వఁజూచినను, ఆ సమయమందే మా మనస్సు
తన పుంజీభూత సంస్కారములతో నెదుర నిలుచును

చపలేంద్రియములు విషయమునుండి విషయమునకుఁ బరుగెత్తును. ఇఁకఁ బ్రాణమో ? దాని జాడయే లేదు. అది యింద్రియసేవలో మునిఁగిపోయినది. అమ్మా ! అట్టియపుడు మనోహీనము, ప్రాణహీనము, ఇంద్రియహీనము, శ్రద్ధాభక్తి విశ్వాసహీనము నైన యీ దుర్బలకంఠములకు అమ్మను బిలుచు భాగ్య మేదీ ? అమ్మా ! కైలాసమందలి నీ హేమసింహాసనము దాఁక మా పిలుపందునా ? అష్టబంధనయుక్తమైన, సంసార సంతాపజర్జరితమైన, దుర్బలమైన యీ శిశుసంతానమువంకఁ జూచి, యొక్కసారి నీయొడిని జేర్చుకొనుటకై పిచ్చిదానివలెఁ బరుగున వత్తువా ? అమ్మా ! చూచితివా ? మే మెట్టి దురవస్థలో నున్నామో ? ఈ యధమపుత్రుల మేననంటిన ధూళిని, మాలిన్యమును, దుర్గంధమును జూచి, యేవగించి, నడుదారిలో నట్టడవిలో విడిచినచో, నీ నిష్కలంక మాతృస్నేహము కలంకితమై పోదా ? అమ్మా ! నిన్నుఁ గోరినవారు నిశ్చయముగా నిన్నొందుదురు. మేము పొందఁజాలము. మనస్సు భోగమును గోరును; ఇంద్రియములు విషయములను గోరును; ప్రాణము దేహమును గోరును. గాన, మఱల నీవే కావలయునని నిశ్చయముగాఁ గోరికొను సంయోగమునకు ఇంకెన్ని నాళ్లు కడచి పోవునో ?" యని యీ పశ్చాత్తాపదుఃఖమును రోమ రోమ కూపముల ననుభవించును.

"కృపామయీ ! మేము కోరకున్నను నీవు వత్తువు. ఇంత కృప, ఇంత స్నేహము నీ హృదయమందున్న దే. ఒక్క బొట్టు నీ నెయ్యము నొందియే లోకమందలి తల్లులు పుత్ర స్నేహముతో మైమఱచుచున్నారు. నీవు స్నేహసింధువవు. నీ నెయ్య మెంత

గొప్పదో యది నీవే యెఱుఁగుదువు. అమ్మా! తప్పన్నది లేని శక్తి
నీ వాక్కు తెవే. సంతానదోషము లెన్ను, తఱి, నీవు గ్రుడ్డిదా
మమ్ములను మైమఱపింతువు. మా గడ్డము పుడుకుచు, కొడు
రారా ! యనుచు నాదరింతువు. అపుడు మేమభిమానము
మొగము త్రిప్పుకొని, నిన్ను అమ్మా ! యనము. అమ్మా ! య
పిలవమందుము." ఇట్టివే చింతలు.

సురథుఁడైన సాధకుని యీ చింతలనుగూర్చి చెప్పఁబడి
విషయము మఱొక్కసారి సంక్షేపముగాఁ దలఁపుఁడు. ఒక
దేహపురవిషయకచింత. రెండవది, దేహాభిమానముచే విష
భోగవాసనా చింత; మూడవది, కర్మకాండము యొక్క
బహిర్ముఖత్వచింత; నాలవది, బహుకష్టముతోఁగూర్చిన ప్రా
మయకోశము వ్యయమగుచున్నదను చింత; బుద్ధిమయకో
మందుఁ జేరు భాగ్యమబ్బిన సాధకుల కీ చింతలు క
స్వాభావికములు.

## మనుష్యుఁడు శరణాగతుఁడు కావలయును.

మనుజుఁడు తా నేయుద్దేశ్యముతో నేకార్యమందు నియు
డయ్యెనో, యతని యా కార్యము నిందితమేకా
ప్రశంసనీయమేకానీ, యే యవస్థయేకానీ యటు లేయు
భగవంతునకు శరణాగతుఁడు కావలయును. సర్వవిధముల నా
చరణముల నాశ్రయించియే కర్మక్షేత్రమందు ముందడు
వేసినచోఁ గర్మశక్తి యినుమడించును. చిత్తమొక విధమైన శాంతి
వెలయును. సాగుచున్న ప్రత్యేకావస్థయందును జీవన సార్థకత

ధ్యానించుచున్నచో భూతభవిష్యదవస్థల సార్థకత తనంతనేవచ్చును. "అంతిమ జీవనమందుఁ గర్మావకాశమును బట్టి భగవదాశ్రయము నొందుదుము." అనునది సోమరుల మనోవినోదము మాత్రమే. "నిశ్చయముగా నీవే నా ప్రాపు; నీవే నా కత్యంత సుహృదుఁడవు" అనుచు, నాతని యుబును నీ మనసునకుఁ దట్టిన ప్రతి ముహూర్తమందును అతని సన్నిధిని నీ సుఖము, దుఃఖము, పాపము, గ్లాని మున్నగునవి సరళప్రాణముతో నిష్కపటముగ నివేదింపుము. అపుడేదో నీకుఁ దెలియని యొకశక్తి నీ వర్ణాశ్రమ ధర్మ ప్రతిపాదనము చేయించు చున్నదని కనుగొందువు. గీతయందలి యీ సుఖమధుర స్నేహమయాశ్వాస వాణిని స్మరించుకొమ్ము.

"అపిచేత్సు దురాచారో భజతే మామనన్యభాక్ ।
సాధురేవ సమంతవ్యః సమ్యగ్వ్యవసితో హి సః ॥ (6-30)

క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వచ్ఛాన్తిం నిగచ్ఛతి ।
కౌన్తేయ ప్రతిజానీహి నమేభక్తః ప్రణశ్యతి ॥" (6-31)

ఈ శ్లోకముల లఘువ్యాఖ్య - సుదురాచారి మనుష్యుఁడును నన్న నన్యభ క్తిని భజించినచో నతఁడు సాధువుగానే లెక్కింపఁబడును. ఏలన-వాఁడు మంచి యధ్యవసాయముతోఁ గూడినవాఁడు. సాధకా ! క్రియ యెడలక్ష్యముంచిన నేనాసక్తితోఁ జేయుచున్నానా ? యని నేనే చూచుకొనవలయును. విషయ మొకటి లేక యాచరణము జరుగదు; గాని విషయము మనకుఁ గడుదూరమునఁ బడియుండును. ఇదిగో, ఆ విషయమందే యాసక్తి యుంచి పలుజన్మములు రాగముతోనే మత్తెక్కి యున్నచో, నేను సుదురాచారుఁడను. ఏలన,

అది యతి చవలావస్థ. విషయాసక్తిని విడిచి కూటస్థు నందు నాలక్ష్యముంచి సూక్ష్మశ్వాసమునం దాసక్తి యుంచి ధారణయందు నిల్వఁగల్గితినా - అపుడే నేను నేనై యుందును. అదే, దానిపేరే ఆత్మనిష్ఠ.

సుదురాచారుఁడును (అజామిళుఁడు, భిక్షువు, గజము, గణిక) నన్ను భజించి వడిగా ధర్మాత్ముఁడగును. నిత్యశాన్తి నొందును. అర్జునా ! నాభక్తుఁడు చెడఁడు.

ఆత్మనిష్ఠా సుఖము నొకసారి యనుభవించినవాఁడు మరల దాని ననుభవించుటకై తప్పక వ్యాకులపడుచుండును. ఆ వ్యాకులత, ఆ సుఖము నొందుటకే వానిచేతఁ బ్రయత్నము చేయించుచుండును. దానివలన సుఖము నొందును. ఈ తీరున మాటిమాటికి వ్యాకులతయు, మాటిమాటికి సుఖమునొందు నలవాటునుగాఢమైనపుడు శబ్దస్పర్శ రూప రస గంధములనెడి విషయములయెడఁ దప్పి తొలఁగిపోవును. చరణము (నడచుట, తిరుగుట సంకల్ప వికల్పములనెడి యంతఃకరణ ధర్మము విడిపోవును. ధారణ వచ్చిపడును. ఈ ధారణయే ధర్మము. అట్టి ధర్మమందే చిత్తము కట్టుపడును. మఱి రెండవదానిని గ్రహింప నొల్లదు. కనుకనే యీ యవస్థ శాశ్వతశాంతికి వాసభూమి.

అనన్యభాక్ - అనన్యభక్తుఁడగుటచే, ఆ శాశ్వతశాన్తి భూమికి బోవుటగును. అతనికి వినాశము లేదు. అనఁగా విష యాసక్తిచే మోహితుఁడై మాటిమాటికి జన్మమరణముల ననుభవించు బాధ యుండదు.

సాధకుఁడా ! ఇపుడు నీవు, అజ్ఞాచక్రమునకు లేచి నిల్చి, యుపాసనచేఁ బ్రత్యక్ష జ్ఞానాకర్షణమందు (జ్ఞానానుభవము నందు) సమర్థుఁడవై 'కౌంతేయ' పదవాచ్యుఁడవై పొమ్ము. ఇపుడు నీవు ప్రతిజ్ఞచేసి, ప్రతిజ్ఞ = తెలిసికొను వస్తువు - 'నేను'. ప్రతిజ్ఞ + అ = ఆసక్తి, అనఁగా - తెలిసికొనువస్తువైన 'నేను' నెడఁ బ్రత్యాసక్తి యుంచి, యా 'నేను' నకు భక్తుఁడ వౌదు వేని, మఱి వినాశము రాదు.

## తన్మయత

కొన్నాళ్లు బుద్ధిమయక్షేత్రమునకు రాకపోక లగుచుండుటచే మెల్లమెల్లగా నొక తన్మయత వచ్చును. మనోవిమోహనమైన బుద్ధిజ్యోతికిఁబైని, ఆత్మప్రతిబింబ మించుక యాభాసింప, క్షణమాత్రము ముగ్ధుఁడై యుండును. అపుడు కొంచె కొంచెము తన్మయత వచ్చును. ఆ తన్మయతా స్వరూప మేమియో తెలిసికొను పట్టుదల గలుగును. ఈ తన్మయత నొందుటకే సాధకుఁడు పలువిధముల యోగకౌశలమును, గఠోరాభ్యాసమును జేసినను గోర్కి నెఱవేఱదు. తాను బిలు వకయే యుపస్థితమగు దానియెడ జీవుఁడు మొదట ధారణయే చేయలేఁడు. కనుక దాని పరిచయమునకై వ్యగ్రుఁడగును ఈ యవస్థ, అపూర్వానందకరమైనను, విషయమాలిన్యము వీడలేదు గాన జీవభావీయ సీమయందు బద్ధుఁడై యుండి దుఃఖ శోకాకులుఁ డగుచుండును.

'ఏమిది ? బోధపడకున్నదే,' యని కొట్టుకొనును. అపుడమ్మయే దయచేసి జీవుని సర్వసంశయములను దొలఁగిం

చును. అపుడు తన్మయతతోడి పరిచయము బలపడును. అది సుఖదాయక మగుటచే మఱిమఱి దానినే యనుభవించు వాసన యుదయించును దానితోనే పరమాత్మీయభావము హృదయమున బొడమును.

## ఇదే సమాధి పరిచయము.

అనేక జన్మసంచిత పుణ్యకర్మ ఫలముగా జీవునకు సమాధిస్థితి లభించును. జాగ్రత్ స్వప్న సుషుప్తులనెడి మూడవ స్థలును, సాధారణముగా జీవు లనుభవించుచున్నవే. ఇవి గాక మఱియొకటి "తురీయము, సమాధి" యనియుఁ గలదు. దీనిని సాక్షాత్కరించుకొని ధన్యులగు జీవులు కొందఱు మాత్రమే.

మనో బుద్ధి చిత్తాహంకారములు, పంచజ్ఞానేంద్రియములు, పంచకర్మేంద్రియములు తమతమ పనులు చేయుచుండు నవస్థయే జాగ్రదవస్థ. మనో బుద్ధి చిత్తాహంకారము లనెడి యంతఃకరణ చతుష్టయము మాత్రమే క్రియాశీలమై యుండి తక్కి దశేంద్రియములు నిష్క్రియములై యుండు నవస్థయే స్వప్నావస్థ ఈ పదునాల్గును నిష్క్రియములై యుండునదియే సుప్తావస్థ. ఈ యవస్థయందు మనము మనవఱకు మఱచి పోదుము. అపుడు జాగ్రద్ జ్ఞానము - 'నేనున్నాను' అను తెలివిసైతము ప్రత్యక్షము కాదు. ఇది తఱచుగా మృతవదవస్థ యనఁబడును, గాని సమాధ్యవస్థయం దిట్లుకాదు. జగద్ జ్ఞానము లేకున్నను, ఆత్మసత్త మేల్కొనియే యుండును. అనఁగా జగద్భావము నిద్రితము, ఆత్మభావము జాగరితము. దీనిపేరే సమాధి, బుద్ధియోగఫలముగా చైతన్యమయ మహా కాశమండలమందు నిల్చు నభ్యాసమైన తర్వాత

నీ యవస్థ తనంతనే సిద్ధమగును ఇదే, ఆత్మరాజ్యమందు - అమ్మయొడి యందుఁ జేరుటకైన ప్రవేశద్వారము. మాతృస్నేహరసముచే నభిషిక్తుఁడై, పుష్కలభక్తి ధనవంతుఁడై, సద్గురు నపారకృపా ధనముచే జ్ఞానవంతుఁడై, సత్యప్రతిష్ఠావటుశక్తిచే వీర్యవంతుఁడై, బుద్ధియుక్త కర్మఫలముచేతను, జిన్మయ జ్యోతిర్ధ నముచేతను ధనవంతుఁడైన వానియందే యీ సమాధి ప్రకాశించును.

## సమాధి

అష్టాంగయోగము యొక్క తుదియంశము యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధారణా, ధ్యానములు, సమాధి - యివి యోగశాస్త్రమందుఁ జెప్పబడిన యెనిమిది యోగాంగములు. ఇవి కేవల భగవత్ప్రాప్తిపక్షమందే యుపయోగులు అనుమాట లేదు. యోగమనునది లేక యెట్టి జగత్కార్యమును సిద్ధము కానేరదు. యోగమనఁగాఁ జేరు కొనుట - మిలనము. ఒకదానితో నొకటి చేరుట యోగము. ఇంద్రియములతో విషయములే యనుము;మనసుతో బుద్ధియే యనుము. బుద్ధితో నాత్మయే యనుము, ప్రత్యగాత్మతోఁ బరమాత్మయే యనుము; భక్తునితో భగవంతుఁ డనుము; అమ్మతో బిడ్డలనుము. ఈ చేరుట యనునదంతయు యోగపద వాచ్యమే. ఆ యోగము యమ నియమాదులైన యెన్మిది యంగముల మొత్తమే.

విషయేంద్రియ సంయోగము పేరు కర్మము, కనుక కర్మ
యోగము. జీవుఁడే యోగి. మహాయోగిని యోగ మాయ మ
యమ్మ కల్పించిన ప్రత్యేక పరమాణువును నిమ్మహాయోగము
సదా కూడుకొన్నదే. మహాయోగి యైన మహేశ్వరుని హృదయమం
విహరించు యోగేశ్వరితో యోగచ్యుతి (వియోగము) అన
సంబంధవిలోప మగునేని, ఆకాశమందలి పరమాణువు పర్యంత
నిలువఁ జాలదు. అంతయుఁ జక్కఁగా నమ్మలోఁ జేరిపోవునపు
మహాముక్తియందే యీ యోగమునకు సమాప్తి. కద
యేయుగమందుఁ బ్రథమచైతన్యప్రకాశమైన యేనాఁడీ యో
మారంభమయ్యెనో, యది యిఁక నెపుడు సమాప్తమగు
యోగరాజ్ఞి మన యమ్మకుఁదక్క నితరుల కెవ్వరికిం దెలియదు

మన మిపుడు కర్మమాత్రమందే యోగమగుననుట యెటు
తెలియవలయును. నీవు భోజనము చేయుచున్నా వనుకో, అపు
నీ మనసును దక్కిన కార్యములతో నీ యక్క అనుబట్టి కొంచె
సంయతము చేయవలసివచ్చును. దీనిపేరే యమము.

కాలుసేతులు కడిగికొనుట, ఆహారముకడఁ గూర్చుం
యన్నాదుల నిటునటు నర్దుట మున్నగు కొన్ని యావశ్య
నియమముల నవలంబించుటపేరే నియమము.

ఏవిధముగాఁ గూర్చున్నచో నీ భోజనము సుఖముగా నగు
యటులు కురుచుండుటే యాసనము. పరుగిడుచున
బండుకొనియు నుండునపుడు వలెనే నీ యంగవిన్యాసమైన

నీ భోజనము సరిగా జరుగదు. ఏ పని చేయునపుడు నీ శరీరమెట్టి న్యాసాకృతునుంచిన నీ పని సుగముగా సాగుటకగునో, యా విధమున నుంచుటే, యా పని కుపయుక్తమగు నాసనము.

తరువాతిది ప్రాణాయామము. ప్రాణముయొక్క ఆయామము = విస్తారము. దీని తత్త్వము మున్ముందు వ్రాయఁ బడును. సాధారణముగా శ్వాసప్రశ్వాసముల నిరోధము, సంయమ మని తెలియవలయును. వేర్వేఱు కార్యములయందు మన శ్వాసగతి పరిణామమాత్రలు హెచ్చుదగ్గ లగుచుండును. అనఁగా విస్తరించుట, తగ్గుచుండుట యగుచుండును. ఏ కార్యమందుఁ బ్రాణప్రసారమగునో, ఆ కార్యము చేయునపు డది మృదుభావము నొందును. ఏ పనియందుఁ బ్రాణము సంకుచిత మగునో, ఆపని చేయునపుడు శ్వాసగతి తీవ్రమగును. శ్వాసప్రశ్వాసగతి యధికమగుటే - నిడుసాగుటే మానవుని లక్ష్యముగాఁ బ్రాణాయామసాధకుఁడు - ఏ పనియందుఁ బ్రాణమెంతదూరము సంకోచ ప్రసారముల నొందుచున్నదో, యది లక్ష్యమం దుంచుకొనవలయును. దానిని లక్షించియే పూర్వాచార్యులు పుణ్య పాప, విధినిషేధ వ్యవస్థచేసిరి. ఎట్టి పనియందుఁ బ్రాణము స్వభావముగాఁ బ్రసారితమగునో, యది శాస్త్రములందుఁ బుణ్యముగా వర్ణింపఁబడినది. ఇదె విధినిరూపిత కర్మము. ఏ పని చేయుటచేతఁ బ్రాణము సంకుచితమగునో, (అనఁగా వడివడి నడుచునో) దానిని శాస్త్రకారులు పాపకర్మ మనిరి. పాపపుణ్యములు విధినిషేధములు, నీ ప్రాణాయామ తత్త్వముపై నాధారపడి యున్నవి. ఇదంతయు సాధారణ కార్యములందలి ప్రాణాయామ విషయము. ప్రత్యేక ప్రాణాయామ క్రియను జరుపుదు

మనువారుప్రాణమును గుంభించు కాలమును గ్రమక్రమముగ నధికము చేసినచోఁ బ్రాణశక్తి ప్రత్యేక దేహాణువునందును విస్తరించును. ఇది బహూపకారక ప్రయత్నమే. ఇదె చిత్తవృత్తులను గొంతవఱకు నిరోధింపఁ దోడ్పడును. శ్రీశంకరాచార్యులు ప్రాణాయామ క్రియ యందలి పూరణ కుంభన రేచనము లనెడి మూడంగములలోఁ గుంభకమునకే ప్రాధాన్యమిచ్చి యాక్రియను "తస్యైనమః కుంభక దేవతాయై" యనుచుఁ గొన్నిశ్లోకములతోఁ గీర్తించిరి. కుంభనస్థితియే ప్రాణాయామమందు ముఖ్యము. అగస్త్యునకు కుంభసంభవుఁడని పేరు. "కుంభే సమ్యగ్భవతి తిష్ఠతి, ఇతి కుంభసంభవః" కుంభన స్థితియందుఁ జక్కగా జాలసేపు నిల్వఁగలవాఁడని భావము. కనుకనే యోగముతోఁ బ్ర సంబంధము నొంది, కుండలినీ సంచారముతోఁ బూర్ణపరిచయము గల్గినపుడే, శ్రీఘ్రముగా సిద్ధించు సౌభాగ్య శ్రీవిద్యను హయగ్రీవ దేవుఁడు, కుంభసంభవుఁడైన యగస్త్యునకే సమగ్రముగా నిచ్చెను కడవయందుఁ బుట్టినవాఁడు కుంభసంభవుఁ డనునది పౌరాణిక కథాజన్యార్థము. అది యుండనిండు.

ఇపుడు ప్రస్తావింపఁబడిన యాహారకార్యమందు సైతము స్వాభావిక ప్రాణాయామము, శ్వాసప్రశ్వాసగతి తారతమ్యమును నిత్యసిద్ధములు.

తరువాతిది ప్రత్యాహారము - ఇంద్రియవృత్తుల నన్ని విషయములవలన నడ్డగించి యభీష్టకార్యమందుఁ దగుల్చుట ప్రత్యాహారము. ఆహారకార్యము పూర్ణమగునంతకును బ్రత్యాహార మెంతో యావశ్యకము.

తరువాతది ధారణ - ఆహారమువలని తృప్తి - క్షుధా నివృత్తివైపు చిత్తము ధరించియుంతువు అది ధారణ. కనుక ఆఁకలి తీఱి తృప్తి గలిగినపైని నీ భోజనకార్యము ముగిసినట్లగును. ఇటులు భోజనవిషయకమైన కొంత ధ్యానము (చింతయు) మఱి దానికై యల్పక్షణస్థాయియైన సమాధియు నగుచున్నది. క్షణకాలము మనస్సు, ఆజ్ఞాచక్రమును దాకి వచ్చుచున్నది. దాని ఫలముగానే భోజనకార్యము నెఱవేఱుచున్నది. ఈ విధముగా నంతటను నని తెలియునది. మన సర్వకార్యములందును మనకుఁ దెలియకయే యీ యష్టాంగయోగ సాధనమగుచున్నది. సాంసారిక కార్యములందిట్టి యభ్యాసమై పోయినది. ప్రత్యేక కార్యమందును నింత కాండము నడచుచున్నది; దానియెడ మనము లక్ష్యము నిల్పకున్నను, ఈ యెనిమిదంగములు నొకదాని వెనుక నొకటి సిద్ధమగుచునే యున్నవి. శతపద్మపత్రభేద న్యాయముగా, నివి యొక్క ప్రయత్నముచేతనే ఒక్కసారిగా సిద్ధమగుచున్నవని యెఱుంగునది.

(నూఱు తామర రేకులను దొంతిపెట్టి నూది గ్రుచ్చునపుడు, అన్నిటి నొక్కసారి భేదించితి మనుకొందుము, గాని వాస్తవముగా నవి యొకదాని వెనుక నొకటిగానే వేధింపఁబడినవి. ఇదె శతపద్మపత్ర వేధన్యాయము)

సమాధియనునది లేక, యేపనియు సిద్ధముకాఁజాలదు. మనసు బుద్ధియందు (నిశ్చయాత్మిక వృత్తియందు) లెస్సగా నిల్పఁబడినపుడే సమాధి యగును. నీ కాలిలో నొక ముల్లు గ్రుచ్చుకొన్నది. ఇంద్రియములు ఆ పనిని మన మనస్సునకుఁ గొనిపోవును గాని, అది యేమిటో మనసు చెప్పలేదు; కనుక నది

మఱల దానిని బుద్ధియెదుటఁ బెట్టును. ఈ బుద్ధి చెంతఁ బెట్టుట పేరే సమాధి. ఇప్పుడు మనస్సు ఆజ్ఞాచక్రమందు బుద్ధితోఁ జేరును. అపుడు బుద్ధి "దాని పేరు కణ్టకవేధము - ముల్లు గ్రుచ్చుకొనుట, దానివలనఁ గొంచెము నొప్పిగల్గును" అని చెప్పివేయును. అప్పుడే మనస్సు 'ఉస్ - అబ్బా ! చాల నొప్పి అనుచు, ములు గ్రుచ్చుకొనుటవల్లనైన యాతన ననుభవించును. ఇటులే సర్వత్ర యగును. ఈ మనోబుద్ధుల మిలన మనెడి సమాధి సాంసారికకార్యములకెల్ల మూలము. ఇట్టి సమాధిని జీవుఁడు రేవగళుల నొందుచునే యున్నాడు. కనుక దాని కంగభూతమైన యమ నియమా ద్యష్టాంగయోగము స్వభావముగానే సిద్ధము.అయిన నిట్టి సమాధి సమాధికాదు. ఏలన మనస్సు సంస్కారములపైనే నిర్భరమైనది.

వాస్తవిక సమాధి ప్రజ్ఞతో మనసుచేరుట. "ప్రజ్ఞానం బ్రహ్మ ' యనెడి ఋగ్వేదీయ మహావాక్యమును బట్టి ప్రజ్ఞానమే బ్రహ్మము. మనస్సు ప్రజ్ఞానాకారము నొందినపుడే యథార్థసమాధియగును. ఇది తొల్త జ్ఞాత, జ్ఞానము, జ్ఞేయముమనెడి త్రిపుటితో ఁగూడి సంకల్ప వికల్పభావముతో నావిర్భవించును. మఱల శ్రీమాతృకృపచేతను, అభ్యాసబలము చేతను, నిర్వికల్ప త్రిపుటీరహితమైన కేవల విశుద్ధబోధముగా మాఱును. దీనిపేరే 'అసంప్రజ్ఞాత సమాధి'.

సమాధియే మాతృమిలనద్వారము. అఖండ చిత్సముద్రము తోడఁ గల్పిత జీవభావమునొందిన పరిచ్ఛిన్న చైతన్యము చేరిపోవుటకైన ప్రణాళియే సమాధి. చైతన్య జీవునందు సదా దీని యావిర్భావతిరోధానము లగుచున్నను, దాని ననుభవింపఁజాలనంతదాఁక

జీవుఁడు జనన మరణ శోక దుఃఖ కష్ట తాపముల చేతినుండి తప్పుకొనలేఁడు - మన యమ్మయే సమాధిరూపమున వెలసి తన నెయ్యపు బిడ్డలైన జీవులను దయఁదలఁచి యాత్మ సముద్రమందుఁ జేర్చి వేయును. (దేహాత్మ బుద్ధిని మఱపించివేయును.) మనుష్యజీవనమున కిదే చరమ పరమ కృతార్థత.

ఈ సమాధి మొట్ట మొదట మలినభావముతో నుండును. ఇంతకాలమును సమాధి యననేమో తెలియని సురథజీవుఁడు అమ్మ కృపచే నిపుడు సౌభాగ్యఫలముగా సమాధి పరిచయ మొకసారి కాఁగానే, యది మలినభావాపన్న మే కానిమ్ము; మలినత తెగిపోయి, విశోకుఁడగును. దుర్మనస్సు సుమనస్సయి పోవును. యమనియమాద్యంగ ములతర్వాత బూర్వ పూర్వా వస్థల పరిపాకము క్రమముగా నగును. అనఁగా 'యమ' అనుష్ఠానము పూర్తిగా సిద్ధింపఁగా నియమము సిద్ధమగును; నియమసిద్ధి యైనంతనే, ఆసనానుష్ఠాన సమయమగును. ఈ విధమున వరుసగా ధారణాభ్యానమైన తర్వాత ధ్యానమును, ఆ ధ్యానము గంభీరమైనపయిని సమాధియు వచ్చును అని తలంతురు కాని, వాస్తవముగా నటులుకాదు. సమాధిస్థితి వచ్చునపుడే తక్కిన యోగాంగములు తమ కుఁదావే సిద్ధమగును. సమాధి నిత్యసిద్ధవస్తువు. ధ్యానమువలన సమాధి రాదు. సమాధి వచ్చినపైనే ధ్యానము సిద్ధమగును. అంధకారము పోయిన తర్వాత సూర్యోదయము కాదు. సూర్యోదయమైన తర్వాతనే చీఁకటి తొలఁగును. సృష్టివలెనే యను లోమక్రమముగానే ప్రలయమును సిద్ధమగును. ప్రకృతివలన మహత్తు, మహత్తు వలన అహంకారము,

అహంకారమువలనఁ బంచతన్మాత్రలు, పంచతన్మాత్రలవలనఁ బంచమహాభూతములు నీ యనులోమక్రమముగా సృష్టి యగును. ముక్తి (ప్రలయసమయ) యందును సూక్ష్మదృష్టితోఁ జూడఁగా నీ యనులోమక్రమమే కానఁబడును. మఱి నేను బరిణామము నొందను." అని ప్రకృతి తలంచినంతనే, మీదినుండియే లాగుట యారంభమగును. అనఁగాఁ బ్రకృతి మహతత్త్వమందు విలీనము కాఁ బ్రయత్నించును; మహత్తు అహంకారమును లాగును; అహంకారము పంచతన్మాత్రలను, పంచతన్మాత్రలు పంచమహాభూతములను నీ విధముగా నాకర్షణము అనులోమ విధితోనే యగును, గాని వెలికి విలోమగతియే తోఁచును "క్రిందినుండియే ప్రలయ మారంభమగు" ననుకొందురు. అనఁగా బంచమహాభూతములు పంచతన్మాత్రలందుఁ బ్రవేశించుననియు పంచతన్మాత్ర లహంకారమునందును, అహంకారము మహత్తునందును, మహత్తు ప్రకృతియందును సమాప్తమగుననియు నీ విధముగానే ప్రకృతి పురుషునందును విలీనమై పోవుననియు దోఁచును. ఇటులు తోఁచు విలోమగతి యంత ర్నిహితమైన యనులోమగతియొక్క బహిర్వికాసమే. ఫల మాత్రమే. పోటువేళ సముద్రజలము, నదులు శాఖానదులు మున్నగువానిలోఁ బ్రవేశించి వాని కలేబరములను బోషించి, మఱలఁ బాటువేళ సముద్రాకర్షణముచే నదీనాళాదుల జలము సముద్రము వంకకు బోవునట్లు కానవచ్చును. ముందుగా సముద్రమందుఁ బాటు లాగుట యగును. దీనిచే నదీ నాళాదుల నీరు సముద్రమువంకకు వడిఁబోవ మొదలిడును. సమాధి మున్నగు యోగాంగముల

నిట్టులే యని యెఱుంగునది. అనులోమగతియే జగత్తునందు సర్వత్ర యగుచున్నది. సమాధి వల్లనే ధ్యానము, ధ్యానమువలన ధారణము, ధారణమువలనఁ బ్రత్యాహారము నీ విధముగానే తక్కుయోగాంగములు నని యెఱుంగునది. యోగశాస్త్రమం దీ క్రమము సరిగాఁ జెప్పఁ బడకున్నను, సాధకులు క్రిందినుండియే మీదికిఁ బోవుటకై ప్రయత్నింతురు. అయినను జక్షుష్మంతులైనవారు కొంచెము ధీరముగాఁ బర్యాలోచించి యెఱుంగఁదగును. సమాధి యొక నిత్యసిద్ధవస్తువు - అవస్థ. అది సర్వకాలములందును సమభావముతో నుండును. అది ధ్యానధారణములవలనఁ బుట్టునది కాదు; సరిగదా ధ్యానధారణాదులే సర్వవిధముల సమాధి కనుగాములు. సమాధ్యవస్థ యుదయించినంతనే, యదే యమ నియమా ద్యాకారమున వెలయుచుండును. సాధారణముగా జీవులు దీని ననుభవింపఁజాలమిచే, సాధనగతిని క్రిందినుండి మీదికి నడుపుటకే యారంభింతురు, గాని చెప్పరాని శ్రమ నొందియు యథార్థాత్మ స్వరూపము నెఱుంగఁజాలక హతాశులై పోవుచున్నారు.

సాధకా ! చూ[illegible]వా; నీవు తొల్త యమమును సాధింపవలయును. బ్రహ్మచర్యము, అహింస, సత్యము, అస్తేయము, అపరిగ్రహము ననువానినే యమమందురు. వీనిలో నొక్కొక్క దానినే సాధించుకొని వచ్చుసరి కెన్నో యేండ్లు పట్టును. ఈ విధముగాఁ బ్రత్యేకాంగమును, వాని ప్రత్యంగములను సాధించి సిద్ధినొంది, సమాధినిజేరి పరమాత్మసాక్షాత్కారము నొందుటకు, ఎంత దార్ఢ్యము, ఎంత సహిష్ణుత యుండవలయునో, ఎంత

కాలము పట్టునో, వర్తమాన యుగమందెంత దుర్లభమో యోచింపుము. తొంటి యుగములందు జీవులకు సాగెడిశక్తి యుండెడిది, గాన సాగఁగల్గెడివారు. కాని సాధనమార్గమందు బొత్తిగా సాగలేని సొట్టలే యీ యుగమందలివారు. మార్గమును జూచి నిశ్చింతముగాఁ గూర్చున్నచోఁ గార్యము సఫల మెట్లగును ? ఇపుడు మనము, మన యమ్మ యస్తిత్వమందు నమ్మకము లేనివారము గనుకఁ బూర్తిగా సాగలేకున్నాము. శక్తిహీనుల మైపోయినాము. ఇపుడు యోగాంగానుష్ఠాన మందు అసహిష్ణుతయా ? ఈ యుగ మం దమ్మ తానే వచ్చి తన సంతానమును నడిపించుకొని పోవును. కాలమెంత కఠోరము కానీ, అంధకార మెంతగా నల్లుకొననీ; పుత్రవత్సల మన యమ్మ తన కరుణాతరంగముల నుప్పొంగించును. జగత్తును దయతో ముంచివేయును. ఇదె మనతల్లి మాతృత్వము. కేవలము, అమ్మ యస్తిత్వమందు నమ్మకమును వీడకు. "అమ్మా ! నీవు మా కన్నతల్లివి మేము నీ బిడ్డలము." అనుచు నిష్కలంకప్రాణముతో నుండుము. నీ మాటలందెల్ల "అమ్మ సత్యముగా నున్నది. మన మంగళ సాధనములందెల్ల నామె యుత్కంఠితయై యున్నది." అనుచు నిమ్మాటను నీ హృదయ ఫలక మందుఁ బెద్ద యక్షరములతో వ్రాసి యుంచుకొమ్ము. నీ సమాధి తనంతనే నీ చెంతకు వచ్చుటను నీవు కనుగొందువు. నీ యష్టాంగయోగము నీకుఁదెలియకయే సిద్ధమగును. జాలితో "అమ్మా ! నీవు సర్వత్ర సర్వభావములలో వెలయుచున్నావు. మఱి నే నెందుకు నమ్మను ?" నీ యసామర్థ్యము మూలమందును నీవే యున్నావు. మమ్ముల నీ యవిశ్వాసాంధకారమునం దేల ముంచియుంచెదవు ? ఒక్కసారి

నా తెలివికన్ను విప్పుము. ఒక్కసారి మాత్రమే. ముల్లోకములందు వ్యాపించియున్న నీ స్నేహరసము నాస్వాదించు సుయోగము నిమ్ము. దానితో నేను "అమ్మా ! యనుచు ధన్యుఁడ నగుదును. తాపత్రయ శోషితమైన ప్రాణము సరసమగును." అని యేడ్చు చుండుము; అమ్మకు నివేదింపుము. అపుడు నీ విశ్వాసము స్థిరపడును. అపుడు సమాధిసంధానము నీవు చేయకున్నను, అది తానేవచ్చి సిద్ధ మగుట నీవే కనుగొందువు. బుద్ధియోగఫలముగా సమాధి సాక్షాత్కారము నొంది ధన్యుఁడ వగుదువు.

సాధకా ! ధన మనఁగా రూపరసాది విషయగతమైన యైశ్వర్యమే. ఈశోపనిషత్తునందు "మాగృధః కస్య చిద్ధనమ్" విషయగత ధనగ్రహణము చేయకుము. అనఁగా విషయత్వ మందు ముగ్ధుడవు కాకుము. ధారణా ధ్యానాదు లెవ్వడును విషయాభిముఖిత్వమును విడువఁజాలవు. మన ప్రత్యేక కార్యమందును సమాధి (అష్టాంగయోగము) సిద్ధమగునని మును జెప్పితిని. సాధకుఁ డొందెడి సమాధి నిత్యసిద్ధము. రేవగళ్లు నుండునది. గాన విషయలోలములైన ధ్యాన ధారణాదులచే దెబ్బతిన్న మనుజుఁడు రేవగళ్లు విషయములనే ధ్యానించును. విషయధారణమందే యలవాటుపడినవాఁడు విషయభోగము నకే యింద్రియనిరోధమును జేయును. చేసెడి సాధనయంతయు రూపరసాది విషయసంబంధి ధనలోభముతో నే చేయును. సమాధియో అతినిర్మలము. అది సర్వదా ప్రజ్ఞతోఁ జేరియుండును గాన నది సుఖవంతము. సమాధి కీ స్వాభావికమైన యీ యుచ్చస్థితిరానంతదాఁక ధ్యానధారణాదులనుదనుపుట కే లాలా

యితుఁ డగుచుండును. ఏ రూపరసాదుల వంటి యోగాంగము లుండునో, వానినే సమాధి బయల్పెట్టును. సమాధిలేకున్నచో విషయములు ప్రకాశింపవు. ఈ విధముగాఁ బలునాల్లు ధ్యాన ధారణాదులను బోషించినను సమాధికోరిక నెఱవేఱకపోఁగా నప్పుడే విషయవిముఖుఁడై యొంటిగాఁ బ్రజ్ఞతోఁ జేరఁగోరును. గాని ధ్యానధారణాదులు తొల్లింటివలెనే యుండి విషయలోలుప తను వీడకుండుటచే సమాధి పరాజిత మగుచుండును. అవి సమాధియే తమ్మనుసరింపవలయునని కోరుచుండును. గాని సమాధి, యీ ధ్యానధారణాదులు నా కనుకూలములై భూమ సుఖము ననుగమింపవలయునని కోరుచుండును. ఒండొంటికిఁ గల్గు నీ విరుద్ధభావమే కారణముగా ధ్యాన ధారణాదులచే సమాధికిఁ బరాజయమగుచుండును. అవి సమాధి కంగములే యైనను నిష డవి స్వాధీనములు బలవంతములునై నిల్చినవి. బహుకాలము అహంకారముతో డి జీవభావముతో నుండుటచే "నాకు మఱెవ్వరు సాటి" యను నహంకారము ప్రత్యేకము నకుం గల్గినది. ఇపుడు దేనికదే స్వతంత్రము కాఁగోరుచున్నది. గాన సమాధిని విడఁగొట్టఁజూచినవి. అసలుమాట యేమనఁగా, బుద్ధిమయ క్షేత్రమందు నిల్చి కొంచెకొంచెము తన్మయత గలుగునంతదాఁక విషయసంస్కారములు తొలఁగవు. గనుక, సమాధి నిర్మలమును దీర్ఘకాలస్థాయియుఁ గాదు.

ప్రత్యేక జీవుని హృదయమందును నిట్టి సంఘటనము లగుచునే యుండును. వ్యష్టియం దగునదియే సమష్టియందును

నగును. మన యమ్మ ప్రత్యేకజీవుని హృదయమందును, ఏ భావముతో నావిర్భవించి వానిని ముక్తిమందిరమునకుఁ గొని పోవునో, యే సాధకుని హృదయమందు గుప్తముగా వెలయునో, యట్టి ప్రకాశ్యభావముతోనే వెలసి ముక్తిమందిరమునకుఁ గొనిపోవును. ఏ సాధకుని హృదయమందు గుప్తముగా సంఘటితయగునో, వాని నా ప్రకాశ్యభావముతో ముస్తాబు చేయుటకు, మన యమ్మ ధరపైని విశిష్టభావముతో నవతరించును. ఈ విధముగా సురథుఁడైన సాధకునకు సమాధిపరిచయ మగుచుండును.

## ఆనందమే యట్టి సాధకుని ధనము.

ఆనందమే లబ్ధసమాధియైనవాని ధనము, ధ్యాన ధారణాది యోగాంగములు ఆ ధనమును లాగికొన్నవి. జీవులు ప్రత్యేకకర్మమందును నెల్లపుడు నీ యష్టాంగయోగానుష్ఠానము చేయుచున్నారు. అది విషయేంద్రియ సంయోగ కారణమున మఱుఁగుపడిన యానందము నుద్దేశించియే చేయఁబడు చున్నది. ఆ గుప్తానందము యథార్థసమాధిచే నగు నానందసిం ధువునందొక బిందుమాత్రమే. బ్రహ్మ మొదలుకొని చీమ వఱకు నెల్లజీవులు, ఆనందమును వెదకుచున్నవే. జీవసమూహము కేవల కామనా కాంచనాదులకైన యాశతోనే పిచ్చి యెత్తినట్లు గ్రుడ్డిదానివలె దిక్కు తెలియక జ్ఞానహీనమై పరువెత్తుచున్నది. దాని యుద్దేశ్యము అత్యల్పానందము మాత్రమే. ధార్మికులు ధర్మమాచరించి యానందించుచున్నారు. పాపులు నింద్యకర్మములను జేసి యానందించుచున్నారు. ఆనందాంశ మం దిరువురును సమానులే.

కారణమేమన, ఆనందమే బ్రహ్మము. ఆనందమే అమ్మ - సచ్చిదానందమయి యయిన యమ్మయొక్క సత్ స్వరూపము విశిష్టభావముతో జడపదార్థముల యం దుదితమగు చున్నది. సత్స్వరూప యమ్మ తా నెట్టిదో చక్కఁగా మనకు దెలియఁజెప్పుటకై ఇక్కానవచ్చు జడపదార్థములందు సదా వెలయును. మనయమ్మ చిన్మయి. అమ్మాట చక్కఁగా దెలియఁ జెప్పుటకై యామె ప్రాణిరూపముతో సర్వత్ర కనఁబడును. మనము ప్రాణులందుఁ జైతన్యసత్త యొక్క విశేషవికాసమును గనుచున్నాము. మఱి యానంద ధర్మమును విశేషించి వానియందే తోఁచుచున్నది. (తెలియఁబడుచున్నది.) ఆనందము మఱెక్కడను లేదు. అమ్మ యొక్కతెయే యానందఘనమూర్తితో సదా సర్వత్ర వెలయు చున్నది. ప్రత్యేక జీవునియందును గానవచ్చు విషయభోగ జనితానందము, ఆ యానందసముద్రమందలి యొక్కొక్క బుడగయే. ఈ యానందమును జీవుఁడెటులు భోగించుచున్నాఁడు?

## ఆనందము విభిన్నముగాఁ దోఁచుటేల ?

మనము కోరికొన్న వస్తువును సంగ్రహించుటకు జతనము చేయుదుము. అపుడు మన యింద్రియములను మనస్సును దానిని గూర్చి ప్రేరితము లగును. అట్టివేళ బుద్ధియు నానంద సముద్రమునఁ బడిపోయి విషయాభిముఖి యగును. మఱి మన ప్రయత్నము సఫలమగునపుడు - అనఁగా, అభీష్టవస్తువు లభించి నపుడు క్షణకాలమాత్రము ఇంద్రియములు, మనస్సు, బుద్ధియు స్థిరముగా నుండును. అపుడే యానందప్రతిబింబము బుద్ధి యందుఁ బ్రకాశించును. కనుకనే యానందప్రాప్తి యగు చున్నది.

గాని మనము మన యభీష్టవస్తువే యానందము నిచ్చు చున్న దనుకొందుము. ఇదే యజ్ఞానము. విషయమం దానందము లేదు. దాని ఛాయ యెల్లపుడును బుద్ధిపైఁ బడును. బుద్ధి యా ప్రతిబింబమువంక లక్షింపక, విషయమువంకకు పరుగెత్తునపుడే మన మానందమునుండి విచ్యుతుల మగుదుము. మఱల బుద్ధి స్థిరపడునపు డా యానందము అనుభవింపఁదగి యుండును. ఇచ్చట "ఆనందమన్నది యొక యఖండస్వరూప మైనపుడు, వేర్వేఱు విషయములు ప్రాపించువేళ వేర్వేఱు తీరుల యానందము నేవిధముగా ననుభవింతుము ?" కాంచన లాభమునందగు నానాందానుభవమునకును, ఇంద్రియపరితృప్తి సాధనమందగు నానందానుభూతికిని భేద మెందులకుండును ? "ఒక పూవును జూచినప్పటి యానందమే, యొక సంగీతము వినునప్పు డెందులకుఁ బొందఁబడదు ?" అని శంకింపవచ్చును. దాని కుత్తర మిది - ఆనందవస్తు వొక్కటే, యఖండమే యైనను విషయేంద్రియ సంయోగ వైచిత్ర్యవశమున నది భిన్నభిన్నముగా ననుభవమునకు వచ్చును. మన యింద్రియములు విశేషభావముతో సంతుష్టము లగునపుడు, ఆయా యింద్రియములు తృప్తినొందుటకైన విభిన్నతయే, ఆనందము విభిన్నముగాఁ దోఁచుటకుఁ గారణము.

## ఆనందము లేమి యెక్కడను లేదు.

ఈ జగత్తు ఆనందముతో నిండియున్నది. ఆనందము నుండియే జీవులు పుట్టుట. ఆనందమువల్లనే సంజీవితము లగుట. ఆనందమందే యంత మొందుట. ఈ మోహనవాణినే ఋషులు

మాటిమాటికి వెల్లడించిరి. ఈ యుగమందుసైతము దీని జాడ నెఱింగినవారును ఈ యొక్కమాటనే ప్రతిధ్వనింపఁ జేయు చున్నారు. శోకార్తుని జాలితోడి యేడ్పు, క్షుదార్తుని యాఁకటి మొఱ్ఱ, వేయేల ? అన్నియు నానందమును వెల్లడించునవియే. మనుష్యుఁ డీ విధముగా నేడ్చి, యీవిధముగా హాహా కారములు చేసి, యానందము జాడనే కనుగొనుచున్నాఁడు. కనుకనే యిటులు చేయుచున్నాడు. చేఁదుమందు తినునపుడు నోరు విప్పకుండుట, మొగము చిట్లించుకొని పెడఁ ద్రిప్పు కొనుట మున్నగు నెన్ని విరక్తివికారములు కాన్పించినను, రోగి దానిలో నిమిడియున్న రోగహరణశక్తియనెడి యానంద రసముండుట నెఱుంగుటచేతనే యా చేఁదుమందు సేవించుటకు బాధ్యుఁడగుచున్నాఁడు. పుండుపుట్టిన యంగమందుఁ గత్తితోఁ జీల్చుటచే నగు నొప్పియందును, నొక సాటిలేని యానందము సంధానితమై యున్నది. రాముని వనవాసము, సీతాపహరణము, అభిమన్యు వధము మున్నగు కరుణరసోద్దీపకములగు ఘట్టములు చక్కగా నభినయింపఁబడునపుడు చూచిన సహృదయులు కన్నీళ్ళు కార్తురు. ఆరోదనమందును నానందాస్వాద మున్నది. కరుణయు నొకరసమే. 'రసో వైసః' రసస్వరూప మమ్మ యొక్కతే. ఆ రస (ఆనంద) ప్రవాహము కరుణాకారమున వెలయునపుడే, మనము దానిని దుఃఖమందుము. ఈ విధముగా మన యమ్మ యొక్కతే రసస్వరూప సదా శృంగార హాస్య వీర రౌద్రాది సర్వభావములతోను బ్రకటయై జీవులనెడి తన ప్రియసంతానమున కానంద రసాపానము చేయించుచుండును. పతివ్రతయైన సతియు, మరణించిన తన

పతితో సహగమనము చేయఁబోవునపుడు సైతము ప్రానాంతకరము నసహ్యము నైన యా యగ్ని దాహమందును నొక యవ్యక్తానం దానుభవము చేయును. జగత్తునందంతటను నిటులే యానందమున్నది. అంతర్వాహినియైన ఫల్గునదివలె నంతర్నిహితానంద సంధానము నొందు వ్యక్తి, జాగతికమైన సర్వ దుఃఖ శోక సంతాప పీడాదుల నడుమనున్నను, నిత్యము నిత్యానంద సంభోగముతోఁ గృతార్థుఁడగుచున్నాఁడు. అయ్యో ! జీవుడా ! నీ వెపుడా యానందధారను గ్రోలి యమరశాన్తి నొందుదువో ? ఉండనిమ్ము సమాధి యీ యఖండానంద సముద్రమును వెదకునదే; కాని, ధ్యాన ధారణాదులు విషయానందమగ్న ములై పోయినవి. ఆనందమయి యమ్మ తన యాత్మస్వరూప మును గుప్తముగా నుంచి, లీల యనెడి మిషచే విషయము లనెడి కపటవేషమును ధరించి బొట్టుబొట్టుగా నానందదానము చేయును. ఆయోగ సర్వాంగములును దానికైన ప్రయత్నములే; కనుక సమాధితోఁ బరస్పరవిరోధము. విషయ సంస్పర్శమువలనఁ బుట్టు నానందకణములు గూడ సమాధివల్లనే పొందఁబడుచున్నవి. తక్కు యోగాంగము లా యానందము చెంతఁ జేరఁజాలవు కావున మనస్సు ఆజ్ఞాచక్రమందు నిల్చి ఆ యానందాస్వాదము చేసినపైని దాని కుటుంబజనము దానిని (ఆనందమును) ఖండఖండములుగాఁ జేసి చేకొనుచుండును. (మనః కుటుంబజనము - ఇంద్రియములు) కనుకఁ గేవల విషయములనే ధ్యానించువాఁడు, ఆనందమును ఖండ ఖండములుగానే చేసివేయును.

త్వష్టు నేవిశిష్టమూర్తినో, జ్యోతినో, విశిష్టభావ మునో ధ్యానించునవు డవియు నమాధివలనఁ బొందఁబడు నఖండానందమును ఖండఖండములుగానే చేసివేయును. ఇట్లే ధారణాప్రత్యాహార ప్రాణాయామాదులైన ప్రత్యేక యోగాంగములును, సీమాబద్ధమైన యానందము నెడనే ముగ్ధములై పోవును. యోగాంగసమూహముయొక్క యీసీమాబద్ధ ముగ్ధత, నదా చేయుచుండు ప్రత్యేకకర్మమునందును - యోగ శాస్త్రోక్తములవైన యుపాయముచే నగు భగవత్సాధనమందునుఁ దుల్యమే. ఆత్మజ్ఞానప్రాప్తి నుద్దేశించి చేయఁబడు యోగాంగములు, జీవుని ఆత్మజ్ఞానప్రాప్తి కుపయోగింగాఁ జేసినను యమనియమాది సాధనములతో నాత్మనెఱుంగునంతకు - కేవల యోగాంగ సహాయమున నఖండానందస్వరూపానుభవ మునకుఁ బ్రయత్నించునపుడు, "ఆ యథార్థానంద సంధానము నొందలేదు" అని తెలియఁగల్గును. ఊరక తన యిచ్ఛతో, ఆ అనందానుభవ మైనదనుకొనును. దాని దర్శనమైన ముహూర్త మందే సమాధి సిద్ధమగును. సమాధిసిద్ధి యైనంతనే తక్కిన యోగాంగములు తమంతనే సిద్ధమగును. చూడు - అమ్మను జూచుటకు నీ వెంతదాఁకఁ యమనియమముల ననుష్ఠింతువో, అమ్మను జూచుటకై నీవు పద్మాసనమును బిగించుకొని యెంత దాఁకఁ గూర్చుండఁ బూనుదువో, నీ యింద్రియముల నడ్డగించి యమ్మవైపుమఱలింప నెంతదాఁకఁ బ్రయాసపడుదువో, యంతసేపును, నీ వూరక నడుము బిగించి సిద్ధమైనను, "ధ్యాన మొనర్చినంత నమ్మ దొరకదనియు, అమ్మయే వచ్చునపుడు ధ్యానము తనంతనే యగుననియుఁ దెలిసికొందువు." జాగతికమైన

ప్రతికార్యమునందును, మన వెంటులు విశిష్టభావముతో ధ్యానధారణములు చేయమో, యమనియమాదులు ననుష్ఠింపమో, యోగాంగములు తమంతనే సిద్ధమయిపోవునో (భోజన దృష్టాంతమును స్మరించుకొనునది.) యటులే మాతృలాభ సమయమందు సైతము, "నేను అమ్మను జూతును; చూచు చున్నాను" అనుచు దృష్టి నమ్మవంక మఱలింపుము. అపుడు నీ సర్వవిధ యోగాంగములును దమంతనే సిద్ధమగుట కనుగొందువు.

వినుము - ఆహార విహారాది దైనికకర్మములు మన స్వాభావికము లైనటులే, ప్రయత్నవిశేషము లేకే తమంత సిద్ధమగునటులే, మాతృప్రాప్తియు స్వాభావికమని తెలియ వచ్చును. మన యమ్మ సహజ (సులభ) వస్తువు. మనము చూడఁగోరము. చూడము. కనుకనే అమ్మ మనకు గానరాని, మనము చేరలేని స్థలమం దెక్కడనో యున్నదనుకొందుము. గాని యట్టి పొందరాని తల్లి కాదు. ప్రయత్నించి యామె నెయ్యము నాకర్షించుకొన వలయును. మన యమ్మ సత్య. అమె తన ప్రబల స్నేహాకర్షణమువల్లనే, మన వెనువెంటఁ బరుగెత్తి వచ్చుచుండును. మనము, 'అమ్మా !' యని పిలువము. ఆమె యస్తిత్వమును నమ్మము. అమ్మ గుండెపైనే కూర్చున్నాము. మఱి "మాయమ్మ యేదీ ? యెక్కడ నున్నది ?" అంచున్నాము. దీనిచే మన యమ్మ దుఃఖముచేఁ గ్రుంగిపోవుచున్నది. నెయ్యపుబిడ్డలే యవజ్ఞ చేసినచోఁ దల్లి దుఃఖింపదా ? ఇంత యవజ్ఞ చేయుటవల్లనే, రాజరాజేశ్వరి, బ్రహ్మ విష్ణు మహేశ్వర జనని - మన యమ్మ జీవిత్వమనెడి మాసినచినిఁగిన చీర కట్టుకొని, లేమిని గల్పించుకొని, దారుణ

హాహాకారముతో దిక్కులు శోకింపఁజేయుచునే, మనలను దన యొడిలోఁ గూర్చుండఁబెట్టుకొన్నది. ఆ దుఃఖ మింతింత కాదు. నీవొక్కసారి యా మెవంక సత్యదృష్టి పఱపి "మా యమ్మవు నీవేనా?" యనుచు యథార్థముగాఁ జూడ నభ్యసింపుము. సమాధికై విచారింపకు. అది తనంతనే వచ్చును. నీ వెల్లపుడు నానంద పల్లవితుఁడ వగుదువు.

సమాధి స్వాభావికానందమును స్వాభావిక మాతృ మిలనమును గోరుచుండును. దేనిచే సదా సర్వవిధముల మాతృ యుక్తుఁడవై యుండఁగల్గుదువో, సర్వదా అఖండానందాస్వాదములో ముగ్ధుఁడవై యుండఁగల్గుదువో, యదేసమాధియొక్క యాకాంక్ష కాని దాని పరిజనవర్గము - యమ నియమాదులు - ఆ యాకాంక్షాసిద్ధికి విరోధులు; వారు సమాధిని వేఱుచేసి యుంచఁజూతురు.

## సోఽహం అనెడి జ్ఞానము పేరే సమాధి.

మొట్టమొదట సమాధ్యవస్థ గల్గునపుడు (తొల్తసమాధిలోఁ బరిచయమగునపుడు) తనను 'సోఽహమ్' అనుచు సిద్ధము చేయును. సోఽహమ్ అనెడి జ్ఞానము పేరే సమాధి. పుస్తకములు చదివినంతనే, యుపదేశములు వినినంతనే సోఽహమ్ జ్ఞానము వికసింపదు. "ఈ మా యమ్మయే స్నేహముచే ఆత్మవిస్మృతి నొంది 'నేను' అయిపోయినది; అనంత మహిమమయి - అఖిల బ్రహ్మాండాధీశ్వరి - అమ్మయేఁ యీ 'నేను' రూపములో వెలయుచున్నది," అను నీ యనుభవమగు ముహూర్తమందే

సమాధి సిద్ధము. అపు డెట్టి యవస్థ యగునో మాటలతో నెట్లు తెలియఁజెప్పుట ? అది మూగవాని బెల్లము. ఎవరి మట్టుకు వారికిఁ దెలియవలసినదే. అభిలాషము తీర్చుకొనుటకై, అమ్మ పాదములను స్మరించి చెప్పఁగలవాఁ డేదో కొంచెము చెప్పను.

## సమాధ్యనుభవము

కన్ను జగద్రూపమును గనదు అమ్మయొక్క రూపము లేని రూపసాగరమున మునిఁగిపోవును. చెవి జాగతికశబ్దములను వినదు. చప్పుడులేని, యమ్మ పిలుపును విని ముగ్ధమై పోవును. రసన (నాలుక) యా యఖండరసమును రుచిమఱిగి మొద్దు వాఱి పోవును, ముక్కు శ్వాసప్రశ్వాసముల పనిమాని అమ్మ మేని స్వర్గీయ సౌరభముచే స్తబ్ధమైపోవును. త్వక్కు అమ్మ యాలింగనముచేనైన మధుర స్నేహమయ స్పర్శముచే నేమగు చున్నదో తెలియలేదు. దాని నిట్టి యవస్థయని చెప్పలేము. శరీరమందలి ప్రత్యేక పరమాణువు, నేయానందరసముచేఁ దడిసి పోవుచున్నదో దానిని వర్ణింప నలవికాదు. భవభూతి మహాకవి తన కల్పనా భాషయందు "నిష్పీడితేందు కర కందలజో ఽను సేకః" అనఁగల్గినాఁడు. చంద్రునిబట్టి రెండుచేతులతోఁ బిడిచి, యా సుధాకరునుండి కారు నమృతమయ స్నేహమును లో వెలులఁ బూసినను ఆ సుఖమయస్పర్శమునకు సాటిరాదు. ఇంకే మగునా - హృదయ పిండక్రియ యాగిపోవును. రెండు నేత్రములు శవనేత్రములవలె జ్యోతిర్హీనములై పోవును. అంగ ప్రత్యంగములు సడలిపోవుటో, కొయ్యవాఱిపోవుటో యగును. వేయేల ? ఇది దేహము, ఇది జగత్తు

అనెడి తెలివి విలుప్తమైపోవును. కేవలానందమయ చిత్సముద్రము మాత్రమే మిగిలి పోవును. మొట్టమొదటి "ఆపరమాత్మయే 'నేను' అనెడి జ్ఞానము" ప్రవహింపఁజొచ్చును.

## అదె మన యథార్థ స్వరూపము.

అదె సో౽హంభావ సమాధి. ఇట్టి సమాధియందుఁ గొన్నాళ్లలవాటుపడెనేని, మఱి 'వాఁడు, నీవు, నేను' అనెడి దేమియు నుండదు. ఆ యవస్థను నోరఁజెప్పలేఁడు. విచారించు కొనలేఁడు. అపుడుండిన దేదో యదే మహాసత్త - మహాచైతన్యము - నిస్సీమానందము. ఇందు సందేహము లేదు. కాదు కాదు; దానిని 'మహా'త్ అనలేము. అణువు అనలేము. ఏమన - అపుడు పరిమాణజ్ఞానము రవ్వంతయు వికసింపదుకదా; మఱి దానిని మహాత్ అనిగాని, అణువనిగాని చెప్పుటెట్లు ? మఱొక విశేషమేమనఁగా, చెప్పెడివాఁడే చూడఁగలవాడు. అణు వనుకొన్నచో అణువే; మహాత్ అనుకొన్నచో నది యప్పుడే మహాత్ గాఁ దోఁచును. అట్టి సంకల్పమే యుండదు. సమస్య యేమనఁగా - అచటఁ జేరి సంకల్పము లుదయించు టెట్లు ? ఏమనఁగా, సంకల్పించునది మనస్సు; అచట దాని జాడయే యుండదు. అమ్మ కరుణించి కొంతసేపచట నుండనిచ్చినచో, నొకటి రెండు సంకల్పము లుదయింపవచ్చునంటేని, కాదు. అచట సంకల్ప ముదయింపదు. సంకల్పము లుదయించు చోటది కాదు. ఆ చోటు దానికంటె మిగులఁ గ్రిందిది. ఎంత సుఖమయానంద ధామమో మన యున్కి యొడి ! అదె మన యథార్థస్వరూపము.

## సో ఽహం తత్త్వము

సాధకా ! మన మిపుడు సో ఽహంతత్త్వము నెఱుఁగఁ బ్రయత్నింతము. ఇదిగో ! మన మెఱిఁగిన రవ్వంతయు మన బుద్ధి హద్దులో నున్నదే, కాని భగవత్తత్త్వము బుద్ధికిఁ గడు నతీతమైనది. కనుక 'దీనిని నేను జక్కఁగా నెఱుంగుదును; ఎఱుంగఁగల్గుదును' అన్నచో నది సందేహమే. బ్రహ్మ విష్ణు మహేశ్వరుల ధ్యానమునకును నగమ్యయైన మన యమ్మ మనుజబుద్ధిగమ్య యెట్లగును ? అమ్మను గూర్చిన జ్ఞానము మనకు రవ్వంతయైనం జాలును చీమకుఁ బంచదార కొండ పరిమాణము నెఱుంగవలసిన పని యేమున్నది ?

సో ఽహం శబ్దమునకు"వాఁడు-నేను" అని యర్థము. ఇతఁడు నేను కాదు. అతఁడు నేను. నేనునకు మూడు స్వరూపములు (అవస్థలు). 1. జీవుఁడగు నేను 2. ఈశ్వరుఁడగు నేను. 3. పరముఁడగు నేను. నేను వాఁడనుటయే నేనుయొక్క (నా) పరమభావము. శ్రేష్ఠతమావస్థ. అది వాఙ్మనోబుద్ధులకు నతీత మైన స్వరూపమగుటచే, జీవభావమునకుఁ గేవల మప్రత్యక్షము, కనుక సర్వనామమైన 'సః' శబ్దము ప్రయోగింపఁబడినది. వ్యాకరణ శాస్త్రానుసారముగా సైతము, అప్రత్యక్ష విషయ మందే తచ్ఛబ్దము ప్రయుక్తమగును. గాన 'సః' శబ్దముచేఁ బరమాత్మయే తెలియఁబడును. నేను అన్నను, ఆత్మ యన్నను నొక్కటేమాట. వాస్తవముగా జీవాత్మ-పరమాత్మ యను రెండును వేర్వేఱు పదార్థములు కావు. ఆత్మయొక్క కల్పితాంశముచే వికసించు

జీవభావముపేరే జీవాత్మ. ఇంక దానియే యంశమం దెట్టి భావమును వికసింపదో అదె పరమాత్మ. ఆత్మయొక్క యి పరమభావ మెట్టిదియో యెఱుంగ నించుకంత ప్రయత్నింపుము. ఏ స్థితియందు ఆత్మ సచ్చిదానంద రూపముతోఁ బ్రకాశించునో, యెచట అసత్, అచిత్ నిరానందము లనునవి యెన్నఁడును లేవో, అదె పరమభావము. దానిని భాషలోనికిఁ దెచ్చి, భావము-అవస్థ-స్వరూపము మున్నగు మాటలు ప్రయోగింతురు. విచారించినచో నీ పదములు సయితము దానియెడఁ బ్రయోగింపఁదగినవి కావు. ఏమనఁగా, భావము-అవస్థ-స్వరూపము మున్నగునవి పరిచ్ఛిన్న పదార్థముల కగునవియే స్థూలముగా నాలోచింపుము. వెదకినను అసత్తనునది యించుకంతయు లేనట్టియు, అచిత్ (జడము) అనుట కింతయు వీలులేనట్టియు, నిరానందలేశమైనను అనుభవమునకు రానట్టియు నొక యవస్థ మనకుఁ గలదు. అది పరిచ్ఛిన్నతయు, రూపరసాది విషయములును లేనట్టిది; కావున భావాభావములు రెండును నచటఁ బ్రతీతియోగ్యములు కావు. అది యిట్టి యొక యవస్థ. ఏ చైతన్యసత్తచే నీవు సాగుచున్నావో నీ దేహ మన ఇంద్రియాదులను మఱచి, అ చైతన్య సత్తామాత్రమును, నీ బోధమునకు దెచ్చికొని నిల్వఁగల్గినచో నీ పరమాత్మ భావాభానము నొందఁగలవు (ఎఱుంగఁగలవు). కాని యచట నేను, నీవు, వాఁడు మున్నగు జ్ఞానమే యుండదు. దానిని విజ్ఞాత యనుటకును, ద్రష్ట యనుటకును వీలులేదు. ఏలన ఆ యవస్థయందు జ్ఞేయము, దృశ్యము అనునవి లేనే లేవు. ఆ యవస్థపేరే పరమాత్మ. మన పరమభావము.

# అహంవస్తువు

పైనిజెప్పిన మన పరమభావముయొక్క యొక యంశ మందు స్వభావముచేఁ గేవల లీలావశమున నొక యహంబోధము వికసింపఁజొచ్చును. ఎందుల కీవిధముగా వికసించు నని యడుగక తెలియుటకే ప్రయత్నింపుము. అహంబోధము ఉబుకనంత పర్యంతము వాఙ్మనసుల కగోచరమైయుండు నా స్వరూపము, అహంబోధ ముబికినతోడనే, అఘటన ఘటన పటీయసియైన మహామాయ ప్రకట యగును. ఆ మొదటి యహంబోధ ప్రకాశముతో నారంభమయి యీ పంచభూత భౌతిక పదార్థపర్యంతము విరాడ్బ్రహ్మాండరూపముతోనే మహా మాయ వెలయును. ఈ మహామాయయే స్థిరముగా, అనఁగాఁ గ్రియాశక్తి రహితముగా నుండనంతదాఁకఁ బరమాత్మ, బ్రహ్మము నిరంజనము మున్నగు శబ్దములతోఁ బ్రసిద్ధము. శక్తివికాస మారంభమగునపుడు, దానిపేరు మహామాయ యైనది. తొలుదొల్త, అహంబోధము వికసించిన యా 'నేను' మహా, ఏకము. అపుడు మఱియొక నేను లేదు. ఏకమైన యా నేనునకు నిచ్ఛ కలుగుఁగానే యది బహుత్వభావముతోఁ బ్రకటమగును. బహుత్వనాటక మాడును. ఆనందమే దాని స్వరూపము. కనుక నీ బహుత్వపు లీలలోసైతము, అఖండానందము అఖండముగానే యున్నది. ఇదిగో ఈ బహుత్వేచ్ఛ (కామము) పాడము చోటే మనస్సు. మనసు లేక సంకల్పము పుట్టఁజాలదు. ఈమనోమయి యమ్మ తొంటి కల్పములు సృష్టి బీజమును గుప్తముగా నింతదాఁకఁ దన

గర్భరూపముతో ధరించి యుంచినది. ఇపుడు మఱల దానిని బ్రసవించినది. ఈ బహుత్వసృష్టికి నిమిత్తకారణమును, ఉపాదానకారణమును అమ్మయే అదే 'నేను'. అదే యీ యనంతకోటి బ్రహ్మాండాకారముగా నాత్మప్రకాశము చేసినది. ఆకాశము, వాయువు, అగ్ని, జలము, స్థలము, సూర్యుఁడు, చంద్రుఁడు, అణువు, జీవాణువు, పరమాణువు, కీటకము, పతంగము, పక్షి, పశువు, మానవుఁడు, దేవత ఇంకెన్నియో అన్నియును, దిక్కులు, కాలము, కర్మము, ధర్మము, అధర్మము, కామము, క్రోధము, లోభము, మోహము మున్నగునవి వేయేల? అన్నియును దానయైపోయినది. చైతన్యమే దాని స్వరూపమైనను, ఆనంద ప్రేరణముచేతను, నెయ్యవుటుబుకుచేతను, జడపర్యంతము కావలసి వచ్చినది. ఆ తానే నేను. కనుక దాని కల్పితమైన యణు పరమాణుపర్యంతము. 'నేను' అనెడి జ్ఞానముతోనె మెలఁగును. అది సముద్రమువలె నున్న నేను, మఱి జీవజగత్తు అందలి తరంగమువంటి 'నేను'.

ఒక లాంతరు, ఏడురంగుల గాజుముక్కలతోజేయఁబడి యున్నదనుకో. నడుమ నొక వత్తి వెలుఁగుచున్నది. ఆ యేడు గాజుముక్కలలో నుండి, దాని కాంతి యొక్కటే యేడు విధములుగాఁ బ్రకాశించును. ప్రత్యేక జీవునియందు నున్న 'నేను' అనెడి జ్ఞానము సైతము ఇట్టిదే. వాస్తవముగ, ఆ నేను ఒక్కటియే యైనను, అనేక జీవులలో, అనేక 'నేను' లుగ వెలయుచున్నది. మిగుల ధీరముగాఁ దెలియఁ బ్రయత్నింపుము. మూలమందుఁ బెక్కు నేనులు లేవు. అనేక భావములతో వెలయు నేను ఒక్కటే.

దానిపేరు వ్యష్టిగా నుంచినచో 'నేను' జీవుఁడు. ఆ యేకమైన నేను పేరు ఈశ్వరుఁడు. ఎందుల కీశ్వరుఁ డనఁబడెను ? బహుత్వసృష్టియు దాని ధారణమును, ఆ నేను నందే యగును. మఱి యతఁడు, "నేను బహుత్వభావముతోఁ బ్రకాశింపను" అని యిచ్ఛగించినపుడే సృష్టి తెగిపోవును. ప్రలయమైపోవును. దీనిచే, ఆ సృష్టి స్థితి ప్రలయములను జేయునతఁడు ఈశ్వరుఁడు. ఈ యంశమునకు - అనఁగా నీశ్వరునకు మున్ను జెప్పఁబడిన పరమాత్మ స్వరూపముయొక్క శక్తిరూప వికాసమే చెప్పఁబడును. ఆ పరమాంశము పేరే శక్తిమంతుఁడు. అహంబోధతో నారంభించి, యనేకభావములతోఁ బ్రకాశించి వానిని ధరించి, ప్రలయాది కార్యము లొనర్చు నంశము పేరే శక్తి. ఈ శక్తిశక్తిమంతులు వాస్తవముగా నభిన్నపదార్థములు. సూర్యుని ప్రకాశశక్తి, అగ్ని దాహకశక్తి యని కేవలము నోరితోఁ జెప్పఁబడుచు, వాని భేదమెన్నఁడును ననుభవయోగ్యము కానటులే, శక్తిశక్తిమంతుల భేదము కేవల మౌఖిక విచారముతోఁ గాఁదగినదే. రాహువు శిరస్సు, అనునపుడు రాహువును, శిరస్సును అభిన్నముగాఁ దోచునటులే, పరమాత్మయు శక్తియు నభిన్నముగాఁ బ్రతీతియోగ్యములు.

## 'సః' తో 'అహం' చేరిపోవుటకు ద్వారము సమాధి.

ఇపుడు తెలియవచ్చినది నేనునకు మూడు స్వరూపము లని. ఒకటి జీవుఁడైన నేను; రెండది యీశ్వరుఁడైన నేను; ఇఁక మూడవది పరముఁడైన నేను. ఈ పరముఁడైన నేనుపేరే 'సః'. ఏమనఁగా నది యప్రత్యక్షము. మఱి జీవుఁడగు నేను పేరు 'అహమ్' అయినది. "సః-అహమ్" అను రెండును జేరిపోవునపుడే,

జీవుఁడు బ్రహ్మరూపముఁ బ్రకాశించును. ఈ చేరిపోవుట
ద్వారము సమాధి. సమాధియే 'అహమ్' ను 'సః' గాఁ జేసివేయు
కావున సమాధి తనను 'సో ఽహమ్' అని పరిచయము చేసికొను
మన మెటులో 'సో ఽహమ్' అను విషయముఁ దెలిసికొన్నా
గాని దానిని గూర్చి యెఱుంగఁదగిన దింతో యంతో యు
చూడు; "నేను జీవుఁడను" అని తెలియఁబడిన, దానియఁ
వాస్తవముగా నేమియు లేదు. ఏలన, లాంతరు దృష్టాంతము
దెలియఁగల్గితివా ? - 'నేను ఒక జనుఁడను'. "నేను" అనుచు
ఈశ్వరుఁడే చెప్పఁబడును. అనఁగా, నమ్మాట యీశ్వరునే తెల్పు
దేహాత్మబోధవిశిష్టుఁడైన జీవునకు "నేనుదనము" (అహంత్వ
అజ్ఞానమాత్రమే. కార్యముచే నీశ్వరుఁడే. 'సః' తో గూడ 'అహ
చేరుటయే; పరమునితో నీశ్వరుఁడు చేరుట యన్నచో
నుండును. 'చేరుట' యనుటచే, రెండు వేర్వేఱు వస్తువు లొక
జేరికొనుటగాఁ దలంపరాదు. జీవభావముతో వెలసి యథ
'నేను జాడనెఱుంగుటచేతనే జీవేశ్వరుల చేరిక (మిలన
సంఘటిత మగును. మఱి యీశ్వరభావముతో వెలసిన
పరమభావ మందువనీతమగుటచేతనే పరమపురుష
(కైవల్యము) ప్రాప్తించును. జీవుఁడు పరమభావ
బ్రవేశించునపుడు, మధ్యవర్తి స్వరూపుఁడైన యీశ్వరుఁడగు
నతిక్రమించుటచే గాఁజాలదు. జీవుఁడు ముందుగా నీశ్వ

కావలయును. ఈశ్వరుఁడు పరమభావమం దుపనీతుఁడు కావలయును. ఇదె ముక్తి; యిదె మూలతత్త్వము.

## ఇదే సాధన

జీవునకు సాధ్య మీశ్వరుఁడే యనియు, పరమభావము సాధ్యము కాదనియుఁ దెలిసినది. అది సాధ్య సాధనాది సర్వావస్థలను మీఱినది. కావున ఉపాసనా సాధనాదులగునవన్నియు మధ్యవర్తి (ఈశ్వర) అవస్థయందే సిద్ధమగును. జీవుఁ డేదే నొకవిధముగా నీశ్వరస్వరూపవిశిష్టుఁడు కాఁగలఁడేని, వాస్తవముగా 'నేను' అనెడి వస్తువుయొక్క స్వరూపసంధానము నొందును. జీవభావముతో వెలయు 'నేను' నీడ (ప్రతిబింబ) మాత్రమే, కనుక "యాదేవీ సర్వభూతేషు చ్ఛాయారూపేణ సంస్థితా" (దేవీ మాహాత్మ్యము) యనఁబడెను. యథార్థమైన 'నేను' సృష్టి స్థితి ప్రలయకర్త; సర్వజ్ఞుఁడు; సర్వేశ్వరుఁడు; అనంతుఁడు; కరుణాసింధువు; స్నేహమయుఁడు; నిగ్రహానుగ్రహసమర్థుఁడు; ఏకాంతాశ్రయుఁడు; ఇతఁడే యక్షరపురుషుఁడు. మఱి జీవుఁడు క్షరపురుషుఁడు. ఏమనఁగా, గాజుముక్కలలో దాగియున్న ప్రకాశమనెడి 'అహమ్' తొలఁగిపోయినచో మఱి యహ ప్రతిబింబమనెడి జీవుఁ డుండఁజాలఁడు. మన యమ్మయే అహంస్వరూప. అహమ్మయి. కనుకనే యామె సర్వాంగములందును నేను వికసించినది (ఆమె సర్వాంగములుగా నేను, అయినది). ప్రత్యేక పరమాణువునందును 'నేను, నేను' అను శబ్దమే వికసించును. ఏ 'విరాట్, మహాన్, సః' అనెడి సముద్రమునుండి

యసంఖ్యమైన బుడగలు లేచెనో, ఆ నేనును సంధాన
చేయుటపేరే సాధన. ఆ నేను నెడ రుచి పేరే భక్తి. ప్రేమ. ఆ నే
నెఱుంగుట పేరే జ్ఞానము. ఇటులు సాధన తత్త్వమయ
కానంతదాఁక (ఆత్మాను సంధానయుక్తము కానంతదాఁక)
నీరసముగా మెల్లమెల్లఁగా నడుగులు వేయుచు జరుగుచున్న
మాటయే.

"పూజా ధ్యాన జపాదీని నామసంకీర్తనాని చ ।
అహం దేవ వియుక్తాని వికలాన్యాహ బ్రహ్మవిత్ ॥"

పూజ, ధ్యానము, నామసంకీర్తనము మున్నగునవి అహం
యుక్తములు కానంతదాఁక (సోఽహంభావముతో సాగనంతదా
పూర్ణఫలమునీయఁజాలవు. అహమ్ అనునదే సాధ్య
అహమ్మనునదే పూజ్యము; అహమ్మనునదే యుపాస్యము.
నేనును విడిచి సాధకుఁ డగ్రసరుఁ డగుచున్నంతదనుకను
పూజయే చేయుచుండును, గాని యది అవిధిపూర్వకము. కావు
గీతాగురుఁడు, "యే ఽప్యన్య దేవతాభక్తా యజన్తే శ్రద్ధయాన్వి
। తే ఽపి మామేవ కౌంతేయ యజన్త్య విధి పూర్వకమ్" (9-2
అన్నాడు. "అహం హి సర్వయజ్ఞానాం భోక్తాచ ప్రభురేవచ" మున్న
గీతావాక్యములును గ్రహింపదగినవే. (నా వ్రాసిన రాజవిద్యా
చూచునది.) దొరుకుచోటు : సాధన గ్రంథ మండలి, తెనాలి.

వినుము :- ఈ నేనే యీశ్వరుఁడను. సర్వయజ్ఞముల
భుజించువాఁడను. ప్రభువును నేనే. ఎవఁడు ఏ యింత
మాచరించినను, దానిని నేనే భోగింతును. జీవుఁడా!
నన్నెఱుఁగనంతదాఁక, నన్నాదరింపనంతదాఁక, జన్మమరణ

యాతనలనెడి తిరుగంటిలో నలిగిపోవుచుందువు. నేను సర్వజీవుల హృదయమందును బ్రాణరూపముతో నున్నాను. నన్నెఱుంగనివానిని బోలిన దురాచారి మనుష్యులలో లేఁడు. కావున దురాచారివ్యక్తియు నన్ను భజింపఁగల్గు చున్నాడు. ఈ నేనే వైష్ణవుల రాధాకృష్ణుఁడను; శైవుల శివుఁడను; శాక్తులశక్తిని; గాణపత్యుల గణపతిని; సౌరుల సూర్యుఁడను. ఈ నేనే సాకారముతో విశ్వరూపుఁడను. భక్తి విశిష్టుల కొఱకు విశిష్టరూపములతో నావిర్భవింతును. ఈ నేనే రూపాతీతుఁడను; నిరంజనుఁడను. జీవుఁడు 'నేను జీవుఁడను' అనెడి జ్ఞానముతోనే యుండి, 'ఈశ్వరో ఽహమ్' అను మాటను పృథగ్భావముతో నుపాసించునంతదాఁక, ఆ 'నన్ను' దెలియలేఁడు పొందలేఁడు. పొందు వెరవును లేదు. "నేను జీవుఁడను గాను" అను మాట సంతతము స్మరించుకొనుచుండుమా ! "కలౌతు స్మరణాన్ముక్తిః" అను నుపదేశ మిదే సుమా ! ఇదే చుమా మేధ. "బ్రహ్మాహమస్మీతి స్మృతిరేవ మేధా" అను శ్రీశంకర గురువాక్యము నీ కంటఁ బడనే లేదా ? ఉపనీతునకు మేధాజననమైన దనఁగా, నీ తెలివి యలవడినదని కాదా యర్థము ? యుగయుగాంతరములనుండి, జన్మజన్మాంతరముల నుండి విస్మరింపఁబడిన యీ సత్యమును స్మరించుకొనుటచేతనే నీకు విముక్తి. 'జీవో ఽహమ్' నేను జీవుఁడను; అనుచు నభిమానముతో నుబ్బుచుండు వానియందు, అహమ్ 'నేను' అనునది అమ్మయే. అమ్మ యెన్నఁడును జీవుని విడిచియుండదు. జన్మజన్మాంతరములనుండి నేను అమ్మ జ్ఞానసారముగా హృదయమందుండి, అజ్ఞానసారముగా సర్వరూపములతో నుండి,

నీ పోషణము చేయుచున్నది. అదరించుచున్నది. నీ యెడనైన నెయ్యమునుబట్టి వృద్ధిచేయుచున్నది. ఇంతదాఁక నీవు తెలియకున్నను హానిలేదు గాని, యిపుడు మనుష్యుడ వైతివి. ఇపుడైనను నన్ను (అమ్మను) గుర్తింపవా ? కడు దుఃఖములో "అవజానన్తిమాం మూఢా మానుషీం తనుమాశ్రితమ్" (గీత 9-11) మనుజుఁడా ! నీవు నన్ను గడు నవజ్ఞ చేయుచున్నావు. నీవెంతగా నవమానింతువో నేను నీకంతగాఁ గానరాకయే యుందును. సిగ్గుచే మొగము గప్పుకొని, ఊరక కన్నీరు విడుచుచు, కొడుకా ! కొడుకా! యనుచు నీ వెనువెంటనే తిరుగు చున్నాను. నీవు నన్నెపు డాదరింతువో, అమ్మా ! యని నన్నెపుడు పిల్తువో యని యపేక్షించుచున్నాను. నీవు రేవగల్లు 'నాది, నాది' యనుదానిని అభిమానరూపిణియైన యమ్మగా నభిమానించి తిరుగుచున్నావ? 'మా యమ్మ' యనుచు నెన్నఁడే నొక్కసారి నావంకఁ దిరిగి చూడలేదే. కొడుకా ! యెన్నాళ్లు శిశువుగా నుందువు ? నన్నమ్మా ! యనుము. నన్నే పొందుదువు.

## సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ

అహంతత్త్వము నెఱుంగుటకై యెంతో యాలోచనము చేసితిమి. క్షోభము లేదుగాని, యే యిద్దఱు ముగ్గురు సాధకులైనను, ఈ 'నేను' గూర్చిన సాధన చేయఁగల్గినయెడ నిందులకైన శ్రమము కానరాదు.

'నేను' అనుదాని ధారణ చేయలేకున్నచో 'సో ఽహమ్' అను నుపాయము లేదు. 'సో ఽహమ్' కాకున్నచో జనన మరణ

పీడవలనఁ దప్పుకొను నుపాయము లేదు. జీవభావముతో మన మనుకొనుచున్న 'నేను' వాస్తవికమైన 'నేను' కాదు. 'నేను అనున దొక్కటేకాని రెండు లేవు. సర్వజీవులలోపలను, ఒక్కటేయైన నేనే ప్రతిధ్వనించుచున్నది. భిన్న భిన్నాధారములందు, భిన్నభిన్న భావములతోఁ బ్రతిధ్వనించుచున్న యా నేనొక్కటే దేవ మనుష్య తిర్యగాద్యాకృతులతో వెలయుచున్నది. అందంతటనున్న 'నేను' ఒక్కటే. దాని శరణమునే పొందుము. "సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ" సర్వరూపములతో నున్న 'నేను' యొక్క ప్రతిబింబమును గనుచున్నావు. దానిని విడిచిపెట్టి యన్నిటిలోను ననుస్యూతమైయున్న 'నేను' నే (మాం = అమ్మనే) యాశ్ర యింపుము. "అహం త్వాం సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః" నేను నిన్ను సర్వపాపములవలన (సంకీర్ణతవలన) విడిపింతును. శాంతిమయమును ఉదారమునైన ముక్తిక్షేత్రమందు (సోఽహం సామ్రాజ్యమందు) జేర్చివేయుదును. మఱి దుఃఖ పడకుము అని శ్రీకృష్ణవేషముతో గీతయందనిన యీ చరమ పరమాభయవాణి, యెవ్వరిలోఁ జక్కఁగా ననుభవింపఁబడునో వారే సత్యముగా నీ భావముతో నేనును (అమ్మను) గురువుగా నొంది, అమ్మ (నా) చరణములం దాత్మార్పణము చేయుటకై ప్రయత్నింతురు. అట్టివారికొఱకే శ్రీకృష్ణగీత - దేవీమాహాత్మ్యము కేవల పాఠము కొఱకును, నాలుగు మంచి మాటలు నేర్చుకొనుటకును గీతా దేవీ మాహాత్మ్యములను బట్టుకొని నలుపుట, పుస్తకములతోడి పిల్లల యాటవంటిదే.

# క్షేమము

ఇంతదాఁకఁ జెప్పినదే యోగము. గీతయందున్న "అనన్యాశ్చింతయంతో మాం యేజనాఃపర్యుపాసతే। తేషాం నిత్యాభి యుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్" అను నభయవాణి యందలి యోగవే. ఇఁక క్షేమము మాట. క్షేమమనునది యమ్మయే. సర్వభూతములందును నేను రూపముతో వెలయు నమ్మనొంది మనస్సెట్లు ధన్యమగునో ? ధ్యాన ధారణాదుల యిల్లు మనస్సు.

ఆత్మయొక్క (నేను అనుదాని) చాంచల్యమయ సంస్కా రాత్మకమైన యవస్థయే మనస్సు. ప్రత్యేక పదార్థమందును ప్రత్యేక భావముతో మాతృదర్శనఫలముగా సత్యప్రతిష్ఠ ప్రకృతి సిద్ధమైపోయి, సర్వవిధముల మాతృసత్త (ఆత్మసత్త) వెలయునపుడే మనోమయక్షేత్రమందు క్షేమంకరీ చరణస్పర్శ మగునని తెలియునది. మఱి యది కానంతదాఁక పరిచ్ఛిన్న విషయవాసన మనస్సు యొక్క స్వాభావిక చాంచల్యమును మఱింత పెంచును. కామనాగ్నిచే మండుచు మనస్సు మిగుల నుడుకు చుండునంతదాఁక దానియందు అక్షేమమే తాండవించుచుండును. ఆ రెండిటిలో నేది మనసుపై నధికారము చలాయించునో దాని నెఱుఁగుటకే సమాధికగు నుత్కంఠ. సాధక జీవుఁడు మనోరాజ్యము నుండి నెట్టివేఁబడి బుద్ధిమయ క్షేత్రమును జేరుటచే దాని వర్తమానావస్థను దెలియలేకున్నను, దానినంటిన పూర్వ సంచితాసక్తులను సైతము విడువఁజాలఁడు.

ఇచట యమ నియమాది యోగాంగములు పూర్తిగా మాత్మప్రాప్తినే యుద్దేశించి చేయఁబడక, కేవల శారీరస్వాస్థ్య మునో, చిత్తస్థిరతనో, ఒక విశిష్టశక్తి లాభమునో యుద్దేశించి జరుపఁ బడుచున్నంతకాలము మనోమయక్షేత్రమందు క్షేమమే. అదిగాక ధ్యానాదియోగాంగములు ఇపుడు సదాచరణములా ? అసదా చరణములా ? యనునదియు నుత్కంఠకుఁ గారణము. సత్ అనునది ఆత్మయే. అమ్మయే. దానియందుఁ జరించుట పేరే సదాచారము. మఱి మాతృభావరహితములైన కేవల విషయ భావములందు విచరించుట పేరే అసదాచారము. యోగాంగములు ఆత్మప్రాప్తి నుద్దేశించి చేయఁబడున్నవా ? విషయమాత్రముగ్ధములా ? యను నిట్టి సంశయము సాధకునకుఁ బ్రథమావస్థయందు స్వాభావికము.

ఎల్లపుడును బరిచ్ఛిన్నతతో ముగ్ధములైన ధ్యానధారణాదుల వ్యవహారముచేఁ బీడింపఁబడి, పరిచితసమాధియైన సాధకుఁడు, ఆ యసత్సంగమును విడువఁగోరి వీడి బుద్ధిక్షేత్రమును జేరికొన్నను, వాని చిత్తమందు అనురాగ భావమును విడువలేఁడు. బహుకాల సహవాసమువలని ఫలమిదే. సమాధి ధర్మము ఆత్మానుసంధానము. మనోధర్మము చాంచల్యము, విషయాలోచనము. ఇటు లొండొంటికి విరోధమగు కారణముచే, బలవంతమగు మనసుచే మొట్టమొదట సమాధి యోడిపోవును. అయినను మనసునందగు పూర్వానురాగమును విడువఁజాలదు. ఏలన - చంచలత, పరిచ్ఛిన్నత తోడగుట చేతనే యాత్మబోధము జాగృతమైనది. అహంత్వమును జాగృతము చేసి యుంచుటకుఁ బ్రధాన సహకారులైన వాని విఘ్నముల నెఱింగియు మిగుల

నిర్దయుఁడువలె వానియెడ స్నేహరహితుఁడై యుండుట ప్రథమావస్థయందు సాధకునకుఁ గడు గఠినమైన పనియే. పూర్ణముగా మాతృభావమందు పైైమెఱచినవాఁడుగాక, దేహాత్మబోధము పూర్తిగా సడలిపోక, యది సంభవింపదు. జీవుఁడు ఇంద్రియధర్మములను బరిత్యజించినను, అహంతను జాగృతము చేసి యుంచఁగల్గినపుడే వాఁడు మాయను బరిత్యజించుటకును సమర్థుఁడగును. కానిచో, సాధనాంగములే యనుము, యోగాంగములే యనుము; వాని నించుకంతయుఁ బరిత్యజింపలేఁడు.

## మొదటి సమాధికి క్షణస్థాయిత్వము స్వాభావికము

ధ్యానము పితృస్థానీయము; ధారణ పతిస్థానీయము. యమనియమాదులు స్వజనస్థానీయములు. అవి తమకు సమాధి యెడనుండిన స్వాభావిక ప్రేమను బూర్తిగా విడిచినవి. అవి సమాధిని క్షుద్రత్వమందే యెల్లప్పుడు నుంచుట కుద్యోగించినవి. మఱియు సమాధి, ఆత్మానుసంధానమం దగ్రగామియై వాని స్వాభావికాకర్షణమును విడిచి, యిపుడు మెల్లమెల్లగాఁ బ్రజ్ఞజాద నెఱింగినను, వానియెడ మూలముట్టుగా నాసక్తి తెగదయ్యెను. ఇటులు విరుద్ధభావములచే వ్యాకులుఁడై మలిన భావుఁడైన సాధకుఁడు, అల్పకాలము మాత్రమే నిల్చుట స్వాభావికము. ఏలన - ఇప్పటికిని అతఁడు బుద్ధిమయక్షేత్రమందే యున్నాఁడు. బ్రహ్మక్షేత్రమందుఁ జక్కఁగాఁ బ్రవేశింప లేకున్నాఁడు. పరమాత్మసామీప్యప్రాప్తి క్షణకాలము వచ్చినను, మఱల నప్పుడే మనోమయక్షేత్రమునకు దిగిపోక తప్పదు.

## పరిచిత సమాధియైన సాధకుని చాంచల్యము

బుద్ధిమయక్షేత్రమందు సమాధి ప్రథమసాక్షాత్కారము లభించునపుడు, సాధకునకు మలినభావాపన్నతయే కానఁబడును. ఏలన, బుద్ధిమయక్షేత్రమందుఁ బూర్ణనిర్మలత ప్రకటము కాదు. కేవల ప్రజ్ఞయందుఁ బ్రవేశింపగల్గునపుడే, సర్వభావచాంచల్యము చేతితోఁ దీసివేసినట్లు తొలఁగును. బుద్ధి జగన్ముఖియైన నిశ్చయాత్మిక వృత్తి విశేషము. ఇంద్రియములు, మనస్సు మున్నగువానిని బట్టిచూడ, స్వచ్ఛము స్థిరము నుదాసీనమువలె నున్నను, దానిచెంత మానసిక సంస్కారరాశి, ప్రతిక్షణము నొకదాని వెన్కనొకటి వచ్చిపడుచునేయుండును. గాన బుద్ధికిని జాంచల్యము తోఁచుచునే యుండును. వడివడిగాఁ బరుగెత్తు బండిపైఁ గూర్చున్న వారికి; దారియం దిరుప్రక్కలనున్న నిశ్చలవస్తువులును బరుగెత్తుచున్నట్లు తోఁచునట్లే యనుకొమ్ము. సదా చంచలమైన మనస్సు సంస్కారముల నొకదాని వెనుక నొకదానిని దెచ్చిపెట్టి బుద్ధిజ్యోతిచేఁ బ్రకాశింపఁజేయుచుండును; గాన నతిచంచల మనస్సుతో సదా సంబంధమున్న హేతువున, నిశ్చలబుద్ధియును జంచలముగాఁదోఁచును. బహుజన్మ సంచితములైన జాగతిక సంస్కారములను విడిచి జీవుఁడు, బుద్ధిమయ క్షేత్రమందుఁ జిదాభాస నిర్మలజ్యోతిచేఁ దన్నుఁదా మఱచి, యించుకంత సమాధిచ్ఛాయ ననుభవించునపుడు, మున్ను రుచిచూచిన యానందరసము ననుభవించును. ఒకప్పుడా సమాధియం దెక్కువసేఁపు నిల్వజాలమిని, మఱలఁ జిత్తక్షేత్రమునకు దిగిపోయినను, ఆ యా స్వాదము తలంపునకు వచ్చు మాత్రాన,

సంస్కారములను మొదలంట నశింపఁజేయ సిద్ధపడును; గాని నిజముగా ననుకొన్నంత పనిచేయలేఁడు. అపుడు తన దౌర్బల్యము నెఱింగి మిగుల హతాశుఁడై పోవును. పెద్దనిట్టూర్చి తన మర్మదాహమును రెట్టించుకొనును. అయ్యో ! యీ దుర్బలచిత్త జీవునకు నాకు మాతృప్రాప్తి విషయమున మిగులఁ దిరస్కారమే యైనదనుకొంచు, సాధకుఁడు మిగుల నుదాసీన మనస్కుఁడై పోవును. అంతేగాక, యటు లెందుకయ్యెనో నిర్ణయింపఁజాలమిని మఱింత దుర్బలుఁడై పోవును.

## సాధకున కిదే శుభముహూర్తము

జగత్తున మనుజుఁ డేదేని దుఃఖముచే నలిగిపోవునపుడు, దాని కారణముఁ దెలియఁగల్గెనేని, దుఃఖపరిమాణము ఎంతో కొంత తగ్గును. కారణ మెఱుంగకున్నచోఁ బీడితుఁడే యగుచుండును. మనుష్యున కిది సైఁవరానిది. కామినీకాంచనములు, విషయవాసనలు, యమ నియమాసనాది సాధనోపాయములు తల్లిని జేరనీయవని యెఱుఁగును. అవి తన హితమును గోరునవి కావని, ఉదార మాతృవక్షము, అమ్మ యొడి, మనోబుద్ధుల కతీతములని, ఆత్మసత్త యతీంద్రియమని యెఱుఁగును. ఎఱిఁగి నను మననుయొక్క యుత్యాశను, దాని ననుసరించు నుద్యమములను జూచి, ధ్యాన ధారణాది యోగాంగములు, కర్మకాండము నన్ను క్షుద్రత్వమందే మోహితునిఁజేసి యుంచుచున్న వని కనుగొనును. సాధకా ! మనము ప్రతిక్షణము మానసికోత్తేజనము చేతనే యింతగాఁ బీడింపఁబడుచున్నాము. కళంకితుల మగుచున్నాము. మన యమూల్య జీవనము, ఎన్ని జన్మములందో పడరానిపాటులుపడి సంపాదించిన జ్ఞానము, ఉత్సాహము

మున్నగునవెల్ల వ్యర్థముగా వ్యయమైపోవుచున్నవి. సీమాబద్ధతయే (పరిచ్ఛిన్నతయే) ముక్తిమార్గమం దత్యంత విఘ్నము. అది తెలిసియు దానియెడ నింత యనురాగమేల ? ఎవ్వఁడును దాని కారణము నిర్ణయింపలేకుంటచే వానియెడ నిష్ఠురత వహింపలేకున్నాఁడు. వాస్తవముగా విడువఁదగిన వస్తువులే యొక యజ్ఞాతకారణముచే గ్రహింపఁదగిన వనుకొని సంగ్రహించుచున్నాఁడు. అక్కటా! ఎంత దౌర్భాగ్యము ! ఇట్టి చింత, ఇట్టి దౌర్మనస్యమును సమాధి నత్యంత మలినము చేసి యుంచినవి.

కొంచెకొంచెముగా సమాధి యాభాసించునపుడు సాధకునకు సంసార సంస్కారములు, విషయ క్షుద్రత, ఉపాసనో పాయములయెడ మున్నుండిన యాసక్తి, యనునవన్నియు మిగుల మర్మపీడాకరము లగును. సందేహము లేదు. గాని, సాధకా ! ఇదే నీ శుభముహూర్త మనుట మఱువకుమా ! బహుజన్మసంచిత సుకృతఫలముగా నేఁడు నీవు సమాధిసాక్షాత్కారము నొంది, జీవత్మమును సైఁపరాని సంకెలగాఁ గనుఁ గొంటివి; ఇదిగో నీ విపుడు ముక్తిమందిరద్వారముకడఁ జేరుకొంటివనుట మఱువకు. చూడు; నీ కొఱకే యమ్మ రవికె సడలిపోయినది. పుత్త్రస్నేహ వ్యాకుల యగుటచే. అమ్మ గబ్బిగుబ్బలనుండి పాయి జాల్వాఱుచున్నది. చిరకాలమునుండి సంతానము నొడియందుంచుకొనియు మనసార నాదరింపలేక పోయినది, గాన నేఁడు పిచ్చియెత్తినట్లు కడు వడిగా సత్యలోకమునుండి దిగినది. సాధకా ! నీ కొఱకై యమ్మ కెంత వ్యాకులత ! నీ వింతకాలమును అమ్మను గోరవైతివి ;

విషయములనే కోరితివి; కావున విషయాకారముగానే నీ చెంత
నిల్చినది. తన స్వరూపమును బహుకష్టముతో దాచియుంచి
విషయాకారముతో నీ యింద్రియములఁ గృతార్థము లొనర్చినది
కామినీ కాంచనాకారముతో నమ్మ నీ పెద్దపెద్ద కోరికలను దీర్చినది
నీవు తన కన్నబిడ్డవు కదా; - నీవు కోరినపుడు 'ఈయనా ? మానవా!
యని విచారింపక బిడ్డ నెయ్యముచే గ్రుడ్డిదైన తల్లి, నీ య
కోరికలకు దగునట్లు కామకాంచనాకారముతో, రూపరసా
విషయాకారముతో, దేహ మనోబుద్ధ్యాకారముతో, నీయెదు
నిల్చినది. ఔరా ! యీ నెయ్యమును దలంచుకొన్నంత
గుండెచెక్కలైపోవును; మర్మములు వీడిపోవును.
నెయ్యపుందత్త్వము నెఱుంగఁగలబుద్ధి మనకు లేనేలేదు.
నెయ్యమును ధరింపఁదగినది మన గుండె కానేకాదు. మన య
యద్వితీయ, అనంత. ఆమె స్నేహము సైతము అద్వితీయమ
అనంతము. అమ్మ నీకై యేమిచేయుచున్నదో ఒక్కసారి చూడుమ
ఎంత వ్యాకులతతో నిన్నుఁ దన గుండెకుం జేర్చుకొన్నదో ! ఎం
పిచ్చిదై నిన్ను ముద్దాడుచున్నదో ! ఎంత యావేగముతో ని
నిత్యానందమందు నిల్పుచున్నదో ! చాంచల్య విషయ వాస
వేగముచేనైన నీ మోహం ఇట్టె తొలఁగిపోవును. ఈ కథను
వెల్లప్పుడు చూచుచుండుము. శుభదినము వచ్చినది. మహా
స్సమయము సన్నిహితమైనది. ఇదిగో - సమాధి మొట్ట మొద
బహుదృఢము, ఉజ్జ్వలము కాకపోయినను, దాని
యింతనరానిది. అది బహుజన్మ బహుసాధన ఫలము.
పుణ్యముచే అమ్మవంక కాకర్షణము కొంచెకొంచెముగా న

వించునపుడు మాతృస్నేహ ప్రబలాకర్షణ మాధుర్యము, విష యాభిముఖ విపరీతాకర్షణముయొక్క కటుతయు సానుభవములైనపుడు, జీవమాత్రుఁడే నిఃశ్వాస దౌర్మనస్యములతో "నేనేమి చేయుదును?" అని వ్యాకులుఁడై, ఆ యజ్ఞేయ మోహమును ద్రెంపుకొన యత్నించును.

## ఇపుడే యమ్మ గురురూపమున జీవుని ధన్యుని జేయును

జీవుఁడు తన జ్ఞానబలముచేతను, అధ్యయనాదులచేత నైన జ్ఞానముతోడను, సమధర్మియైన మఱొకని జ్ఞానప్రకాశము చేతను = (తనయట్టివాఁడే మఱియొకఁడు జ్ఞానవిషయమును దెలియఁజెప్పుటచేతను) మఱెవ్వరివల్లను దత్త్వజ్ఞానము కల్గక, దేనిచేతను దన దప్పి తీఱక, అజ్ఞాన తమస్సు మఱింత ఘనీభూతమైపోఁగా, ఎట్లును దన సందేహములు తీఱకపోఁగా "ఏమి చేయుదును, దేనివల్లను లాభములేదు; ప్రయత్నము వృథా; ఆయోజనము వృథా; తపస్సు వృథా; కర్మోద్యోగము వృథా; అది యిది అన్నియుఁ జేసితిని, గాని బ్రతుకు కృతార్థము కాలేదు. అమరత్వాస్వాదమింతయు లభింపలేదు; అభయము చిక్కలేదు. సంశయమయులు తొలఁగలేదు" అను నిట్టి భావములతో జీవుఁడు వ్రతరహితుఁడై మతిపోయినటు లున్నపుడే మన యమ్మ గురురూపమున నావిర్భవించును. ఏదో నొక దేశమునకో జాతికో చెందిన లోకులనేకులు, ఇట్టి భావములతో వ్యాకులం పడునప్పుడే, యమ్మ జగద్గురురూపమున, ఋషిరూపమున, ధర్మప్రతిష్ఠా రూపమున మనుష్య దేహమందు వెలసి, సత్యసముజ్జ్వల ప్రకాశముతో జీవులను ధన్యులుగాఁ జేసివేయును. అటు లా

యమ్మ వెలయునప్పుడు లోకులు కొద్దియెా గొప్పయొ యథార్థముగా నామె నెఱుంగఁగల్గుదురు. కాని, తిరోధానమైన తర్వాత జగత్తు వాని యుపదేశములను విని, వాని కార్యములను ఆదర్శములనుగాంచి మఱల వానిని మనవంటి మనుష్యుఁడే యనక, యీశ్వరుని విశిష్టావతారముగా నెంచి పూజింతురు. ధన్యులగుదురు. ఇదే, యమ్మ యాట.

## గురూపాసనము

జీవసత్తముఁడు (శ్రేష్ఠుఁడు) అనఁగా సత్యప్రతిష్ఠుడు సచ్చిదానందమయియైన యమ్మ సత్స్వరూపము ననుభవించిన వాఁడు, ఆస్తిక్య బుద్ధియం దెన్నఁడు నెట్టి సందేహ వైపరీత్యములు లేనివాఁడును మాత్రమే సార్థకసత్తముఁడు. ఈ మాట యింతయు నుపేక్షింపరానిది. కేవలాస్తిక్యబుద్ధియే సాధనముయొక్క యథార్థ మూలధనము. ఇదెంత యధికముగా నుండెనో యంత యధికలాభము నొందఁగలఁడు. "అమ్మ సంబంధమున నేనేమియు నెఱుఁగను. ఆమె రూపగుణ స్నేహాదర మహిమాదులు నాకింతయుఁ దెలియవు. మాయమ్మ యొక వ్యక్తి" యని మాత్రమే నే నెఱుఁగుదును. ఇమ్మాట యెడ, వందలు వేలుగా ఘాత ప్రతిఘాతములు, సందేహములు, వితర్కములు, విరుద్ధ ప్రమాణములు నెన్నియేని కానిమ్ము, మన యా సత్యజ్ఞానమునకు ఆస్తిక్య బోధమునకు బిందు మాత్రమైనను జాంచల్యము కల్గదనెడి యొక విశ్వాసము రావలయును. ఇట్టి భావముతో, అమ్మయొక్క సత్స్వరూపసాధనమునందు సిద్ధుఁడగువాఁడే నరసత్తముఁడు అనఁగా సర్వజీవులలో శ్రేష్ఠస్థాన మందువానికే యధికారము గలదు

ఇట్టి సాధకసత్తమవ్యక్తి, గురుసన్నిధిని జేరినపుడు, వాఁడెట్లు వ్యవహరించును ? యథాన్యాయముగా, యథాయోగ్యముగా, సముదాచార పూర్వకముగా గూర్చుండును.

యథాన్యాయము - విధిపూర్వకమని యర్థము. ఏ విధముగా సముదాచారము యథాశాస్త్రమును యథాయోగ్యమునగునో యది యించుక తెలుపఁబడును. గురుసమీపమునఁ జేరినపుడు "నేను సాక్షాద్భగవంతుని సన్నిధినే చేరితి" ననియే మనస్సునందట్టును. "ఇతఁడు నా జన్మజన్మాంతర చిరనఖుఁడు, చిరసుహృత్తు. హృదయరాజ్యము నేలు నేకచ్ఛత్రసమ్రాట్టు. ఇతఁడు విజ్ఞాన మయుఁడు. సర్వభూత మహేశ్వరమూర్తితో సర్వభూతములందు వెలయువాఁడు. ఇతనియందే సమగ్రజగత్తు నిల్చియున్నది. అధిక మేల ? నేనెవరిని గోరుచున్నానో, ఆ మా యమ్మయే నాయెడ నెయ్యముతోఁ, బరమకృపతో నాకొఱకే నేఁడు మనుష్యరూపమును దాల్చి యెదుట నున్నది. నేను గోరినచో నివుడే నాకట్లను సడలింపఁగలదు. ఇతఁడే తలంచినచో దయచేసి, నా యజ్ఞానాంధ నేత్రములందు దివ్యజ్ఞాన జ్యోతిని వెలిగించును"అనెడి యీ తెలివియందు నిల్కడగలిగి నీ మనసేమి కోరిన నది చేయుము. యథాశక్తి వినయభావముతోఁ గాయిక వాచిక మానసిక ప్రణామపూర్వకముగా, అడుగులు తాకుట కధికారమిచ్చినచో నడుగులంటి మ్రొక్కి కృతార్థుఁడ వగుము. అతఁడు పలుకనంత సేపు ధీరముగా నాతని యనుమతిని బట్టి చేమోడ్పుతో నిల్వుము. తాత్పర్యము - నీవు సాక్షాద్భగవంతుని సమ్ముఖమున నున్నపుడు,

నీ మనఃప్రాణేంద్రియ దేహాదులం దెట్టి పరివర్తనమైన దనుకొందువో, అట్టి పరివర్తనము గురుదర్శనమాత్రమున సంఘటితమైనపుడే, నీ సముదాచారము యథాన్యాయము యథాయోగ్యముగా నైనదని తలంపుము. గురువునెడ యథార్థ భగవద్బుద్ధి గలుగకున్న యథార్థ సంవిత్ (సమ్యగ్ జ్ఞానము) కల్గదు. ఈ సంవిత్తు ఎంత సరళము, ఎంత సత్యమునై, యెంత విశ్వాసముతో నిల్చునో యంత శీఘ్రముగా గురుకృపనొంది కృతార్థుఁడగును. గురుకృప గల్గుటచే, మఱి భూమిపైఁ బుట్టి గిట్టుట కాదు. గురుగీతలందు "మోక్షమూలం గురోః కృపా" యని చెప్పఁబడినది.

## సముదాచారము తర్వాత గురుసన్నిధి నుపవేశనము

గురుఁడు నీ యాసనగ్రహణమున కనుమతించినపుడో, సన్న చేసినపుడో నీవు కూర్చుండుము. ఇందును గొంత విశేషమున్నది. - నీ పాదములు గురునకుఁ గానరాకుండ వస్త్రముతోఁ గప్పియుంచి వేరుదండము తిన్నఁగా నిల్పి, తల యించుక వంచి గురునాజ్ఞలనెల్లఁ బాలించుటకు సిద్ధముగా నున్నానననెడి భావము తెల్లమగునట్లు బెట్టు నవ్వు, అజాగ్రత్త మున్నగునవి లేకుండ, యాతని శ్రీముఖమునుండి వెడలు ప్రతివాక్యమును ధ్యానపూర్వకముగా వినుటకై యెల్లపుడును జెవులు రిక్కించి యుండుము. గురుఁ డానందమయ మహాపురుషుఁడు; సదా బాలకునివలె సరళభావముతో వెలయుచుండును, గాన అతని మాట యెన్నఁడును హాస్యజనకము కాదు. వానిని విని నీ చాంచల్యము బయలగునట్లు నీ వెన్నఁడును నవ్వకు. ఇంతేల!

స్థిరధీరభావముతో, శుశ్రూషాయోగ్యతతో వినయముతో, అజ్ఞాపాలనమం దుద్యతుఁడవై యుండుము. ఈ యైదు భావములు తేటపడునట్లుండుటయే శిష్యునకుఁ దగును (శిష్యత్వము).

సాధకా ! శిష్యత్వసాధనమందు సిద్ధుఁడవగునపుడే నీకు సర్వము ప్రాప్తించుననెడి మాట మఱువకు. శిష్యత్వము సిద్ధమైనపుడు గురుఁడు మట్టిబొమ్మయైనను, మోక్షము తప్పక లభించును. శిష్యత్వ సాధనమును ప్రసిద్ధమహర్షులు చేసిరి. మహాభారతమందలి యొక చక్కని దృష్టాంతము :- చండాల పుత్త్రుఁ డేకలవ్యుఁడు; అస్త్రగురుఁడైన ద్రోణాచార్యునిచే నవమానితుఁడై, మట్టితో గురు (ద్రోణ) మూర్తిని గల్పించుకొని ప్రతిష్ఠించి; సాక్షాద్గురుభావముతో నా మృణ్మయగురుమూర్తి ముంగల నస్త్ర ప్రయోగమభ్యసించి- ఒకనాఁడు ద్రోణచార్యుని ముఖ్యశిష్యుఁడును, సర్వాయుధ విశారదుఁడునైన యర్జునునకు సైతము తలవంపు గల్గించునంతటి వాఁడయ్యెను. ఆహా ! శిష్యత్వసాధన మెంత ధన్యము ! ముందుగా నీ హృదయమునే గురువున కాసనముగాఁ జూపి, స్వయముగా శిష్యత్వప్రాప్తి కైన యోగ్యతను గడింపుము. గురువుకొఱకు వ్యాకులుఁడవు గాకుము. గురుఁడు దొరకకపోఁడు. గురుఁడు, నీ వెప్పుడు సమీపింతువో, నిన్నెపుడు కృతార్థునిఁ జేయుదునో యనియే ప్రతీక్షించుచుండును. గురున విచారించుకొనుచు నీవు పరిభ్ర మింపకుము. దానికేమి ? నీవు ముందుగా, శిష్యుఁడవైతివో లేదో చూచుకో. నీవు కోరినచో గురుఁడెవ్వఁడే నొకఁడు కాఁగలఁడు.

భాగవతమందు - అవధూత దత్త్రాత్రేయునకుఁ బశు పక్షి పర్యంతము గురువులైరి. కావున శిష్యత్వప్రాప్తియే సాధనము.

చూడు; హిందువులయిండ్ల యాఁడుబొట్టె లేమి చేయుచున్నారో - పదిపంౘ్రెండు, పదునాలుగేండ్లు కన్నవారి యింటనే యుండి తల్లిదంౘ్రుల నెయ్యముచే లాలితలై, పాలితలై, యన్నదమ్ములు, అక్కసెల్లెంౘ్రు, చెలులు మున్నగు నాత్మీయులతోఁ గలిసిమెలసి యొకచోటఁ గడుపుదురు. సరి; ఏదో యొకనాఁడు, మున్నెన్నఁడు ముక్కు మొగ మెఱుఁగని పాతటికము లేనివాఁడు ప్రత్యక్ష మగును. పురోహిత మహాశయుఁడు మంత్రములనుచు నాలుగుమాట లేకరువు పెట్టును. రాత్రి గడవదేమి వేగమనుచు, గడియలు లెక్కించుచు, నెటులో రేయి పుచ్చి, తెలవాఱునంత లేచి, యామె పూర్వపరిచితులైన జనక సోదర బంధు మిత్రాదులను హఠాత్తుగా విడిచి, ఆ యపరిచిత పురుషునితో, ముసిముసినవ్వులతో, రసవంతములగు గుసగుసలతో నానందించుచు లేచిపోవును. అపుడు తన మనస్సులో "ఇతఁడే న఼ా సర్వస్వము" అనుకొనును. ఇతఁడే నా యుత్తరకాలమందు గతి. ఈ యున్న వారెల్లరు నాత్మీయులే. కాని, యీతనిసాటి ప్రియతము లెవ్వరుంగారు" అనుకొనును. మున్నెన్నఁడు వానిం జూడలేదు. వానికథ యెఱుఁగదు. గ్రుడ్డివాఁడో - చెవిటివాఁడో - మూర్ఖుఁడో - పండితుఁడో - మంచివాఁడో - దొంగయో, యెట్టివిచారము లేదు. సందేహము లేదు. "ఏ దెటులేఁగానీ, ఇతఁడే సర్వస్వము" అనును. క్షణమాత్రములో నెంతచక్కని మార్పు ! చూడుము. తీవ్ర సాధనఫల

మెట్టిదో చూడుము. విచారించి చూచినచో వింతతక్క మఱేమియు లేదు. ఇట్టిదే శిష్యత్వము.

ఇటులెందుల కగును ? హఠాత్తుగా నింత పరివర్తనము సంభవమా ? కారణము మఱేమియు లేదు. ఆ బాల పలునాళ్ల నుండి పత్నీత్వ (ఇల్లాలగుటకైన) సాధనము నొరులెఱుఁగకుండఁ జేసి సిద్ధినొందినది. ఆమె 'నేనొకనాఁడొకనికి భార్యనగుదు' నని యెఱుఁగును. "వాఁ డెవ్వఁడు కానీ, ఎట్టివాఁడు కానీ, అతఁడే నా సర్వమును బట్టిచూడ, నాకుఁ బ్రియతముఁడు కాఁ గలఁడు" అను నిట్టి ధారణ పలునాళ్లుచేసిన ఫలముగా, నిట్టి యాకస్మిక పరివర్తన మగుట సంభవమే. సరిగా, నిట్టులే నీలోనే గురునాసనమును రచియించుకొమ్ము, నీవు శిష్యుఁడవగుము. గురువిచారము చేయు నవసరముండదు. 'ఇతఁడు గురువు కాఁ దగునా ? తగఁడా ? ఇతఁడు నన్ను ముక్తిమార్గమునందుఁ గొనిపోఁగలఁడా ? లేఁడా ? యని విచారించు నవసరము లేదు. ఈశ్వరప్రేరణముచే, గురురూపమున నీ యెదుట నిల్చినవాని యెడ నీ ప్రాణము తానే నమితమై పోవును. గురుఁడొక యధారమాత్రమే. చేయుటంతయు తనదే. ఒకఁడెవ్వఁడును వేఱొకనికి ముక్తి నీయఁజాలఁడు. ఈయలేదు. నీ సమస్త భారములను గురువుపైనే విడిచి నీవు నిశ్చింతముగా గూర్చుండఁ గలవా ? అట్టి మహాపురుషులు జగమునం దరుదు. అట్టివారు శిష్యులకుఁ దెలియకయే మోక్షానుకూలకార్య సంపాదనము చేయింతురు.

అది యుండనీ; జీవుఁడు బహుజన్మసంచిత పుణ్యఫలముగా సమాధి సాక్షాత్కారము నొందును. ఇంత విలంబమునకు హేతువైన

లోటేది ? లోటు దేనికి ? - జ్ఞానమునకు. ఒక్కబొట్టుజ్ఞానము నొందుటకై జీవన కెంతో కఠోరతపస్సు చేయవలసివచ్చుచున్నది. సాధారణముగా జీవుఁడు దేనిని శ్రేయమనుకొనునో యది ప్రేయము కాదు. ఏది ప్రేయమో దానిని శ్రేయముగా గ్రహింపలేకున్నాఁడు. ఈ శ్రేయఃప్రేయముల సమస్యను దొలఁగించు జ్ఞానజ్యోతిని బడయుటకు (ప్రజ్ఞారూప) శుద్ధబోధమనెడి గురువు నాశ్రయించుటగును. ప్రత్యేక జీవుని హృదయమందును నది గురురూపమున నిత్యము వెలయును. ఆ శుద్ధబోధమే అంతర్యామి చిన్మయమహాపురుషుఁడు. హృదయమందున్న యీ గురుని సాక్షాత్కారము నొందనంతదాఁక, జీవుఁడు యథార్థశాంతి కేంద్రమును వెదకుచున్నను దొరకదు. బాహ్యమందలి మనుష్యమూర్తి గురుఁడు విజ్ఞాన మయ మహేశ్వరమూర్తిగా వెలయనంతదాఁక యథార్థగురు ప్రాప్తి కాలేదన్న మాటయే. గురుప్రాప్తి యైనంతనే జీవునకు మఱెట్టి భయమును నుండదు. అతని ముక్తి సునిశ్చితము.

## ఆ గురుఁడే మన పెద్దదిక్కు

మనోయోగ సాధనముతోనే యీ హృదయస్థ గురుసన్నిధిని జేరఁగలము. కొంచెకొంచెముగా సమాధి పరిచయమైన పైని జీవుఁడు ఈ బోధమయగురుని జేరుటగును. సమీపించి మన కథలను జెప్పికొందుము. నీ దుఃఖకథలను అమ్మతోఁ జెప్పఁగోరినచో ముందుగాఁ గైలాసమునకుఁ బొమ్ము. అప్పుడైనను అమ్మకు నీ దుఃఖకథలను విన్పింపగలవా ? మనయమ్మ కైలాసముకంటె నన్నిటికిని బైశిఖరమునందు గురువక్షమందు నిత్యము విరాజిల్లును.

అమ్మను జూడుము. కైలాసమునకుఁ బొమ్ము. గురువును బట్టుకో. అపుడు నీకు గురువే యమ్మ యని, అమ్మయే గురుఁడని నీవు కనుగొందువు. ఇది తెలియుటకుఁ దడవుకాదు. ఆ గురుఁడే మన పెద్దదిక్కు; ప్రాణమునకుఁ బ్రాణము. సకునికంటెను బ్రియతముఁడు; బందుగుకంటెను బరమస్నేహశీలుఁడు. భార్యకంటెను నధికానంద దాయకుఁడు; ఇతఁడే మన కత్యంతాంతరంగికుఁడు. అతనితో మనసు విచ్చి మాటలాడక మఱెవ్వరితో నేమి చెప్పికొందువు ?

ఇదిగో, గురువువలన నీ వెన్నఁడేని దీక్షగాని, యుపదేశముగాని పొందియున్నచో నా గురుఁడు నీవాఁడు. నీవాఁడు కానంతదాఁక - నీకత్యంతాంతరంగికుఁడగు నా గురుఁడే నీవును గానంతదాఁక, నీకు గురులాభమైనట్టులే కాదని తలంపుము. అపుడు ప్రత్యేక కార్యము నతని మహోద్దేశ్యపూర్ణమైన యైశ్వరిక కార్య సూచనముగా శిష్యుని హృదయమునందు వెలయును. ఆదర్శ శిష్యుఁ డర్జునుఁ డీ రీతి నసూయారహితుఁ డైనప్పుడే భగవంతుఁ డతనికి అపూర్వమైన రాజగుహ్యయోగము నుపదేశించి ధన్యు నొనర్చెను.

## గురుఁడే బ్రహ్మము

జీవుఁడు ప్రజ్ఞానఘనగురుని సమీపించినపుడు అతనిని భగవంతుఁ డనుటకు బాధ్యుఁ డగును. ఏలన - ప్రజ్ఞానమే బ్రహ్మము. గురుఁడు - బ్రహ్మము వేఱుకాదు. గనుక నా యవస్థయందు భగవంతుఁ డనుటే మిగుల స్వాభావికము. వ్యావహారిక జగత్తునందు సైతము, శిష్యుఁ డెవ్వఁడేని గురువును

సమీపించునవుడు, అతని( బ్రత్యక్షేశ్వరునిగా( జూచుటే యుచితము. విచారవివేక సహాయమున( గల్పనచే గురు నీశ్వరరూపముగా( జూచుట తన నిమ్నాధికారమును సూచించును. గురుదర్శనమైనంతనే, గురునామము విన్నంతనే మనసు నిష్కపట శిశువువలె నైపోవుటే యుచితము. అత(డే మన భగవంతు(డు. నీ తల్లి వికలాంగయై పోయిననను 'ఈమే మాయమ్మ' యనుచు, నొక యవ్యక్త సరలసత్య సంబంధము ప్రకటమగునట్టులే, గురు(డెవ(డు కానీ, యెట్టివా(డు కానీ యత(డే నా యీశ్వరు(డు; అత(డే యుత్తరకాలగతి; అత(డే సర్వ సృష్టిస్థితి ప్రలయకర్త. కేవలము మనయెడ( గృప నెఱపుటకే మనుష్య రూపముతో వెలయుచున్నా(డు. ఇత(డు బహులోకగురు(డు కా(గల(డుగాని, మన మా విషయముం గనుగొను నావశ్యకత లేదు. ఇత(డే మన గురు(డు - బ్రహ్మము. ఇది కేవల కల్పనము కాదు. యథార్థముగా భగవంతు(డు తక్క మఱెవ్వడు నెవ్వనికిని గురువు కానధికారము లేదు. ఎవ్వ(డేని జీవభావాపన్ను(డైనవా(డు తనను గురువుగా నెన్నుకొనునేని, వా( డనాయాసముగా 'ఉ' కారమును గోల్పోయి 'గరువు' (పశువు) అయిపోవును. ఏమన, వా( డజ్ఞానాంధు(డు. గురుగీతలందలి మంత్రములు చదివినచో - గురు( డెవ్వ(డు ; సాలగ్రామ శిల యుంచ(బడు సింహాసనముకూడ మనకు( బూజ్యమే యైనటులు, గురుని కాసనమైన మనుష్యదేహము కూడ (గురుశక్తి ప్రకాశించుట కాశ్రయమైన దేహము) మనకు( బూజ్యమే. గురు( డొక జను(డు. ఎవ్వ(డును ఎవ్వరిగురువును నిందింపరాదు. ఏలన - నీ గురువు, నా గురువు వేఱు కారు. వైష్ణవ శైవ శాక్తాది

బాహ్యావరణములు గురువులు భిన్నులని తెల్పు గుఱుతులు కావు. గాజుచిమ్నీలు వివిధాకారములు, వివిధవర్ణములు కలవైనను, లోపలి దీప ప్రకాశ మొక్కవిధముదే. కాని చిమ్నీ రంగునుబట్టి దాని కాంతి పలురంగులుగాఁ దోఁచును. అటులే, గురుఁ డొక్కఁడే భిన్నభిన్నాధారములందుండి, భిన్నభిన్నధికారుల కల్యాణముకొఱకు భిన్నభిన్నభావములతోఁ దాఁ బ్రకాశించును. ఇదిగో, "మద్గురుః శ్రీజగద్గురుః" అనుమాట మఱువకు.

## గురులాభానంతరము శిష్యుఁడేమి చేయవలయును?

ఈ విషయమున శాస్త్రము - తనువు, ధనము, మనము, వాణి యను నాల్గిటిని యథాసంభవముగా శ్రీ గురుచరణములం దర్పించుటావశ్యకము. సర్వవిధముల గురునాజ్ఞ పాలించుటకై దేహమును శ్రీ గురుచరణములందర్పించుట పేరే తన్వర్పణము. గురువును సాక్షాదీశ్వరునిగాఁ జూచుటపేరే మనో ఽర్పణము. గురుపీఠమును - అతని పాంచభౌతిక శరీరమును బోషింపఁదగు ద్రవ్యమును యథాశక్తిగా యథావసరముగా నర్పించుటపేరే ధనార్పణము. ఈశ్వరపూజా సేవాదికమువలని ఫలము పలుతావులం దప్రత్యక్షము; అయినను మనుష్యశరీరమం దవతరించిన గురుని సేవాపూజాదికముల ఫలము ప్రత్యక్షముగాను బరోక్షముగాను నగును. ఇది హేతువుగానే గురున కీశ్వరునికిఁ గన్నను ఉచ్చతరాసన మీయఁబడును. గురుఁడు గృహస్థాశ్రమి యైనచో ధనము, వస్త్రములు, గోవు మున్నగు తనవి సమర్పించుట పేరే ధనార్పణము. ఓయి ! భయపడకు. బ్రహ్మనిష్ఠుఁడైన గురుఁడు

నీ సర్వస్వముఁ దీసికొని నిన్ను దరిద్రునిఁ జేయఁడు. ఒకప్పు డటులు కైకొన్నను బ్రసన్నతతో నోర్చికొమ్ము. నాయనా ! కొంచెము కష్టపడకున్న బ్రహ్మజ్ఞానము గలుగదు. అది కేవల సులభముకాదు. దాని నొందియే నీ వమరుఁడ వగుదువు. నిత్యానందము ననుభవింతువు. ఈ పృథ్వీపైనుండియు నీ వపార్థివజీవుఁడ వగుదువు. అది కేవల మౌఖికభక్తి వలన నబ్బదు. నీ చిత్తము కేవల సాంసారిక నశ్వరపదార్థములందుఁ దగిలియున్నది. ఆ తగులమును ద్రెంచివేసి, దానిని దెచ్చి గురుచరణములం దర్పింపవలయును. సర్వథనార్పణము దాని మొదటి ప్రయత్నము. గురువు సన్న్యాసియైనచో శిష్యుడు సర్వమును బరిత్యజించి సన్న్యాసియే కావలయును. పిదప నతఁడు మఱి యింటికిఁ బొమ్మని యానతిచ్చినచో, నతని యా దేశమును బాలింపవలయును. సర్వదా గురుగుణగానమును జేయుటే వాణి నర్పించుట. ఈ విధముగా శిష్యుని కర్తవ్యము పూర్ణమగును.

## అపుడు గురుకర్తవ్యారంభము

ఒక్కనాటి ప్రయత్నముచేఁ గాదు. కొన్నాళ్లు ప్రయత్నించినను శిష్యత్వార్జనమును, గురునిపై సర్వభారములను బెట్టుటయు ననంభవము కాదు. బ్రహ్మనిష్ఠుఁడైన గురుఁడు నీ సర్వస్వమును గ్రహించి, నిన్నమృతధనముచే వంచించునో యను నాశంక యెన్నఁడును జేయకుము. ఏలన, శిష్యునకు ముక్తి కలుగనంతదాఁక, గురువునకును ముక్తి లేదు. విశ్రామము లేదు. బహు భయంకరమైన యీవి. గురువు నీకే మిచ్చునో తెలిసినదా?

"ఏక మప్యక్షరం యంతు గురుః శిష్యం ప్రబోధయేత్ ।
పృథివ్యాం నాస్తి తద్ద్రవ్యం యద్దత్వాసో ఉనృణీ భవేత్ ॥"

గురుఁడు శిష్యునకొక యద్వితీయాక్షర పురుషుని జ్ఞానము గల్గించునపుడు, దానికి బదులుగా నేమే నిచ్చి, ఋణవిముక్తుఁడు కాఁదగు వస్తువే లోకమునందు లేదు. తెలిసినదా ? గురుఁడు శిష్యున కేమిచ్చునో ? ఒక యక్షరము నిచ్చును. ప్రబోధితునిఁ జేయును. మేలుకొలుపును. గురుఁడు శిష్యున కేమిచ్చునో తెలియునా ? ప్రాణము. తన పుత్త్రునే కిచ్చుటకును వెనుదీయునట్టి తన ప్రాణమును దన చేతితో లాగి, శిష్యుని హృదయమందుఁ గూర్చుండఁబెట్టును. గురుఁడు శిష్యుని కేమిచ్చివేయునో తెలియఁగల్గితివా ? తాను చచ్చి శిష్యుని బ్రతికించును. ఏ బ్రహ్మానందమందు (శిష్యుని) నిల్పుటచే జగత్తనియు, శిష్యుఁడనియు, దీక్షయనియు మఱేదియు నుండదో ఆశ్చర్యము అపుడా బ్రహ్మానందముకంటెఁ గ్రిందికి దిగి, శిష్యునెడఁ గృపావశుఁడై నెయ్యముతో వ్యాకులుఁడై, యా యానందమునే శిష్యునకు వితరణ మొనర్చును. దానియందే యతనికి సుఖమున్నది. తన సుఖమును దాను గోరఁడు. గురుఁడు శిష్యుని కేమిచ్చెనో, యేమి యిచ్చునో తెలిసినదా ? శిష్యుని మాలిన్యములను, సంతాపములను, బాపములను దాను దీసుకొని, తన పవిత్రత చేతను, దన పుణ్యోజ్జ్వల ప్రకాశముచేతను శిష్యుని గృతార్థుని జేయును. గురువు శిష్యుని కిం కేమి యిచ్చునో తెలియునా ? అవన్నియుఁ జెప్పమన్నచోఁ బని సాగదు. శిష్యుఁ డైనవాఁడు గురువునే తన ప్రాణముగాఁ దలంచును. ఉపనిషత్తు లందు, "యస్య దేవే పరా భక్తి ర్యథా దేవే తథా గురౌ ।

తస్యైతే కథితా హ్యర్థాః ప్రకాశ్యంతే మహాత్మభిః ॥" ఎవనికి గురువునం దీశ్వరబుద్ధి గల్గునో, ఎవఁడు తన గురువునెడ నీశ్వర జ్ఞానముతో నేభక్తి నెఱపునో, వానియెడనే గురువుపదేశించిన సాధన రహస్యములును, యథార్థతత్త్వమును బ్రకాశించు చుండును. ఇది యుండనిమ్ము.

## బోధమయ గురులాభానంతరము జీవునవస్థ

బోధమయ గురుసమీపమునుజేరి విషయాసక్తి కేంద్రమును వెదకఁబూనును. "సంసారము నాదికాదని జ్ఞానముచే నెఱుఁగుదును. దేహేంద్రియాదులు నావికావని యితరులకుఁ జక్కఁగాఁ జెప్పుదును. కాని కార్యవేళ నందతికంటె నజ్ఞుఁడను. ఎఱిఁగినదేదో యది కార్యరూపమునఁ బరిణమింప కున్నది" యనును. సాధకునకే యిట్టి సంకటదశ గల్గును. నిర్మలబుద్ధి జ్యోతిచే హృదయ మెంతగాఁ బ్రకాశితము కానీ; సాంసారిక సంస్కారశ్రేణిని గూర్చిన యకించిత్కరత్వబోధ మెంతఁ గల్గనీ చిత్తముయొక్క చిరాభ్యస్తమైన యాసక్తి, దేనిచేతను నివృత్తి కాకున్నది. మన యమ్మ మొకవంక జ్ఞాన ప్రకాశమును వెలయించి సాధకుని హృదయమందు నిత్యా నిత్యవస్తువివేకము నెంతగా వెలయించునో, యంతగా నాతఁడు తన చిత్తము మున్నేవిధముగా విషయవిమూఢమయ్యెనో, దేహాత్మజ్ఞానముచే ముగ్ధమయ్యెనో యిప్పుడును నట్టులే యున్నదని కనుగొనును. "దేహమన నేమియుం గాదు; సంసారమన నేమియుఁ గాదు; సంస్కారములన నేమియుంగాదు; ఇవన్నియు మనయమ్మ స్వేచ్ఛతో

నాడుకొనుచున్న క్షుద్రత్వపు టాటలు మాత్రమే." యని బాగుగా నెఱుంగఁ గల్గును. కాని యీ క్షుద్రత్వమందే మనసు ముగ్ధమైనది. దానిని విడిపించు నుపాయము లేదు. "ఇవి దోషపూర్వకములు కావనుమాట లేకపోయెఁగాని, మున్నివి యింత పీడాకరములు కావయ్యె. అపుడీ సంసారకూప మందు విషవాయువులు నిండిన చీఁకటికోణమందు, బహుసుఖముగా నివసించితిని." అనుకొనును. కాని, యిపుడు జీవుఁడు బుద్ధియోగలాభము నొందెను. సమాధి సహాయ మించుక దొరికినది. నిర్మలమును బ్రకాశవంతమును, ఉదారమును, అనంతమునైన చిన్మయాకాశము కానఁబడెను. ఇప్పుడా తొల్లింటి యవస్థ ప్రీతికరముగా లేదు. "త్యక్తుం భోక్తు మశక్తాయే దుఃఖినస్తే త్వహర్నిశమ్" విడువను, ననుభవింపను జాలనివారు, సర్వకాలము లందును దుఃఖవంతులే. ఈ దశయందు విషయాసక్తి పరిహారము, విషయ భోగానందప్రాప్తియను రెండును లేకుండుటచే జీవుఁడు మిగుల దుఃఖితుఁడు కాఁజొచ్చును.

## సాధన క్షేత్ర కష్టములు

నిజముగా జీవుఁడు- విషయములు విషమాత్రములని కనుగొన్నను, దా నెఱుఁగని యొక శక్తి యొత్తిడిచే, ఆ విషమును గొంతులో దిగువకే దింపివేయుచున్నాఁడు. ఇంతకంటె నరక యంత్రణ మేదికాఁగలదు ? తొల్త నీయంత్రణము పరిమితముగా ననుభూతమగును. మన యమ్మ దయచేసి బుద్ధిమయ క్షేత్రమందు నిల్చు నుయోగమును సమయమును నెంతగా నెడము చేయుచుండునో, యంతగా నీ యంత్రణపరిమితి పెరుగు

చుండును. "జాగతిక కార్యములను జేయుచున్నామే కాని, దేని యందును మేలు కాన రా కున్నది." యనుచు నొక మర్మపీడ లోలోనే యగుచుండును. కనుకనే, సాధకుఁడగుటకంటెఁ గాకుండుటే సుఖమనును. ఈ పీడను సాధకుఁడు తక్క నితరుఁ డనుభవింపఁ జాలడు.

ఇపుడు మన యమ్మ గురురూపముతో శుద్ధబోధ రూపముతో, విజ్ఞానమయ మహేశ్వరరూపముతో, ఆశుతోషమూర్తితోఁ గూర్చుండి, తన బిడ్డల నోర " మేమత్యంత దుఃఖితులము" అనుమాట వినుచున్నది. ఒకనాఁడు, అమ్మగీతాగానము చేయుచు నర్జునునకు "అనిత్య మసుఖం లోక మిమం ప్రాప్య భజస్వ మామ్" అనిత్యమును దుఃఖమయమునైన సంసారము నొందియే నన్ను భజింపుమన్నది.

యథార్థముగా దుఃఖము మంచి హితకర వస్తువు. దుఃఖమే, యమ్మను దెచ్చిపెట్టును. దుఃఖముతో సాటియైన చుట్టము మఱి లేఁడు. దుఃఖమును వెలపెట్టియే మనుజుఁడు సుఖమును గొనుచున్నాఁడు. దుఃఖమునే అమ్మ పంపెడి యాగ్రదూతగా నెఱుంగుము. చెప్పెడి దేమనఁగా - దుఃఖ జ్ఞానము కలుగవలయును. దుఃఖము ననుభవింపవలయును. "అనేకులు కట్ట బట్టయు, నిల్వ నీడయుఁ, దిన బువ్వయు లేకున్నారు. కొందఱి భార్యలు అప్రియవాదినులు; కొందఱి కొడుకులు అప్రియకారులు; కొందఱి బంధుగులు కట్టుబాటు లేని యత్యాచారులు; అయినను వారు సుఖముగానే యెట్లో దినములు నెట్టుచున్నారు." అని గొణుఁగుకొనుట వినుచున్నాము. వారికి దుఃఖానుభవ మెక్కడనున్నదో చెప్పండి.

సరిగా దుఃఖానుభవమైనవారే శ్రీఘ్రముగా దుఃఖవిముక్తులగుదురు. అమ్మ యీ దుఃఖానుభవము చేయించుటకే దుఃఖ రూపమున వచ్చినది. సాంసారిక దుఃఖముల యనుభూతిని రేగఁగొట్టి, యప్పుడు సాధనక్షేత్రమందు జీవులను బ్రవేశపెట్టును. ఆ తర్వాత మాతృ స్నేహరసముతో నభిషిక్తుఁడై క్రమక్రమముగా సాధనక్షేత్రకష్టముల ననుభవింప మొదలిడును.

## అంతయు అమ్మయే యను తెలివి

తెలిసిన దవమ్మా ! నీవే, దుఃఖరూపమున నీవే; అనుభవరూపమున నీవే; దుఃఖసంహర్త్రి రూపమునను నీవే వెలయు చున్నావు. అమ్మా ! మాకు దుఃఖానుభవమైనదో లేదో నీవే చూచుచున్నావు. అజ్ఞాన ఘోరాంధకారము క్రమ్మగా అత్యంత దుఃఖితసంతానమైన మేము, హతాశమైన మనస్సుతో దారి తప్పిపోయి, యథేచ్ఛముగా విచరించుచున్నాము. ప్రారంభ మందు మధురమును బరిణామమందు విరసమునైన దానినే సుఖమనుకొని, యాదరించి చేపట్టితిమి. వాస్తవముగా నాత్మ జ్ఞానమునెడ మోహమును గలిగించు తామసిక సుఖమునే భూమసుఖ మనుకొని, నిద్రాలస్య మోహాజ్ఞానములే కృతార్థత యనుకొని, కౌఁగిలించుకొని, యథార్థసుఖము వంకను, వాస్తవిక శాంతి వంకను నెన్నఁడును జూడనైనలేదు. దాని ఫలము గానే, పలురీతుల యుడుకులతో నుడికి పోవుచున్నాము. చూడు మమ్మా ! త్రితాపతప్తులైన నీ బిడ్డలు నీ స్నేహరసబిందువున కానపడి, కుత్తక లెండిపోవునటులు అమ్మా ! అమ్మా ! యని యఱచుచున్నారు. నీవు విశ్వజననివి; విశ్వధాత్రివైన తల్లివయ్యు, స్థిరముగా ధీరముగాఁ

బాషాణమువలె నచల మూర్తితోఁగూర్చుండి, యీ దృశ్యమునే మనస్సుతోఁ జూచుచున్నావు. అంధజగత్తు; సంతప్తజగత్తు; భక్తిహీన శ్రద్ధాహీన మాతృవిముఖ సంతానమైన మేము పరిచ్ఛిన్నమందే ముగ్ధులమై పోయితిమి. చంచలతాదౌర్బల్యములే మా కూఁత. ఈ దుర్దినములందు, ఈ యుగసంధి మహాక్షణమందు, అమ్మా! నీవొక్కసారి స్నేహమయమూర్తితో వచ్చి, నిల్చి చూచితివా - సరే, మా యహంకారము నొక్కసారి మఱపింపుము. మఱొక్కసారి - ఒక్కసారియే - నీ యాపీనోన్నత స్తనచూచుకములను, నీ సంతానము నోటఁబెట్టుము. ఎండిన మా పీఁకలు రసార్ద్రములై పోవును. తాపత్రయజ్వాల లడఁగిపోయి దేశము ధన్యమగును.

## గురుకృపచేఁగాని మోహము తెగదు

జీవుఁడు సమాధిసహాయముతో నిత్యము పరమాత్మ స్వరూపమందు నిల్చుటకుఁ బ్రయాసపడును. గాని, మనస్సు సర్వదా విషయేంద్రియసంయోగముచే నైన పరిచ్ఛిన్నజ్ఞానము తోనే తృప్తినొందుచుండును. ఏవిధముగాను దానిని శాసింప లేకుండుట చూచుకొని, సాధకుఁడు తన యజ్ఞానాంధతను, మోహమూఢతను జక్కగా హృదయంగమము చేసికొనఁ గల్గును. అపుడు శుద్ధ బోధరూపగురువు నాశ్రయించి యాతని కృపచే నీ మూఢతను దొలఁగింపఁ బ్రయాసపడును.

ఈ మోహవస్తువు పట్టుపడనంతదాఁకఁ దన వాస్తవమైన లేమిని సాధకుఁడు తెలిసికొనలేఁడు. "తేషాం మోహః పాపీయాన్నా మూఢ

స్యేతరోత్పత్తేః" అని శాస్త్ర మనుచున్నది. కామక్రోధాది శత్రువర్గమందు మోహమే యన్నిటి కంటెనుం బాపము. ఏమన - మోహాచ్ఛన్నుఁడుకాని వ్యక్తిని, దక్కు శత్రువు లాక్రమింపఁజాలరు. మోహశబ్దము ముహ్‌ధాతువునుండి పుట్టినది. ముహ్‌ధాతువు నర్థము వైచిత్ర్యము. మమత్వమనఁగా నా దేహము, నా యిల్లు అను నిట్టి జ్ఞానమే మోహము. అజ్ఞానము వైచిత్ర్యమూలకము. సాధనాక్షేత్ర మందు మొదటఁ బ్రవేశించి యనేకులు "భార్యాపుత్ర కామ కాంచనాదులు నా సాధనమార్గమందు గొప్ప విఘ్నములు. వీని నెడపెట్టియున్నంగాని మాతృలాభము కాఁజాలదు" అందురు. కాని కొంచెము ముందంజవేసినపుడు "సంసార మెక్కడ నున్నది ? వెలినా ? లోనా ? వాసనాకేంద్ర మెంత దూరమందున్నది ?" యందురు. క్రమముగా లోఁజూపు వికసించిన కొలఁది "మాయయందే దాని కేంద్రము. అది నాలో లోపలనే వేరు తన్నుకొని యున్నది. ఆ వేరు పెల్లగించినచో, "నేనును" ఉండదు. గాని 'నే' నుందును. 'నాది' ని ఊడఁదీసి వైచినచో నేను పర్యంతము పెల్లగిలిపోవును" అనుకొనును. అపుడు మతి వెరవులేక, సమగ్రసాధనశక్తి, యోగశక్తి, తపోబలము మున్నగు నెన్నో యుపాయములు ప్రయోగించినను వాని యుచితవిధానము జరుపలేకపోవును. అది సహింపరాని యాతన. జీవుఁడు పరమాత్మసముద్రమందు సదా నిమగ్నుఁడై యుండఁగోరును; గాని దేహాత్మబోధము వానిని బలాత్కరించి తలక్రిందుగాఁ గ్రిందికి లాగివేయుచుండును. చిత్తక్షేత్ర సంధానము నొందినవారే యీ యాతనను బాగుగా ననుభవింతురు. కనుకనే,

గాజీపురమునందు 'పత్రాహారి' బావాజీ, దేహపర్యంతము బ్రహ్మార్పణముచేసి, యీ యాతనవలన విడిపోవు నుపాయమును జేసెను. గౌరాంగదేవుఁడీ యాతననుండి విడివడుటకై సముద్రమందు దూఁకెను. మహారాష్ట్రీయ సుప్రసిద్ధ సిద్ధుఁడు తుకారామ్, ఈ పరిచ్ఛిన్నత పట్టునుండి తప్పుకొనుటకే ఇంద్రాయణీ నదీజలములకు దేహమర్పించెను అని చెప్పికొందురు. నాయనా! నీలో నీవే విచారించుకో. - ఎదుటనే యమృత సముద్రమున్నది. కోరినంతనే చిరనిమగ్నుఁడవై పరశాంతి నొందుదువు. అయినను, జయింపరాని మోహము, అనంత జన్మముల కర్మసంస్కార శ్రేణులు వెనకనుండి నడుముపట్టి లాగివేయుచున్నవి. ఇట్టి యవస్థయందు దేహేంద్రియాదుల యెడ నొక విద్వేషము తనంతనే కలుగునా? కలుగదా ? చెప్పుము.

కేవల గురుకృపచేతనే, యా పరిచ్ఛిన్నత యెడనైన విద్వేషము తొలఁగును. జీవుఁడు తనను వివేకాంధునిగాను, మూఢునిగాను ననుభవింపఁ గల్గినపుడు, చక్షుష్మంతుఁడైన యొక జ్ఞానిచరణములందు ఆత్మ సమర్పణము చేయుటే యుపాయము. ఆ జ్ఞాని మెల్లమెల్లఁగా, ఆ పరిచ్ఛిన్నత యెడనైన విద్వేషము, ఆసక్తి యనెడి మోహము సైతము, అమ్మయంగాలంకారములే యని తెలియఁజేయును. మన యమ్మ లీలాకైవల్య వశమున, అనురాగ విద్వేషరూపమున వెలయుననుట యనుభవింపఁగల్గుటచే మోహము తొలఁగిపోవును. గాని శాంతభావముతో నగ్రసరుఁడు కావలయును. ధీరత లేనిచోఁ బని సాగదు. ఛాందోగ్యమునందు 'శాంత ఉపాసీత' అన్నాడు. ఎంత చక్కని యుపదేశమో చూడుము.

జీవత్వ బంధనమువలనఁ బూర్తిగా విముక్తుఁడగుట కడు దూరపుమాట. అత్యున్నత జ్ఞానముచేతనే పొందదగినది. ధీరస్థిరభావముతో, గురువాక్య వేదాన్త వాక్యములందు గట్టినమ్మకము సాయముగా, ముందడుగు వేయుటగును. అధీరతవలన నుపాసన సాగదు. ఒక్కనాఁడే మోహము తెగిపోదనుట మఱువకుమా. అనుశీలనమనెడి యభ్యాసమును వైరాగ్యము ననెడి ఫలముగా మెల్ల మెల్లగా మోహము తొలఁగును.

ఎంతటి జ్ఞాని కానీ; ఎంత సత్కులప్రసూతుఁడే కానీ; గురువును జేరి "నేను అజ్ఞానాంధుడను, నాజ్ఞాననేత్రమును విప్పుము; నేను మూఢబాలకుఁడను" అనెడి భావము మనసున నుఱుకకున్నచో, యథార్థగురుకృప నొందఁడు. గీతలందు, "తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా । ఉపదేక్ష్యన్తి తేజ్ఞానం జ్ఞానిన స్తత్త్వదర్శినః॥" "తత్త్వదర్శిమహాపురుషులు నీకు జ్ఞానోపదేశము చేయుదురు. నీవు ప్రణిపాత పరిప్రశ్న సేవలచే దానిని గ్రహింపుము.' ' అన్నాఁడు. ప్రణిపాత శబ్దముచేఁ గేవల కాయిక వాచిక మానసిక ప్రణామమమాత్రమే కాదు. నీవు నీ యహంజ్ఞానమును మాఱుమాటాడక ప్రసన్నవదనముతో గురుచరణములందుఁ బూర్తిగాఁ బడవేయఁ గల్గునపుఁడే, నీ ప్రణామము సార్థకమును బూర్ణము నగును. "నే నెఱింగినది, తెలిసికొన్నదియు నకించిత్కరము. ఆ తెలివి నా మనసున యథార్థశాన్తిని గూర్పఁజాలకున్నది," గాన "తత్త్వదర్శి గురుఁడా ! దయఁజూచి, దేనిచే శోక మోహములను గడవఁగలనో, యట్టి జ్ఞానము నుపదేశింపుము." అను నిట్టిసరళ భావము నీలో నుదికించుట పేరే ప్రణామము.

ఒకఁడు గురువునుజేరి, "ఎఱుఁగుదును గాని చేయఁజాల కున్నాను" అనును ఆ మాటయు దప్పే. ఎఱిఁగియేయున్నచో నిశ్చయముగాఁ జేయఁగలఁడు. చేయలేకున్నాననుటచే "చక్కగా యథార్థముగాఁ దెలియలేదని" స్పష్టము. "ఔరా ! సంసార సంస్కారరాశి నాయాత్మస్వరూపము కాదు." అని యథార్థ ముగా దెలిసికొన్నవాఁడు, మఱల వానియెడ ముగ్ధుఁడు కాఁగలఁడా ? అసలుమాట యేమనఁగా - తెలిసికొంటి మన్న దేలేదు; శ్రీ గురుకృపలేక తెలిసికొనుట కాదు. ధ్రువ, ప్రహ్లాదులకును, భగవంతుఁడగు శ్రీకృష్ణునికిని గురుస్వీకారము చేయవలసి వచ్చినది. అహంకారమును విడిచి నిష్కపటముగాఁ బ్రణమిల్లు టభ్యసింపుము. గురుచరణములందు శరణాగతుఁడ వగుము. నిన్ను నీవు వివేకాంధునిగాను, మూఢునిఁగాను ననుభవింపుము. అపుడు గురుఁడు నిశ్చయముగాఁ గృపఁజూచును. ధన్యుఁడ వగుదువు.

## సత్యదర్శి ఋషులే జ్ఞానప్రకాశకులు

పరమాత్మ క్షేత్రమందు నిత్యము విచరించు శీలముగల వారే ఋషులు. వారే సత్యదర్శులు. సత్యమందునిల్చి వారేమి చెప్పుదురో, అదే ప్రత్యక్షదర్శన ఫలము. అది యధ్యయనము వలనఁగాని యుపదేశమువలనఁగాని కల్గిన జ్ఞానము కాదు. వారే మంత్ర ద్రష్టలు. వారి యాధర్మవాణియే మంత్రము - వేదము. దానిని మఱల మఱల మననము చేయుటచేఁ బరిత్రాణము లభించును ఇది ముమ్మాటికి సత్యము. ఈ దేశము నుండి ఋషిశబ్దము ఏనాడో లేచిపోయినదని లోకులనుకొన్నను. భారతవర్షము నేఁటికిని

ఋషిశూన్యము కాలేదు. ఇప్పటికిని భగవంతుఁడు స్వయముగా ఋషిరూపమున జగజ్జీవపరమ కల్యాణమునకై సత్యవిజయ వైజయన్తిని బట్టుకొని యెగుర వేయుచున్నాడు. ఋషులు లేకపోలేదు. వారిని వెదకి దర్శింప వలయుననెడి దప్పిగలవారులేరు. నాయనా ! నాలుగు సారులు ఋషి శబ్దము నుచ్చరించినంతనే మనసు పవిత్రమగును. వారున్నచోటి గాలియు గగన మండలము వఱకుఁ బవిత్రమైపోవును. ఋషి యట్టి వస్తువు. ఋషులు శ్రీమాత కుంగడు ముద్దుబిడ్డలు. ఋషులు సదానందమయ మహాపురుషులు. ఋషులు బ్రహ్మలిప్త బ్రహ్మజ్ఞులు. వెలిగుర్తులచే ఋషులను గుర్తించుట బహు కష్టము. ఎవ్వరికినిఁ దమ్ముఁ బరిచయము చేయుటకై యెట్టి మిథ్యాడంబరముఁ బూనరు. అదియుండనీఁ 'తెలియునుగాని చేయలేకున్నాము' అనెడివారికి, ఆ ఋషులు చెప్పెడి దేమనఁగా - అయ్యా ! అన్ని ప్రాణులకును జ్ఞానమున్నది గాని, అది విషయగోచరము. 'విషయ' శబ్దార్థము రూపరసాదికము. గోశబ్దార్థము ఇంద్రియము. 'చర్' ధాత్వర్థము విచరించుట - మెలఁగుట. ఇంద్రియ మార్గమున విచరించి విషయాకారమునఁ బ్రకటితమగు జ్ఞానమునే విషయగోచర జ్ఞానమందురు. నీవు, ఏ జ్ఞానమును బట్టి జ్ఞాని ననుకొను చున్నావో, ఆ జ్ఞానము సర్వప్రాణులకునుం గలదు. ఆహార నిద్రాభయమైథునాది జ్ఞానము సర్వప్రాణి సాధారణము. రాజ్యాది విషయక జ్ఞానమేకానీ, స్త్రీపుత్రాది

విషయక జ్ఞానమే కానీ, అది విషయగోచర జ్ఞానమాత్రమే. ఏ జ్ఞానము లేకుంటచే నిన్ను నీవు జ్ఞాని ననుకొనుచున్నావో - అ గోచరా తీతజ్ఞానము జాడ దొరకకయే నిన్ను నీవు జ్ఞానిననుకొనుట, యజ్ఞానమాత్రమే.

## సర్వసాధారణ జ్ఞానస్వరూపము

చూడుము - జీవుఁడు, ఒక రేపు మొదలు మరుసటి రేపు వఱకును జాగ్రత్ స్వప్న సుషుప్తులనెడి మూడవస్థల నను భవించుచున్నాఁడు. మొదటి జాగ్రదవస్థను దీసికొనుము. ఈ యవస్థ కొన్ని విశిష్టజ్ఞానముల సమష్టిమాత్రమే. (మనసు హృదయమునుండి వ్యాపించునపుడు, మస్తిష్కమునకును ఇంద్రి యములకును వచ్చును. దానినే లోకులు జాగ్రదవస్థయందురు.) చూచుట, వినుట, ఆహారము, విహారము, ద్రవ్యోపార్జనము మున్నగునవి జాగ్రత్కాలమందుఁ జేయఁబడును. అవన్నియు జ్ఞానములే. శబ్దస్పర్శాది విషయక జ్ఞానములే. జ్ఞానమొక్కటే యనేక విశేషణములతోఁగూడి భిన్నభిన్న భావములతో వెలయును. ఆ విశేషణాంశములను విడిచిపెట్టినచో మిగులునట్టి యఖండశుద్ధజ్ఞానమే జాగ్రత్కాలజ్ఞానస్వరూపము. ఆ మనస్సేయింద్రియ మస్తిష్కములనుండి, మఱలి హృదయము లోపలి తన మూలస్థానమునకు వచ్చునపుడు, దానిని నిద్రయందుము. ఈ మనస్సు తన కర్మములను భోగించుటకై హృదయకమలమందుఁ జెఱఁబెట్టఁబడినది. దీనికి జాగ్రత్తను భోగింపఁజేయు పనిపడినపుడు అది జాగ్రద్దశగా మాఱిపోవును. అదే

స్వప్నమును భోగింపఁజేయుటకు సిద్ధపడినపుడు నిద్రాదశగా మాఱిపోవును. దీనికిఁ గర్మసమాప్తి కానంతదాఁక నీ శరీరముతోడి సంబంధముండును. ఈ దశయే స్వప్నావస్థగా నగును. ఆ సమయమందుఁ గేవలము అంతఃకరణచతుష్టయముగాఁ గ్రియాశీలమగును. ఆ సమయమందును దర్శనాది కార్యములు జాగ్రత్తయందువలెనే యగుచుండును. కావున రూప రసాది విశేషణ విశిష్టమయియే జ్ఞానము ప్రకటమగును. ఆ విశేషణాంశమును విడిచినచో విశుద్ధాఖండజ్ఞాన స్వరూపము ప్రకాశితమగును.

దీని తర్వాత సుషు ప్తియనెడి యవస్థ. ఈ యవస్థయందు సర్వేంద్రియములు నంతఃకరణములతోఁగూడి లయమొందును. ఎట్టి జ్ఞానప్రకాశమును నుండదు, గాని నిద్రాభంగము కాఁగానే "నేను సుకముగా నిదురించితిని; ఇన్ని సంఘటనము లైనవిగాని నేనేమియు నెఱుఁగను" అనెడి ప్రతీతి యగును. ఈ యెఱుంగ కుండుట యనెడి యజ్ఞానము సైతము, ఒక విధమైన జ్ఞానమే. సుషుప్తావస్థయం దా యజ్ఞానవిషయకజ్ఞాన ముండుటచేతనే, జాగ్రత్కాలమందు దాని స్మృతి గలుగుచున్నది. మున్నెన్నడు ననుభూతముకాని దాని స్మృతి యసంభవము. కనుక మూ డవస్థలయందును జీవుఁడు జ్ఞానముగానే యున్నాఁడని తెలియఁబడుచున్నది. జ్ఞానాభావ మెన్నఁడు నుండదు. దినము, సప్తాహము, పక్షము, మాసము, వర్షము, జన్మజన్మాంతరములు మొదలుకొని జీవసమూహము ఈ యొక్క యఖండజ్ఞానముగానే యున్నది. 'మాకు జ్ఞానము గలదు' అనుకొనుచున్నది విషయగోచరమే. అనఁగా విశేషణయుక్తమగుటచేతనే యీ జ్ఞానము ప్రకాశితమగును. ఘటవిషయక జ్ఞానము, పటవిషయక జ్ఞానము మున్నగు నాకారములుగా రూపొంది, వేవగళ్ళు నొక్కజ్ఞానమే

భిన్నభిన్న భావములతో వెలయుచున్నది. పొందఁబడుచున్నది. జ్ఞాన మీ విశిష్టభావములతోఁ బ్రకాశించుట పేరే విషయగోచరజ్ఞానము.

సరే; యిపుడు నెమ్మదిగాఁ దెలిసికొనఁ జూతము. జాగ్రత్ స్వప్న సుషుప్తులనెడి యీ మూడవస్థలయందును జ్ఞానమునకుఁ బైగాఁ గానవచ్చు విశేషణాంశములను విడిచి పెట్టి, యే యఖండైక రసజ్ఞానము నెఱుంగుచున్నావో యదినీదే. నాయనా ! ఏదో మఱొకచోటినుండి తెచ్చుకోన్కఅలేదు. అదినీదే. నీ జననము మొదలు మరణము వఱకు ఆ యఖండజ్ఞానమొక్కటే యనేక విశేషణములతో విశేషితమై వెలయుచున్నది. ఒకప్పుడు కామినీకాంచనములును, ఒకప్పుడు ధర్మార్థకామ మోక్షములను అనఁగా భోగాపవర్గములను, నీయఖండజ్ఞానము యొక్క భిన్న భిన్న ప్రకాశములే. ఈ ప్రకారముగా ననాది జన్మమృత్యువులు నీ జ్ఞానాంగమందే సంఘటితము లగుచున్నవి. జ్ఞానహృదయమందే నీవు పుట్టితివి; ఉందువు; చత్తువు.

గీతలయందు- 'జ్ఞానం లబ్ధ్వా పరాం శాంతి మచిరేణాధిగచ్ఛతి' (4-36). జ్ఞానమునొంది వడిగానే జీవుఁడు సర్వోత్కృష్టశాంతి నొందును- అని యున్నది. జ్ఞానమే యథార్థశాన్తి. జ్ఞానమందే సర్వకర్మములును బర్యవసించును (అంతమొందును). జ్ఞానమే యమృతము. జ్ఞానప్రాప్తియైనంతనే సర్వభయములు తొలఁగును. ఎట్టి జ్ఞానము లభించినచో శాంతి లభించును ? మఱి సర్వకర్మముల యంతమగును ? అన్న దేయిపుడు తెలియవలయును. వేదాన్త శాస్త్రజ్ఞానమును ముక్తి కారణ మందురు. ఇది యెట్టిదో తెలియవలయును. ఈ సర్వజీవులును సదా పొందుచున్నదే యాజ్ఞానము. ఉపదేశాధ్యయనములవలనఁ గలుగు

జ్ఞానము కాదు. అది సర్వజీవులందును సమభావముతో నున్నది. కనుకనే మూర్ఖాతిమూర్ఖుఁడైనను, మనుజుఁడత్యంత దురాచారియైనను గోరినచో నీజ్ఞానము నొందఁగలఁడు. దీనిపేరే ప్రజ్ఞానము-బ్రహ్మము. ఇది కేవల వాచనిక జ్ఞానముగా సమాప్తమగు చుండునంతదాఁక, నింతయుఁ బ్రాపింపదు. ఇది యతిప్రత్యక్షము. ఈ జ్ఞానమే యుదయించెనేని, జగత్సత్తా విలుప్తమైపోవును. కావుననే శ్రీ శంకరాచార్యులు జగత్తును మిథ్యా యనిరి. ఈ జ్ఞానము కఠినపాషాణమును సైతము మీఱునంత ఘనము. ఈ మాట, ఆత్మసంవేదన మాత్రమే. ఎవరిమట్టుకు వారెఱుంగవలసినదే.

"ఆకాశాదపి తత్సూక్ష్మం ఘనం తత్స్వైంధవాదపి ।
శైలాదప్యచలం విద్యాచ్చిన్మయం పూర్ణమద్వయమ్॥"

ఈ జ్ఞానమొక తత్త్వమాత్రము కాదు. దానికి వ్యక్తిత్వ మున్నది. అది యొక్క జనుఁడు. దానితో బరిచయము చేయవలయును.దాని సేవ చేయవలయును. ప్రాణ వేదనము చేయవలయును. అప్పుడది, "సర్వేంద్రియ గుణాభాసంసర్వేంద్రియ వివర్జితం । ఆసక్తం సర్వభృచ్చైవ నిర్గుణం గుణభోక్తృచ ॥" (గీత 13 -15). దాని కింద్రియములు లేవు, గాని సర్వేంద్రియ గుణములతో నొప్పును. దేని నంటదు; అన్నిఁటి నదే భరించును. నిర్గుణము; గుణముల ననుభవించును. ఇట్టి మూర్తితో వెలయును. అపుడు దానిని నీవు "అపాణి పాదో జననో గృహీతా, పశ్య త్యచక్షుః స శ్రుణోత్యకర్ణః" దానికిఁ గాళ్లు లేవుగాని, నడువఁగలదు; చేతులు లేవుగాని,

పట్టుకొనఁగలదు; కన్నులు లేవుగాని, చూడఁగలదు; చెవులు లేవుగాని, వినఁగలదు; అని నీవే యెఱుఁగఁగలవు. అంతేకాదు; "స వేత్తి విశ్వం న హి తస్యవేత్తా, తమాహు రాద్యం పురుషం ప్రధానమ్'' అతఁడఖిలము నెఱుంగునుగాని, యాతని నెఱుఁగువాఁడు లేఁడు. అతనినే ఆదిపురుషుఁడు, ప్రధానపురుషుఁడు అనిరనుటయు నెఱుంగఁగలవు. రూపముచే సర్వభూత మహేశ్వర మూర్తిగాఁ దన్ను వెలయించుకొని నీ ప్రత్యేక కృత్యమును జేసివేయును. సత్యముగా నీ జ్ఞానమే గ్రహింపఁబడుచున్నది. మనుష్యమాత్రుఁడే దీనిని బ్రత్యక్షము చేసికొనఁగలఁడు. ఇది కేవల భాషాఝంకారము కాదు. తెలిసియో, తెలియకో సర్వము నీజ్ఞానమందే నిల్చియున్నది. కాని - యది విషయ గోచరము. ఈ జాగతికధూళియు, నీ జ్ఞానపరిచ్ఛిన్నతయు మాత్రమే ప్రియతమముగాఁ దలంచునంతదాఁక, ఆ జ్ఞానము విషయేంద్రియ సంయోగ కారణమున, ఖండఖండాకారముగానే ప్రకాశితమగును.

## ఈ జ్ఞానము పేరే; గురుఁడు - శివుఁడు

లెక్కలేని భావములతో, లెక్కలేని విశేషణములతో నా జ్ఞానము పరిచ్ఛిన్నమైనను, దాని శ్రేణీవిభాగము చేయునపుడు, అయిదు విభాగములుగానే కానవచ్చును. అయిదింద్రియములనుండి, అయిదు విధములైన జ్ఞాత తరంగములు సదా ప్రత్యేక జీవునియందును వెలసి లయించుచుండను. ఒక యఖండ జ్ఞానసముద్రమున్నదనియు, దానియం దసంఖ్యతరంగములున్న

వనియు, ఆ తరంగములను గ్రహించుటకే మన పంచేంద్రియము లున్నవనియు నెఱుంగవలె. ఈ జ్ఞానము పేరే, గురు(డు - శివు(డు. స్థూలమూర్తి గురు(డు, ఈ జ్ఞానముయొక్క ఘనీభూత ప్రత్యక్షవికాసమే. అయిదు విధములుగా జ్ఞానప్రకాశమగును. ఇవే శివుని పంచముఖములు. ఇదిగో - విను; పంచముఖములతో నొకదేవత యేదియు లేదనుకో(కుము. ఈ జ్ఞానసాధనమును జేయుటవలన, మఱల విశిష్ట మూర్తితో( బ్రకటమగుటకై, భక్తుల హృదయములందు( గాతరప్రార్థనములు బయలు దేఱునపుడు, భక్తి యనెడి ప్రబలమహిమముచే ఘనీభూతమై, ఆ యఖండ జ్ఞానసముద్రమునుండి వెండికొండవలె( దెల్లనిదియు, సకల భయహరమును, ఆశుతోషమును, పంచవక్త్రమును, త్రినేత్రమును నైన వరదమూర్తి యావిర్భవించి, దయాపరాకాష్ఠతో సాధకుని యజ్ఞాననేత్రచికిత్స చేసి చక్క(గా విప్పును.

## ఈ జ్ఞానము పేరే చిత్ - (చిన్మయి మాత)

ప్రతిక్షణమును, మనము దీనినే (చిన్మయి మాతనే) మన యజ్ఞానాంధనేత్రమును దెఱచు గురువునే యనుభవించుచున్నాము - ప్రతిశ్వాస ప్రశ్వాసమందును ప్రతీంద్రియ సంచాలన మందును దానినే గ్రహించు చున్నాము; గాని యెన్న(డైన నొక్కసారి దానిని అమ్మ యని యాదరించితిమా ? చెప్పుమీ; "అమ్మా ! నీవే మాసర్వస్వము; నీవే లేకున్న మా కేమియులేదు; ఉండదు; నీవు కొంచెమాగెదవేని, యీ యవజ్ఞను క్షమింప( బ్రణమిల్లెద" నని, యొక నా(డైన నంటివా ? అడుగుపెట్టునంత నావెం

యావిర్భవించుచున్నది. కాని మన మామె నాదరింపకున్నాము. ఆమె యుపేక్షింపఁబడి కుటిల కటాక్షముతోఁ బోవుచున్నది. మఱల నెయ్యవుటొత్తిడిచే బాధ్యయై తిరిగి వచ్చుచున్నది. ఇటులెన్ని యుగయుగాంతరములు కడచిపోయినవో ? ఇవుడు మనుష్యుఁడవయ్యుఁ దెలిసి కొన్నావా ? ఇఁక నామె నాదరింతువా? ఒక్కసారి యింద్రియముల దారి నపేక్షింపుము. నీకుఁ జిక్కును. నీవామె ననుభవింతువు. అపేక్ష విడకు. పలుసారులు విఫలుఁడ వగుదవు గాక, ఆ విఫలతయే నిన్ను సఫలుని జేయును. ఆమె రాకమానదు. రేవగళ్లు వచ్చుచుఁ బోవుచునే యున్నది. ఆమె రాకపోకలకు విరామము లేదు. ఎప్పుడో యొకసారి యిట్టే చిక్కఁగలదు. ఇదిగో - నీ కామె లభింపకున్నచో, ఆమె రాకపోకలను గనిపెట్టి యనుభవింప, నింద్రియమార్గములందుఁ గూర్చుండి యేడువుము. ఏదారి నామె వచ్చునో, యే దారిని బోవునో, యది కనిపెట్టలేవేని, అక్కడఁగూర్చుండి యేడువుము. ఆదారులందలి ధూళి నీ యొడలునిండ బూసికో, నీ జీవనము ధన్యమగును. ఆమె దర్శనమిచ్చును.

జీవులు సాధారణముగా విషయగోచరజ్ఞానమందే విచరించుచున్నారు. సహజాఖండజ్ఞానసంధానము నొందనంత దాఁక, నెంత గొప్పవిద్వాంసుఁడే కానీ, ఎంతటి తపస్వియే కానీ, యెంతటి శక్తిశాలియే కానీ, వాఁడజ్ఞాన శిశువే. ఈ యఖండజ్ఞానమొక్కటితక్క, నెన్నిజ్ఞానము లున్నను నవి విశిష్టజ్ఞానములే. జ్ఞానాభాసమాత్రములే ! సముద్రమునకును, గెరటములకును భేదములేనటులు, అదే ,యభేదజ్ఞానముగాను, విశిష్ట (ప్రసిద్ధవిలక్షణ) జ్ఞానముగాను నున్నది. అది లభింపనంతదాఁక,

మనుష్యుఁడు ఆధ్యాత్మికదృష్టిచే సాధారణ ప్రాణులకంటె విశేష శ్రేయోవంతుఁడు కాఁడు

## ఒక్కశక్తియే భిన్నభిన్న విషయాకృతితో వెలయును

విషయ మనఁగా నింద్రియగ్రాహ్య వస్తువు. షిఞ్ధాత్వర్థము బంధనము. ఏది విశేషించి బంధించునో యది విషయము. శబ్దస్పర్శరూపరస గంధలమునెడి యైదువిషయములు నైదు విధములయిన జ్ఞానేంద్రియములచే గ్రహింపఁబడుచున్నవి.

జ్ఞాన మఖండ మంటిమి. ఆ యఖండవస్తువు అయిదు భేదములుగా నెట్లగును ? సముద్రమందుఁ గెరటము లెన్ని లేవనీ, అవియన్నియు జలస్వరూపముతోనే సరిగాఁ గానఁబడునటు లే జ్ఞానసముద్రమం దీయైదుతరంగముల విభాగమగును. అవియు జ్ఞానాకారముతో బ్రతీయమానమగు టుచితమే యైనను, అటులుగాక రూపగంధాద్యాకారములతో నవి యనుభవము నకు రానేల ? జ్ఞానరూపముతో అనఁగా రూపవిషయకజ్ఞానము, రసవిషయకజ్ఞానము అని యీవిధముగాఁ బ్రతీతియోగ్యములు కాకుండుటేమి ? అను నీ యాశంకకు బదులిది - ఇట్టి ప్రతీతి యథార్థమైనను, జ్ఞానము సాధారణముగా రూపరసాదిరూప ముననే గ్రహింపఁబడును. ఏమన జ్ఞానమన్నెడి విశేష్యాంశము కప్పఁబడి యుండును. కేవల విశేషణాంశము సర్వజీవులందును సాధారణముగాఁ బ్రతీతమగుచుండును. దీనికిఁ గారణమేమి ? - మన మెుకప్పుడు ఆనందోచ్ఛ్వాసముతో బహుత్వక్రీడ చేయుదమనుకొంటిమి. అట్లభిలషించితిమి. కనుక, అఖండజ్ఞాన

మేక రసస్వరూపమయ్యును బలువిధములుగా మనకుఁ బ్రతీతి యోగ్యమగును. బహుత్వపుఁగోరిక సాగుచున్నంతదాఁక, నిది యొక్కటయ్యును, బహునామములతోనె, బలువ్యవహారముల తోనె సాగుచుండును. "అమ్మా! ఇఁక మాకు బహుత్వ మక్కఱలేదు. ఒక్కటియైపో; ఒక్కటి చేసివేయుము" అనుచు నేనాఁడు సత్యప్రాణముతో లోపలినుండి పలుకుదుమో ఆనాఁడే యామె మనయెదుట నేకరూపముతో నే విరాజిల్లును.

వంచదార కరగించి వివిధమైన యచ్చులలోఁ బోసి మామిడివండ్లు, చిలుకలు, గుజ్జాలు మున్నగువాని యాకారములతోఁ జేయఁబడి యనేక నామములతోఁ బరిచితము లగు చున్నపుడు చిన్నపిల్లలు " నాకు గుండ్రని దక్కఱలేదు; గుజ్జివ బొమ్మ కావలయును, నాకుఁ జిలుక కావలయు" ననుచు నామరూపములచే నాకర్షింపఁబడుదురు. వారి ప్రీతికిని, అప్రీతికిని వారి దృష్టియందు ఆ యాకారములందలి విచిత్రతయే విషయమగుచున్నది. అదే యొక పెద్దవాఁడు వివిధాకార నామములతో నొప్పు బహుత్వమందుఁ జూచునది యొక్క వస్తువే, పంచదార. ఘటనవైచిత్ర్యము వాని ప్రీతికిఁగాని యప్రీతికిఁ గాని విషయము కాలేదు. అటులే అఖండజ్ఞాన మొక్కటే సర్వజీవులయందు సాధారణభావముతో నున్నది. అయినను, అజ్ఞాన ప్రభావముచే సంస్కారముల యందలి వైచిత్ర్యము కారణముగా నది భిన్నభిన్న భావములతోఁగ్రహింపఁబడుచుండును.

## విష్ణుని పరమపద మొక్కటే సర్వత్ర యున్నది.

దానినుండి భిన్నభిన్న స్పందనములు, ఇంద్రియముల దారిని జీవుల సంస్కారములుగా నున్నవి. అది సజాతీయమైన

సంస్కారములను రేఁగఁగొట్టును. ఇదే పరమపదముయొక్క అర్థము - పదార్థము. సంస్కారములే విషయాకారమున వెలిని వెలయును. జగత్తు వెలిని లేదు; జ్ఞానమందే యున్నదని మున్నంటిమి. మన జ్ఞానమే జగదాకారముగా రూపొందుచున్నది. ఏ శక్తి ప్రభావముచేత నయ్యఖండజ్ఞానము ఖండ ఖండము లగుచున్నదో - విషయాకారమున వెలయుచున్నదో, అదే (విష్ణుని పరమపదము) మహామాయగా వర్ణింపఁబడినది. గురుకృపచే జ్ఞాననేత్రము విడినపుడు ఆ వ్యక్తి "విషయమన్న దేదో వేఱొక వస్తువు కాదు; ఒక్క శక్తియే భిన్న భిన్న విషయాకారముల వెలయుచున్న" దని కనుఁగొనును. ఈ కాన వచ్చు జగత్తు, ఒక శక్తి మాత్రమేయని మున్నంటిమి. ప్రత్యేక పరమాణువును శక్తియే. విషయ సమూహమును శక్తి మాత్రమే. ఇది యాధునిక విజ్ఞానముచే సైతము ప్రమాణీకృతమైనది. జీవుఁడు శిశువుగానుండి, యీ యఖండజ్ఞానసంధానము నొందనంతదాఁక, శక్తిరూపిణి మహామాయ (విష్ణుమాయ) మన యమ్మ, ఒక్క జ్ఞానమునే భిన్నభిన్న భావములతో, భిన్న భిన్న రసములతో రుచిజూపుఁ చుండును. ఒక్క జ్ఞానమునే భిన్నభిన్న రసములతో రసమయ మొనర్చిమన నోరు తీపి చేయుచుండును. సరే మఱువకుమా ! ఒక్క జ్ఞానమేయనేక వైచిత్ర్యములను జేయుచు విషయాకారమున వెలయు మహాశక్తియే మూలతత్త్వము. ఆ జ్ఞానమును, శక్తియు వాస్తవముగా వేఱు కావు. మున్ముందు విశేషవివరణమును గాంతురు.

## దివాంధులు, నిశాంధులు, తుల్యదృష్టులు.

ఇపుడు విషయముల భోగము (అనుభవము) వల్ల నైన విభిన్నత వెల్లడింపఁబడును.

కొన్ని ప్రాణులు (మనుష్యులు) దివాంధములు. దివాశబ్దార్థము ప్రకాశాత్మకవస్తు జ్ఞానము. దానియందు అంధము అనుమాట కానఁబడదు. ఏమన, జ్ఞానవస్తు వొక్కటే విషయ సమూహరూపమున నెల్లపుడు ప్రకాశించును. దాని యనుభవముఁ జేయఁజాలనివారు, రూపరసాది విషయములు - జగత్తుగా - గాంచఁగల్గుదురు. వారు వేసారులు. జ్ఞానము తక్క మఱొక్కటేమియు లేదని తెలిసికొన్నను, దానిని గ్రహింపఁజాలరు. ఇది సాధారణ జీవజగత్తుయొక్క దశ.

రెండవది - మఱియొకశ్రేణి (తెగ) వారు రాత్ర్యంధులు. అనఁగా - వగలు చూడఁగలరు. ఇదిగో, ఈ శ్రేణివారే జగన్మిథ్యావాదులని ప్రసిద్ధులు. దీనివలన సత్యపరమార్థ జ్ఞాన ప్రాప్తి కాకమున్నే, వీరు అఖండజ్ఞానసముద్రమందుఁ దరంగ రూపమునఁ బ్రకాశించు విషయరూపిణి మహాశక్తిని భ్రాంతి, మిథ్య యనుచుందురు. కనుక దర్శనయోగ్యము కాదందురు. తాత్పర్యమేమన - ఈ పరిదృశ్యమానజగదంశము వారి కంటికి రాత్రితుల్యము - అజ్ఞానమే. విశేష మేమనఁగా - జగత్తును మిథ్య యనువారు జగదీశ్వరునిసైతము మిథ్యయని యెగురఁ గొట్టఁజూచువారే. కాని తామెల్లప్పుడును జగద్ జ్ఞానమందే విచరింప బాధ్యులగుచున్నారు. వీరే వాస్తవముగా రాత్ర్యంధులు

మూడవది మఱియొక తెగ; వారు రేవగళ్లు (ఉభయత్ర) తుల్యదృష్టిసంపన్నులు. అఖండశక్తిమయమైనది యఖండజ్ఞాన మొక్కటే యనియు, ఆ యఖండశక్తియే యానందలీలగా నామరూపవ్యవహారాత్మక విషయాకారమున, జీవజగత్తురూపమున వెలయుచున్నదనియు వారు ప్రత్యక్షము చేసికొనఁగలరు. సర్వశాస్త్ర సమ్మతమును, సర్వశాస్త్ర ప్రతిపాద్యము నైన యీ తత్త్వమందే సదా నిల్చియుండు కారణమున, దివారాత్రములు - అనఁగా జ్ఞానాజ్ఞానములు - ప్రకాశాప్రకాశములు నను రెంటను సమానదృష్టిసంపన్నులు.

గీతయందును సరిగా నిట్టి భావముతోనే యొక శ్లోకము నందు "యానిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ। యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః ॥" సర్వ భూతములకు రాత్రియైనది - అనఁగా, అప్రకాశమైన యాత్మ జ్ఞాన మనెడి నిత్యప్రకాశాత్మకవస్తువునందు సంయమిసాధకుఁడు సదా జాగృతుఁడై యుండును. అనఁగా అతఁ డెల్లపుడును జ్ఞానమందే విచరించుచుండును. మఱి సమస్తప్రాణులును విచరించు విషయజ్ఞాన మనెడి పరిచ్ఛిన్నతయే, సత్యదర్శిసాధకుల పక్షమందు నిశ. అనఁగా అదృశ్యము. ఏమన, సాధారణ మానవులువలె వారు విషయములను విషయమాత్రముగా గ్రహింపరు. "ఆత్మ - జ్ఞానరూపిణి అమ్మ విషయాకారమున స్వేచ్ఛతో వెలయుచున్నది." కనుక నీ దర్శనాభ్యాసమే వారికిఁ గలదు. కాని జగత్తును మిథ్యాయనువారును యథార్థవాదులే. ఆ మాటయు సత్యమే. ఏలన జగత్తును గేవల జగద్రూపముతో దర్శించుట పేరే మిథ్యాదర్శనము. బ్రహ్మమే జగద్రూపమునఁ బ్రకాశించుచున్నదని

దర్శించుటే సత్యదర్శనము. అయినను ఆధునిక వేదాంతులు దాని కనేక కూటార్థములు చేసి, బ్రహ్మజ్ఞానము నదేదో నీరసవస్తువుగాఁ జేసి వైచిరి. ఔరా ! బ్రహ్మశబ్దమును స్మరించు మాత్రమున నొడలు పులకించును. ఇంద్రియములు స్తంభించిపోవును. హృదయపిణ్డక్రియ యాగిపోవును. కన్నులు శవనేత్రములవలె గాంతిహీనములై పోవును. కనుగొనల నానందాశ్రువులు కానఁబడును. మఱెన్నో బాహ్యలక్షణములు కానవచ్చును. అదే బ్రహ్మము. పరమాత్మ దాని దర్శించినంతనే మర్మపీడ సిద్ధమగును. అది వేఱేమాట. ఉండనీ.

## జీవుఁడు, ఈశ్వరుఁడు, బ్రహ్మము.
## క్షరుఁడు, అక్షరుఁడు, పురుషోత్తముడు.

అనెడి మూఁడు విధములయిన యాకారములతో, అమ్మ (ఆత్మ) తన్నుఁదా వెలయించుకొన్నటులే, ఆమె దర్శనము సైతము మూఁడు భావములతో వెలయును. ఈ దర్శనము, అనాది కాలమునుండియు వచ్చుచున్నది. మఱి యనంతకాలము సాగును. ఇమ్మూఁడు విధములుగాఁ గనునట్టివారి, యెవ్వరి చూపును భ్రమకాదు, భ్రాంతిని గలిగించు కంటిజబ్బెవ్వరికిని లేదు. భ్రాంతయైనది మన యమ్మయే. కనుక నెల్లరును సత్యదర్శులే యంటిమి. విషయమాత్ర దర్శిజ్ఞానముచే నంధులైన వారే దివాంధులు వారి కా రూపముతోనే యమ్మ కానవచ్చును. జ్ఞానమాత్ర దర్శనము చేయుచు; విషయములను మిథ్యా యని యెగురఁగొట్టువారే రాత్ర్యంధులు. వారి యెదుర నా భావముతో

యమ్మ వెలయును. మూడవ తెగవారు సర్వత్ర సత్యదర్శనము చేయువారు. జ్ఞానాజ్ఞానములు రెండును వారికి బ్రహ్మసత్తను దలఁపించు చుండును. అట్టి భావముతోనే యమ్మ, వారి కాత్మదర్శనము చేయించును. జీవుల క్రమగతియు సరిగా నీ విధముగానే యుండును. తొలుత బహుత్వప్రియుఁడైన జీవుఁడు విషయ మాత్రమును జూచి తృప్తినొందును. ఈ జాగతిక ధూళిని మేనఁబూసికొని ప్రసన్నుఁడగు చుండును. పిదప విషయముల నెడపెట్టును. కేవల విశుద్ధచైతన్యసత్తనే గ్రహింప నుద్యుతుఁడగును. ఇది జ్ఞానము యొక్క రెండవ మెట్టు. తుదకు యథార్థ జ్ఞానము లభించునపుడు, సర్వము నేకమనియు, సర్వము మధువనియుఁ గనుఁ గొనును. త్యాజ్య మేమియు లేదు; గ్రాహ్య మంతకంటెను లేదని కన్గొనును. త్యాగగ్రహణము లేమియు లేవు. మన యనంతనిత్యానందమయసత్తయే పూర్ణభావముతో విరాజిల్లునని కనుగొనును.

మన యమ్మ సచ్చిదానందమయి. తన సత్స్వరూపమును విశేషభావముతోఁ బ్రకటించుటకే యామె జడాకారముతో వెలయును. జీవుఁడు ఈ జడమును ఘనీభూత సత్స్వరూపమును సేవించుచునే సంతుష్టుఁడగు నంతవఱకు నతఁడు దివాంధుఁడే. ప్రథమశ్రేణికిఁ జెందినవాఁడే. ఇఁక రెండవది మన యమ్మ విశిష్టభావముతోఁ దన సత్స్వరూపమును బ్రకటించుటకుఁ బ్రాణరూపముతో చైతన్యరూపముతో సర్వత్ర విరాజిల్లును. జీవుఁడా సత్స్వరూపమును విడిచి, కేవల విశుద్ధచైతన్యమయమూర్తిని

దర్శించుటకు ముందంజవేయునపు డాతఁడు రాత్ర్యంధుఁడు. రెండవ శ్రేణికిఁజెందిన జీవుఁడు. ఇఁక నమ్మయొక్క యానందమయమూర్తి జాడ నెఱుంగువారు, జ్ఞానమందును, సజ్ఞానమందును, జడమందును, జైతన్యమందును నంతటను, అమ్మ సచ్చిదానందమయమూర్తిని దర్శింతురు. వీరే దివారాత్రముల రెంటను దుల్యదృష్టిసంపన్నులు. వీరు మూడవ తెగవారు. జీవుల కీమూడువిధములైన దర్శనమందే బ్రహ్మత్వము లభించును. ఇందొకరిని మన్నించి యొకరిని విడువలేదు. అఖండ జ్ఞానతత్త్వము జీవజగత్తునం దేభావములతోఁ బ్రకటితమై యనుభవయోగ్యమై యున్నదో తెలియఁజెప్పుటే యభిప్రేతము.

## జ్ఞానాజ్ఞాన తత్త్వము

జీవసమూహము జాగ్రదాదులైన మూడవస్థల యందును జ్ఞానమందే నిల్చియున్నదని మున్నంటిమి. ఆ జ్ఞానసత్త కేవల మనుష్యులందె కాదు. పశుపక్ష్యాది ప్రాణులన్నియు జ్ఞానసత్తచేతనే సత్తావంతము లగుచున్నవి. ఆహారనిద్రాభయ మైథునాదులు నడుచునప్పుడది విషయగోచరరూపముతోనే ప్రకటితమగును. జగత్తు జ్ఞానమువల్లనే పుట్టినది. జ్ఞానమందే నిల్చియున్నది. జ్ఞానమందే మఱల లయించును. జ్ఞానముతక్క నెక్కడను మతేమియు లేదు. జడపదార్థ రూపమున మనకుఁ గానవచ్చున దంతయు, జ్ఞానముయొక్క ఘనీభూతావస్థయే. జ్ఞానమే జగదాకారముతోఁ బ్రకాశించును. మన యమ్మ (ఆత్మ) జ్ఞానమయ మూర్తితో సర్వత్ర సుప్రకటయైననను, మనుష్యుఁడుతక్క నన్యప్రాణులు దాని ననుభవింపఁజాలవు. ఏమన అవి యెల్ల

నిప్పటికిని నమున్నత ప్రాధాన్యపూర్ణమగు నింద్రియాదుల నొందలేదు. గాని, అమ్మ మనుజసంతానము నిట్టిక్షేత్రమునకుఁ దెచ్చిపెట్టి, యదికోరినచో నా చిన్మయ మూర్తిని సాక్షాత్కరించుకొని యమరత్వము నొందగల్గునంతటి పూర్ణసామగ్రిని దయచేసి యిచ్చినది. యథార్థముగా, అమ్మయొక్క యీ సర్వప్రాణి సాధారణమును, అఖండమునైన జ్ఞానమూర్తిని బ్రత్యక్షము చేసికొనుటచే మనుష్యుఁడు -

"నైనం ఛింద న్తి శస్త్రాణి నైనం దహతి పావకః,
న చైనం క్లేదయన్త్యాపో న శోషయతి మారుతః ॥"

శస్త్రములు దీనిని ఛేదింపఁ జాలవు. అగ్గి దీనిని గాల్పఁ .జాలదు. నీరు దీనిని దడుపఁ జాలదు. వాయువు దీని నింకింపఁ జాలదు. కనుక, "న జాయతే న మ్రియతే వాక దాచిత్" 'నేను' జననమరణముల కతీతుఁడనని తెలియఁగలుగును. అమ్మ యొక్క యీ జ్ఞానమయమూర్తిని సాక్షాత్కరించు కొన్నచో, నీ యన్నిటి యనుభవమునుం గాఁగలదు. అదికాక మున్నీ వాక్యముల యర్థజ్ఞానవేు కలుగదు. పెంపుడు పక్షులు 'కృష్ణ, తాత' యనునటులు నోటితో నావృత్తి చేయుటే యగును. మనుష్యుఁడు సహజమైన యీ జ్ఞానమునెడ విముఖుఁడై యుండునంత దాఁక, నెంతపండితుఁడే కానీ, యెంత ధనవంతుఁడేకానీ, ఎంత యశఃశాలియేకానీ, యెట్టిఁడుకానీ పశువునకును వానికిని నెంతో వాసియుండదు.

ఈ విషయమునే మఱింత తెలియఁజూతము. మృగ పక్ష్యాది జంతుజ్ఞానముతో మనుష్యజ్ఞానమును సమానమే యంటిమి. ఈ సమానత, యాహార భయ నిద్రాది విషయకము. పశువులవలెనే

వారును నొకప్పు డాహారమును గొందురు; దానికై ప్రయత్నింతురు; ఇంద్రియము లలసిపోఁగానే నిద్రింతురు. మృత్యువువలని భీతినొందుచుందురు. తమ మరణము తలంపునకు వచ్చినంతనే యొకవిధమైన భయమును లోలోపలనే పొందుదురు. ఇవిగాక మతియొకటి. వర్తమాన భవిష్యత్తులను గూర్చిన యధిక ప్రచారము చేయఁగల యింద్రియ చరితార్థత గల్గుటచే మనుజుల జ్ఞానవిజ్ఞానప్రసారము అన్నివైపుల నయి వింతగొల్పును. ఆర్షదృష్టి కదియుఁ బఱుచిత జ్ఞానము గానే తోఁచును. ఈ జ్ఞానపు హద్దు కేవల భౌతిక జగత్పర్యంతమే. ఎవ్వఁ డెంత మార్జితుఁడు, సంస్కృతుఁడు, నభ్యుదయ సంపన్నుఁడు నైన, అది యజ్ఞానమను పేరనే బరగును. అజ్ఞానమనఁగా - జ్ఞానము లేమి యనిగాని, జ్ఞానమునకు విరోధియైన దేదో యనిగాని తలఁపరాదు. అల్పముగాఁ బ్రకటితమగు జ్ఞానమునే యజ్ఞానమందురు. సర్వప్రాణి సాధారణమై, మును జెప్పఁబడిన యా యఖండ సహజజ్ఞానము పరిచ్ఛిన్నముగా - అనఁగా నామరూపాదివిశిష్టమై వెలయునప్పుడు, అదే యజ్ఞాన మనఁబడును. ఈ యజ్ఞానము (అల్పజ్ఞానాంశము) నందే, పశువులును మనుజులును సమానులు. పశువుల యింద్రియము లపూర్ణములు ఉత్కర్ష లేనివి. కనుక వానియందు వెలయు జ్ఞానము మనుజదృష్టియందు అజ్ఞానము. మనుష్యుల యింద్రియ సామాగ్రి యున్నతతరము కావున జ్ఞానముసైతము సంస్కరింపఁ బడియే వెలయును. వాస్తవముగా రెండును గోచరజ్ఞానములే, కనుక నజ్ఞానమాత్రములే. ఈ మనుష్యత్వము సరిగా సంధి స్థలము. ఒక వంక దేవక్షేత్రము; రెండవవంక పశుక్షేత్రము. మనుష్యుఁడు పూర్ణుఁడయ్యెనేని దేవత.

పశువు పూర్ణమయ్యేనేని మనుష్యుఁడు. ఈ పూర్ణత్వము కేవల జ్ఞానాంశమును బట్టియే యుండును. కనుకనే నీతిశాస్త్రమందు "జ్ఞానేన హీనాః పశుభిః సమానాః" అని చెప్పఁబడియున్నది.

మన దేవ దేవీమూర్తుల కించుమించుగా నన్నిటికిని బశుపక్ష్యాది తిర్యగ్జాతులే వాహనములు. భారతుల ధర్మ విజ్ఞానమందిది యొక చక్కని యపూర్వరహస్యము. ఇచట వాహనతత్త్వసంబంధమునఁ గొంత యాలోచనము అప్రాసంగికము కాదు. ఏ దేవశక్తి యెట్టి పశుశక్తి నదిష్ఠించి పరిచాలితమగునో, యదే యా దేవతకు వాహనమనఁబడును.

ఇచట నొకటి రెండు వాహనరహస్యములే వ్రాసి నా వ్రాసిన "దేవపూజా రహస్య" * మనెడి గ్రంథమందు విశేషించియున్న రహస్యములను జదివి యానందించునది యని మనవి.

## దేవ దేవీ వాహన రహస్యము

సిద్ధిదాత శ్రీగణేశుఁడు. ఆ దేవుని వాహనము మూషికము. సాయనాచార్యుల యథర్వశీర్ష భాష్యమందిట్లు వ్రాయఁబడినది. "ముష్ణాతి - అపహరతి (కర్మఫలానీతి) మూషికః" జీవుని కర్మఫలములను దెలియనీయకే హరించునది మూషికము. ప్రబలప్రతిబంధములైన కర్మఫలము లుండునందదాఁక సిద్ధి లభింపదు గాన, కర్మఫల హరణముపైనే సిద్ధి ప్రతిష్ఠితమై యున్నది. మనుష్యుఁడు సిద్ధిప్రతిబంధమైన కర్మఫలానుభవము లేకయే దానిని

క్షయింపఁజేయఁగోరునవస్థకు వచ్చునపుడాతఁడు మూషికధర్మి యగును. బ్రహ్మజ్ఞానమనెడి వరమసిద్ధి నొందుట కుపయుక్తమగుటచేతనే జీవుఁడు చల్లఁగా నెవ్వరికిని దెలియకుండఁ దన యత్యంత కఠోర కర్మఫలములను ద్రెంచివేయ నారంభించును. అనఁగా మనుజుఁ డీవిధముగా మూషికధర్మి యగుటవల్లనే సిద్ధినొంది ధన్యుఁడగును. కనుకనే, సర్వభూత గణాధిపతికి మూషికము వాహన మనిరి.

ఇటులే లక్ష్మీవాహనము ఉలూకము (గుడ్లగూబ), దివాంధము (పగలు కన్నులు కానరానిది). ఆత్మజ్ఞానాంధుఁ డైనవాఁడే యులూకధర్మము గలవాఁడు. జీవుఁ డులూకధర్మముతో నుండునంత దాఁకనే తెలియకో తెలిసియో ధనధాన్యాది పార్థివసుఖమున కధిష్ఠాత్రియైన బ్రహ్మశక్తి నుపాసించును. అదే పార్థివధనేశ్వరియైన మన యమ్మ లక్ష్మీమూర్తి, దివాంధ ప్రాణులచే వహింపఁబడును. కనుకనే లక్ష్మి వాహనము దివాంధ (గుడ్లగూబ) మనిరి.

ఇఁక సరస్వతీవాహనము హంసము. సరస్వతియే బ్రహ్మవిద్య. రేయుం బగలు, అజపామంత్రసిద్ధుఁడైన సాధకుఁడే హంసధర్మము గలవాఁడు. స్వస్థమనుష్యుఁ డొక పగలు నొక రాత్రియు 21600 'హంసః' యనెడి యజపామంత్రజపము పేరి శ్వాసప్రశ్వాసక్రియ నడుపుచుండును. ఈ స్వాభావిక మంత్రజపాను భవమును జేయఁజాలనంతదాఁక, మనుష్యుఁడు హంసధర్మి కాఁజాలఁడు. కావుననే యతనికి బ్రహ్మవిద్యజాడయే దొరకదు. ఇదిగాక హంసపక్షి యందు మఱియొక విశేషధర్మ మేమనఁగా నీరు కలిసిన పాలనుండి నీటిని విడిచి పాలను గ్రహించుట

మనుష్యుఁడు నిట్లే నశ్వరజగత్తునుండి సారజ్ఞానాంశమును మాత్రమే పరిగ్రహించు సామర్థ్యము గల్గునపుడే బ్రహ్మవిద్యాప్రాప్తియై కృతార్థుఁడగును.

ఇఁక విష్ణువాహనము గరుత్మంతుఁడు - శ్రీమద్భాగవత ద్వాదశ స్కంధమందు "త్రివృద్వేద స్సుపర్ణస్తం యజ్ఞం వహతి పూరుషమ్" వేదమే గరుడపక్షి. ఇది యజ్ఞపురుషుని మోయుచున్నది అని చెప్పఁబడినది. విష్ణుఁడు జగద్వ్యాపి చైతన్యస్వరూపుఁడు. ముక్తిదాత. జ్ఞానకర్మములనెడి యుభయాత్మక సాధనములే విష్ణుదేవతను మోయుచున్నవి.

"ఉభాభ్యా మేవ పక్షాభ్యాం యథా ఖే పక్షిణాం గతిః ।
తథైవ జ్ఞాన కర్మభ్యాం జాయతే పరమం పదమ్ ॥

కేవలాత్కర్మణో జ్ఞానా న్నహి మోక్షోభిజాయతే ।
కింతు తాభ్యాం భవేన్మోక్షః సాధనం తూభయం విదుః ॥"

- యోగవాశిష్ఠము.

పక్షి యాకాశమున రెండు తెక్కలతో నెగురఁగల్గు నటులు సాధకుఁడు జ్ఞానకర్మములనెడి యుభయాత్మక సాధన బలముచేతనే విష్ణుని పరమపదమునొందును. కేవల కర్మముచేతఁ గాని కేవల జ్ఞానముచేతఁగాని ముక్తి నొందఁడు. కావున నుభయాత్మక కర్మమే సాధనము.

ఈ విషయమందొక యాశంక - జ్ఞానకర్మములే మోక్ష సాధనమైనపుడు భక్తికిఁ దావేది ? యని, కొందఱడుగవచ్చును. మున్ముందు దీనికి నమాధానముఁ గందురు కాని యిచట సంక్షేపముగా దాని మీమాంస చేయఁబడును, - చూడుఁడు.

భక్తిమాట చెప్పెడిదేమి ? భక్తియే లేకున్న చో జ్ఞానములేదు; కర్మములేదు. ఇక్కాలమున 'తల్లిదండ్రుల భక్తి నెఱపుము.' అను నిట్టి యుపదేశములతో నిండిన పుస్తకముల ప్రచారమెంతో కాంతుము. భగవంతునెడ భక్తి నెఱపు మనెడి యుపదేశములతో నిండిన పుస్తకముల ప్రచారమెందులకుఁ గాదు ? భక్తి మనుజుని సహజాతధర్మము. ఈ ధర్మవికాసము కానంత దాఁక వేదమందు అనఁగా కర్మజ్ఞానముల యనుశీలనమందు అధికారమే లేదు.

మఱియొక మాట - శ్రీ శంకరాచార్యులు కేవలజ్ఞానము వల్లనే ముక్తి గల్గుననిరి. " జ్ఞానకర్మముల కెన్నఁడును సముచ్చయము కానేరదు ?" ఇమ్మాట సత్యపూర్ణము. ప్రారంభిక దృష్టిచే, నీ సిద్ధాన్తముతో యోగవాశిష్ఠ వాక్యమునకు విరోధము తోఁచునుగాని, వాస్తవముగా విరోధ మేమియులేదు. సాధకునకుఁ గ్రొత్తవానికి, ఈ విచారమున కింతయు నావశ్యకత లేదు. అది క్రమముగాఁ దెలియును.

జీవుఁడు వేదోక్త కర్మకాండమును జ్ఞానమయముగా ననుష్ఠించుటయందుఁ దత్పరుఁడైనపుడే, యతఁడు పక్షిస్థానీయుఁడగును. వేదశాస్త్రమే గరుడుఁడని మునుజెప్పితిమి.

సాధారణముగా వేదము రెండుభాగములుగా విభక్తమైనది. ఒకటి యాగ యజ్ఞాది కర్మకాండానుష్ఠానమునకగు మంత్రములతో నిండియున్నది. రెండవది ఉపనిషద్ (జ్ఞాన) కాండము. దీనినే వేదాన్తము, శ్రుతిశిరస్సు అందురు. జ్ఞాన మయమై కర్మకాండ మెటులనుష్ఠింపఁబడునో యిందుఁ బ్రతిపాదింపఁబడినది.

వేదప్రతిపాదిత కర్మజ్ఞానములు రెండును గరుడుని ఱెక్కలుగా వర్ణింపఁబడినవి. అదిగాక మఱియొక గరుడధర్మ మేమనఁగాఁ బన్నగాశనత్వము (పాములను దినివేయుట), కర్మ సమూహ మెంతగా జ్ఞానమయమగునో యంతగా సంసారాసక్తి - దేహాత్మబోధ మనెడి కుటిల సర్పగతి విలయమగు చుండును. కనుక గరుడునికి సర్పములు భక్ష్యములు. మనుజుఁడిట్లు సర్వవిధముల గరుడధర్మము నొందఁగల్గినపుడే, మోక్షదాతయు సర్వవ్యాపకుఁడు నైన విష్ణుఁడు వానిపై నధిష్ఠితుఁ డగునని తెలియును. అనఁగా జ్ఞానమయ కర్మయజ్ఞమే యజ్ఞేశ్వరుని వాహనము. సర్వగతబ్రహ్మము నిత్యమును యజ్ఞమందే ప్రతిష్ఠితమగును. ఇమ్మాట గీతయందునుం జక్కఁగాఁ జెప్పఁ బడినది.

ఇటులే శివశక్త్యాదివాహనముల తత్త్వము నా "దేవ పూజా రహస్య" మందుఁ జూచునది.

ఈ సందర్భమున మఱియొక మాట. ఈ వాహనతత్త్వ మును జదివి యెవరేని 'ఈ దేవతలకు ఏదేని విశేషమూర్తి యున్నదా - లేదా ?' యని భ్రమనొందకుందురుగాక. యథార్థముగా వీరెల్లరు దేవతలే. చిన్మయమహాశక్తియొక్క యే భావ మెపుడు సాధకుని భక్తిహిమముచే ఘనీభవించి, యే విశిష్టమూర్తిగా వెలయునో యా విశిష్టభావమునుగూర్చి యే యాలోచించితిమి. చైతన్యముయొక్క యా విశిష్టభావమందుఁ దన్మయత్వముగల్గుటచేతనే యిట్టి దేవమూర్తుల దర్శనమగును. మన్ను మున్నగువానితోఁ జేయఁబడినట్టియు, పటములపైఁ జిత్రింపఁబడినట్టియు బొమ్మలతో వానికి సాటిలేదు. బొమ్మల మూర్తి ప్రాణహీనము; వాని

మూర్తి చైతన్యఘన జ్యోతిర్మయము. ఒక్కమాట - ఏ మూర్తియేని ప్రాణప్రతిష్ఠితమై సూర్యమండలమందో, చంద్రమండలమందో, ఉత్తాపరహితమైన యే జ్యోతిర్మండలమందో ప్రతిష్ఠింపఁబడి యుపాసింపఁ బడినపుడు - ఏమి చెప్పను ఆ మాధుర్యము ! ఆ చైతన్యఘన - ఆనందఘన మూర్తిస్వరూపము నేమి వర్ణింపను! ఆ దివ్యజ్యోతి ! చిత్తమును ముగ్ధముచేయు నాయపూర్వసౌందర్యము ! ఆ ప్రాణసమానస్నేహము !

ఉండనిండు; ఇవుడు మనము ప్రస్తావితవిషయ సమీపమునకు వచ్చితిమి. మానవులును దిర్యక్కులను నిజముగా విషయగోచర జ్ఞానసంపన్నములే.

సారమేమనఁగా మనుష్యున కెట్టి జ్ఞానము ప్రియమో తిర్యగ్జాతికి నట్టిదే యని తేలినది. 'జ్ఞాన - ప్రియ' శబ్దముల యర్థమేమి ? కొన్ని సంస్కారముల యావరణములవలన భిన్న భిన్నా కారములతో విషయగోచరమై స్వప్రకాశాఖండజ్ఞానమే ప్రకాశించును. అదే, ఆ సంస్కారవిశిష్టజ్ఞానమే, కొంచెకొంచెముగా మనుష్యులయు, నన్యప్రాణులయు విశ్వాసమునకు దగినట్లుండును. జ్ఞానముయొక్క యీ యంశము మనుష్యులకుఁ బ్రియమైనటులే, పశు పక్ష్యాది తిర్యగ్జాతులకును బ్రియమైనది. ఆ సంస్కారవిశిష్టజ్ఞానముపైనిగల యస్మిత (అహంజ్ఞానము) యే ప్రియత్వకారణము. జీవమాత్రుఁడు తననే యన్నిటికంటె నధికముగాఁ బ్రేమించును. 'నేను' అన్నది మనకెంత ప్రియమో యంతగా నీ జగత్తునం దెట్టి వస్తువును బ్రియము కాదు. మనుష్యులకును దిర్యగ్జాతులకును మృత్యుభయము సమానమే.

జీవుఁ డింతగా మృత్యువున కేల భయపడును ? వెనుక 'నేను' ఉన్నది యను జ్ఞానము మఱపగును. జగత్తునందలి దంతయు నీయొక్క బిందుమాత్రజ్ఞానమునుబట్టియే ఆహారము, నిద్ర, ద్రవ్యోపార్జనము, ఇంద్రియచరితార్థత మున్నగున దంతయు ఆ 'నేను' అనుచుఁ గొంతజ్ఞానము వెలయఁగనును. ఇది దానిని బ్రేమించు ఫలమే. సాధారణముగా మనుష్యులును మనుష్యే తర ప్రాణులును జగత్తున నెంతజ్ఞానమున కధికార మొందిరో జ్ఞానముయొక్క యెంతభాగము కరణముల (ఇంద్రియముల) యందు వెలయునో, ఆ యంశమునే మిగులఁ బ్రేమించి దానిని బూర్ణముగా రక్షించుకొనుటకే ప్రయత్నించుచుండును.

జ్ఞానముకంటె నతిరిక్తమై వేఱొకటి లేకున్నను సాధారణ దృష్టికి జ్ఞానముకంటె నతిరిక్తమనఁగానే జడపదార్థ మను కొందురు. ప్రాణులందుగల యంశములు రెండు, ఒకటి జ్ఞానము. రెండవది పృథివ్యాదుల కలయిక చేనైన జడదేహము. వేదాన్తదర్శన భాష్యకారుల భాషలో నీ యంశమునే యజ్ఞానమనిరి. జ్ఞానాంశమందు మనుష్యులను బశువులును తుల్యులే యని మును జెప్పితిమి. ఆ జ్ఞాన మిరువురికిని సమానప్రియ మంటిమి. వాస్తవముగా బ్రాణిజగత్తునందు రెండువస్తువులే కానవచ్చును. ఒకటి జ్ఞానము (చైతన్యము). రెండవది జడము (అచేతనము) ఇవి సర్వప్రాణులకును దుల్యములే.

సర్వత్ర సుప్రకాశమైనదియు, నింద్రియగ్రాహ్యము కానిదియు నైనదే, యేకరసాత్మకమైన యాత్మజ్ఞానము. ఆ యంశము సాధారణ మనుష్యులకు నొందరాని దైనటులే పశువులకు నొందరానిది. అనఁగా దత్త్వజ్ఞానవిషయమున రెండును

గ్రుడ్డివే యందురు గాని, యిట్టి వ్యాఖ్య మనకు నచ్చదు. ఏలన. మనుష్య జగత్తునం దొక్కొక్క వ్యక్తి యీ జ్ఞానము నొందుటను గనుచున్నాము. పశుజగత్తునందుఁ బొందకుండుటయు గనుచున్నాము. అది యుండనీ.

సాధకా ! నీ వేజ్ఞానమునుబట్టి యహంకరించుచున్నావో దాని నొక్కసారి చూడుము. అట్టి యహంకారము నీకుఁ దగదు. నీవు మనుష్యుఁడవు. జ్ఞానము కలదనుట నిజమే కాని, యది విషయేంద్రియ సంయోగమున నైనదే పరిచ్ఛిన్నము. అట్టిదే పశుపక్ష్యాదులకును గలదు. నీవు సంస్కారవిశిష్టమైన ఖండ ఖండజ్ఞానమును 'నేను' అనుకొనుచుఁ భ్రేమించుచున్నావు. పశువక్షులును దమ తమ యీ జ్ఞానమును 'నేనును' భ్రేమించుచున్నవి. తక్కిన దేదియైనను జడదేహాదిక మే, అజ్ఞానమే. ఆ యంశమందును నిరువురికిని భేదములేదు.

## సర్వము ఆత్మతృప్తికే యగుచున్నది

తిర్యగ్జాతులును, 'తన' నన్నిటికంటెఁ గడుభ్రేమించును. ఆకలి గొన్నప్పు డాహారము చేసినచోఁ దమకుఁ దృప్తి కలుగును: గాని యటులు చేయక నోరనున్న యాహారవస్తువులను సంతానము నోరఁబడవైచును. మనుష్యులకుఁ బై పెచ్చు ప్రత్యుపకారా యుండునుగాన శ్రమముల కోర్చికొని సంతానమును బెంతురు. తక్కుప్రాణుల కట్టియాస లేదు. అట్లైన నవి యెందుల కటులు చేయును ? దీనివలన నొక గుప్తమైన యాత్మతృప్తి కలదు. తాము తిని పొందు తనివికంటెఁ దాము తినక సంతానమునకు

దినిపించుటనే నెక్కువ యాత్మతృప్తి నొందును. గాన జీవుల వ్యవహార మిట్లుండును. ఇందుఁ గొంత మోహము, అజ్ఞానము గలదు. ఇటులు చేయుట వాస్తవముగాఁ దమ్ముఁ దాము ప్రేమించుకొంటయే యని జీవులెఱుఁగరు. సంసారమం దేమి చేసినను నది యాత్మతృప్తి కొఱకే. బృహదారణ్యకోపనిషత్తునందు బ్రహ్మర్షి యాజ్ఞ వల్క్యుఁడు. "పతితృప్తికై పత్ని పతిని బ్రేమింపలేదు; సరి గదా, పతిని బ్రేమించుటచేఁ దన తృప్తియే యగును. కనుకనే పతియెడఁ బ్రేమఁజూపును. ఇటులే పతియుఁ బత్నిని బ్రేమించుటచేఁ దానే సుఖియగుచున్నాఁడు. పుత్త్రునికై తండ్రి పుత్త్రుని బ్రేమింపలేదు. ఆత్మతృప్తికే కొడుకును బ్రేమించు చున్నాఁడు. ఈ విధముగా నెల్లరును దమ తమ తృప్తికొఱకే వేఱొకరిని బ్రేమించుచున్నారు." దీని పేరే జ్ఞానము. ఈ విషయమును దెలిసికొని యనుభవించువాఁడే జ్ఞాని అతఁ డెల్లరిని బ్రేమించును. ఎల్లరకు నుపకారము చేయును. మఱియు నన్నే నేను బ్రేమించు కొను చున్నాననియు నాతఁడెఱుఁగును. జీవుఁ డెంతఁ దాఁక నాత్మను,-అమ్మను-తనను వెదుకఁబోఁడో యెంత దాఁక- వానికి జ్ఞానమున్నను, వాని మోహము తొలఁగదు. పక్షులు తా మాఁకటితో నున్నను, దమ నోరనున్న యాహారవస్తువును బిల్లల నోరఁబెట్టు చుండుట, యెవరి తృప్తి కొఱకో యవి యెఱుఁగవు కనుకనే యవి మోహచ్ఛన్నములు. ఇటులే మనుష్యుఁడును, "నేను భార్యా పుత్త్రులను బోషించుచున్నాను; జగదుపకారమునకే జగద్ధిత కార్యములను జేయు చున్నాను" అని తలంచునంతవఱకు వాఁడు మోహగ్రస్తుఁడే యనక తప్పదు. ఇంకను జూడుము.

## ఇదే మోహము

మనుష్యులకును బశుపక్ష్యాదులకును సంతాన స్నేహ పాలనములనెడి స్వాభావికవృత్తి కారణముగానే స్నేహశీలు రగుచున్నారు, గాని భవిష్యత్తునఁ బుత్త్రాదులచేఁ బ్రత్యుప కార మొందుదు మనెడి వాసనయు మనుష్యులలో దాగి యున్నది. ఇదే విశేషము. తిర్యగ్జాతినిబట్టి చూడఁగా మనుష్య జాతి పలురెట్లు జ్ఞానముచే గొప్పది. మనుష్యుఁడు కొంచెము భవిష్యత్తును జూచును. సాధారణమనుష్యులు పుత్త్రాదులవలన జాగతికమైన యుపకారము నాశింతురు. వారిలో నున్నతబుద్ధులు పారలౌకికములైన (ఆత్మికములైన) యుపకారముల నాశింతురు కాని, యుభయత్ర మోహము సామాన్యమే, ప్రత్యుపకారాశ యుండనీ, లేకపోనీ; పుత్త్రులను పేరనో, పత్నులను పేరనో యెవ్వరి పరితృప్తి చేయుచున్నారో, యది వారెఱుఁగరు. సాధకా ! నీవు గ్రామాంతరములకో, దేశాంతరములకో పోయి, మఱలి వచ్చునపు డేవో తినుబండములు తెచ్చి నీ చిన్ని బిడ్డలచేఁ దినిపింతువు. వా రాదరమతో నవి తినువేళ నీ హృదయములోనే నీ కెంత తనివియయ్యెనో కనుగొంటివా ? పుత్త్రరూపమున నెవ్వరున్నారు ? ఆత్మ - అమ్మ. ప్రియ పరిజన రూపమున నెవ్వరున్నారు ? ఆత్మ- అమ్మ అన్ని రూపముల నెవ్వరున్నారు ? మన యాత్మ-అమ్మ. 'నేను' అన్నదే పత్నీ పుత్త్రాదిరూపమున వెలయుచున్నది. బహుత్వలీల చేయఁ గోరినది గాన, 'నేను' ఒక్కటే యనేకమై బహురూపియైన నేనును సేవించుచున్నది. విష్ణుమూర్తితోను, విశ్వరూపముతోను 'నేనే' విరాజిల్లుచున్నది. ఇది బోధించుకొనక 'నేనును' మఱచి యేమి చేయుచున్నారు ? పత్నీ పుత్త్రుల సేవ - అది 'నా' సేవయే. "నమస్తే

బహురూపాయ విష్ణవే పరమాత్మనే" యనుచు, నెంతదాఁక 'నా' పూజ చేయరో యంతదాఁక, ఫలముచే నా పూజయే చేయుచున్నను, గార్యముచే నన్య దేవతల పూజయే యగును. దీని పేరే యజ్ఞానము. ఇదే మోహము.

## అజ్ఞానము (అల్పజ్ఞానము) గల్గినపుడే పూర్ణాఖండజ్ఞాన ముదయించును

వినుము - అఖండ చిత్సముద్రమందలి యొక తరంగము పైని ఒక కల్పిత 'అహంత' వచ్చి కూర్చున్నది. ఇదే మొదటి యవిద్యాగ్రంథి. విశుద్ధజ్ఞానాంశమందు దృష్టిపడినపుడు "నీవు - నేను" అను మాట లేని యొక జ్ఞానమహాసముద్రము ప్రతీత మగును. దానివలన నాత్మబోధ వికాసమగును. జ్ఞానసముద్ర మందలి యా భిన్న భిన్న తరంగములు పత్నీ పుత్రాదిరూపమున నుబికి లేచుచున్నవి. ఆత్మస త్తచే సత్తావంతమైనది యీ జగత్తని యెఱుంగకుండుటే మోహము. ప్రత్యుపకారము నాశించి ప్రేమించుటే మోహము. దీని పరిణామ మేమి ? జ్ఞానమే. అజ్ఞానము = అల్పజ్ఞానము, కల్గినపుడే పూర్ణాఖండజ్ఞాన ముదయించును. ఇదెట్లు సంభవము ? ఆలోచించుకో. నీవు పుత్రుని బుత్రుఁడనుకొనియే ప్రేమించుచున్నావు. కార్యముచేఁ బ్రేమరూపమై నీ విశిష్టసంస్కార మొకటి సిద్ధమగును. కొన్నాళ్ల తర్వాత - పుత్రుఁడు లేనపుడు (పుత్రుని లేమి యేర్పడునపుడు) ఒక యమరసంవేదనము సిద్ధమగును. దానికి లేమి యుండదు. ఇటులే జగత్తునందంతటను ననుకో. చిన్న చిన్న విషయములను

బ్రేమించి జాగతికపరిచ్ఛిన్నతచే ముగ్ధులై కేవల నామరూపముల యందే యనురక్తులై జీవులు బొట్టు బొట్టుగా ననురాగమును - ప్రేమమును సంచిత మొనర్చుకొందురు. అది పూర్ణమగునాఁడు, మనము మనలనే ప్రేమించుచున్నామని కనుగొందురు. అప్పుడే జీవు లాత్మరతులై అమ్మతో నాడుకొంచు, నఖండ ప్రేమసముద్ర మందుఁ గ్రుంకు లిడుదురు. ఆ యవస్థ రానంతదాఁక, ఆత్మను వీడి మఱియొక కల్పితవస్తువు నాశ్రయించి ప్రేమ యను పేరు నొక యనుభవము చేయుదురు.

## అమ్మ యానందఘనస్వరూపము ప్రేమమే

సాధారణముగా లోకులు "మన మీ నశ్వరజగత్తును బ్రేమించుటే బంధనము. ఈ బంధనమువలన విడివడకున్న భగవత్ప్రాప్తి యగు నాశలేదు" అనుకొందురు. ఇమ్మాట యొకవిధముగా సత్యమే కాని, చక్షుష్మంతులు ఈ విషయాను రాగము, ఈ సంసారాసక్తి యనెడి మాయారజ్జువులు జీవుని సదా బంధించునదిగా నెన్నరు. అవి యమ్మను మనలను బ్రేమ రజ్జువులతోఁ గట్టియుంచుటకుఁ బూర్వాయోజనములు.

సాధకుఁడా ! భయపడకు. నీవు సంసారమం దాసక్తి విడుచుపట్ల, నిన్ను నీ వసమర్థునిగాఁ దలంచుచున్నావు. అటులు తలంపకుము. ఏలన - మాతృప్రాప్తి నీకుఁ జాల దూరమం దున్నది. "గణయసి యదిదం బంధనమాత్రం పశ్చాద్ద్రక్ష్యసి మోచన దాత్రమ్" దేనిని నీ విపుడు బంధన మనుకొను చున్నావో, అదె కొన్నాళ్ల వెనుక

నీ బంధనమును ద్రెంచు వెరవని కనుగొనఁగలవు. నాయనా! తొల్తఁ బ్రేమ మను పేరితో నొకవస్తువు సిద్ధముగా నున్నది. దానినే నీవు ప్రేమగాఁ జేసితివని కనుగొందువు. ప్రేమమే దాని స్వరూపము. ప్రేమమే మన యమ్మ (ఆత్మ) గారి యానందఘనస్వరూపము. అచటఁ బ్రేమము, ప్రేమి యను భేదము లేదు. నీవంతటను బ్రేమమును బ్రసరింపఁజేయ నెుదలిడుము. అపుడు ప్రేమస్వరూపము ననుభవింపఁగల్గుదువు. ఆత్మదానము ప్రేమస్వరూపము. ప్రేమమయియైన యమ్మకు మహామాయకు, ఆత్మదానము చేయుము. అపుడు నీవు ప్రేమసముద్రమందు మునుఁగుట కనుగొందువు. ప్రేమసాధనమునకై - ప్రేమికుఁడ వగుటకై, వేఱొకవిధమైన యనుష్ఠానముగాని, కల్పిత మనుష్యప్రేమము నారోపించుటగాని యేమియు నక్కఱలేదు. ఒక్కమాట మఱువకు - మును జెప్పఁబడిన యఖండజ్ఞాన సముద్రము కేవల నీరససముద్రము కాదు. అది ప్రేమసముద్రము. జ్ఞానమన్నను బ్రేమమన్నను నొక్కటే.

అనేకులు భగవంతునకుఁ బ్రేమ లేదని దుఃఖింతురు గాని, ప్రేమమయి యమ్మ మనలను మఱొకదారిని నడిపించు చున్నది. భగవంతుని బ్రేమించు ప్రయత్నమును బట్టి చూడ, నతనికి, బ్రతిప్రేమ స్వాభావిక మనుకొందుము. దానినే భగవంతు డనుచు నమ్మి ప్రయత్నించుట శీఘ్రఫలదాయకము. ఇంచుక యాలోచించి చూడుము.

## మమతావర్తము, మోహగర్తము

సర్వజీవులకును దాము తృప్తినొందు సాధనమే లక్ష్యమందుండును. ఇదే యథార్థతత్త్వమైనను దన్నుఁ బ్రేమించు విషయమున జీవుఁడు 'నేను' మాట మఱచిపోవును. కొన్ని వస్తువులు 'నావి' యై నిల్చును. ఈ నాది యను మాటయే యింత గొడవకు హేతువు. నాది 'మమ'. ఈ 'మమ' కుఁ దుదిని 'తా' ప్రత్యయము చేరి మమతాశబ్దము సిద్ధమైనది. 'మమతా' యనఁగా నాదియై యుండుట. ఇది నీటిసుడి వంటిది. సుడియు నీటఁబడిన గడ్డిపోఁచ మున్నగునది తిరిగితిరిగి యొక్క చోటనే పడియుండునట్లు, ఈ మమత యనెడి సుడియందుఁడి మనుష్యుఁడును నొక్కచోటనే తిరుగుచుండును; అనఁగా నవశుఁడై దానినంటి తిరుగుచుండి, అనఁగా - నా యాలు, నా బిడ్డలు, నా దేహము అను నిట్టి జ్ఞానముతోనే విచరించి విచరించి మోహమనెడి గర్తమందు బడుచున్నాఁడు. నీటిసుడి చాలసేపు వడివడిందిరిగి యొకవిధమైన గర్తముగా (గోయిగా) నిల్చును. గడ్డిపోఁచ మున్నగునవి మొదట నీటిసుడితోనే తిరిగి తిరిగి తుదకా గోయివలెనైన చోటఁ జేరుకొనును. జీవునకును సరిగి నిట్టి దశయే యగును. చాలకాలము 'నాది' యనుచుఁ దుదకు 'నేను' వస్తువును మఱచిపోవును. దీని పేరే మోహము. ఇదేగర్తసదృశము. మనుజుఁడు 'నేనును' వెదకి తెలిసికొఁజాల నప్పుడే పూర్ణమోహాచ్ఛన్నుఁ డగును అపుడే నరుఁడు, నరకుఁడు - అల్పనరుఁడు. నరశబ్దాంతమునందు అల్పార్థకమైన క ప్రత్యయము చేరఁగా 'నరక' శబ్దమగును. మనుజుఁడు అల్ప

మతియు నతిసంకీర్ణుఁడు నైనపుడే నరకమునకుఁ బోవును. గర్త మందు బడిన వస్తువు మఱి వెలికిఁ గానరానటులే బహుకాలము నా యిల్లు, నా వారు, నా పరివారము అనెడి భావముతో విచరించి జీవుఁడు, మఱి 'నేను' అననేమో కానఁజాలనంత ముగ్ధుఁడై పోవును. రేయుంబవలు 'నేను, నేను' అంచునే యుండును, గాని నేననదేమో తెలియలేఁడు. దీని పేరే యజ్ఞానము - మోహము. దీనిచేతనే మాటిమాటికి సంసారభ్రమణము తప్పకున్నది. సంసారము నింతగా మనదిగాఁ జేసివేయుట కిదె కారణము. నేను పర్యంతము నష్టమైపోయెననెడి యనిష్టము నెంచి యేడ్చును. ఇంటి ప్రాచీరము విరిగిపడినంత, గుండె కరకరలాడిపోవును. ఇట్టియవస్థ వచ్చిపడి నను, సంసారమునందు సమస్తము నష్టమైనను, 'నేను' నిత్యస్థిరుఁడనని తలంపఁడు. "ఈ సంసారము, ఈ దేహము, ఇంద్రియములు, మనస్సు, ప్రాణము, బుద్ధి యన్నియు నా సత్త చేతనే సత్తావంతములు. నేను లేకున్న నిందేదియు నుండదు." అని తెలిసియుఁ దెలియ లేకున్నాఁడు. ఈ మోహ మిట్టి యజ్ఞేయము.

## వాఁడే, నేను

ఆ నేనే, అన్నమయాది పంచకోశములలోనుండి, (మన నిత్యభోగ జగత్తులోపలనుండి) స్త్రీ పుత్త్రాది సంసారములో నుండి, కానరాక దాగియుండి చూచుచున్నది.

"మయ్యేవ సకలం జాతం మయి సర్వం ప్రతిష్ఠితం ।
మయి సర్వం లయం యాతి తద్బ్రహ్మాద్వయమస్మ్యహమ్ ॥"

"నా యందే సకలము పుట్టుచున్నది. నాయందే నిల్చి యున్నది. నాయందే లీనమగుచున్నది. నేను యా యద్వయ బ్రహ్మమను."

ఓహో ! నే నెంత గొప్పవాఁడను. రాజకుమారుఁడు నిరుపేదవేషము వేసికొని పేదవలె నభినయించు చున్నాఁడు. వాఁడే "నేను".

తెలిసినదా ? అజ్ఞానాంధనేత్రము జ్ఞానాంజన శలాకచే విడినది. ఇపుడు - శ్యాముఁ డెవఁడో, శ్యామల యెవతెయో, ముప్పదిమూడు కోటుల దేవత లెవరో, అనంతకోటి బ్రహ్మాండము లేవో, సర్వవ్యాపి మహా ఎవఁడో, సుప్రకాశుఁడయ్యును నదృశ్యుఁ డెవఁడో, దూరముకంటె దూరమయ్యును, నంతరముకంటె నంతరమేదో తెలిసికొనఁగలవు.

చూడు చూడు. అమ్మను, నేనును - పేరు తెలిసికో. ఈసారి తెలియఁగలిగితే, నెంతసులభమో, యది ! ఇపుడు దాని నొందఁ బ్రయత్నింపుము. దానిని బ్రేమింపుము. దానిని గడు ననాదరించితివి; కడు నవమానించితివి. దాని నాదరింపుము. నీవు దానిని జూచిన ముహూర్తమందే సంసారము పాఱిపోవును. ఆ ముహూర్తమందే ముక్తుఁడవగుదువు ఇటులే మాటి మాటికిం జూడుము. జీవన్ముక్తుఁడ వగుదువు - సరే. అది వేఱేమాట. అటుండనీ.

## జీవుల నీ మోహగర్తమం దెవ్వరు త్రోయుచున్నారు ?

మహామాయా ప్రభావము. అది సంసారస్థితికారి. సంసార లీలాభినయము చేయుటయే, అమ్మ - ఆత్మ - నేను - యొక్క

యుద్దేశ్యము ఏకమయ్యును ననేకభావములతో విరాజిల్లుటకైన యానందము ననుభవించుటకే యీ సంసారస్థితి యొక్క యావశ్యకత. మోహములేకున్న నీ సంసారమనెడి యాట సాగదు. కన్నులు మూయకున్న దొంగాట సాగదు. మన యథార్థస్వరూపము ప్రతిక్షణమందును బోధమువలన వికాసము నొందును. మఱి యీ బహుత్వము ఈ సంసారలీల యుండదు.

జీవుఁడా ! నీవు మోహాచ్ఛన్నుఁడవైన కారణమున దుఃఖానుతాపముల నొందరాదు. "అయ్యో ! నేనెంత నికృష్ట జీవుఁడను ! నే నేవిధముగాను మోహముపట్టువలన దప్పుకొనఁ జాలను. నా కిఁక నాత్మలాభము కాదు" అనుచు దుఃఖపడ వలదు. ఎంత మోహము కానీ; ఇది మహామాయా ప్రభావమని తెలిసికొమ్ము. దాని యిచ్ఛవల్లనే నీవు మోహాచ్ఛన్నుఁడవైతివి. ఆమె యిచ్ఛవల్లనే యొకఁడు పుణ్యవంతుఁడు; ఒకఁడు పాపి యగుచున్నాఁడు. నాటకరంగమందెక్కి యభినయించు వారిలో రాజాభినయము చేయువానికిని, భిక్షుకాభినయము చేయువానికిని నెట్టి తేడయు లేదు. ప్రథమాంకమం దుత్తమాధమ పాత్రముల నభినయించినవారలే, రెండవ యంక మందు వ్యత్యాసముగా నభినయింతురు. వీరిలోఁ జిన్న, పెద్ద, పాపి, పుణ్యుఁడు, ఆదృదుఁడు, అనాదృతుఁడు నను మాటయే లేదు. ఎల్లరు సమానులే. అంతయు మన మహామాయ యాటయే.

## మహామాయ యెవరు ?

మున్ను దీని విషయ మింత చెప్పఁబడినది. మఱికొంత యాలోచింతము. మును జెప్పఁబడిన జాగ్రదాదులైన మూడవస్థలకును సాక్షి భూతమై, సర్వప్రాణిసాధారణమైన యఖండ జ్ఞానమును మన మేవిధముగా నెఱుంగఁగల్గుదము ? తరంగములను జూచి - విషయముల ద్వారా, రూపరసాది విషయము లొకదాని వెనుక నొకటి వచ్చి, యా జ్ఞానముయొక్క యస్తిత్వమును దెలియఁజెప్పును. మనము విషయ గ్రహణమునుండి విముఖుల మగునపుడు - అనఁగా సుషుప్తుల మగునపుడు, జ్ఞానముయొక్క యస్తిత్వ మనుభవింపఁబడదు. కనుక జ్ఞానము స్వయంప్రకాశస్వరూపమైనను, విషయాకారమున రూపొంద నంతదాఁక, మన యెదుట నది ప్రకాశింపదు. ఈ విషయములు శక్తిప్రవాహమాత్రములే యని మున్నంటిమి. శాస్త్రకారులు ఈ శక్తిప్రవాహమును స్థూలముగా - షడ్భావ వికారములు గలది యందురు. 1. జాయతే - జన్మగ్రహణము, చేయుచున్నది (పుట్టుచున్నది). 2. అస్తి - ప్రతిశక్తి ప్రవాహముతో విరోధించి తన సత్తను నిల్పుకొనుచున్నది. 3. వర్ధతే - పెరుగుచున్నది. 4. విపరిణమతి - పరిణామము నొందుచున్నది. అనఁగా వృద్ధియొక్క తుదియవస్థ నొందుచున్నది. 5. అపక్షీయతే - క్రమముగా క్షయము నొందుచున్నది. 6. నశ్యతి - నశించుచున్నది. అనఁగా ఆ రూపముతో మఱి కానరాదు. అదృశ్యమై పోవుచున్నది. ప్రత్యేక పదార్థమందును బ్రతిముహూర్తమందును నీ యాఱు మార్పులును గల్గుచునే యున్నవి. ఈ యాఱువికారములును

సంక్షేపముగా, సృష్టి స్థితిలయములనఁబడును. దీనిచే జగత్తనఁగానే (విషయములని) యీ సృష్టి స్థితి ప్రలయాత్మికయైన యొక మహాశక్తి విశేషముగా నెఱుంగునది. ఒక పండో, పూవో చేతఁ బట్టుకొని చూచినచో, దానియం దీషడ్భావ వికారములు - సృష్టి స్థితి ప్రలయరూప క్రియాశక్తి ప్రతిక్షణము ప్రవహించుచుండును. ఇదే జగద్రూపముగా నంతట నున్నది.

ఇచ్చట నొక యాశంక :- శక్తి స్థిరపదార్థము కాదు. అది సర్వదా పరివర్తనశీలమైన ప్రవాహరూపము గదా; ఈ జగత్తును మనమై యెట్లు కన్గొందుము అని - ఒక దృష్టాంతమును సమాధానముగాఁ గైకొనుఁడు. ఒక కఱ్ఱముక్క యొక్క కొనను గాల్చి దానిని వడిగాఁ ద్రిప్పినచో, స్థిరమైన యగ్ని మయరేఖ యొకటి మనకుఁ బ్రత్యక్షముగాఁదెలియును. జగత్తు యొక్క స్థిరతము సత్తయు నట్టిదే. దీనివలన రూపరసాది విషయములు, ఒక శక్తి ప్రవాహమాత్రములైనవి. ఇట్టులే చక్కగాఁ బ్రతీతిగోచరము లగును. ఆ శక్తి యనంతమును వైచిత్ర్యమయము నైన బ్రహ్మాండాకారముతోఁ గానవచ్చుచున్నను, వాస్తవముగా నది యొక్కటే; బయల్పడుచున్న విభిన్నతను జూచి, శక్తిగత విభిన్నత ననుమానించుట నంగతము కాదు. విద్యుచ్ఛక్తి యొక్కటే, యొకచోట దీపముగా వెలుగును. ఒకచోటఁ దిరుగుడు విసవకఱ్ఱను ద్రిప్పును; ఒక చోట ముద్రణయంత్రమును నడుపును. ఇటు లనేకవిధములఁ బరిచాలితమగును. ఆ విధముగా శక్తి యొక్కటే వైచిత్ర్య పూర్ణ జగదాకారమున వెలయుచున్నది.

## శక్తిశక్తిమద్విషయమున నందఱు సత్యదర్శనులే.

ఈ శక్తి మునుజెప్పిన జ్ఞానవక్షమందు నిల్చియున్నది. శక్తిచేతనే జ్ఞానము ప్రకాశించును. ఈ రెండు వస్తువులను జేకొని దార్శనికు లెంతయో విచారించిరి. ఒకటి జ్ఞానము, ఒకటి శక్తి. ఈ రెండు నొక్కటియయా ? వేర్వేఱా ? సాంఖ్యులు రెండును భిన్నములందురు. జ్ఞానమును నిష్క్రియ-నిష్కల- చైతన్యమయ పురుషుఁ డందురు. శక్తిని, జడ-పరిణామశీల- ప్రకృతి యందురు. ఈ ప్రకృతి పురుష వివేకము గల్గుటవల్లనే పురుషుఁడు ప్రయుక్తుఁడై ముక్తస్వరూపమున నుండు నందురు. ప్రకృతి యుక్తతయే పురుషుని బంధనము - జీవభావ మందురు. విశిష్టాద్వైతవాదులు - ప్రకృతిపురుషులు భిన్నులుకారు; ప్రకృతి పురుషుని శక్తియే; అవయవ మాత్రమే; అంగితో నంగము నకుఁగల భేదమువంటిదే వీని భేదము; పురుషుని సామ్ముఖ్యమే (సమ్ముఖుఁ డగుటయే) ముక్తి; విముఖత్వమే బంధనమందురు. వేదా న్తవ్వాదిమతముచే జ్ఞాన శక్తులు కేవల మభిన్నములు. శక్తి శక్తిమంతుల కించుకయు నెట్టి భేదమును లేదు గాని ఆ శక్తి యొక్క యంశమాత్రము పేరే మాయ. అది మిథ్య; ఇంద్రజాలము వంటిది; దానికి వాస్తవ సత్తలేదు. కేవల జ్ఞానమునకే పరమార్థసత్త కలదు. కావున జగదాకారమునఁ బ్రకాశించుచున్న శక్తి రజ్జుసర్పములె భ్రాంతి మాత్రమే. ఇది యిప్పటి యద్వైతవాదము. ఈ యన్నిటియందును సత్యదర్శనము కలదు. అందఱు సత్యదర్శులే. సాధకులకే యీ యనుభవ మగును. మొదటిది ద్వైతప్రతీతి; రెండవది విశిష్టా ద్వైతప్రతీతి; మూడవది సత్యమిథ్యలు కలిసిన యద్వైత ప్రతీతి. కాని, తుట్టతుదకు

సాధకుఁడు ఉపనిషత్ప్రతిపాదిత జ్ఞానమందు - ఆర్షదర్శనమందుఁ జేరుకొనును. అదే పూర్ణాద్వైత దర్శనము. మున్నిటి దర్శనకారులు కాశకృత్స్నాది మహర్షులును, వైదికయుగ బ్రహ్మర్షులును ఈ సిద్ధాన్తమువఱకుఁ జేరిరి. ప్రామాణికోపనిషత్సమూహమును ధీరముగాఁ జదివి, వాని సరళార్థమును గ్రహించినపైని, ఈ సిద్ధాన్తమే స్థిరపడును. ప్రేమికావతారమైన గౌరాంగదేవుఁడును "అద్వయజ్ఞాన తత్త్వ వ్రజేంద్ర నందన'' అనెను. ఇంతెకాక, అచింత్య భేదాభేదమునుగూర్చి చెప్పి, జ్ఞానశక్తుల యథార్థస్వరూపమును వెల్లడించెను. వాఙ్మనస్సుల కతీతమును బుద్ధికంద నిదియునగు తత్త్వ సంబంధమున నెవ్వరేనొక సిద్ధాన్తకల్పనము చేసి 'అది యిదే; యన్యమేమియుంగాదు' అనుట సమీచీనము కాదు; అది యెంత, యెట్లలో, ఎవ్వరెఱుంగుదురు ? ఎవ్వరి కెట్టి యెంత యనుభవము కలదో వాఁడంతే, యటులే చెప్పఁ గలుగు' ననెను.

## జ్ఞానశక్తులు రెండుకావు, ఒక్క వస్తువే

మన మిపుడు, జ్ఞానము శక్తియు సర్వవిధములచేత వేఱు కావని తెలిసికొంటిమి. ఆ యఖండ జ్ఞానసముద్రమందలి ప్రత్యేక కల్పితాణువే శక్తి. దీనివలన ఋషులు శక్తివాచక 'చిత్' పదముతో నే దీనిని వెల్లడించిరని తెలియుచున్నది. శక్తి యొక్క వికాసములేనప్పుడే దీనిపేరు ప్రజ్ఞానము, బ్రహ్మము, నిరంజనము మున్నగు మాటలతోఁ జెల్లును. జ్ఞానమయమే శక్తి; శక్తిమయమే జ్ఞానము. ఈ రెండును మాటలచే వ్యక్తపడవు గాని, జ్ఞానశక్తులు

రెండుకావనుట మాత్రము స్థిరము. ఒక్కవస్తువే సృష్టి స్థితి ప్రలయాత్మకయైన మహాశక్తి, జగదాకారముతోఁ బ్రకటిత యగునపుడు, దీని పేరు సగుణ బ్రహ్మము. ఇది యెక్కడను మిథ్యాభ్రాన్తి శబ్దములతోఁ జెప్పఁ బడలేదు. ఆర్ష గ్రథములందు (ఉపనిషత్తులందు) ఆ శబ్దముల ప్రయోగము కనరాదు. లేదు.

## అదే యాత్మ: అదే మన యమ్మ.

ఈ విచారము చేయుచుఁ గడుదూరము వచ్చితిమి. అది మన యమ్మ, మహామాయ. దాని యాభానము వల్లనే ఈ సంసారము నిల్చియున్నది. జగన్నాటకమాడు మన యమ్మయే, మన మమతావర్తరూపముతో వెలసినది. మఱి మోహగర్త మందుఁ బడిన జీవరూపముతోను నామెయే. సర్వత్ర యీ రూపముతో నమ్మను గాంచువారికి, బంధన మనుచు నేమియులేదు. బంధనమే లేనపుడు ముక్తి యెవరికి ? మనమా యమ్మ కడుపునఁ బుట్టితిమనియు, అమ్మ యొడిలోనే కూర్చున్నామనియు, మనము మహామాయ యొడియందున్న యానందమయ శిశువులమనియు నెఱుఁగుదుము. సరే. ఇంత తడవు విచారించినది - జ్ఞానము, శక్తి - అను రెండు మాటల వ్యవహారము. అది కేవలము మాటల గడబిడ. ఎవ్వఁడును దానిఁ దత్త్వమాత్రముగాఁ దలంపఁదగదు. దానికి వ్యక్తిత్వమున్నది. సర్వేంద్రియ రహితమయ్యును, ఇంద్రియ ధర్మము లన్నియు దానియందున్నవి. స్నేహము కలదు; ప్రేమయు కలదు; దయ గలదు; స్థూలదేహమును ధరించు శక్తియుఁ గలదు. అది సగుణ నిర్గుణము లనెడి రెంటిని మీఱినది. దాని నొక

తత్త్వమాత్రముగాఁ దలఁచినచో దారి తప్పిపోవుటగును. అదే యాత్మ. అంతయు దాని యాట. ఈ సంసారముగా ముస్తాబగుటయే దాని యానందమయలీల. దానిం దెలియఁ బ్రయత్నింపుము. అమ్మా ! యని, నేస్తమా ! యని, బందుగా ! యని, కాతరహృదయముతో నఱువుము. ఊఁత యిమ్మని యేడ్వుము. సర్వసంశయములు తొలఁగును. జీవనము సఫల మగును. ఏడ్చుట చేతఁగాదే నభ్యసింపుము. మహామాయ యెవరో, యేమో, పుస్తకములు చదువుకొన్నంతనే తెలియదు. సంసారస్థితి యెట్లు చేయుచున్నదో, మమత యనెడి సుడిగుండమం దెట్లు పడుచున్నదో, మాటలతోఁ దెలియదు. గురువా ! యని దానికే శరణాగతుఁడ వగుము. అంతో యింతో పొందుదువు. ఇంతో యంతో తెలియుదువు.

## మన యిష్టమే యామె యభీష్టము.

మహామాయ మోహజనని. మనము సామాన్యజీవులము. ఆమెయెా - జగన్నాథుఁడైన హరిని సైతము యోగ నిద్రా స్వరూపమునఁ గ్రమ్మినది. జగత్పాలకుఁడును, జగద్వ్యాపకుఁడును, ప్రాణశక్తి స్వరూపుఁడు నైన విష్ణువును సైతము యోగనిద్ర క్రమ్మినది. ఆమెయే యీ జగత్తును మోహపెట్టుచున్నది. యోగనిద్రా ప్రభావముచే విష్ణుని సైతము మోహపెట్టఁగలిగినది. విష్ణునివలెనే పరిపుష్ట సంతానమును ఈ జగన్నాటకమందు మోహపెట్టి మఱపించి యుంచునదిగదా; ఆమె నిన్నును నన్నును బోలినవారిని దన మహాత్స్వరూపమునుండి జార్చివేసి క్షుద్ర క్షుద్ర విషయములందు ముగ్ధులను జేసెనన్న నిందు విస్మయంపడ నేమున్నది ?

## ఆ మోహావర్త గర్తమునఁ బడకుండు నుపాయమేమి ?

ఆమె యెందుల కీ విధముగా జగమ్మును మోహ పెట్టును ? మన మామె నెయ్యపుబిడ్డలము గదా ! మనల నీ జగత్తేలనమందు ముగ్ధలనొనర్చియుంచిన నామె కేమి లాభము ? ఏమి యభీష్టసిద్ధి యగును ? ఆమెకు గోరికయే లేదుకదా ! యన్నచో - మన యిష్టమే యామె యభీష్టము. మన మీ విధముగా ముగ్ధలము కాఁగోరుచుంటిమి. ఈ విధమైన బహుత్వపు - క్షుద్రత్వపు టాట యాడుకొనుటకై యొకనాఁడు మహేచ్ఛామయికి, అమ్మకు శరణాగతుల మైతిమి. నాఁటినుండియు నిచ్ఛామయి యమ్మ మనలను గుండెపై నుంచుకొని అనంతబహుత్వము, నద్వితీయబహుత్వమును భోగింపఁజేయు చున్నది. ఒక్క గడెయైన నొడినుండి క్రిందికి దింపదు; అనేకులు సాధకు లిచ్చటికి వచ్చి, గొప్ప నమన్వయమందుఁ బడిపోదురు. సాధకుఁడు మఱి బహుత్వమును మెచ్చక, విషయవాననలను గోరక, కామినీకాంచనముల నొల్లక, బహుత్వపు టాట బాగులేదని తోఁచి, "అమ్మా ! ఏకమునుండి వచ్చితిమి; మఱల నేకముచేసివేయు మమ్మా !" యనుచు సరల నగ్న శిశువులవలె నేలఁబడి పొరలి యేడ్చును. అప్పుడును ఈ బహుత్వస్పందనము హృదయవిదారక వాసనలచే నాఁకలిగొన్న యగ్గి కొనమంట యాఱదు. శిశువు ఏదేని ఎంతేని కోరనీ, కోరకపోనీ, తల్లి వడిగాఁ దెచ్చి కోరని విషయములను బెట్టుచుండును. ఇపుడు నీవు పరిపుష్టుఁడవై యెదిగితివి. మఱి విషయము లకించిత్కరము లని యెంచితివి (తెలిసికొంటివి).

కనుక బహుత్వము నచ్చక యిట్లనుచున్నావు, గాని యొకప్పుడు నీ వీ బహుత్వముకొఱకే యమ్మకు శరణు చొచ్చితివి. అమ్మ యా మాట మఱచిపోలేదు. నీవు కోరితివి గనుక, నెయ్యముచే మతిపోయి నీ కోరిన బహుత్వమును వెనుకముందులు చూడ కిచ్చుచున్నది. స్వస్థత చెడిన కొడుకు తల్లిని, బువ్వ యడిగి తినఁగోరినాఁడు గాని, అమ్మ యప్పుడు తిననీయలేదు. ఇపుడు కొడుకు వికార మడఁగినది. 'బువ్వ పెట్టవా ? అమ్మా !' యనుమాట మనసునం దుంచుకొన్నదై, నేఁడు కోరకున్నను నెయ్యముతో విమూ ర్తయై యన్నము తెచ్చి వాని నోటిదగ్గరఁ బెట్టి "అబ్బాయీ ! స్వస్థత చెడియున్నపు డొకనాఁడు నీవు బువ్వ పెట్టుమంటివి. అపుడు నేను నీకుఁ బెట్టలేకపోయితిని. ఇపుడు స్వస్థత కలిగినది. బువ్వ యనాయాసముగాఁ దినఁగలవు" అన్నది. ఇచ్చ లేకున్నను వానిచేఁ దినిపించినది. సరిగా నీ విధముగానే మహామాయ, యమ్మ జగత్తును ముగ్ధమొనర్చుచున్నది.

అమ్మయే మోహరూపముతో నున్నదనెడి విశ్వాసమును వజ్రమువలె దృఢపఱచుకొని కూర్చుండుము. నీవెంత ముగ్ధుఁడవే యగుము. అమ్మా ! యనుట మాత్రము మానకు. కామము గల్గినా - 'జయ మాతా ! యనుము. కాంచనము వచ్చెనా - జయ మాతా ! యనుము. విషయవాసనలు రేఁగెనా - జయ మాతా ! యనుము.' అంతయు అమ్మయే యైనపుడు నీకు వచ్చెడి భయమేమి ? ఎట్టి మూర్తితో గానీ మీయమ్మయే వచ్చినది. క్షుద్రమే కానీ, మలినమే కానీ, పంకిలమే కానీ, అది మీయమ్మ. ఇది నిశ్చయము. నీవామె

నెటు లవమానింతువు ? అవజ్ఞతను దెల్పు కుటిలకటాక్షముతో నెగురఁగొట్టఁ జూతువా ? అమ్మా ! యని యామెకు మనసార మ్రొక్కుము. అమ్మా ! యనుచు నమ్మోహరూపిణి శ్రీచరణము లందు నీ కన్నీటఁ దడిసిన పూదోయిలి నర్పింపుము. అంతె కాదు, అమ్మా ! నీవే బ్రహ్మ విష్ణు మహేశ్వర జననివి, మహా మోక్షప్రదాయినివి, రాజరాజేశ్వరివి యైయుండియు నీ బికారివేషముతో, నింత మలినతతోడి యస్వాభావిక వేషముతో మా యెదుటికి వచ్చితివే. ఓహో ! యేమి మా భాగ్యము ! అనుచు మోహరూపిణి మాతచరణములు పట్టుకొని యేడ్వుము. అప్పుడేమగునో చూడుము.

## ఇదె దేవీ దేవీత్వము – ఇదె యామె యాట.

దేవి యనఁగా ద్యోతనశీల. అనేక భావములలోఁ బ్రకాశించుటే యామె స్వభావము. దేవి-క్రీడనశీల యనియు నర్థము. ఈ బహుత్వక్రీడ స్వభావముగాఁ గలది. ఈ రెండును మహామాయా విశేషణములు. అమ్మ యాట యిట్టిదే. ఆత్మజ్ఞాన ప్రాప్తి యైనట్టియు, ఆత్మానాత్మవస్తువివేకము గలట్టియు జ్ఞానుల చిత్తమును సైతము బలపూర్వకముగా నాకర్షించి విషయములవంకఁ ద్రిప్పుచున్నది. ఆమె ప్రభావ మట్టిది. ఇదె యామె దేవీత్వము. ఇదె యామె యాట. ఈ బలాదాకర్షణమే లేకున్నచో, శ్రీశంకరాచార్యుల బౌద్ధమత దళనము, వేదాన్తభాష్యాది బహుగ్రంథ ప్రణయనము, సనాతనధర్మ పునఃప్రతిష్ఠాపనము, దిగ్విజయాది కార్యప్రయాసము మున్నగునవి సంపన్నములు కాకయే యుండును ఇటులు బలముచూపి లాగి దింపకున్న

భక్తవీరుఁడైన గౌరాంగదేవుని దేశదేశములందు ధర్మప్రచారము, పతితోద్ధారము మున్నగు పనులు నెఱవేఱకయే పోవును. ఇట్లే యంతటను నెఱుంగునది. ఏ మహాపురుషులు మున్ను బుట్టి తమ జ్ఞానభక్తుల యుజ్జ్వల ప్రకాశముచే జగత్తును ధన్యమొనర్చిరో వారును మహామాయ చేతినుండి తప్పుకొనిరని తలంపరాదు. ఎంతగా మిథ్యయే యనుము; భ్రాంతియే యనుము; మహామాయ నిత్య; సత్య. ఇమ్మాట నోర ననకున్నను గార్యముచే నది నిరంతర ప్రమాణిత మయిపోయినది.

సాధకుఁడా ! నీవు రేవగళ్ళు సమానభావముతో అచింత్యము, అవ్యక్తము, అనిర్దేశ్యమునైన యమ్మస్వరూపము నంటి యుండఁ గల్గుదువా ? యోచింపుము. అటులెన్నఁడును గాలేదు. కాఁజాలదు. మౌనీంద్రుఁడేకానీ, గిరిగుహానివాసియే కానీ, నిర్జనమహారణ్య మందుండు సాధుసన్యాసియే కానీ, మహామాయా ప్రభావమునుండి యెవ్వఁడును దప్పుకొనలేడు. తప్పుకోఁజాలఁడు. నాయనా ! దేహముండు నంతదాఁక మహామాయ యుండనే యుండును. విదేహకైవల్య మెన్నఁడో యొకనాఁ డగును. ఎచ్చటి కేగినపై మతి మఱలివచ్చుట కాదో, అదియే మన మాయాపరమధామము. అచ్చటి కామె సంకల్పించిననాఁడే కొనిపోవును. దీనికి మున్నెవరికిని దెలిసికొను నధికారములేదు. తెలిసికొను నావశ్యకత యేమున్నది ? అమ్మ యొడిలోనేయుండి యామె యాటలను జూడుము. ఎంత యానందమయమో ! ఇంతదాఁక నీసంసారము చేసితివి. నీవుకర్తనని సంసారపుటాట యాడితివి. ఎన్ని దెబ్బలో తిన్నావు. ఎంత ధూళియో మేనఁబూసి కొన్నావు. ఇప్పుడమ్మను బోల్చి కొన్నావు. అమ్మను

జేరినావు. అమ్మ యొడిలోనుండి యామె సంసార ఖేలనమందు నీవును జేరిపో. అపుడు నీవు కర్తవైతివి. ఇపుడు అమ్మయే కర్త (కర్త్రి). ఇపుడు నీవు దెబ్బలు తినవు. ధూళి పులిమికొనవు. అపు డాటాడుటవలన దోషమేమున్నది ? త్యాగము త్యాగమనుచు నెందెకు కంగారుపడెదవు ?

సాధనమందుఁ బై మెట్టున కెక్కినవారు - విశేషించి యమ్మ స్వరూపము నెఱింగినవారు, ఈ బలాధాకర్షణము వలన భయపడరు. దుఃఖవిషాదముల నొందరు. కాని, మొదటఁ బ్రవేశించు సాధకుల యవస్థ బహుయాతనను గలిగించును. ఇదిగో - ఏదో కొంత ధ్యానము, పూజ యను నిట్టి కార్య మొకటి పూనుకొనుటకై దానియుం దించుకసేపు మాత్ర యుక్తుఁడవై యుండగలవనుకో. కాకున్నపుడు, ఆ బలాదాకర్షణమన్నది, నీ చిత్తమును బలాత్కరించి లాగి విషయాభిముఖుని జేసివేయును. లేదా - నీవు బ్రతికియున్నంతకును సత్కార్యములు తక్క నసత్కార్యములు చేయునని దృఢసంకల్పము చేసినను, నిన్నెవ్వరో బలిమిని నీ సంకల్పమునుండి జార్చివేయుట కనుగొందువు. ఆ యాకర్షణము మహామాయదే. ఇదే యామె ప్రభావము.

## సృష్టి స్థితి లయములు

## మనుష్యునకు ముక్తి యెపుడు ?

"తయా విసృజ్యతే విశ్వం జగదేత చ్చరాచరం ।
సైషా ప్రసన్నా వరదా నృణాం భవతి ముక్తయే ॥"

- దేవీమాహాత్మ్యము - మార్కండేయ పురాణము.

ఇందున్న 'చరాచర, జగత్, విశ్వ' మనెడి మూడు మాటలందుఁ బునరుక్తిదోషమును గాంచి, యనేకులు పలు విధములుగా నర్థము చేసిరి. మన మెట్టి డొంకతిరుగుడులలోను బడవద్దు. చర = గమనశీలము; అచర = స్థితిశీలము. (జంగమము, స్థావరము). జగత్ = నిత్యపరివర్తనశీలము (జాయతే గచ్ఛతే ఇతి జగత్). సదా మాత్రంకమందుండి, యీ స్థావర జంగమాత్మకమై యవ్యక్త సత్తయందుఁ జొచ్చుచున్నదీ బ్రహ్మాండము. అమె చేయు రచనయే, అమె చేసినదే. ఇందు 'విసృజ్యతే' యను మాటయందు సృష్టి స్థితి లయము లనెడి మూడు కార్యములున్నవని తెల్పుటకే యీ మూడుమాటలుఁ బ్రయోగింపఁ బడినవి. చరాచరపదము సృష్టిని, జగత్పదము స్థితిని, విశ్వపదము లయమును దెల్పునవి.

సృష్టిలోను గొంత రహస్యమున్నది. విసృజ్ ధాతువు నర్థము. విసర్గము - త్యాగము - విడుపు. కావున జగత్సృష్టి యనుటచే జగత్తుయొక్క త్యాగము - వెలికి విడుచుట యని యెఱుఁగునది. మున్ను జగత్తు అదృశ్యభావముతో (కానరాని యవస్థతో) మాతృగర్భ మందుఁ గారణరూపముతో - బీజరూపంతో నుండెను. ఆ జగత్తు అవ్యక్తభావమును విడుచుటచే, అదృశ్యము దృశ్యమైనది. కారణము కార్యమైనది. విత్తు చెట్టుగాఁ బరిణమించినది. దీని పేరే త్యాగము. విడుపు - సృష్టి గీతయందును - "భూతభావోద్భవకరో విసర్గః కర్మ సంజ్ఞితః" అని, యీ మాటయే సరిగా వర్ణింపఁబడినది.

## సృష్టి సంబధాలోచనము.

ప్రకృతివలన మహత్తు, మహత్తు వలన నహంకారము మున్నగు వరుసను, ప్రకృతి పరిణామరూపమైన సాంఖ్యోక్త సృష్టి, లేదా - అత్మ వలన నాకాశము, ఆకాశము వలన వాయువు మున్నగు వరుసను మాయావివర్త రూపమైన వేదాంతోక్త సృష్టితత్త్వము నెఱింగినయంత, సాధనమందుఁదొల్తఁబ్రవేశించిన సాధకుల పక్షమున విశేషలాభముతో ఁచదు. వారు జ్ఞానరాజ్యమందు విచరించు పక్షమునఁ గొంత సాయ మగును. అది యుండనిండు. మనము మఱియొక విధమున (మఱొకవైపునుండి) సృష్టితత్త్వముం దెలియఁబ్రయత్నింతము.

మున్ను, అఖండజ్ఞానమును మహతీశక్తిని గూర్చి చెప్పితిమి. ఆ శక్తి యొక యిచ్ఛామాత్రమే. ప్రత్యేకజీవుని యందునుంగల ధనేచ్ఛా పుత్త్రేచ్ఛా విషయేచ్ఛా సుఖేచ్ఛా రూపమున, క్షుద్రక్షుద్ర విశేషణములతోఁ గూడి యిచ్ఛలు వెలయు చుండును. ఇచ్ఛనుండి యా విశేషణాంశములఁ దీసివేసినపుడు, బ్రహ్మాండవ్యాపియైన యొక మహతీచ్ఛయే ప్రతీతమగును. అఖండజ్ఞానమే - చిచ్ఛక్తియే యా మహతీచ్ఛారూపిణి. ఆ యద్వితీయ మహేచ్ఛవల్లనే బహుభావములుగాఁ బ్రకటిత మగు కల్పన వికసించును. ఈ కల్పనయే జగత్తు. కల్పనము మనోధర్మము. నిరంజనయు, నిర్వికల్పయుఁ, జైతన్యమయియు నైన యమ్మ, తనను మనోమయ - ఇచ్ఛామయ రూపమున వెలయించుకొనునప్పుడే యీ చరాచరసృష్టి యగును.

మనమును మన మన మనోభావములను వెలివుచ్చి యెవరికేని౯ జూపఁగల్గుదుమేని మనమును నిట్టులే సృష్టిచేయఁ గల్గుదుము, గాని యిది కాఁజాలదు. కారణమేమనఁగా మనము మనస్సును జీవిత్వసీమలోనే సంకీర్ణముచేసి యుంచితిమి. కాని మనోమయి, మహదిచ్ఛామయి, మహామాయ, యమ్మ యెక్కడ నెట్టి సంకల్పము చేయునో, యక్కడ నట్టి భావమే ఘనీభూతమగును. కావున౯ బదార్థరూపముతో స్థూలాకారమునఁ బ్రత్యక్షమగును. మనము మంటితో నొకమూర్తిని జేయఁబూనినచో మంటిని సంగ్రహించుటయు, పాలుగూర్చి మర్దించుటయు మున్నగు పనులెన్నో కాళ్లతోను జేతులతోను జేయవలసియుండును; గాని, మనసుతోనే యేదేని మూర్తిని నిర్మింపఁబూనునపుడు ఎట్టిచేష్టయు నక్కఱలేదు. ఎట్టి సామగ్రిని సంగ్రహించు పనిలేదు.

నీవు కలగంటివనుకో, చక్కగా ముస్తాబు చేసిన యేనుఁగుపై స్వారియై, వేలకొలఁది జనముల జయధ్వనుల నడుమ రాచబాటను బోవుచున్నావనుకో; - ఈ దశయందు ఏనుఁగు, జనములు, రాచబాట మున్నగునవి నీ మనసుచేనైన కల్పన తక్క మతేమియుం గాదు. అయినను గలగనువేళ నిది యంతయు స్థూలభావముతోఁ బ్రతీతమగును; గాని యింత కల్పనముచేసి దానిననుభవింపఁ జాలవు. మనోమయి అమ్మయో - తాను బహుత్వకల్పనచేసి తన్నేక భావములతోఁ బ్రకటించు కొనఁగలదు. ఇదే సృష్టితత్త్వము. ఆమె సచ్చిదానందమయి యని మున్నంటిమి. కావున నామె చేయు నీ సృష్టి - బహుత్వ మందును నామె సత్త, చైతన్యము, ఆనందము

ననెడి ముత్తె అంగులు గానగు వికాసము, దానియందుఁ దేటపడును. మఱి యొక విశేష మేమనఁగా, ఆమె తా నద్వితీయ కావున, నామెచేనైన యీ సృష్టియందలి ప్రత్యేకపదార్థమును నద్వితీయమే. రెండు ప్రాణులు, రెండాకులు - ఇంతేల ? రెండిసుక రేణువులు నొక్కతీరుగా నుండవు. సాధకా ! ఒక్కసారి కనువిచ్చి చూడుము. అంతటను మన యమ్మ సచ్చిదానందరూపముతో విరాజిల్లుచున్నది. ఎంత బహుత్వమును, ఎంత క్షుద్రత్వమును గొని తన్ను వెలయించుకొననీ, ఈ యద్వితీయ సచ్చిదానందమూర్తి కేనాఁడును వ్యాఘాతము లేదు. ఈ జగత్తే మన యమ్మ స్థూలమూర్తి. దీనిని ఆత్మ యనలేని నాఁడు, దీనిని అమ్మగాఁ గననినాఁడు జగదతీతమును, అతి సూక్ష్మమునైన కేవల జ్ఞానేచ్ఛాశక్తిరూపమైన యమ్మ మూర్తిని దర్శింపఁగలఁడా ? మనోమయియైన యమ్మను బట్టుకొనలేనిచో, విశుద్ధచైతన్యమయియైన యమ్మ నెటులు చేరఁగలఁడు ? పోనీ; ఇది వేఱే విషయము.

## అమ్మ యీ (బహుత్వ) సృష్టినెందులకుఁజేసినది ?

ఆమె యిచ్ఛ; ఈ వైచిత్ర్య మెందులకు ? ఆమె లీల; ఒకఁడు పల్లకి నెక్కువాఁడు; ఒకఁడు పల్లకి మోయువాఁడు; ఒకఁడు ప్రభువు; ఒకఁడు సేవకుఁడు; ఒకఁడు పాపి; ఒకఁడు పుణ్యవంతుడు. ఇదంతయు నామె లీల. ఆమె ఒకరిని దండింపదు; ఒకరిని బురస్కరింపదు; కర్మఫల పురస్కారము, తిరస్కారము, సాధురక్ష, దుష్టశిక్ష మున్నగునది జ్ఞానముయొక్క తొలిమెట్టు. ఆమెను గాననంతదాఁక ఈ విషయముల నన్నిటిని దెలిసికొన

బాధ్యుఁడగునుగాని, విశ్వరూపదర్శనమైన తర్వాత సాధకుఁడు, "ప్రియోసి ఉమే అయమాత్మా సర్వేషాం భూతానాం మధు । అస్యాత్మనః సర్వాణి భూతాని మధు" అని కనుగొనును. ఆమెను విడిచి యెక్కడను నేమియు లేదుగనుక కర్మఫలము, దండము, పురస్కారము (బహుమానము) మున్నగు వాని నెట్లనఁగలవు ? నీ చిత్తమందు సత్ ప్రవృత్తి వెలయు నపుడు దానిని వేఱొండు వ్యక్తిగా నెంచి బహుమానింపవా ? అసత్ప్రవృత్తి వెలసినదనుకో; దానిని దవ్వు తొలగింపవా ? అంతయు నీవుగానే నీయందే లేచి యుబికినది. ఇదియు నటులే. మన యమ్మ "సత్, అసత్, తత్, పరమ్, యత్" కర్మఫలానుసారము సృష్టివైచిత్ర్య జ్ఞానవిచారముతో యథార్థముగా నున్నది. అమ్మకు స్వాధీనమైన యీ లీలారంగము లోఁ గార్యకారణపరంపరను సంధానించుటచేత, నిట్టి లెక్కలేని సంకెలలు ప్రత్యక్షమగును. ఆ నియమములను ఆ సంకెళ్ళను ఆవిష్కరించుటకొఱకే దార్శనికులు, పౌరాణికులును సృష్టి ప్రక్రియను వర్ణించిరి.

అగుఁగాక ! మన యమ్మ చరాచరరూపముతో సృష్టి శక్తిమయ బ్రహ్మమూర్తిగాను, జగద్రూపముతో స్థితి శక్తి మయ విష్ణుమూర్తిగాను, విశ్వరూపముతో సంహారశక్తిమయ రుద్రమూర్తిగాను నున్నది. ఈ సృజనాదులైన మూడు పనులును నెచట సంఘటితములగునో యదే యీశ్వరుఁడు, అక్షర పురుషుఁడు మున్నగు పేళ్లతోఁ బ్రసిద్ధము. మహామాయ యమ్మలోపల నిమ్మూడు భావములు నవ్యక్తముగా మఱిగి

యున్నవి. వానిని బ్రకాశయోగ్యములుగాఁ జేయుటకై యామె యా యవ్యక్తభావ పరిత్యాగము చేసినది. కావున 'విసృజ్యతే' యను దాని నర్థము త్యాగము. ఇదే తాంత్రికుల "కారణార్ణవ" మందు - మహాకాలీ - బ్రహ్మ విష్ణు మహేశ్వరుల నుత్పత్తిచేయుట.

అమె ముక్తిరూపముతో అనఁగా ననేకరూపములు పరిత్యజించి శుద్ధబోధరూపముతోఁ బ్రకాశించుటకై మనోమూర్తిని విడిచి, తనమూర్తితో వెలయుటకై యుద్యమించు నపుడే ప్రసన్న వరద రూపముతోఁ బ్రియతమ సంతానమునెడ బ్రకటిత యగును. మఱియుం జూడుము. ఈ నిత్యతృప్తయు, నిత్యప్రసన్నతయు, నిత్యవరదయునైన యమ్మ, నిత్యమును జీవుల ముక్తికొఱకై లోలోపలనే, కడుఁజెంతనే నిల్చియుండును. కనుకనే మంత్రమందు 'ఏసా' యని, యతిసామీప్య మును దెలుపు 'ఏతత్' అని ప్రయోగింపఁ బడినవి.

## అమ్మయే ముక్తిహేతువు; బంధన హేతువు?

మహామాయ మన యమ్మ విద్యారూపిణి. "విద్యా యయా తదక్షర మధిగమ్యతే నా విద్యా" దేనిచే నక్షర బ్రహ్మ మెఱుంగఁబడునో యది విద్య. విద్యావిద్యాభేదముచే విద్య రెండు తెఱగులు. అవిద్యా శబ్దార్థము విద్యావిరోధి యేనికాదు. ఏమనగా, విద్య స్వయంప్రకాశరూప; దానికి విరోధి - అవరక మనుచు నేదియు నుండఁజాలదు. ఇచట 'నఞ్' ఈషదర్థమందుఁ బ్రయుక్తమైనది. విద్య వరిచ్ఛిన్న జీవాదిరూవవము వెలయునవు డదే యవిద్యయనుపేరఁ బరగును. ఆమెయే పరమ - 'పరాన్ - బ్రహ్మాదీన్ మాతీతి పరమా' బ్రహ్మ విష్ణ్వాదులకును నియమనకర్త్రి

కావున మనయమ్మ పరమ. అపర-జీవజగత్తునకును నియమనకర్త్రి కావున అవరమ. ఇక్కా రణమున ముక్తి బంధనములకు రెండింటికిని గారణస్వరూపయైనది మన యమ్మయె సర్వేశ్వరేశ్వరి. ఆమె సనాతని - నిత్య. కనుకనే సర్వ; అనఁగా జీవజగత్తు. ఈశ్వరి - అన మాయోపహితచైతన్యము (బ్రహ్మ విష్ణు మహేశ్వరులు) నకును ఈశ్వరి. మహామాయయే సర్వము. ఒక్కమాట - ఈశ్వరుఁడు, జగత్తు అను రెండిటికి సతీత మహామాయయే, క్షర, అక్షర పురుషోత్తములు - జీవేశ్వరబ్రహ్మలు; మనః ప్రాణాత్మలు; జ్ఞానజ్ఞేయజ్ఞులు. ఈ త్రివిధ భిన్న భిన్న రూపములతోఁ దన్ను వెలయించుకొను చుండును.

## ముక్తి సంసారబంధనముల యాలోచనము.

ఈ యాలోచన మిపుడు తప్పదు. జీవుఁడు విశుద్ధ చైతన్యాభావము నొందనంతదాఁక సంసారబంధనవిచారమును జేయనేలేఁడు. మనోబుద్ధీంద్రియాదులలో వెలయు క్షుద్రత్వమునే మెచ్చుకొనుచుండును. ఆ క్షుద్రత్వము - ఆ పరిచ్ఛిన్నత వల్ల నగు యాతనలను జీవుఁ డనుభంపలేనంతసేఁపు, నోరితో వేయి సారులు బంధనము. బంధన మన్నను యథార్థబంధన జ్ఞానము కలుగదు. అసలుమాట యేమనఁగా, అమ్మను జూడఁ జాలనంతదాఁక, బంధనమన నేమో తెలియదు. విచ్చలవిడి నొక్కసారి యాకాశమందు విచరింపక పంజరమందుండుట దుఃఖకరమని పక్షికిఁ దెలియఁబడదు.

బంధన స్వరూపమేమి ? - మనస్సు మనస్సుగా నుండు నంతదాఁక బంధనమే; అంతదాఁక సంసారమే; ఒక వాక్యము "సంసారబీజం మన ఏవ విద్ధి న పుత్ర్త భార్యా ద్రవిణాదికం। హి సంసారనాశో మనసో లయేన న తద్గృహస్థాశ్రమ వర్జనేన॥" మనసే పుత్ర్తభార్యాధనవిషయ మీ సంసారము కాదు. మనోలయ మగుటచేతనే సంసార బంధము తొలఁగిపోవును. గృహస్థాశ్రమమును విడినంతనే సంసారత్యాగము కాదు.

## ముక్తి.

ఇది కడు దూరపుమాట. బంధనజ్ఞానము మఱియు దూరపు మాట అమ్మకే తెలియదు. అమ్మను దెలిసికొమ్ము. యథార్థ బంధన జ్ఞానము గల్గిన క్షణమందే మనము నిత్యముక్తులము. ఏమన, మనము ఇచ్ఛామయి శ్రేష్ఠపుత్ర్తులము. "ఓ యమ్మా ! ఈ బంధనా వస్థయే యింకను ప్రీతికరముగాఁ దోఁచుచున్నది. మే మేమి చేసినను సరే; కట్టిపెట్టియుంచుటే నీకుం గడుఁ బ్రియము. అమ్మా ! ఈ జగత్తునందు శక్తిమంతులు మహాపురుషులు నని వాసికెక్కిన వారు సైతము నీవే యిచ్చిన యే రెండు సిద్ధులనో నెత్తినిబెట్టుకొని యవే కిరీటములనుకొని యహంకారమహత్త్వ మందిరమందుఁ బ్రతిష్ఠితులై పోయిరి. అమ్మా ! వారిలో ముక్తిని గోరువా రెందఱున్నారో ? ఆ తర్వాత నీ యరుణచరణములను సమీపించి శ్రద్ధాభక్తులను విశుద్ధజ్ఞానమును అడిగికొని సర్వశ్రేష్ఠ సాధకు లనఁబడువారు సైతము అహంత్వమును రక్షించుకొనుటయందె (బద్ధావస్థలో

నుండుటయందె) విశేషశ్రమ పడువారేయైరి. వారిలో విశేష మేమనఁగా - ఆ యహంతకు మాసినదుస్తులు తీసివేసి, ఆకర్ష ణీయమైన మంచి దుస్తులతో ముస్తాబు చేయఁగోరుదురు. అమ్మా! చెప్పుమా ! వారు ముక్తికై ప్రయానపడువారా ? మఱి సంసారసంతాపముచే విదగ్ధులై ముక్తి కావలయుననువారి లేములు, అభియోగములు తొలఁగినంతనే, వారి ముక్తికైన యావశ్యకత యంతమగును. కాని, మేమో అమ్మా ! ఈ జీవత్వముండనంతదాఁక, నీ యపారమైన జగద్వ్యాపిస్నేహము ననుభవింపలే మనుకొనుచున్నాము. ఈ మా చిన్నగుండె హద్దులేని యా స్నేహము నందుకొని యిముడ్చుకొనఁజాలదు. ఈ మా రెండు క్షుద్రనయనములు, సదా లోభనీయమైన నీ బ్రహ్మాండవ్యాపి రూపరాశిని గ్రహింపఁజాలవు. ఈ క్షుద్రశ్రవణములు నీ కమనీయ కంఠమునుండి వెల్వడు సుధామయా వాహనమనెడి ప్రణవధ్వనిని ధరించి యుంచలేవు. నీ మేనినుండి వెడలు దివ్యగంధమును వహించుటకు మా యీ ముక్కు చాలదు. మైమఱపించు నీ స్పర్శము నీ మా చర్మము సహింపఁ జాలదు. ఈ క్షుద్రశిశు హస్తములు నీ త్రిభువనవ్యాపిపాదపద్మము లందు భక్తిచందనముఁ జేర్చి పూవుల నర్పింపఁజాలవు. మా యీ యొంటి తలకాయ నీ సహస్రచరణములకు మ్రొక్కఁజాలదు. ఇఁక మే మేవిధముగా నీ యా స్నేహము ననుభవింపఁ గలము ? తల్లీ ! నూతిలోఁ గూర్చుండి మింట నల్లెడ నల్లుకొన్న చంద్రికను బానముచేయుటెట్లు ? కనుక నీ నెయ్యము ననుభవించినపైని, ఆత్మప్రేమమందు యథార్థముగా విహ్వలుఁ డైనపైని ముక్తుఁడగుట సంభవము. అమ్మా ! మేము

ముక్తి కొఱకే ముక్తిని గోఱము. ముక్తితో మాకేమియుఁ బ్రయోజనము లేదు. బద్ధావస్థలోనుండి నీ నెయ్యము ననుభవింపఁ గలమా ? జీవుఁడు, ని న్నేనాఁడు ప్రాణమని, యాత్మయని తెలియఁగలఁడో, యేనాఁడు నీ కాత్మదానముచేసి యాత్మమయుఁడు కాఁగలఁడో యానాఁడే మఱి బంధనమని, ముక్తి యని - యేమియు నుండదని తెలియఁగల్గును. ఆత్మదానము చేయఁగల్గుదనుక, జీవుని హృదయమందు నీవు బంధనరూపము తోను, ముక్తిరూపముతోను వెలయుచునేయుందువు.

## అమ్మ సర్వేశ్వరేశ్వరి

అమ్మా ! నీవు నిత్యముక్తవైనను, అనాదికాలము నుండియు జీవులను (ఈ జగత్తును) బంధనమందే యుంచి యున్నావు. ఈ సృష్టి స్థితి ప్రలయబంధనము నీ యంగమునకు నిత్యవిభూషణము. ఈ బంధనమందుండియు నీవు నిత్యముక్తవు. ఇఁక, నేనో - నిత్యముక్తవు అమ్మవునైన నీ యొడియందుఁ గూర్చుండియు బద్ధుఁడను. నా సంకీర్ణజ్ఞానమును గాల్పనా ? నా పుత్త్రత్వమును గాల్పనా ? ఎల్లప్పుడును దెఱచియుండు శ్రీమాతృహృదయమందు లాలితుఁడును బాలితుఁడు నయ్యుఁదనను బద్ధునిఁగాఁదలంచు వాని పుత్త్రత్వము విడంబనా మాత్రమే. సరే. అది యుండనీ.

బంధనజ్ఞానము తనలోఁ గల్గనంతదాఁకఁ జక్కఁ దినుటయుఁ దిరుగుటయే బాగు. అపుడు మఱి బంధనమేమిటి దనెడి యీ భావము తొలగనంతదాఁక - మన యమ్మ, వాని హృదయమం దింకను బంధనజ్ఞానరూపముతో వెలయలేదన్న మాటయే.

ప్రార్థించినచో నామె యా రూపముతో నావిర్భవించును. అపుడు సైఁపరాని బంధనయాతనను గూర్చిన జ్ఞానము గలుగును. ఆ యాతనలోనుండియే మోక్షకామన యుబుకును. అపుడు అమ్మ జీవునిఁ గ్రమక్రమముగా మీది మీది మెట్టు లెక్కించును ఆ యుచ్చతరపదమును జేరియే ప్రబల ముక్తి కామనను రేఁపి యుంచఁగలదు. అపుడే ముక్తి రూపిణి యమ్మ తన నెయ్యపుబిడ్డను గుండె కత్తించుకొనును. ఈ రెండవస్థలవలన జీవుఁడు మోక్షధామమును జేరును. ఈ మాటను బ్రతిపాదించునదియే 'సర్వేశ్వరేశ్వరీ' శబ్దము సర్వమునకును ఈశ్వరునకును ఈశ్వరి. తొలుత సర్వత్వమందు ముగ్ధుఁడైన జీవుఁడు (అమ్మయొక్క సర్వరూపమందు) జాగతికధూళిని మేనఁ బులిమికొని పరితృపుఁ డగుచుండును. ఇదె జీవభావము - సర్వభావము. దీని తరువాతిది - ఈ సర్వము దేనివలన నుత్పన్నమై నిల్చి, మఱల సంహృతమగుచున్నదో యదే యీశ్వర భావము. తొల్త జీవుఁడు సర్వత్వమునుండి యీశ్వరత్వమును జేరుటకుఁ బ్రయాసంపడును. తుదను ఈ రెండిటికి నతీతమైనది పరమభావము. దేనియందీ రెండు భావములును లెస్సగా నిల్చి యున్నవో, దేనినొందుటచే నీ రెండిటి యవస్థ మఱి యను భవమునకు రాదో, అదే మన యమ్మగారి సర్వేశ్వరేశ్వరీ స్వరూపము.

నీవు వస్త్రమును జూచితివనుకో. వస్త్రమునెడ ముగ్ధుఁడ వగునంతదాఁక నామరూప వ్యవహారరూపిణియైన మాయ యొక్క సర్వరూపముతోనే యుందువు. మఱి యా వస్త్రము నకుఁ గారణమైన నూలుపైఁ జూపువడినది. ఇదే అమ్మయొక్క

యీశ్వరరూపమునకు దృష్టాంతము. తుదకు నూలు (దారము) నకుఁ గారణమైన దాని నెఱుంగఁబోఁగా, ప్రత్తికంటె మఱేమియు లేదు. అపుడు నీలోనుండి, వస్త్రముపేరు, రూపము, గుణము దానికిఁ గారణమైన నూలు, మున్నగున దంతయు నదృశ్యమై పోవును (అది నీకుఁ గానరాదు). అపుడు నీవు మహాకారణమునెడ ముగ్ధుఁడవైతివి. తప్పకగుదువు. ఇదే మన యమ్మ యొక్క సర్వేశ్వరేశ్వరీ స్వరూపమున కుదాహరణము. ఈ మూడవస్థలందును స్వేచ్ఛగా విచరింపఁగలవాఁడే యాప్తకాముఁడైన మహాపురుషుఁడు. (అనఁగా దొలుదొల్త బహుత్వకామము గల్గుటచే "కాముఁడు" అనిపించుకొనిన పరమాత్మ నెఱుంగఁగల్గిన మహాత్ముఁడు.) అతఁడే బంధనముక్తుల కతీతుఁడు. జీవశ్రేణియందు సైతము, ఇమ్మూఁడువిధములైన భేదము కానఁబడును. ఒకఁడు బద్ధుఁడు; ఒకఁడు ముక్తుఁడు; ఒకఁడు ఇయ్యిరువురికి నతీతుఁడు (ముముక్షువు, జీవబంధమున కంతర్గతుఁడే-అందుఁజేరినవాఁడే) ఈ మూడవస్థలే క్రమముగా అవిద్యా, విద్యా పరమా నామములతోఁ బ్రసిద్ధములు. ఇవే క్రమముగా సత్య, నిత్య, అవికారి భావములతో ననుభూతములై యున్నవి.

## ఈ జగత్తే మహామాయా ప్రకటమూర్తి

సాధనమార్గమందు దీనినిబట్టి చూడ మఱియొక సారవంతమైన యుపదేశమును శ్రేష్ఠశిక్షయు బుద్ధికిఁ దట్టదు. సాధకా ! ఈ జగత్తునే అమ్మ యనుము. నమ్మకము లేనిచోఁ బ్రతిగా ననుము. మిథ్య యనుము. ఏమన నామె మిథ్యకాదు. వాయువు నీకుఁ గానరాదు గాని ప్రవాహరూపముగా వెలసి తెలియఁబడుచుండుటచే నెల్లరకు

భోగ్యమే యగుచున్నది. అటులే మనయమ్మ నిత్యస్వరూపగా నింద్రియగ్రాహ్య కాదు. కాని మనకై నిత్యభోగ్యమైన యీ నర్థాలవముగా నిత్యము వెలయుచున్నది. ప్రకటమూర్తిగా నమ్మఁజాలనివాఁడవు, అచింతనీయ తత్త్వము నెట్లు ధరింపఁగలవు ? దప్పిగలవారికి దీనియందెట్టి విచారవితర్కములు నుండఁజాలవు. అయ్యో ! యిన్నాళ్లు నెంత భ్రాంతి ! ఇంతదాఁక జగత్తనుచునే భోగించుచు వచ్చితిని. ఒక్కనాఁడే 'నమ్మ' యని భోగింపనైతినే ! ఇప్పుడు గురుకృపచే నిదే యమ్మ యని తెలిసికొంటిని. ఇపుడు మాతృలాభ మైనది. ఎట జూచిన నటనే యమ్మ. ఇఁక నాకుఁ గొఱఁత యేమి ? నా కాతరప్రార్థనములు, భక్తిహీన ప్రణామములు, కృతజ్ఞతతోడి కన్నీళ్లు నందించుటకై మాయమ్మను నేను వెదకికొన నక్కఱలేదు. ఎచ్చట నర్పించిన నచ్చటనే యందుకొనును. ధన్యుఁడవు; శ్రీగురుఁడా ! నాకు నంద్రపుటావలియొద్దు చూపితివి. అమ్మ యెచట నున్నది ? భగవంతుఁ డెచట నున్నాఁడని, యెంతో వెదకితినిగాని జాడ దొరకలేదు. వెదకుచున్నకొలఁది దూరమై పోసాగెను; గాని యిపుడు నాచెంతనే, నాయెదుటనే యున్నదని తెలిసినది. మఱి భయమేమి ? "సాధనకు నూత్రపాతము చేయుదు" నని నూతన జీవనమునొంది, నూతనోత్సాహముతోఁ బూర్ణాధ్యవసాయముతోఁ బ్రత్యేకకార్యమందును, బ్రత్యేక జగద్వ్యాపారమందును మాతృయుక్తుఁడవుగాఁ బ్రయత్నింపుము.

సాధకా ! గురువాక్యమందుఁ బూర్ణవిశ్వాసమునుంచఁ బ్రయాసపడుము. ఇదిగో ! నీ శుభదిన.మెంత చేరువైనదో చూచుకో

సాధనసాఫల్యమును, జీవనచరితార్థతను నిజముగా ననుభవింపఁ గలవు.

గీతయందలి - "యో మాం పశ్యతి సర్వత్ర సర్వంచ మయి పశ్యతి" యనెడి మంత్రసాధనతో ముందడుగువేసి, శ్రీమాతృతత్త్వమందుఁ బ్రవేశింపకమున్ను సమాధిసహాయముతో శుద్ధబోధమనెడి గురువుచెంత "నిత్యైవ సా జగన్మూర్తిః" యనుమాట వినువారికి సర్వాశలుతీఱి, ప్రాణము పూర్ణశక్తివంతమగును. ఇఁక "ఇది యందఱికిఁ దెలిసిన మాటయే; ఇందుఁ గ్రొత్తయేమున్నది ? భగవంతుఁడు సర్వభూతములందు వెలయుచున్నాఁడు" అనుచు నూత్న రహస్యమును వెదకి తీయఁబూనుకొన్నవారును వెదకి వెదకి తుట్ట తుదకుఁ జిరపురాతనమును, సర్వజనవిదితము నైన యీసత్యమునకే వచ్చి చేరుదురు. ఈ యొక్క మాటనే సర్వశాస్త్రములుఁ బ్రతిధ్వనించుచున్నవి. వైదికయుగమునాఁటి సాధన ప్రణాళియు నీ విశ్వరూపముతోనే యారంభమైనది. అది యుపనిషత్తులందు విస్తారముగా వర్ణింపఁబడినది. సాధనవ్యాపారము కడు సులభము కాదనుకొనుచున్నంత వఱకు సాధకుని యధ్యాత్మికగతి మృదువుగానే నెమ్మదిగానే సాగును. "సాధనము బహు కష్ట సాధ్యమని, ఎంత కఠోరత ! ఎంత త్యాగము ! ఎంత సంయమము ! అబ్బో" యను నిట్టి యుగము వచ్చినది; గాని ఋషియుగమందు ఇట్టిమాట లేనేలేదు. వారు సరళవిశ్వాస ముతో నీ విశ్వరూపోపాసనమును జేయుచుండిరి. దాని ఫలముగా ఋషిత్వము లభించెడిది. ఏ వస్తువును గన్నను, నది భగవంతుఁడని గ్రహించెడివారు. జలమును గని 'ఆపఃశుంధన్తు

మైనసః" 'అపోహిష్ఠామ యో భువస్తాన ఊర్జేదధాతన; మహేర ణాయ చక్షసే' యనెడివారు. అగ్నినిజూచి 'అగ్ని మీళే పురోహితం', వాయువును స్పృశించి 'మధువాతా ఋతాయతే' యనెడివారు. సూర్యుని గని 'యత్తే రూపం కల్యాణతమం తత్తే పశ్యామి' యనెడివారు. పూవును జూచి 'శ్రీరసి మయి రమస్వ' యనెడివారు. భూమిని గాంచి 'మధుమత్పార్థివగ్ం రజః' 'మేదినీ దేవీ వసుంధరా' యనెడివారు. ఇట్లనుచునే, సరళ ప్రాణ నగ్న శిశువులవలె మట్టితో నాడుకొనెడివారు. గడ్డిపఱకలను సైతము దేవీస్వరూపముగా సంభావించెడివారు. పవిత్రనాములైన యా ఋషులు చేసిన సత్యసాధనము, మఱల మన భారతదేశమునఁ బ్రతి గృహమందును నేనాఁటికిఁ బ్రతిష్ఠిత మగునో ! సత్యమంత్రముతో దీక్షితమై, సత్యప్రతిష్ఠతో వీర్యవంతమై, సత్యప్రాప్తితోఁ గృతార్థమై భారతదేశము "జగత్సత్య" మ్మని యెప్పుడనునో ! భూమ్యాపో వాయ్వాదులు, మనస్సు, ప్రాణము సత్యమని యెప్పుడనునో ! సత్యముయొక్క యుజ్జ్వల ప్రకాశముపైఁ బడిన మిథ్యాకలంకకాలిమ యెపుడు మాసిపోవునో ! కాలమే దానిం దొలఁగించును. ఉండనిండు.

## జగత్సత్యప్రతిష్ఠతోడిదే సాధనబలము

ఈ జగన్మూర్తి మహామాయా దర్శనము - సత్యప్రతిష్ఠను - అన్నిటికంటెఁ దొల్త జడపదార్థములతో నారంభము చేయుదురు. ఏమన - చేతనజీవుని భావచాంచల్యము ప్రారంభ సాధకునకు, మాతృత్వబోధతోడి సాధనమందు వ్యాఘాతముఁ గల్గించును గాన, మొదట వృక్షములు, లతలు, పూవులు, మన్ను, ఱాయి,

• సూర్యుఁడు, చంద్రుఁడు, ఆకాశము మున్నగు వస్తువుల యూఁతతో మాతృబోధమును - సత్యజ్ఞానమును రేఁగఁ గొట్టుదురు. ఇట్టి సాధనము చేయఁగాఁజేయఁగాఁ జిత్త విక్షేపవశమున, అమ్మమాట మఱచి విషయాభిముఖులైనను, హానిలేదు. మనశ్చాంచల్యము, అమ్మను మఱపించునటులే, అమ్మను మాటిమాటికిఁ దలపింపఁజేయును. సాధకుఁడా ! నీవు కేవల మాతలపింపఁజేయు ముహూర్తమాత్రమైనను సద్వ్యాపారము చేయఁ బ్రయత్నింపుము. ఎన్నాళ్లో మఱచితివి. దానికై వగవకు. ఏమనఁగా, "భ్రాంతిరూపమున విరాజిల్లు నదియు అమ్మయే అమ్మ యాదఁబడు ముహూర్త మెంతదగ్గ రయిన, నంత భాగ్యము, అప్పుడే, యమ్మ నీకుఁ బ్రత్యక్షము." అను నీ సరళసత్యవిశ్వాసమందుఁ బూర్ణకాముడును, నిశ్చింతుఁడు నైనవాఁడవై నిల్వవలయును. కొన్నాళ్లిట్టి యభ్యాసము చేయుదువేని, "అవును; అమ్మ యీ జగన్మూర్తితో వెలయుచున్న" దనుట యనుభవింపఁగలవు.

సాధకశిష్యుఁడు మహామాయాస్వరూపమును దెలియఁ గోరునపుడు, గురుఁడు జగత్తే యామె స్వరూపమని చెప్పును. ఆమె స్వభావమును గూర్చి యడుగునపుడు 'మయా తతమిదం సర్వం' అను గీతావాక్యమును స్మరించుకొమ్మనును. దీనిచే శిష్య హృదయమందలి యొక యమూలకమైన యాశంకయుఁ దొలఁగిపోవును.ఆమె నిత్యయయ్యును, అనిత్యజగదాకారముతో వెలసినదని మున్నంటిమి. "ఈ యనిత్యస్వరూపసాధన చేయుటచే మన కేమి లాభము ? మన మిది నశ్వరము - అనిత్యము అనుకొంచునే నిత్యవస్తుసంధానము చేయుదుమా ? అనిత్యవస్తు

సాధనకును, దానిచేనగు నిత్యవస్తు లాభమునకును జాలదూరము. అనిత్యత మఱింత గట్టిపడిపోవును ఏమన - దేని సాధన చేయుదుమో, అది యదేయైపోవును. ఎట్టివారిని సేవించిన, నట్టులే మన యాశయుం దీఱును. రత్నాకరుని సేవించినచో రత్నాలే లభించును. సరస్సును సేవించిన మండూకములు, నత్తగుల్లలే లభించును. కనుక, అనిత్య జగత్తును బట్టుకొని సాధన చేసినచో మనమును, అనిత్యులమే యైపోదుము." అను నాశంకగల్గును. గాని, "మయా తతమిదం సర్వం" అను నిమ్మాటచే నీ యాశంకయుఁ దొలఁగిపోయినది. ఆమె యనిత్య జగన్మూర్తిగాఁ బ్రకటితయైనను, ఆమె నిత్య స్వరూపము సర్వత్ర యఖండితము; పడుగుం బేకవలె నంతట నల్లుకొనియున్నది. ఆమె తన నిత్యస్వరూపమునుండి తొలఁగిపోయి, యనిత్య నామరూపాత్మక జగత్తుగా వెలయలేదు. వస్త్రముయొక్క ప్రత్యేకపరమాణువును ప్రత్తితక్క మఱేమియుం గానటులే, మంచుగడ్డయొక్క ప్రత్యేకపరమాణువును నీరు తక్క మఱేమియుం గానటులే యీయనిత్యజగత్తుయొక్క ప్రత్యేక కల్పితాణువును సత్యముకంటె నన్యమేమియుం గాదు; గాన శంక కింతయు హేతవు లేదు. అనిత్యజగత్తు 'నమ్మ' యనుటచే నీవు నిత్యవస్తువువలన వంచింపఁబడవు. ప్రత్తిని వెదకువానికి గుడ్డముక్క దొరికినను, నీరు త్రాగఁగోరినవానికి మంచుబొట్టో మంచుగడ్డయో దొరికినను వాఁడు వెదకుచున్న వస్తువు దొరకకపోయె ననఁదగునా ? అటులే నీవును జగత్తును 'అమ్మ' యని గౌరవించినచో, అమ్మ జగన్మూర్తి తొలఁగి నిత్యస్వరూపము ప్రకాశింపఁజొచ్చుట నీవే

కనుగొందువు. మన యమ్మ (ఆత్మ) సర్వవ్యాప్తి; విభువు. ఆమె యాత్మ స్వరూపముతో నీ జగత్తును వ్యాపించియున్నది. నీవు పరిచ్ఛిన్న భౌతికపదార్థములను 'అమ్మ' యనుకొను మనుట కెన్నో ప్రమాణములున్నవి. ఈ జడవస్తువులే నీతో సచేతనములవలె వ్యవహరించుట కుద్యతములగుట నీవే చూడఁగలవు. జడపదార్థములను 'అమ్మ' యనుచు 'సత్య' మనుచు నే ముహూర్తమందు నీ విశ్వాసము స్థిరపడునో (జడత్వజ్ఞానము తొలఁగునో) యపుడే జనునివలె - చైతన్యముగల జీవునివలె నీతో గూడి వ్యవహరించును. జడములైన చెట్లు నీవు కోరిన పండ్ల నిచ్చును. జడవస్తుత్తిక నీ కోర్కెలను బూరించును. మున్యాశ్రమమందలి చెట్లు శకుంతలకు వస్త్రాలంకారముల నిచ్చి నవి. ఇది కవికల్పనము కాదు. ధ్రువసత్యము. సత్యప్రతిష్ఠవలని ఫలమిదియే సత్యప్రతిష్ఠవలన నెండిపోయిన చెట్లు పుష్పించును. ఈ వర్తమానయుగమందు సైతము అనేకులు సాధకులు 'అమ్మ' యనుచు, జడపదార్థముల వలనఁ జైతన్యవద్వ్యవహారమునొంది ధన్యులగుచున్నారు. కాఁగలరు.

భగవంతుని యేపేరెవ్వనికిఁ బ్రియతమమో, భగవంతు నితో నెట్టిసంబంధ మెవ్వని కభీష్టతమమో, యాసంబంధమను, విశిష్టనామము నుంచి, జడపదార్థములందును సత్యప్రతీతిని స్థాపించుటచే జడమనుచు నేమియు లేదనియు, అది చైతన్యము యొక్క ఛద్మవేషమే యనియు నీవే కనుగొందువు. సత్య ప్రతిష్ఠ ఘనీభూతమగుటచేతను, సత్యబోధము విశ్వాసముగాఁ బరిణమించుట చేతను, నీవు జగన్మూర్తి యెపుడ దృశ్యమైనదియు,

మహా చైతన్యమయాకాశమువలె సర్వేంద్రియ వివర్జితమయ్యును, సర్వేంద్రియ ధర్మములతోఁగూడి యమ్మయొక్క యా నిత్యస్వరూపము సర్వత్ర పరివ్యాప్తమై యుండుటయుఁ గనుఁ గొందువు. ఇదే "తయా (మయా) తతమిదం సర్వం" అను దానిభావము. ఇదే మన యమ్మగారి విశ్వవ్యాపి చిన్మయ రూపము. అది సరూపమును గాదు; అరూపమును గాదు. అది యవ్యక్తము; గగనసదృశ కేవల జ్ఞానమూర్తి. అదే క్షీరోదసముద్రము; కారణవారి; అసురులచేఁ బీడింపఁబడిన దేవతాబృందము. ఈ క్షీరోదకులమును, అవ్యక్తక్షేత్రమును సమీపించి, విశిష్టమూర్తితోఁ జిన్మయి యావిర్భవించుటకుఁ గారణమైన కాతరచిత్తముతోడి ప్రార్థనము చేయును. ఆ మెయుఁ గాసంతసేపులో, వారికభీష్టమైన మూర్తిగా నావిర్భవించి వరాభయప్రదానమును జేయును. ఇట్టి యావిర్భావమునే 'ఉత్పన్నా' అవతారము అందురు. వాస్తవముచే మహామాయకు ఉత్పత్తియులేదు; కర్మమును లేదు. దేవతల కొఱకే యామె యావిర్భావము. దేవకార్యసిద్ధియే యామె చేయుపని. ఇంద్రియాధిష్ఠిత చైతన్యమే దేవతాబృందము. ఆ దేవతలు సదా పరివర్తనశీలములైన జగద్భావములనెడి యసురులచే మాటిమాటికిఁబీడింపఁబడి తమ్ముఁగురునార్తులుగాను ఆ పన్నులు గాను దలంచునపుడే వారు ఆ యవ్యక్తక్షేత్రమందుఁ జేరుకొని, మహామాయయొక్క యావిర్భావమును బ్రార్థింతురు. సంతాన వత్సల మన యమ్మయు నట్టి వ్యాకుల ప్రార్థనమువలన నాకర్షింపఁ బడి బాధ్యయై, విశిష్టమూర్తితో వెలసి బాధకములైన యాసుర విరోధిభావములను వినాశమొనర్చును. (తనలో లీన మొనర్చు

కొనును) ఇదే మహామాయావిర్భావతత్త్వము మున్ముందు మఱింత తేటపడఁగలదు. ఇపుడు గురూపదేశముచే మహామాయను, బ్రహ్మమును భిన్నవస్తువులు కావని చక్కఁగా నెఱంగికొనును.

## కల్పాంతకాలము

అనఁగాఁ బ్రలయకాలము. సృష్టిబీజములు బ్రహ్మమందు లీనమై పోయినపుడు, జగత్తుండదు. ఏకార్ణవీకృత మగును. జగత్తనెడి కార్యసమిష్టి పరమకారణమందు లీనమగుట - అనఁగా నిది కారణీభావము నొందుట పేరే ఏకార్ణవము. ఋగ్వేదమందుఁ జెప్పఁబడిన సృష్టితత్త్వమందు సముద్రము, అర్ణవము అను రెండిటిమాట కలదు. ఈ రెండును నొక్క యర్థము నిచ్చు మాటలే యైనను, ఒకటి కార్యమును, రెండవది కారణమును దెల్పును. మఱ్ఱి విత్తు, కాఁబోవు మఱ్ఱి చెట్టునకుఁ బూర్వావస్థ యైనటులే, జగత్తనెడి యశ్వత్థబీజము - కర్మసంస్కారసమూహము, బ్రహ్మ మనెడి పరమకారణమందు నిల్చియుండును. అపుడే కల్పాంతకాల మనుపేరఁ బ్రసిద్ధమగును. ఇట్టివేళ శుద్ధచైతన్యము తక్క మఱేమియు ననుభవమునకు రాదు. కావున దీనినే యేకార్ణవమని, కారణసముద్రమని యందురు.

అపుడు విష్ణువు యోగనిద్రారాధన చేయును. విష్ణువనఁగా జగద్వ్యాపక చిచ్ఛక్తియే. దేనియందు జగత్తు నిల్చియున్నదో, యే చైతన్యము జగత్తనెడి ప్రతీతితోఁ బ్రసిద్ధమో, దానిపేరే విష్ణువు. సాధనక్షేత్రమందిదె ప్రాణమను పేరితో జెప్పఁబడును. శ్రుతియును - " ఈ సమస్త జగత్తును బ్రాణమే ధరించినది; అదే భగవంతుఁ"

డనెను. "ఉత్పత్తిం ప్రలయం చైవ భూతానా మాగతిం గతిం। వేత్తి విద్యా మవిద్యాంచ స వాచ్యో భగవానితి." ప్రాణుల యుత్పత్తి, లయము, ఆగమము, నిర్గమము, విద్య, అవిద్య యను నివి యెవ్వనికి బాగుగాఁ దెలియునో యతఁడే భగవంతుఁడు. విష్ణుని మఱియొక పేరు ప్రభువు - అనఁగా స్వాధీనుఁడు; స్వతంత్రముగాఁ దన యిచ్ఛాశక్తిని నడుపఁగలవాఁడు. "కర్తుమకర్తు మన్యథా కర్తుంవా సమర్థః ప్రభుః" అమ్మ యితనికి సర్వసంకల్పములు నిచ్ఛా మాత్రమున సిద్ధింపఁగలంత యధికార మిచ్చినది. కావున నితఁడు ప్రభువు. సరే; "అతఁడేమికానీ; జగత్తుండనపుడు జగద్వ్యాపక చైతన్యము (ప్రాణము) ఏ విధముగా నిల్చి యుండును ?" అనుదానికి సమాధానముగానే, "శేషశయనుఁడై" యుండుననిరి. ప్రాణము, అవశేషామృతము నాస్తరణముగాఁ జేసికొని - అనఁగా మున్ముందు కాఁబోవు జగద్బీజములను శయ్యారూపమునఁ గల్పించుకొని (అధఃకృత మొనర్చుకొని) అనఁగాఁ దనలోనె ప్రలీనము చేసి యోగనిద్రను సేవించును.

యోగ మనఁగా నిచటఁ బరమాత్మ మిలనభావము. అట్టి వేళ జగద్భావము సుప్తమై యుండును. జగద్వ్యవహార పక్షమున నిది నిద్రవంటిది. జగద్వ్యాపకుఁడుగా సదాయుండెడి యా విష్ణుఁడు, జగత్తు లేకుండుటచేఁ దన వ్యాపకత్వము, ప్రభుత్వము, భగవత్త్వము మున్నగువానిని, విస్మృతిగర్భమందు ముంచివేసి, తామసీ నిద్రారూపిణి మహామాయ యొడియందు నిద్రించును. ఇదెట్లు కాఁగలదు ? ఒక్క యోగమువల్లనే యిది సంభవము. పరమాత్మభావమునందుఁ దన విశిష్టభావమును జేర్చివేయుటే

యోగము. ఈ యోగము సుసిద్ధమైనపుడే జగద్వ్యాపారమందు నిద్ర (సుప్తభావము) యగును. ఇదియొక యపూర్వ మధుమయావస్థ ప్రలయకాలమందు భగవంతుఁడు విష్ణుఁడు, ఈ యోగనిద్రారూపిణియైన మహామాయను భజించును. ఎవ్వఁడెవ్వరిని భజించునో వాఁడు వారి సారూప్యము నొందును. ఇది సర్వవిజ్ఞానసమ్మత తత్త్వము. కనుక నీ యవస్థ యందు విష్ణునకు మఱి స్వతంత్రత యుండదు. నేను విష్ణుఁడ ననెడి ప్రతీతి యుండదు. అట్టియపుడు కేవల యోగనిద్రా రూపిణియైన యమ్మ సత్తయే తోఁచును.

జీవాత్ముఁడు సమాధిసహాయముతో శుద్ధబోధమనెడి గురుసన్నిధిని మహామాయా స్వరూప స్వభావాదుల నెఱింగి కొని, యామె విశిష్టావిర్భావమును గార్యములను బ్రత్యక్షము చేసికొన వ్యాకులంపడును. సమాధిస్థుఁడైనచో సర్వతత్త్వము లును దెలిసిపోవును. సాధకా ! మఱువకుమా - ఇది సవికల్ప సమాధి. మనస్సు యొక్క అర్ధభాగ లయావస్థ. (8 కళలు లీన మగుట - బ్రహ్మాండమందుఁ జంద్రుఁడు - పిండాండమందు మనస్సు). ఒక్కకళ మిగులు వఱకునగు సమాహితావస్థయందు ఈ సర్వతత్త్వములును వికసించుచుండును. సాధకుఁ డీవిధముగా సమాధిస్థుఁడై కాతర ప్రాణముతో వ్యాకుల హృదయమందు మాత్రావిర్భావమును - మాయావిశిష్టకార్యములను, విశిష్ట స్నేహమును బ్రత్యక్షము చేసికొనుటకై యపేక్షించు చుండునపుడు, రేవగళ్లు తనను జంచలుని జేయుచున్న జగద్భావములు అమ్మ కృపచే మఱి తలయెత్తకుండుటను గనుఁగొనును. జగద్బీజము - సంసారముయొక్క యస్తిత్వము (ఉన్నదనుమాట) యించుకంత

ప్రతీతమగుచుండును, గాని దాని విశిష్టస్వరూపానుభవము కాదు. ఎదుట అతి ఘనమును, అతి శుభ్రమును స్వప్రకాశము నైన మహావ్యోమమే ప్రత్యక్ష మగుచుండును. దీనిపేరే కల్పాంతకాలము - జగత్తుయొక్క ఏ కార్ణవీభావము - శేషశయ్యపై విష్ణుని యోగనిద్ర. ఈ యవస్థయందగునట్టి హద్దులేని యానందసంభోగమునెడ సాధకుఁడు తొల్తఁ గొన్నాళ్లు ముగ్ధుఁడగును. ఎట్టి విశిష్టేచ్ఛయు రేకెత్తఁజాలదు. అట్టి యవస్థయందు క్షణముండి జారిపోవును. మఱల జగద్భావమునందు దిగిపోవును. అపుడు కడు దుఃఖమగును. ఆయానందస్థితిని దలఁచుకొని బాధపడునపుడు, మఱింత దీనుఁడై అమ్మా ! అమ్మా ! యని యఱచుచుండును. శ్రీగురుచరణములను మఱింత గట్టిగాఁ బట్టుకొనును. దాని ఫలముగా సౌభాగ్యవంతుఁడైన జీవుఁడు అమ్మకృపచే మును జెప్పిన యానందావస్థయందు మఱికొంతసేపు నిల్వఁగల్గు సామర్థ్యము నొందును. అపు డతఁడు మధుమయక్షేత్రమైన యమ్మ యొడినుండి నే నేల జాఱిపోతినని తెలిసికొనఁగోరును. మఱియు "అమ్మా! నన్నెవ్వరిచ్చటినుండి లాగివేసి మఱల జగద్భావమునందు ముగ్ధునొనర్చిరో ? చెప్పిచూపవా ?" యని వేడుకొనును. అపు డమ్మ కృపచేత ఆ నిర్మల చిదాకాశ క్షేత్రమందు "మల - అవరక" స్వరూపములైన రెండు సంస్కారములు తలనూపుట కనుగొనును. ఒకటి విశిష్టానందము; రెండవది బహుభావేచ్ఛ. (ఇవే మధు కైటభాసురులుగా దేవీ మహాత్మ్యమందు వర్ణింపఁబడినవి.) అహంబోధాత్మక విశిష్టానందమును, బహుభావేచ్ఛయు ననెడి యీ రెండును విడదీయరాని సంస్కారములు. అవే సాధకుని

కైవల్యమునకు విరోధులు. కావున నివి ఘోరానురులే. అయ్యిరువురు బ్రహ్మను జంపఁగడఁగిరట. పరమార్థ మేమి ? - బ్రహ్మ - (సృష్టిశక్తి. మనస్సు) విష్ణుని నాభికమలమందు = ప్రాణశక్తి యొడిలో నిశ్చలముగా నుండెను. అనఁగా నించుమించు నిష్క్రియముగా నుండెను. పరమాత్మతోఁగూడి యుండుటే బ్రతుకు. విముఖమై యెడసియుండుటే చావు ఆ సమయమునుబట్టి మనస్సు నిష్క్రియమైయున్నను అప్పుడును నది, నాభి - మణిపురచక్ర సబంధమును బూర్తిగా విడువఁజాలదు. కనుక నా రెండు సంస్కారములును, మనస్సును మఱలఁ గ్రియావంతముగాఁ జేయుటచే జగదాకారముగా నాకారితమగుటకై యుబుకు చుండును.దూకుచుండును. ఇదే మధుకైటభులు బ్రహ్మను జంపఁగడఁగుట.

అమ్మ కృవచే సాధకుఁ డీ మూలసంస్కారములను సాక్షాత్కరించుకొనును (అనుభవించును). నోరితో నెన్నిసారు లన్నను వాని యనుభవము కాదు; మాయాకేంద్ర మెచట నున్నదో, అది యీసంస్కారములు తలనూపునపుడే తెలియఁగలరు. మున్ను "బలాదాకృష్య మోహాయ, మహామాయా ప్రయచ్ఛతి" అంటిమి. ఈ బలపూర్వకాకర్షణము ఈ కేంద్రము నుండియే మొదలగును. ఇచ్చటనే యజేయులగు నసురులు (దుష్ట సంస్కారములు) ఉన్నారు. మన యమ్మ యొడిలో నిత్యము నుండకుండఁజేయు ప్రధానవిఘ్నములు. "నేను అనేక మగుదు" నని, యనేకవిధముల 'నానందోవభోగము చేయుదు' నని కోరితిని. ఆ కోరిక పరమేశ్వరభావముదే, గాన నది యమోఘము. ఆ యిచ్ఛను

హృదయమున ధరించి యమ్మ స్వాధీనేచ్ఛతో, స్వాధీనానందముతో ననంఖ్యయెూని భ్రమణము చేసినది. బహుకాల మిటు లనేకజన్మములం దిరిగి, ఒక్కసారి యమ్మయొడి జాడ నెఱింగినచో (నిర్మల పరమాత్మ స్వరూపాభాసము నొందినచో) ఆ బహుత్వమును ఎప్పటి కప్పుడు నశించు నానందమును, బ్రీతిని గలిగింపవు; సరిగదా, బహుకటువులుగాఁ దోఁచును. అపుడే (మధు కైటభ వధమునకు) మూలసంస్కారనాశమునకు సూత్రపాతము.

అవుడు మనన్సు ప్రాణశక్తికే శరణు జొచ్చును. గాని, జగద్వ్యాపారమునుండి బహిర్ముఖమైన యా యవస్థయందు, మఱలఁ బ్రాణశక్తిని మెలఁగించినఁగాని, యసురసంస్కారము లడఁగడు గాన, దానికై సృష్టిస్థితి సంహారకారిణియైన యమ్మనే మహామాయనే ప్రార్థించవలయును. హరి (విష్ణు) నామముతో నొప్పు ప్రాణశక్తి జాగృతమగును. సర్వభావములను హరించునది గాన, దీనిపేరు హరి. ఛాందోగ్యోవనిషత్తునందుఁ బ్రాణోపానన ప్రస్తావమున - ప్రాణమే సర్వభావవిలయకారి - జగద్గ్రాసకారి యని చెప్పఁబడినది. వాస్తవముగా నిది ప్రత్యక్షమే. జ్ఞానేంద్రియ ప్రవాహమే కానీ, కర్మేంద్రియప్రవాహమే కానీ, ప్రాణాది పంచవాయు ప్రవాహమే కానీ, జనన మరణాది పరివర్తన ప్రవాహమే కానీ, సర్వముఁ బ్రాణశక్తి నాశ్రయించియే వెలయును, ప్రలీనమగును గానఁ బ్రాణమే హరి. జీవుఁడే ప్రాణశక్తి సంధానము నొందనంతదాఁక, ప్రాణమునే హరియని, హరినే ప్రాణమని తెలియనంతదాఁక, తాను బ్రాణప్రతిష్ఠితుఁడు కాఁజాలనంతదాఁక, ఆకాశము బ్రద్ధలగునంతగా

హరినామమును నుచ్చరించినను వాని కమరత్వము అమరసంధానము లభింపదు. మహాప్రభు గౌరాంగదేవుఁడు ఈ సర్వాశ్రయప్రాణసంధానము నొందియే, హరినామముతో దన్నుఁదా మఱచెను. ప్రాణహీననామము మృతశబ్దమాత్రమే, కాని ప్రాణమయనామము నామికంటెను గొప్పది. ఏ నామము నుచ్చరించుచు సాధకుఁడు ప్రాణానుభూతితోఁ దన్నుఁ దామఱచునో, ఆ నామమిప్పుడు కోటి కంఠములతో నుచ్చరింపఁబడుచున్నది. గాని యెందఱు యథార్థప్రాణశక్తి సంధానము నొంది, యమరత్వమునొంది సఫలు లగుచున్నారు ? నామము నుచ్చరించుచుఁ గన్నీరు విడుచుట, నేలపైఁ బొరలుట, సంస్కారఘటితమై ప్రాణహీనమైన యేదేనొక దేవమూర్తిని జూచుట, మున్నగున వన్నియు మనుష్యుని విషయమునఁ గాసంత మీది యవస్థలే కాని, యథార్థముగాఁ గృతార్థుఁడైనటులవి రుజువుచేయఁదగినవి కావు. దానికేమి -

## స్తవాదులు సర్వము చైతన్యమయములే కావలయును

సాధకా ! స్తుతి, ఆవేదనము, నివేదనము, కాతరప్రార్థనము, దీనరోదనము - ఏదయినను, అమ్మను అప్రత్యక్షముగా నుంచి చేయకు. అమ్మ యెక్కడనున్నది - అలక్ష్యస్థానమందు (కానరానిచోట) నున్నది - యని, నీవామె నుద్దేశించి కల్పనా సహాయముతో నిచటఁ గూర్చుండి స్తుతిపాఠమో, సాధనమో చేయుదువు. అట్టి భావ ముండునంతవఱకును సాధన మార్గమందు ముందడుగు వడిగా వేయలేవు. సాధనరాజ్యమందుఁ గల్పనకుఁగాని, అనుమానమునకుఁగాని తావులేదు. అప్రత్యక్షము

నుద్దేశించి యెట్టి సాధనము. సాగదు. సాధనకుఁ బ్రత్యక్షతయే ప్రాణము. కనుక మన మిచట మంత్రచైతన్యవిషయమును సంక్షేపముగా నాలోచింతము. ఏమన - మంత్ర చైతన్యమగుటవల్లనే దేవత ప్రత్యక్ష యగును. చైతన్యహీనముగా మంత్రాదుల నుచ్చరించుటచే అనఁగా. దేవత యప్రత్యక్షముగా నుండుటచేఁ బెక్కేండ్లు కఠినసాధన చేసినను నిష్ఫలమే. ఇదే ఋష్యాదేశము.

## మంత్ర చైతన్యము

మంత్రము శబ్దవిశేషము. దేనిని మననము చేయుటచేఁ బరిత్రాణము గల్గునో, యదే మంత్రము. దానియందుఁ బ్రతిపాదింపఁబడిన శ్రేష్ఠమైన యర్థమే గురువు. ఇట్టి యర్థమువల్ల నగు ననుభవముపేరే చైతన్యము. అదే యిష్టదేవత. ఇటులు మంత్రము, గురువు, దేవత యను నిమ్మూటిని నేకముచేయుట చేతనే మంత్రచైతన్యమగును. ఒక దృష్టాంతముచే దీనిని సులభముగాఁ దెలుపుదును. 'చింతపండు' అని యొకమాట యున్నది. ఇదే మంత్రమనుకో. 'చింతపండు' అను మాట యర్థము తెలియనంతసేపు చింతపండేమిటో తెలియదు. అంతదాఁకనది మృతశబ్దమాత్రమే. నోరితో లక్షసారులు 'చింతపండు' అనుచున్నను. దాని విషయమైన తెలివి గలుగదు. తరువాత నొకఁడు వచ్చి, చింతపండు రూపము, రుచి మున్నగువానిని జక్కగాఁ దెలియఁజెప్పినపుడు 'చింతపండు' అనుదాని యర్థజ్ఞానము కలిగినది. ఆ యర్థముపేరే గురువు. మఱల ఆ మాట నుచ్చరించుతోడనే కోలగా వంకరగానుండు దాని రూపము, దాని

పులుపురుచి మున్నగు వాని తెలివి యుబుకును. మఱల నెన్నఁడేని 'చింతపండు' అనఁగానే, దానిని జూడఁగానే, దాని రుచి గుణాదుల జ్ఞానము నీ యనుభవపర్యంతము వికసించి నీ నోరూరును. అది చైతన్యమయమైనదని తెలిసికొందువు. ఇటులే యంతట ననుకో. అమ్మ 'దయామయి' యనుము. అపుడు దయానుభవముతోనీ హృదయము నిండిపోగా, ఆ దయామయీపదము యథార్థముగాఁ బలుకఁబడిన దనుకొమ్ము. నీవు 'అమ్మ' యనుచున్నావు గాని, అమ్మ యెవరో యెఱుఁగవు. 'అమ్మ' అను శబ్దమున కర్థమును నీకుఁ దెలియదు. ఇట్టి యవస్థలో నీవు 'అమ్మ' యనుచున్నను అది మృతశబ్దమే. మఱియొక రెవ్వరేని 'అమ్మ' యనఁగాఁ బరిపూర్ణస్నేహమున కాధారమైన జగద్వ్యాపిచైతన్యము; ఆమెయే ఆత్మ యని తెలియఁజెప్పుదురు. గురుకృపచే నేనాఁడీమాట తెలిసికొందువో, 'అమ్మ' యనఁగానే స్నేహాఘనమును జైతన్యమయము నైన యొక యాత్మానుభవము నీలో నేనాఁ డుబుకునో యా నాఁడే నీ మాతృమంత్రము (అమ్మయని నీ వుచ్చరించుమాట) చైతన్యమయమైనదని తెలిసికొందువు. అర్థము నెఱుంగక, యర్థము ననుసరించు రసముతోను భావముతోను భావుకుఁడుగాక, మంత్రస్తుతి వాక్యాదుల నుచ్చరించుటచే మనుజునకు యథార్థఫలము చేపడదు. ఇదిగో మంత్రచైతన్యమనెడి యొక వస్తువు లేకపోవుటచేతనే సాధనమార్గము దుర్గమమును అంధకారబంధురముగాను దోఁచును. కావున నేదేని స్తోత్రపాఠమో, విశిష్ట మంత్రజపమో, నామసంకీర్తనమో చేయువేళ నీ యాధ్యాత్మిక ప్రగతికి సాయపడు సదర్థము నెఱింగికొని యర్థాను రూపభావముతో

స్వయంసంవేదితుఁడవగుటకుఁ బనిపూనుము. మించిపోలేదు. అప్పుడే దాని యథార్థఫలము వడిగాఁ బ్రత్యక్షమగును.

ఆగామి కర్మముల బీజస్వరూపమైన, పైని జెప్పిన మూలసంస్కారములు సమూలముగా నశించుటకై, బ్రహ్మదేవుఁడైనను మహాశక్తి కే శరణాగతుఁడు కావలయును. శక్తి యొక తత్త్వమనియు, శక్తియే సాధ్యమనియు, శక్తియే సర్వకారణ కారణమనియు, అవాఙ్మనసగోచర పరమాత్మయనియుఁ దెలిసికొని, యామె కృపేచ్ఛలేనిచో, నీ మూలసంస్కా రాసుర నిధనము కాదనియు నెంచి మహామాయను స్తుతించును. సమాధ్యవస్థయందీ సర్వవ్యాపారములు సిద్ధములగునా ? యని కొందఱందురు. వారు పుస్తకాలు చదివి, సమాధిశబ్దమును ముఖస్థముచేసికొన్నవారే. ఏ సమాధియందు సర్వభావములును విలయమగునో, ఆ దినముఒక్కసారియే వచ్చును. ఆ సమాధి యగునపుడు మఱి వ్యుత్థితుఁడు కాఁడు. కనుకనే, గీత యందు "యద్గత్వా ననివర్తంతే తద్ధామ పరమం మమ" అనఁబడినది. మఱి యిది, యా సమాధియందుఁ జేరికొనుటకు ముందుగానగు నవస్థామాత్రమే. అయిన నిదియు సమాధియే. ఏమన నీ యవస్థయందు, జాగతిక వ్యాపారములు, ఇంద్రియవృత్తి ప్రవాహము, ప్రాణవాయుస్పందనము, దేహబోధము మున్నగునవి యించుమించుగా లోపించిపోవును. కలామాత్రము మిగులుగా, మనస్సు ఆత్మబోధమయి చిదాకాశ క్షేత్రమందు నిల్చి, జీవభావము నొందిన కార్యాకారణ శృంఖలాదికమును బ్రత్యక్షము

చేయుచుండును. అంతేగాక, విశిష్టప్రార్థనము మున్నగు నేదేనొక యుపాయసహాయముతో, విశుద్ధాత్మ బోధమందు = అసంప్రజ్ఞాతావస్థయందగ్రసరుఁ డగుటకుఁ బ్రయత్నించును. ఆ యవస్థయందుఁ బ్రార్థనము స్తుతి మున్నగు ప్రక్రియలు స్థూలమందు మఱి బయల్పడవు. శబ్దహీనమైనను బూర్ణశబ్దమయము; క్రియాహీనమైనను బూర్ణక్రియామయము; ఆ ధ్వని లేని ధ్వని, ఆ క్రియ లేని సక్రియావస్థ, యించుకంతయు ననుభవము చేయని వారికిది సులువుగాఁ దెలియుట యసంభవము దానికేమిగాని, స్థూలముగా - సమాధియొక్క ప్రాథమికావస్థయందు మనో బుద్ధి చిత్తాహంకారాదులైన సూక్ష్మకరణసమూహము ప్రత్యక్షమగుచుండుననియు, వాని విశిష్టకార్యప్రణాళి కానవచ్చుననియుఁ దెలిసి కొనుటగును.

## కర్మముల కొక్కటే ఫలము; అదే జ్ఞానము.

జ్ఞానప్రకాశమును జేయుటే కర్మరూపిణియైన యమ్మ ముఖ్యోద్దేశ్యము. జ్ఞానమునిత్యము కనుక నమృతము. అందులకే అమ్మ సుధాస్వరూపిణి యని ప్రసిద్ధ. ఉపనిషత్తునందు "అన్నో ప్రాణో మనః సత్యం లోకాః కర్మసు చామృతమ్" అని యున్నది. శ్రీ శంకరాచార్యులును అమృతశబ్దార్థము కర్మఫల మనిరి. దేవ పితృ కార్యములను గేవల కర్మములుగాను, వైధకార్యములం దుచ్చరింపఁబడు శబ్దములను గేవల మంత్రములుగాను, వైధకార్యములవలని ఫలములను గేవల కర్మఫలములుగాను గనునంతదాఁక నవి క్షరధర్మము గలవే. కాని యక్షరము నిత్యమునైన మన యమ్మ దేవ పితృ కార్యరూపమున వెలయునని

కనుగొననపుడు, ఉదాత్తాది స్వరభేదముతో, మంత్రరూపముతో, అమ్మా ! నీవేయుచ్చరించినావనునపుడు (మూలాధారగత పరావాగ్రూపిణి) యమ్మయే వశ్యన్త్యాదిక్రమమున మీదికిఁ జరించును. (నాదబ్రహ్మస్వరూప) మఱి కర్మఫలములను సుధ (అమృత) యనక అజ్ఞాన క్షరధర్మ్మలని యెటులనఁగలవు ?

## ఓంకారతత్త్వము

తరువాత సర్వమంత్రసారము త్రిధామాత్రా - ఓంకారము; దానివల్లనే జగత్తు; దానివల్లనే బ్రహ్మ విష్ణు మహేశ్వరులు; అదె అకార ఉకార మకారరూపముతో జగదాకారముతో వెలసినది. ఆ త్రిధామాత్రము అమ్మయే.

ఇచటఁ ద్రిమాత్రా స్వరూప సంబంధమున నించుకయా లోచింతము. మాత్రాశబ్దార్థము స్పందనము. స్పందనము శక్తిప్రవాహమాత్రమే. చిన్మయి, మహాశక్తి జగదాకారమున వెలసి జడశక్తి యను పేర బరఁగును. ఆ శక్తిప్రవాహము మూడువిధముల క్రియను బ్రకాశింపఁజేయును. మొదటిది - ఉత్పత్తి :- నామరూప విశిష్టమైన యొక ఘనీభూత శక్తి కేంద్రము. ఇదే సృష్టి - అకారమాత్ర; రెండవది స్థితి. విశిష్టరూపముతోనావిర్భవించిన శక్తి కేంద్రము, లయశక్తితోఁ బ్రతిఘటించి, తన స్వరూపమును స్థిరముగా నుంచుకొనుటకు సమర్థమగునంతదాఁక, ఆ స్థితి ఉకారమాత్రా నామముతోఁ బ్రసిద్ధము. మూడవది లయము. ఈ చెప్పఁబడిన శక్తి కేంద్రము మఱల మహాశక్తి యొడియం దదృశ్యమగునపుడే లయము. 'మకారమాత్ర' యనుపేరఁ బరఁగును. ఏదే నొక పండు

చేతఁ బట్టుకొని చూడు. ఒక శక్తి, యదృశ్యపరమాణువులను జేర్చి, ఫలరూపమునఁ బ్రకాశితమైనదని తెలియును. అదే మొదటి స్పందనము; ఆకారమాత్ర; సాధనభాషయం దదే బ్రహ్మ; యోగులు దానిని మనోరూపముగాఁ జూతురు. మఱలఁ జూడుము ఆ ఫలరూపముతో స్థూలముగాఁ బ్రకటితయైన శక్తి ప్రవాహము, లయ (దానికి విరోధి) శక్తితోఁ బ్రతిఘటించి, తన రూపమును విశిష్టముగా వెలయించుకొనునంత దాఁక, నది రెండవస్పందనము; ఉకారమాత్రాఖ్యము సాధన భాషయం దదే విష్ణువనఁబడును. యోగులు దీనిని బ్రాణరూపమునఁ జూతురు. కొన్నాళ్ళతర్వాత పండు వాడిపోయి క్రుళ్ళ నారంభించును. అదె నాశము; ప్రలయము; అదె మూడవస్పందనము. సాధనాభాషయందది శివుఁ డనఁబడును. యోగులు దానిని జ్ఞానరూపముగాఁ జూతురు. ఈ ప్రలయమొక యాకస్మికముగా నైన పరివర్తనము కాదు. ప్రత్యేక పరమాణువు యొక్క ప్రతిక్షణమందునైన పరివర్తనము ఫలమే. ప్రతిముహూర్తమందును బ్రతిపరమాణువునందును ముని జెప్పిన 'జాయతే, అస్తి, వర్ధతే' యున్నగు నాఱువూర్పులు, నీ మూడువిధములైన స్పందనములలోనే సాగుచున్నవి. జీవుఁడు భూమిపైఁ బడిన క్షణము మొదలు మృత్యువువంకకే ముందడుగు వేయుచున్నాఁడు ఒక్కనాఁడే మృత్యువు రాదు. జన్మము - అనఁగా మృత్యువున కారంభము; అయినను మూడవ స్పందనము మకారమాత్రను బట్టి యెంతదాఁక ద్వితీయస్పందనము -

ఉకారమాత్ర - ప్రబలముగా నుండునో యంతదాఁక మరణ మనుచు నొక విశిష్టఘటనము తెలియఁబడదు.

జగత్తునందలి ప్రత్యేక పదార్థమందును, బ్రత్యేకము ముహూర్తమందును, నీ మూడువిధములైన స్పందనములు - త్రిశక్తిప్రవాహము సాగుచుండును. ఎప్పుడే స్పందనము ప్రబలముగాఁ బనిచేయునో, అప్పుడదే కానవచ్చు చుండును. యోగదృష్టి గలవాఁడు, ఈ జగత్తును మూడు విధములైన శక్తిప్రవాహము తక్క మతేమియుం గాదనియే చూచును. ఇదే శ్యామాపూజయందలి త్రికోణమంత్రము. అయిదు త్రికోణములు గీసి, వానియందు శ్యామాపూజ చేయు విధానము తంత్రములందుఁ గానఁబడును. పంచభూతములు నీ మూడు విధములైన శక్తి ప్రవాహము మాత్రమే కర్పూరాది స్తవమందు 'త్రివంచార' శబ్దమునకుఁ దాత్పర్య మిదే. తంత్రము లందలి సకలయంత్రపూజ, యా మహాశక్తి ప్రవాహానుభవము చేయు యోగ్యతను గల్గించును.

ఇఁక - అర్థమాత్రా స్వరూపము. అమ్మ నడుగుదము. అమ్మా! నీ త్రిమాత్రాస్వరూపము కొంత తెలిసినది. విశేష రూపముతో నుచ్చరింపఁదగనిది. నిత్యయైన యర్థమాత్రయు నీవే. ఉపనిషత్తులందుఁ జెప్పఁబడిన, జాగ్రదభిమాని పురుషుఁడు విశ్వుఁడును, స్వప్నాభిమాని పురుషుఁడు తైజసుఁ డును, సుషుప్త్యభిమాని పురుషుఁడు ప్రాజ్ఞుఁడును అనువారు ఆ త్రిమాత్రాస్వరూపులే. పలునాళ్లకు నీ యా త్రివిధస్వరూప దర్శనము చేసినపైని, నీవే యీ జగద్రూపముతోఁ బ్రకాశించితివను తెలివి గలిగినది. అమ్మా ! నీ యీ స్వరూప మతిమనోహరమైనను,

నింతకంటె గొప్పది నీస్వరూప మొకటి కలదు. అది విశేషరూపముతో నుచ్చరింపఁ బడనిది. అదె నీ నిత్యస్వరూపము. దానినే యర్థమాత్ర యందురు. దానిని మాటలతో వెల్లడించుట కాదు. అమ్మా ! నీ త్రిమాత్రా స్వరూపమువలన - విశేషణమును జూడ విశేష్యము తోఁచు నటులే, జగత్తును జూచిన, శక్తి యనుమానింపఁబడును. గాని అయ్యర్థమాత్రా స్వరూపముతోఁ దురీయావస్థయందు నీవు అచింత్యవు, అనిర్దేశ్యవు, సర్వేంద్రియాగమ్యవు, సత్యవునై యున్నావు. అనఁగా, నొక్కమాట - నీ యందు త్రిమాత్ర పూర్ణముగా లయించి నపుడే, నీ వనుచ్చార్య రూపమున వెలయుదువు.

తృతీయమాత్ర మకారము వ్యంజనము (హల్లు). అది యర్థమాత్ర. ఉకారము శిరసున నీ యర్థమాత్రయే నాద బిందురూపములతోఁ బ్రకాశించును. దానికి ఉనికి గలదు గాని విస్తారము కాదు. బిందువునకొక స్థానము నియతమైనను దానికి విస్తృతి (పొడవు వెడల్పు) లేదు. ఇది జ్యామిత్ర రేఖా గణిత ప్రమాణము (Meridian). ఆ యున్నయంశము నిర్గుణ పరబ్రహ్మద్యోతకము. విస్తారాంశము సగుణబ్రహ్మ (శక్తి) ప్రకాశకము. నిర్గుణమునకు గుణము నొప్పుకొననివారే, బ్రహ్మముకంటె మాయను వేఱుగాఁ జూతురు. ఉనికి యున్న దానికింతో యంతో విస్తారము తప్పదు. ఏమనఁగా బిందు సమష్టియే పదార్థము. బిందువును గేవల చైతన్యముగాను, నాదమును గేవల శక్తిగాను గైకొనుటచే బిందువునకు శక్తి హీనత వచ్చిపడును. ఈ మతముచే

శక్తిహీనునకు శక్తిపరి చాలకత యసంభవము కనుక, బ్రహ్మమును శక్తిహీన మందురు. ఇది వేదమునకును యుక్తికిని విరుద్ధము.

కాని అమ్మా ! నీవు మా బుద్ధియందు బిందురూపమున నిర్గుణవును, నాదరూపముచే సగుణవును; అట్లే త్రిమాత్రా స్వరూపముచే జగద్రూపముగా వ్యాపించియున్నావు. అయినను నీ యీ యర్థమాత్రాస్వరూపము నిత్యపరివర్తన హీనమును, అనుచ్చార్యమునై వాగగోచరము. కావుననే దేవీ ! ప్రకాశ శీలా ! అమ్మా ! నీవే సావిత్రివి. జగత్తును బ్రసవించుదానవు. ప్రాణులను గన్న దానవు. పరాజననివి. త్రిమాత్రారూపముతో జగ్జననివియు, అర్థమాత్రారూపముతో నీవే పరాజననివియు నైయున్నావు.

త్రిమాత్రా - అర్థమాత్రా శబ్దములకుఁ గ్రమముగా స్వరములు, వ్యంజనములు నని యర్థము చేయువారితోను మా కెట్టి యాపత్తియు లేదు. ఏమనఁగా, స్వరసహాయము తోనే వ్యంజనము లుచ్చరింపఁబడును. స్వరమును (శక్తిని) ఆశ్రయించియే నిర్గుణబ్రహ్మము సగుణరూపమున వెలయు చున్నది. (సౌందర్యలహరి మొదటిశ్లోక వివరణమును జూడుడు.)

## అమ్మ మాతృత్వము

అమ్మా ! సృజించుటకు (వెలికి విడుచుటకు) మున్ను బీజరూపముతో నీ విశ్వము నీ గర్భమందే ధరింపఁబడును. మఱి నీవే యా బీజమును బరివర్తనశీలమైన (మాఱుచుండు స్వభావముగల) జగద్రూపముతోఁ బ్రసవించుచున్నావు. మఱి నీవే దీనిని బరిపాలించి యంతకాలమందు ('స బహుస్యామ్' అనెడి

రెండవ సంకల్ప స్పందము) కాఁగానే భక్షింతువు. (లోని కీడ్చుకొందువు.) ఇదే నీ మాతృత్వము గర్భమందు ధరించుట, ప్రసవించుట, హృదయమందు ధరించి జ్ఞానస్తన్యమిచ్చి పెంచుట, అంతమందు పూర్ణజ్ఞానావస్థయందు, నీ కంటె వేఱుకానటులు నీలోఁ జేర్చివేసికొనుట, యను నిదే నీ మహామాయాత్వము - మాతృత్వము.

" 'నేను' జగద్భోగయోగ్యత నొందనంతదాఁక (జగత్తును భోగయోగ్యముగాఁ జేయనంతదాఁక) బీజరూపముగా గర్భమందు ధరించి, నీరక్త (ఉపరంజన) శక్తిచేతనే భోగయోగ్యతను గూర్చితిని. నాస్తన్యముతో - (అమృతముతో) విషయ జ్ఞానముతోఁ బోషించుకొందును. ఒక్కొక్క బొట్టుగా జ్ఞాన సంచయమును గూర్చి, అమరత్వము నొందు యోగ్యతను గల్గించుటకై, అసంఖ్య జననమరణాది పరివర్తనమందుఁ గొని పోదును." అని మాతృస్నేహముతో ముగ్ధవై, 'అమ్మ' నని తన్మయత్వమునొంది, పూర్ణజ్ఞానమయావస్థకు వచ్చియున్నపుడే నేను నీ యమృతమును అన్నము నగుదును. అపుడు నన్నును భక్షించి - నీవు నీ యన్నపూర్ణ నామమును సార్థకము చేసి కొందువు.

నీ యన్నముగా నున్న మేము "సర్వగ్రాసిని యమ్మ యేనాఁడో మమ్ములను దినివేయును" అని తెలిసికొనలేనంత దాఁక, నీవే మా యన్న మవు. మేము నీ స్తన్యము ద్రాగియే పెరుగుచున్నాము. అమ్మా ! నిన్నెన్నివిధములుగా భోగించు చున్నామో యది విచారించినపుడు చకితులమైపోదుము. ఎవఁ డెట్టి భావముతోఁ జూచునో, యపుడు నీ వట్టి భావము తోనే రూపమును ధరింతువు. నీవే విషయాకారమున వచ్చి, మా యింద్రియములను భోగపూర్ణములుగాఁ జేయుదువు. మా యిచ్ఛనుబట్టి మా లాలన

కాహారము వేయుచుందువు. ఈ విధముగా ఒకనాఁడు కాదు; రెన్నాళ్లకాదు; అనేక జన్మ జన్మాంతరములనుండియు నిట్టి యడ్డులేని వాసనలను హృదయమునుండి విడిపించుచున్నావు. మఱి నీవు మా భోగవాసనలను జరితార్థము చేయుటకు వాసనానుసారముగా క్షుద్రక్షుద్ర విషయముల వేషముతో మా యెదుట వెలయునంత స్నేహవిమూఢ వగుచున్నావు. నీ గొప్పతనమునకు (నేనుతనమునకు) బిందుమాత్రము నవమ్మానము, లోపము కాదు గనుక నీ నత్తను నీవే దాచియుంచుచున్నావు. నీవే మా వాసనవు; నీవే మా భోగమవు; నీవే మా యన్నమవు; నీవే మాతృప్తివి; అని మాకుఁ దెలియనీయవు. ఇంత స్నేహము, ఇంత ప్రేమము నీ హృదయమందున్న దికదా ! రోగము, శోకము, దారిద్ర్యము, దుర్గతి; ఆశాభంగము మున్నగు నర్వావస్థలందును నీ యలౌకిక వుత్రస్నేహము ప్రవహించుచున్నదికదా ! ఈ నీ స్నేహము నెప్పుడు మేము తలంచుకొందుమో ! అమ్మా ! ఇన్నాళ్ల దాఁక నిన్నుఁ దినివేసితిమి. అజ్ఞానముతో నిన్ను భోగించితిమి. ఇపుడు నీవు మమ్ముఁ దినివేయుము. ఇపు డొక వేఱయిన 'నేనుదనపు' హద్దుపెట్టి మమ్ములను నీ నుండి వేఱుచేసిపెట్టితివేల ? నీవును, నేనును ఒకటికాదా ? మఱి సర్వరూపములతో నున్న యమ్మ యెవరు ? సర్వగ్రాసినీరూపముతో నిల్చితివే, ఆకులనేత్రములతో నొక్కసారి నిన్ను నీవు మఱచి, నీ బిడ్డలవెంగవు చూడుము. నీ దివ్యనేత్రములందు మా జ్యోతిర్హీననేత్రములను నిల్పి, అమ్మా !

అమ్మా! యనుచు మమ్ము మేము మఱచె దము. మఱి నీవును రారా! కొడుకా! రారా! వత్స! యనుచు మమ్ము మ్రింగివేయుము. మేము చచ్చి యమములల మగుదుము.

ఏమందువమ్మా! నీ వేమనుచున్నావు? నీవే సుధవా? అమృతమే నీ యాహారమా? ఏదీ, ఇంకను మే మమరత్వ మొందలేదే. సుధ సిద్ధము కాలేదే. కనుక నీ వాహరింప లేకున్నావేమో? ఎవరిది యీ దోషము? నీదా? మాదా? ఎందుచేత మేమింకను అయోగ్యముగా నేయున్నాము? అమ్మా! నీవు విజ్ఞానేశ్వరివైన తల్లివి. మేము మృత్యువునకు గ్రాసముగా నున్నాము. అమ్మా! యెవరిదీ దోషము? ఏమిది? కోరకలు గాను, వాసనలు గాను మాలో నెవ్వరుబుకుచున్నారు? లీల! లీల! అమ్మా! యిపుడు మేము నీ కక్కఱలేదు; మమ్ముఁ గోరవు. నీ యానందమయ జగల్లీల నీవు చేయుదువు. మేమును బూర్ణముగా మా 'నేనును' నీతోఁ జేర్చివేయుదుము. మఱి వేఱుపాటేదీ? యెట్లగును?

అమ్మా! అమ్మా! అమ్మా!

అమ్మా! నీవే యీజగత్తు నుత్పాదించి, పరిపాలించి మఱల సంహరింతువని మున్నంటిమి. కాని యది సరిగా యథార్థముగాఁ జెప్పఁబడలేదు. ఏమనఁగా, నిట్లనుటచే జగత్తు నీకంటె వేఱనుచుఁ దోఁచును. వాస్తవముగా నీవే జగన్మయివి. నీవు తక్క జగత్తుగా నెక్కడను నేమియు లేదు. సాధారణ ముగాఁ బ్రత్యేక కార్యమునందును, మూడు వస్తువులే తప్పకున్నవని మాకుఁ దెలియరాదు. ఒకటి, నిమిత్తకారణము - కర్త; రెండవది, యుపాదాన కారణము - కార్యమునకైన యుపకరణములు. మూడవది,

కార్యము - విశిష్టఫలము. కాని, అమ్మా ! నీ యీ జగద్వ్యాపార మందు, నీవే నిమిత్తము; నీవే యుపాదానము; నీవే కార్యము. నీరు గడ్డకట్టి మంచగును; గాని దానియందుఁ జల్లఁదన మనెడి యొుక హేతువు క్రొత్తగా నుండును. అయినను నీ యీ జగద్వ్యాపారమందు అట్టిది మఱేమియు లేదు. నీవే కార్యము; నీవే కారణము; నీవే కర్త.

నేనొక పండును గోరితిని. ఈ కోరిక యనెడి వాసనయే పండుయొుక్క బీజము. (అవ్యక్తయైన యమ్మ వాసనారూపముతో, ఫలబీజాకారమునఁ బ్రకాశించినది.) మఱి యావాసన ఘనీభూతమై ఫలరూపముతో వెలికి బయలైనది. కారణ మేమనఁగా - వాసనయొుక్క ఘనీభూతావస్థయే ఫలము. ఆ పండు నేననుభవింపఁగానే, మఱల నవ్యక్తమందుఁ జేరిపోయినది. ఎల్లపుడు నిట్టి ఘటనయే యగుచుండును. ఏదోయొుక యవ్యక్తక్షేత్రమునుండి, యొుక్కొక్క వాసన యుబుకుచుండును. మాటిమాటికి నా వాసనలు రేఁగి, కోరిన విషయరూపమున నింద్రియభోగ్యములుగా సిద్ధమగుచుండును; భోగాంత మందు మఱల నాయవ్యక్తక్షేత్రమునందుఁ జేరిపోవును. ఈ మూడు విధములైన ప్రకాశమే సృష్టి స్థితి లయములనెడి పేరఁ బ్రసిద్ధములు. సదా ప్రత్యేక జీవునందును జక్కఁగా నిమ్మూడు శక్తులును వెలయుచుండును. అమ్మా ! జగన్మయీ ! నీకొక్క గడయైనను విశ్రాన్తిలేదు కదా ; నీవు మాకొఱకే యజ్ఞేయవయ్యును జ్ఞానరూపిణివి; శక్తి త్రయాతీతవయ్యును శక్తిరూపిణివి; క్రియాతీతవయ్యును గ్రియాశీలవు; కావున సృష్టికాల మందు నీవే సృష్టిరూపవును, పాలనకాలమందు నీవే స్థితిరూపవును,

ప్రలయకాలమందు నీవే సంహారరూపవును నగుదువు. ఈ మూడు విధములైన క్రియాశక్తిరూపములతో నిన్ను నీవే వెలయించుకొనుచున్నావు. నమస్తే.

## అసంభవ వ్యాపారములన్నియు అమ్మయందే సంభవములు

వెలుఁగుం జీఁకటులు రెండును నొండొంటికి విరోధులే యైనను నీయంవి చేరియే యుండును. మహాదైవీప్రకృతిగాను, మహాఆసురీప్రకృతిగాను అమ్మయే వెలయును. గనుక మహాదేవి యయ్యును మహాసురి. మహావిద్యయయ్యు మహామాయ. బ్రహ్మవిద్యారూపముతో నిత్యము ప్రకాశించుచున్నను, జీవ జగద్రూపముతో మహామాయామూర్తితో విరాజిల్లును. అమ్మయే మహామేధ. ఆమెయే మహా + అస్మృతి. ఆత్మజ్ఞాన ధారణోపయోగియైన (మహా ధీ యనెడి) మహామేధ. అమ్మను మఱచుట, ఆమెయస్తిత్వమును మఱచుట యనునదియు అమ్మ ప్రభావమే. మహావిస్మృతిరూపముతో జీవుల హృదయమందు వెలయును గాన మహామోహరూపిణి యమ్మయే. అమ్మ వనులన్నియు, జగత్తునకు సంబంధించిన కార్యకారణ శృంఖలాజ్ఞానమును మీఱినవే. మానవబుద్ధి యమ్మ నెఱుంగఁజాలదు. వెలుఁగు సీఁకటు లొక్కచోట నుండవనుకొందురు. జ్ఞానము, అజ్ఞానము, మేధ, విస్మృతి యొకచోట నుండఁజాలవు. కాని అమ్మయం దిది యంతయు సంభవమే. దైవీప్రకృతియు, ఆసురీ ప్రకృతియు నత్యంత విరుద్ధములైనను, అమ్మయందు సదాయున్నవి. కాంతియొక్క యల్పత్వమే చీఁకటి యనియు, జ్ఞానముయొక్క యల్పత్వమే యజ్ఞానమనియు అమ్మయే

యొకనాఁడు చెప్పినది. అమ్మ రచించిన యీ జీవజగత్తునందు సైతము ఈ రెండు విధములైన అమ్మగారి మూర్తులను ఒక్కసారి గానే యపూర్వముగాఁ గనుచున్నాము.

సాధకా ! మనము చిన్నటనుండియు జ్ఞానము అజ్ఞానము, సత్ అసత్, విద్య అవిద్య అను నివి పరస్పరము కేవల విరుద్ధములని వినుచున్నాము. గాని, యిది నిజమా ? కాదా ? పరస్పర విరోధులైన రెండు వస్తువు లొక్కచోటఁ గలిసియుండుట మానవబుద్ధి కతీతమే, యైనను, "పరమేశ్వరునందంతయు సంభవమే" యనుచు నొక యుక్తివిరుద్ధమైన మాటను స్వీకరించుచున్నాము. అనుభవము నందును జ్ఞానోదయము కాఁగానే, యజ్ఞానముండదని, యజ్ఞానముండుదాక జ్ఞానము ప్రకాశింపదనియుఁ దెలియుచున్నది. అయినను ఆ యజ్ఞానము జ్ఞానమందే నిల్చియున్నపుడు అజ్ఞానమును జ్ఞానవిరోధి యనక, ఈషద్ జ్ఞానమన్నచో నెట్టి యుక్తి విరోధమును గాదు. ఏమనఁగా, అఖండపూర్ణజ్ఞానమును, ఈషద్‌జ్ఞానమును నొక్కచోట నుండుట యసంభవము కాదు. ఇటులే, అసత్ అవిద్యా మున్నగు శబ్దములందు నఞ్‌కు ఈషదర్థమునే కైకొన్నచో, సర్వవిధతర్కములును సమాప్తము లైపోవును. విరోధ - ఈషత్ - అను రెండర్థములును లాక్షణికములే యైనపుడు, ఈషదర్థమును గైకొన్న నావత్తి యేమి ? (అమరకోశమునుం జూడుము.)

## వ్యష్టి ప్రకృతిరూపయు - అమ్మయే

సమష్టి మహతీప్రకృతిరూపయే గాక, వ్యష్టి ప్రకృతిరూపయు అమ్మయే. ప్రత్యేకజీవుని స్వతంత్రప్రకృతిరూపము తోను అమ్మయే

అనఁగా జీవప్రకృతికధిష్ఠానము అమ్మ. ప్రకృతియనఁగా స్వభావమని స్థూలార్థము. ఏజీవుని దెట్టి స్వభావమో, యదియే వాని ప్రకృతి. సమష్టియందుఁ గాన వచ్చు మహాదైవీ మహాసురీ ప్రకృతులు రెండును వ్యష్టియందు సైతము గానవచ్చును. ఒకనిది దైవీప్రకృతి; ఒకనిది యాసురీ ప్రకృతి. ఒకఁడు సాధువు, ఒకఁడు అసాధువు. అమ్మ - అమ్మ - యని తమ్ముఁ దాము మఱచి ముక్తిమర్గమందు నడుచు సాధకులలో సాధనరూపముగా నుబుకుచుండు దైవీప్రకృతి యమ్మయే మఱియు పాపపుటడుగు మెట్లులకు దిగిపోయి, నరకమార్గమును దెఱచుకొని నిందాపాత్రులగుచుఁ బోవువారి నిందితాసురీప్రకృతియు అమ్మయే. ఎప్పుడే మూర్తితో, నే జీవుని దన యొడిలోనికిఁ దీసికొని కూర్చుండునో, అప్పుడావిధమైన స్వభావమునే యమ్మ పరిచయము చేయును. ఎవ్వనిదే యనుము; ఎట్టిప్రకృతియే యనుము; అదె వాని యమ్మ.

అమ్మ బ్రహ్మాండజనని; బ్రహ్మ విష్ణు మహేశ్వరులను గన్నదయ్యు, మన ప్రకృతిరూపముతో మన యమ్మ యొక్క తే మనకుఁ బ్రీతిసాధనము. మనభోగాపవర్గసాధనకొఱకే మనలను గుండె కత్తించుకొన్నది. మన లేములఁ దీర్చుటకే, మన దరఖాస్తుల మన్నించి, మన క్షుద్రవాసనలను బూర్ణములుగాఁ జేయుటకే ప్రకృతిరూపముతో నున్నది మన యమ్మ. కనుకనే చిన్నపురుగు మొదలు బ్రహ్మపర్యంతము ప్రతిజీవుని భిన్నభిన్న ప్రకృతిగా నొప్పునది యమ్మయే. కనుకనే "ప్రకృతి స్త్వంచ సర్వస్య" అని దేవతలును స్తుతించిరి. సమష్టిచే సర్వమునకుఁ దల్లి; వ్యష్టిచేఁ బ్రత్యేకమునకుఁ దల్లి; మన యమ్మ చింకిగుడ్డ లదే కానీ; భిరుసు

జుత్తుదే కానీ; మకిలి మేనిదే కానీ; తెగులు గొంటిదే కానీ; ఆమెయే మన యమ్మ.

అమ్మా ! జీవులు తమతమ ప్రకృతిరూపిణివైన నిన్నవమానించుటచేతనే యనేకవిధముల దుర్దశలును, సాధనజగత్తునందసంభవ విపర్యయములును, సాంప్రదాయక దుష్టభావములును గలుగుచున్నవి. అక్కటా ! ఇంటనున్న యమ్మ కవజ్ఞచేసి, ఎక్కడనో, ఎవతెనో అమ్మ యను జీవుఁ డెంత మూఢుఁడు ! తన తల్లిని విడిచి మఱియొకరి గుంబముకడ నెయ్యము నడుగు కొనుచున్నను, విధిరహితముగా నీకృపనే యడిగికొనుచున్నారు. ఈ విషయమునే గీతయందలి రాజగుహ్యయోగమున నీవే విశేషించి చెప్పితివి. (నా వ్రాసిన రాజవిద్యాగీతా వ్యాఖ్య చూచునది) అమ్మా ! నేనును నిన్నొక్కనాఁడును గుర్తింప లేనందుననే, నీ దీన మలినవేషమును జూచి యవజ్ఞతోఁ దొలఁగించుటకే చూచితిని. అభిమానపూర్ణమును, అశ్రుభరాక్రాంతము నైన నాఁటి నీ మోము తలంపునకురాఁగా, నిపుడును గుండె బ్రద్దలగుచున్నది. నీవే రాజరాజేశ్వరివి, మా యమ్మవు, అనంత జగదధీశ్వరివి, మా యమ్మవు; అనెడి మాట నాఁ డెఱుంగఁగల్గితినా ? ఎంత యవజ్ఞ చేసితిని ! ఇంకను నిపుడును జేయుచున్నాను. నీవో - అభిమాన పూర్వకముగాఁ బ్రతిక్షణమందును "అవజానంతి మాంమూఢా, మానుషీం తనుమాశ్రితమ్" (గీత 9-11) అంచునే యున్నావు. నిజమమ్మా ! నిజము; మనుష్యులము మేము నిన్నెంతో యవజ్ఞ చేయుచున్నాము. నీ తిర్యక్సంతానము వానికిఁ గృతజ్ఞవృత్తివికాసమే

లేదు; కనుక వానికి అవజ్ఞ సంభవముకాదు. తర్వాత నీ ప్రియతమసంతానము దేవతలు నీయందు నిత్యయుక్తులు. నిత్యము తమ ప్రకృతిరూపమున నున్న మహామాయను బూజింతురు; గాని మనుష్యులము మేము, మహామాయను బూజింతురు; గాని మనుష్యులము మేము, మానుషశరీరము నాశ్రయించిన ప్రకృతిరూపిణి న్నిన్ను అడుగడుగున నవమానించుచునేయున్నాము. అమ్మా ! నీవు లేకున్న మా యేపనియు సాగదు. ఊపిరితీయుట మొదలుకొని మోక్షమువరకు నెట్టిపనియు నిన్ను విడిచి సాగుట యసంభవము. అమ్మా ! భోగరూపముతో నీవు; అపవర్గరూపముతో నీవు; సుఖరూపముతో నీవు; అసుఖరూపముతో నీవు; నవ్వు రూపముతో నీవు; ఏడ్పురూపముతో నీవు; జననమరణ రూపముతో నీవు; బంధనముక్తి రూపముతో నీవు; నీ వొక్కతెవే భిన్న భిన్నా కారములుగా, భిన్న భిన్నా నుష్ఠానములుగా ముస్తాబయి వెలయుదువు.

అమ్మా ! ఇంతేనా ? బహుత్వప్రియుఁడనై క్రొత్త క్రొత్త ముస్తాబులనే కోరుచుందును. నా కొఱకు నిత్యము క్రొత్త వేసములను వేసికొని నీవొక్క తెవే భిన్నమూర్తులతో వెలయుదువు. ఎప్పుడేని సాధువు నైపోఁజూతునేని అపుడే నీవు సాధువేషమున నన్నొడిలో నుంచుకొందువు. ఎపుడేని దొంగ బుద్ధి పుట్టినా, అపుడే నీవు తస్కరమలినవేషముతో ముస్తాబయి నన్నొడిలోనికిఁ దీసికొందువు. ఈ విధముగా స్వర్గమందేమి, నరకమందేమి నన్నొక్క క్షణమైనను నీ యొడినుండి విడనీయలేదు. నా తల్లివై నాప్రత్యేక ప్రతిజ్ఞను జెల్లించుటకు నమ్మిన బంటువలె, నెయ్యపు సకునివలె

నాతోనే యుందువు. అమ్మా! యేనాఁడు నీ మహతీమూర్తియొక్క అమృతమయాంక మందుండి బహూత్వోల్లాస ముబికెనో, యా నాఁటినుండి నీవు నా యొక్కనికే తల్లివైతివి. ఎంత స్నేహము ! ఎంత యాదరము ! కాని నేనొక్కనాఁడైన దీనిని ధ్యానపూర్వకముగాఁ గనలేదు. నీవు నాకై యింత చేసితివి; చేయుచున్నావు; గాని రవ్వంత ప్రతిఫలము నాశింపవు. కృతజ్ఞతతో బదులుసేత లేనేలేదు, సరిగదా - నీక వజ్ఞయే చేయుచున్నాను. అయినను నీ స్నేహశీలము, పుత్రవాత్సల్యము నీ కన్ను గప్పివేసినవి. నీది నా నేరముల నెన్ను కన్నుకాదు. నా చేయు నవజ్ఞలను గాంచు నవసరము నీకులేదు. నీ విట్టి తల్లివికదా. నిన్నెన్నఁడైన అమ్మా! యందునో ! ఎక్కువవద్దు, ఒక్కసారి అమ్మా ! యందునో యని యెదురుచూచుచు ఱెప్పపాటులేని కంటితో రేవగళ్ళు నావంకనే చూచుచుందువు. అదిగో, నానోర యథార్థ మాతృనామము వెడలుటే నీ యపార స్నేహమునకు బదులని యెదురు చూతువు. రాజరాజేశ్వరీమూర్తితో నావిర్భవించు నీయడుగు లందు బూదోయిలి నిడఁగల్గునప్పు డేమో ? ఇంక మఱొకటి - నిన్నుఁ బంచలు జాతిపోవు పాడుకొంపలో, నుపేక్షిత సేవకు రాలిని వలెఁ జేసి యుంచితిని. అమ్మా! నీ కడు ముద్దుబిడ్డలకు "నాయనా ! మీ మీ ప్రకృతియే మీ యమ్మ" అని చెప్పివేయుము చూడు మమ్మా! అమ్మ యన నెవరో, యెట్టిదో, యెఱుఁగనివారికిఁ గూడ 'అబ్బాయి ! మీ ప్రకృతియే మీయ మ్మ' యని చెప్పివేయుము. సాధన చేసియు హతాశులైన వారికిఁగూడ 'మీ ప్రకృతియే మీ సాధన కాధారము' అని చెప్పివేయుము.

గురుసంవిధానము చేయఁజాలనివారికిని 'మీ మీ ప్రకృతియే మీ గురువు' అని చెప్పివేయుము.

## అమ్మ త్రిగుణ ప్రకాశిక

అమ్మా ! సత్త్వము రజస్సు తమస్సు ననెడి మూడు గుణములచేత, నీ వ్యష్టి సమష్టి ప్రకృతి వెల్లడి యగుచున్నది. అమ్మా! నిర్గుణా ! నీవు మొట్టమొదట నేకత్వబోధముతో సంబుద్ధవగునపుడు ఏకగుణితవైతివి; అదే సత్త్వగుణము. మఱి నీవు అనేకమగుటకుఁ గ్రియాశక్తిని బ్రకాశింపఁజేసినపుడు ద్విగుణితవైతివి. అదే రజోగుణము. మఱి నీవు అనేక మగుటకుఁ గోరుటేకాక నీ చైతన్యమయ స్వరూపమును జడాకారమునఁ బరిణమింపఁ జేసినపుడు మూడవసారి గుణితవైతివి. అదే తమోగుణము. సత్త్వగుణముగా నీ సత్, రజోగుణముగా నీ చిత్, తమోగుణముగా నీయానందము ప్రకాశించును. సచ్చిదానందమయీ ! అమ్మా ! నీవు నీ విశిష్ట భావములతోఁ ద్రివిధభజించుకొని, మూడు గుణములతో గుణితవై, సమష్టిచే మహతివై, దైవీ అసురీ ప్రకృతిరూపముతోను, వ్యష్టిచే జీవప్రకృతిరూపముతోనుఁ బ్రకాశింతువు. నీవు ఇట్టిదనరాని యవ్యక్తస్వరూపవయ్యును, బుత్త్రస్నేహప్రేరణముచే గుణత్రయమును వెలయింపఁజేయు ప్రకృతివి. దర్శనకారులు మూడు గుణముల సామ్యావస్థయే ప్రకృతి యందురు. అది యవ్యక్తము కావున నసాధ్యము. నిన్ను మేము స్థూలేంద్రియములతో భోగింపఁగోరుదుము. స్థూలుల మైపోతిమి. కనుక నీ స్థూల భావమును సేవించి తృప్తినొందుచున్నాము. గానఁ ద్రిగుణాత్మికయైన నీ వ్యష్టి మూర్తియే మాకారాధ్యము. ఇఁక సమష్టి జూడ

నెతింగినవారు హిరణ్యగర్భులు. వార లున్న తాధికారులు. వారు నీసమష్టి ప్రకృతి మహాదేవీమూర్తిని బూజింతురు. మేము క్షుద్రులము. తెలివిలేని శిశువులము. ఆటబొమ్మలను బ్రేమింతుము. కనుక సర్వభావమయము, సర్వేంద్రియ యుక్తము నైన నీవ్యష్టి ప్రకృతి యనెడి మూర్తియే మాకుఁ బ్రియము. కావున నీవు మాయెడ గుణత్రయ ప్రకాశినివే యగుము. నీ యీ మూర్తిని బూజింపఁ గల్గునపుడే నీ మహతీమూర్తిజాడ దొరుకునని మే మెఱుఁగుదుము. ఏమన, ఈ మూడు గుణములను బూర్తిగా లయమొనర్చుటకే నీవు కాలరాత్రి, మహారాత్రి, మోహరాత్రి రూపమున వెలయుదువు.

## కాలరాత్రి, మహారాత్రి, మోహరాత్రి

ఎచ్చటఁ గాలము సైతము ప్రకాశింపదో యది కాలరాత్రి. సత్త్వగుణము లయించు చోటినే కాలరాత్రియందురు ఇటులే రజోగుణలయస్థానముననే మహారాత్రి యనియు, తమోగుణ లయస్థానమును మోహరాత్రి యనియుఁ బేర్కొందురు. మోహము తమోగుణముయొక్క బహిర్వికాసము. దాని రాత్రి-యనఁగా-అప్రకాశము-లయస్థానము.

గుణత్రయప్రకాశినీ ! తల్లీ ! వ్యష్టి ప్రకృతిరూపముతో నీవు మా తల్లివే. మఱెవ్వరితల్లివి కావు - మా తల్లివే యని, యిటులు నిన్ను (మా యమ్మను) బూజింపఁగా నీ మూడు రూపములుఁ గనుగొందుము. ఇచ్చోటనే నీ యా మూడింటి పూర్వాభాసము చేసితివి. నీయా మూడు రూపములు నందే భావించినవి. నీవు కాలరాత్రిరూపమున వెలసి, మా కాలజ్ఞాన మును దొలఁగింపుము.

భూత భవిష్యద్వర్తమానము లనెడి త్రివిధకాలప్రతీతి, గంభీరమును అంధకారము నగు క్షేత్రమందు-అప్రకాశయోగ్యస్థానమందు విలీనమగుఁగాక. సర్వమును వర్తమానముగానే ప్రతీతమగును. అపుడు నేను గాలా తీతుఁడనై మృత్యుంజయుఁడ నగుదును. నీ యరుణచరణములను హృదయమందుంచుకొని శివుఁడ నగుదును. జీవత్వము పూర్తిగాఁ దొలఁగిపోవును. ఇదే సత్త్వగుణ లయము. మఱి మహారాత్రిక రూపముతో వెలసి, నీవు మా మహత్తత్త్వ పర్యంతము విలయమొనర్పుము. అపుడు నా క్రియాశీలత - రజో గుణమువలనఁ గలిగిన చాంచల్యము లోపించిపోవును. నాకు నైష్కర్మ్యము లభించును. అపుడు నేను గేవల చైతన్యమయమైన యాత్మబోధమందే మెలఁగుచుందును. మఱి మోహరాత్రి రూపముతో వెలసి నా జగన్మోహము, సంసార భ్రమమును బూర్తిగా విలుప్తము చేయుము. అపుడు నేను జయింపరాని మోహమును జయించి, నిత్యచిన్మయమూర్తియందే యెల్లపుడును మోహితుఁడ నగుచుందును.

అమ్మా ! నీ యీ మూడు మూర్తులు దారుణములు. బహు భయంకరములు. అచటఁ గాలశక్తి రుద్ధము; జగత్ప్ర కాశము సుప్తము. మోహశక్తి విముగ్ధము. నీ కాల (కృష్ణ) రాత్రిమూర్తిని స్మరించినంతనే జీవుఁడు భయంపడును. అమావాస్యనాఁటి ఘోర కృష్ణమేఘము క్రమ్ముకొన్న రాత్రి సూచీభేద్యంధకారము నందును రవ్వంత వెలుఁగుండును గాని, అమ్మా ! నీయా కృష్ణమూర్తియం దదియు నుండదు. సర్వవిధముల

వికాసమును లుప్తమై పోవును. "నతత్ర సూర్యోభాతి న చంద్రతారకమ్ । నేమా విద్యుతో భాన్తి కుతో ఽయ మగ్నిః" అదెట్టి దారుణమూర్తియెా ! అయిన నది స్వయంప్రకాశము అనంతశాంతిమయము. అహంకారశరీరము నంటియున్న సర్వ విధ జంజాలములను దొలఁగించి, మనో బుద్ధి చిత్తాహంకారముల రాజత్వమును విడిపించి, కేవలాత్మబోధమునకుఁ గొంపోయి యచ్చట నిల్పును. రాత్రిరూపిణీ ! తల్లీ ! నీయీ మధుమయాంక మెంత లోభనీయము ! దానిని మాటలతో వర్ణించుటెట్లు ? అది దేవీపురాణమం దొక శ్లోకమునఁ గానఁబడును. "బ్రహ్మమాయాత్మికా రాత్రిః పరమేశలయాత్మికా" జీవుని మాటలెక్కయేమి ? పరమేశ్వరపర్యన్తము విలీనమైపోవును. ఆ బ్రహ్మమాయ యొక్కటే నీస్వరూపము. నీవు త్రిగుణలయము నకై, జీవభావపక్షమున, నత్యంత భయప్రదములగు కాలరాత్రి మహారాత్రి మోహరాత్రి రూపములతోఁ బ్రకాశింతువు.

## అమ్మ, సౌమ్య - సౌమ్యతర - సౌమ్యతమ.

తమ తమ ప్రకృతిని దల్లియనుచు నెఱింగికొని, సర్వత్ర సర్వభావములతో అమ్మదేకర్తృత్వమనియుఁ దాము యంత్ర స్వరూపులే యనియు నెంచి "ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశే ఽర్జున తిష్ఠతి । భ్రామయన్ సర్వభూతాని యంత్రా రూఢాని మాయయా" యనెడి గీతోక్తమంత్రమును సాధించి సిద్ధులైనవారియెడ నమ్మ సౌమ్యమూర్తితోనే యావిర్భవించును.

సాధకా ! "సర్వభావములతో నీవొక్కతెవే విరాజిల్లుదు"వని తెలివితో నెన్ను వారియెడ అనఁగా బుద్ధియోగము నకుఁ

ప్రథమాధికారు లైనవారియెడ, శ్రీమాత సౌమ్య. అమ్మకుఁ బ్రాణసమర్పణముచేసి, తమ ప్రాణమును బ్రవాహ మాత్రముగాఁ గనువారి యెదుట సౌమ్యతర. మఱి సర్వభావములతో మనస్సు నర్పింపఁగలవారియెడ ఆశేష సౌమ్యములకంటె నతిసుందరి. మన 'లలిత' మహాత్రిపురసుందరి అనఁగా సౌమ్యతమ. ఇట్లు మూడు చోట్ల మూడు విధములుగా వెలయును. బుద్ధియోగులయెడ. సౌమ్య. ప్రాణదర్శులైన వారి యెడ సౌమ్యతర. మఱి మనోవిలయ చతురులయెడ సౌమ్యతమ. అమ్మకు సంపూర్ణముగా మనస్సు నర్పింపఁగల సౌభాగ్యము నొందిన సంతానము సర్వభావముల మాతృమయంవే యైంపోవును. వారి నఖిలేంద్రియంముల పర్యంతమును మాతృమహిమమును, మాతృధర్మమును అనుభవించు చుండును. వారు లోను వెలిని సర్వత్ర అమ్మ సౌమ్యతమమూర్తి వెల యుటే చూచి ముగ్ధులగుచుందురు.

అమ్మా ! నీ సౌందర్యము కంటఁబడినవారు మఱెన్నఁ డైన నీ జాగతికవిశిష్టసౌందర్యముచేత నాకర్షింపఁబడుదురా ? చంద్రునందును, గమలములందును, గామినీ కమనీయ ముఖ మండలమందును దోఁచు సౌందర్యము, తన ప్రహ్లాదినీ శక్తి వికాసమును జూపి జీవులను ముగ్ధులను జేయునట్టి నీ సౌందర్య రాశియొక్క కోటిపాలునకైనను సాటికాదు. జగత్తునందెక్కడ నెంత సౌందర్యమున్నను, నది నీ సౌందర్యసముద్రమందలి యొక చిన్న చినుకు మాత్రమే. సకల బ్రహ్మాండములందును గల సౌందర్యకణములను నొక్కచోటఁ జేర్చుటచే గల్పింపఁబడు సౌందర్యరాశి, నీ సౌమ్యతమమూర్తి యొక్క యాభాసమే.

అమ్మా! నీవే పరమవు; సర్వశ్రేష్ఠవు. నీవే పరమేశ్వరివి. మును జెప్పిన నీ త్రివిధసౌమ్యమూర్తులను జూచి ధన్యులై బుద్ధి ప్రాణ మనస్సులను బూర్తిగా మాతృయుక్త మొనర్చిన వారు మాత్రమే, బ్రహ్మ మొదలు కీటాణువర్యంతమును, అనంతకోటి బ్రహ్మాండములును నీసత్తచేతనే సత్తావంతములని కనుగొనఁగలరు. ఈ బ్రహ్మాణ్డ యజ్ఞాగారమునకు ముందు వెన్కలఁ గ్రిందుమీదుల నున్నదంతయుఁ దెలిసియో తెలియకో, నీ పూజయందే నిరతమై యున్నది.

ఇచట నింకను జెప్పఁదగినది - తమ తమ ప్రకృతిని అమ్మ యని తలంపఁగల్గుటచే సర్వభావముల మాతృయోగ మందే యలవాటుపడుటచే, నా ప్రకృతి జగద్ధాత్రియైన దైవీ మహతీ ప్రకృతి రూపముతోనే యనుభవింపఁబడును. అపుడు దానిని, దీనయు మలినయు నైన యమ్మగాఁ దలంపరు. ఆ యవస్థయందు సాధకులు - ఇన్నాళ్లును దేనిని గేవలము అమ్మ యని తలంచిరో, యదే వరావరపూజ్యము, పరమయు, పరమేశ్వరియు నని తలంపఁగల్గుదురు. "మా యమ్మయే సర్వజగదంబ" యను నీ యనుభూతి సాధకునకుఁ గల్గునపుడు, అతఁడు తల్లిని సౌమ్యతమగాను, నతిసుందరిగాను జూడక, మలిల మలినవికారమూర్తిగాఁ జూడఁగలఁడా ?

ఈ సూర్యుఁడు లెక్కలేని గ్రహములచేతను, ఉపగ్రహముల చేతను జుట్టుకొనఁబడి, మన యమ్మ యంగమందుఁ గిరణముల వెదఁజల్లుచున్నాఁడని కనఁగల్గునపుడు, ఈ వాయువు పూఁదావిసిరిని మోచి తెచ్చి మన యమ్మకుఁ దనివిఁగూర్చు చున్నాఁడని కనఁగల్గునపుడు, మేఘమాల పవిత్రజలమును గురిసి, యమ్మ

యంగమును స్నిగ్ధము చేయుచున్నదని కనఁ గల్గునపుడు, ఎత్తయిన కొండపిండు తలయెత్తి మన యమ్మను జూచుటకే ధీరముగా నిల్చియున్నదని కనఁగల్గునపుడు, పూచిన చెట్లగుమి మన యమ్మ యడుగులందుఁ బూదోయిళ్ల నిడు చున్నదని కనఁగల్గునపుడు, పలుతెగల పక్షులు అవ్యక్తమధుర స్వరముతో మాతృవందన గీతములే పాడుచున్నవని కనఁగల్గు నపుడు, ఈ విధముగా సర్వవిధముల సర్వత్ర సర్వజనని సపర్యలే సాగుచున్నవని కనఁగల్గునపుడు, మఱి 'నేను' ఏమయి పోవునో వర్ణింపఁగలమా ? అపుడు మఱి 'నేను' ఉండదు. ఉండునది మన యమ్మయే. అమ్మ వాసుదేవమూర్తియే. ఇట్టి యవస్థయందు సాధకుఁడొక యద్వితీయ బ్రహ్మమూర్తి సంవేదనముతోఁ బూర్తిగాఁ దన్నుఁ దా మరచిపోవును. ఇదే మన యమ్మగారి యతిసుందర సౌమ్యతమ పరమేశ్వరీమూర్తి.

## అమ్మను స్తుతించు టెట్లగును ?

తమ ప్రకృతినే "యమ్మ" యని సాధనక్షేత్రమందు ముందంజ వేయువారు, ఏ విధముగా మెట్టు మెట్టున భేదజ్ఞాన రహితమైన యద్వైత తత్త్వమునఁ జేరుదురో యదియే యింతవఱకుఁ జూపఁబడ్డది.

అమ్మ పరమారూపముతో నతికష్టముచేఁగాని యను భవమునకు రాదు. ప్రకృతిరూపమున మనుష్యమాత్రుల యనుభవమునకు వచ్చును. ప్రకృతిరూపిణయైన యమ్మ సేవ చేయుటచేతనే, యామె పరమేశ్వరీమూర్తి తెలియఁబడును. అపుడుసత్-అసత్-అనుట కెట్టిభేదము నుండదు. సర్వమయమును

జగన్మయమునైన యాత్మవికాసమును జూచి సర్వరూప ములుగా బ్రతీతమగు బహుత్వము ఆత్మయొక్క శక్తిమాత్రమే యని తెలియుటచేతనే సాధకజీవుల సర్వసంశయములును దొలఁగును.

సర్వము నా ప్రకృతియే-నాయమ్మ-నాయాత్మ. నేను; స్తుత్యము, స్తుతి, స్తోత యను సర్వము నేను - అమ్మ అయినపుడు మఱి యెవ్వరెవ్వరిని స్తుతించుట ? "యదా సర్వమాత్మైవాభూత్తదా కేన కం పశ్యేత్" అను నీ యనుభవము కలుగు క్షణమందే యన్నివిధముల క్రియలును నిల్చిపోవును. పూజింపఁ బడునది, పూజించువాఁడు నను భేదముండదు. ఒక్కటే యై పోవును. అహంత్వమహాప్రసారమందు (సర్వము 'నేను' అను జ్ఞానము వ్యాపించునపుడు) జీవభావము (క్షుద్రాహంత) మునిఁగి పోవును. 'సర్వస్య ప్రకృతిః' అన్నది మహాదేవి యై పోవును. చిత్తక్షేపము, వాక్కు, హృదయపిండక్రియయుఁ దమంత నాగిపోవును. ఏకమును, ఘనమును, ఆనందమయమునైన సత్త మాత్రమే నిల్చియుండును. దేనియందు దుపస్థితుఁ డైనపుడు, 'ఉన్నది-అస్తి' యనితోఁచునో, ఆమాటయే యిచటఁ జెప్పబడుచున్నది. జగత్తు యొక్క అస్తిత్వము వీనియెదుటఁ జెప్పఁ బడదు. (అనఁగా జగత్తున్నదని వీనికిదోఁచదు.) అది యుండనీ.

## మనః ప్రాణ జ్ఞానములు అమ్మయే.
## అవియే బ్రహ్మ విష్ణు శివులు.

అమ్మ జీభావము నొందు సంస్కారరూపముతోఁ దన్ను వెలయించుకొన్నపుడు ఆమె పేరు మనస్సు. ఇటులే ప్రత్యేకజీవుని

హృదయమందు ననుభవింపఁబడు వ్యష్టిచైత న్యమే ప్రాణము. ఇటులే ప్రతిజీవునియందు సదా ప్రకాశించు బుద్ధియే జ్ఞాన మను పేరఁ బ్రసిద్ధము. ప్రత్యేక జీవునియందు ననుభవింపఁబడుచుండు వ్యష్టి మనః ప్రాణ జ్ఞానములు, ఒక సమిష్టి విరాణ్మనః ప్రాణ జ్ఞానములందలి చిన్న చిన్న బుడగలే. ప్రత్యేకజీవుని యందు మనస్సు ప్రాణము జ్ఞానము అనుపేళ్లతోఁ బ్రసిద్ధములైనవే, సమష్టియందు బ్రహ్మ విష్ణు మహేశ్వరు లనెడి పేళ్లతోఁ జెల్లును. ఈ సర్వమును మహామాయ - అమ్మయే యైనపుడు, మనము అమ్మగాక, యితరమేమియుఁ గానపుడు అమ్మను స్తుతించుటన నెట్టిది ?

ఇచట సాధనరహస్యము కొంచెమున్నది. ఈ విరాణ్మనః ప్రాణజ్ఞానముల - అనఁగా బ్రహ్మ విష్ణు మహేశ్వరుల సాక్షాత్కారము నొందుటకై తమ జీవభావీయ మనః ప్రాణ జ్ఞానముల సంధానింతురు. వానిని బ్రహ్మ విష్ణు మహేశ్వరులని పూజచేయుదు భూమిలోపల దాగియున్న జలప్రవాహమును దాకుటకై తమ పెరటిలో నొక నూయి త్రవ్వుటచేఁ గోర్కి నెఱవేఱునటులే విరాట్సమష్టిసంధానము చేయుటకై, తమ లోపలనే యెల్లప్పుడు ననుభవింపఁబడుచున్న వ్యష్టి సత్త నాశ్రయించు టగును. నీలోనే ప్రకాశించు మహామాయాశక్తి బిందువునే - నీ యధికారమందున్న యా యింత యంశమునే, బ్రహ్మవిష్ణు మహేశ్వర జననియని తెలియఁ బ్రయత్నింపుము. ఆమె చరణములకే నీ సుఖదుఃఖములను నివేదించుకొనుము. ఆమెయే మహాశక్తిరూపముతోఁ బ్రకటిత కాఁగలదు. నీ దౌర్బల్యముల నన్నిఁటిని దొలఁగింపఁగలదు.

సర్వమయ మాతృకర్తృత్వమును దర్శించి, సర్వవిధముల మాతృస్వరూపము ననుభవించి, సర్వత్ర మాతృశక్తి ననుభవించి, క్రమముగా సాధకుఁడు స్తుతిని విరమించు నవస్థకు వచ్చును. ప్రారంభమందు ద్వైతజ్ఞానము నూఁతచేసికొని జీవేశ్వరభావముల రెంటిని నాశ్రయించి యగ్రసరు లగుదురు. క్రమముగా ద్వైతప్రతీతి లోపించి యాత్మానుభూతి వెలయు చుండును. జీవయాత్రాసాధనచేతనే యనుము; ప్రతిదిన సంధ్యావందనా ద్యనుష్ఠానములచేతనే యనుము; ఇట్టి యనుభవమునే చేయుదురు. సాధకులు ప్రతిదినము చేయు నుపాసనచేత నిట్టి యవస్థాభానము నొందనంతదాఁక, సాధన సరిగాఁ గాకున్నదని తెలిసికోవలసినదే.

అమ్మ తన స్తుతిసాధనము తానే చేసికొనుచున్నదని తెలియవలయును. అత్యుదారమైన యమ్మ ప్రభావము, అలౌకిక మహత్త్వరచనము, అనిర్వచనీయ కథలు, స్నేహము యొక్క యనంత నిర్భరరహస్యము తానై వర్ణింపక, తమంత వెల్లడిగాక, యామె నెఱింగి పట్టుకొనుట యెవ్వరికి శక్యము ? "నాయమాత్మా ప్రవచనేన లభ్యో న మేధయా న బహు శ్రుతేన" ఎన్ని శాస్త్రములు చదువనీ, ఎన్ని వేదములు వల్లింపనీ, ఎంత తపస్సు చేయనీ; అమ్మ దయఁదలఁచి తన్ను దెలుపకపోయినచో నామె నెవ్వఁడును దెలిసికొనఁజాలఁడు. మన నోళ్ళ వెలువడు స్తుతివాక్యముల రూపమున నమ్మయే యావిర్భవించినదని తెలియఁగల్గుఫలముగా, నిత్యతృప్తయైన యామెయే విశేషప్రసన్నమయి, ముందుగా సాధకవృత్తిని బాధించు మూలసంస్కారము లగు - బహుత్వానందము - బహుత్వవాంఛ యను ననురులను

(వీరే మధు కైటభులు) నశింపఁ జేయును. తొలుదొల్త ప్రాణమును (చైతన్యమును) మేలు కొల్పి, జ్ఞానమనెడి శివు నాశ్రయింపఁజేసి యసురులను విలయ మొందించును. తాముగా నయ్యసుర సంస్కారములు రెండును గోరి విలయమొందును. అపుడు గాని బ్రహ్మగ్రంధి భేదము కాదు. ఆగామి కర్మక్షయము కాదు. మహామాయ ద్వివిధ ప్రకృతులుగా వెలయును.

అవి మహతీప్రకృతి, జీవభావప్రకృతి. ప్రకృతి గుణ త్రయప్రకాశిని. జీవభావీయ ప్రకృతి సత్త్వరజస్తమోమయి యైనటులే మహతీప్రకృతియుఁ ద్రిగుణాత్మికయే. ఈ రెండు ప్రకృతులే భగవద్గీతయందు వరుసగా 'పరా-అపరా' యను పేళ్లతో వ్యవహరింపఁబడెను. పరాప్రకృతి తమోగుణముతో నారంభమై క్రమముగా తమో రజస్సత్త్వగుణరూపముతోను అపరాప్రకృతి క్రమముగా సత్త్వరజస్తమోగుణరూపముతోను బ్రకాశిత మగును. అపరాప్రకృతికిఁ దుట్టతుదను పరాప్రకృతికి మొట్టమొదటను తమోగుణవికాసము గలదు. సత్త్వగుణము రెండు ప్రకృతులకును సంధిస్థలము (మధ్యస్థలము). నిద్ర, కునికిపాటు, మోహము, సోమరితనము, జడ్డు (జడత్వము) మున్నగునవి అపరా ప్రకృతియొక్క తమోగుణధర్మములు. చెప్పెడి దేమనఁగా మహామాయయొక్క జగన్ముఖియైన వికాసము పేరే యపరాప్రకృతియు, పరామాత్మాభిముఖవికాసమే పరాప్రకృతియు ననఁబడును. జీవప్రకృతి తమోరజోగుణముల ప్రాధాన్యమును దిరస్కరించి విశుద్ధసత్త్వగుణమందు నిల్చు నపుడే పరాప్రకృతియొక్క రజోగుణక్రియాశీలతచేత ఆసత్త్వగుణము

ప్రలయాభిముఖియగును. అనఁగాఁ బరాప్రకృతియొక్క తమోగుణమందుఁ జేరిపోవును. తామసీమూర్తి యొడియందే ఈ బహుభావేచ్ఛయుఁ దన్మూలకమైన యానందము ననెడి యాసురీమూలసంస్కారములను విలీన మొనర్చుటకే మధ్యవర్తి యైన రజోగుణముయొక్క క్రియాశీలత - అనఁగా మనస్సు ప్రాణమును మేల్కొల్పుట.

చిచ్ఛక్తి యొక్కటే దశేంద్రియములదారిని బహువిధములఁ బ్రకాశించును. ఈ బహుభావముల నేకత్వమందుఁ జేర్చివేయుటకే సాధకుని కాతరప్రార్థనాదుల ఫలితముగా నొక తామసీ (కాళీ) మూర్తి యావిర్భవించును. ఈ మూర్తి యందు ఏకత్వబహుత్వముల సమన్వయము అపూర్వముగా వెల్లడి యగును. ముముక్షుసాధకు లీమూర్తిని దర్శించుటచే ధన్యు లగుదురు. ధన్యులైరి.

చిదాకాశమం దేదేనొకమూర్తి యావిర్భవించునపుడు ఆ మూర్తి సాధకుని సంస్కారముల ననుసరించి ఘటితమగు చుండును. అమ్మ కెట్టి విశిష్టమూర్తియును లేదు. సర్వరూపములతో నామెయేయున్నను, ఆమె స్వయముగా రూపవివర్జిత యయ్యును "సాధకానాం హితార్థాయ బ్రహ్మణో రూప కల్పనా" సాధకుల మేలుకొఱకే సత్యసంకల్ప బ్రహ్మము అమ్మ - తనయందు విశిష్టరూపకల్పనము చేసికొనుచుండును. అవే (అమూర్తులే) మన పురాణాదులయందు వర్ణింపఁబడిన దేవదేవులు. సాధకులు ఎట్టిసంస్కారములతో, నెట్టి గుణములతో నాత్మను విశేషితము చేయుదురో భక్తప్రియయగు, ఆ రూపమునైన పరమాత్మ యట్టిగుణములతోనే గుణమయమై సాధకుల యభిలాషములను

బూరించును. ఇదే సాధకజగత్తు నందు విశిష్టమూర్తి దర్శన రహస్యము.

రెండు చోటులం దిట్టి విశిష్టమూర్తి దర్శనమగును. ఒకటి మనోమయక్షేత్రమందును, రెండవది విజ్ఞానమయ కోశ (ప్రజ్ఞ) మందును నగును (ప్రతి దినాభ్యాసఫలముగా). మనస్సే తానొక విశిష్టమూర్తి కల్పనమును ఘన మొనర్చుటచేతఁ దఱచుగా, నట్టి మూర్తి దర్శనమగుచుండును. ఒక్కొక్కచోట నిట్టి యభ్యాససహాయముతోఁ గల్పనము ఘనము కాకున్నను, అపుడపుడు, ఏదేనొక మూర్తి కానవచ్చును. అది యంతయు బూర్వజన్మసంచితమైన ఘనకల్పనము ఫలముగా నెఱుంగ వలయును. అది యుండనీ; మనోమయక్షేత్రమునందు దర్శన మిచ్చు మూర్తులు, క్షణికానందమును గూర్చునవి యయ్యు, నవి భగవత్సత్తయందు విశ్వాసమును బెంపొందించును; సందేహములేదు గాని, యా మూర్తులు సాధకుని గృతార్థునిఁ జేయఁ జాలవు. ఏమనఁగా - వానియందుఁ బ్రాణధర్మవికాసము లేదు. సర్వజ్ఞత్వము, సర్వదర్శిత్వము, సర్వశక్తిమత్త్వము మున్నగు మహత్త్వముల స్ఫురణ ముండదు. అవి క్షణకల్పితములైన ఛాయావిశేషములే, కావున సాధకులకు వరాభయదానము ఛాయావిశేషములే, కావున సాధకులకు వరాభయదానము లతో సమరత్వము నొసంగ సమర్థములు కావు. గాని ప్రజ్ఞాక్షేత్రమం దేదేనొక విశిష్టమూర్తి దర్శనము లభించెనేని, సర్వవిధముల సంశయములు తొలఁగిపోవును. జ్ఞాననేత్రము విడును. అభీష్టములు నెఱవేఱి సాధకులు ధన్యులగుదురు.

ఆ మూర్తులు ప్రాణశక్తి క్రియాశీలతతో గూడి దర్శన మిచ్చునేని, తొలుదొల్త దేహాత్మబోధము బహుత్వమువీడి

మెల్లమెల్లఁగా బరమాత్మవంక నడక సాగునపుడు చక్షుర్ముఖ హృదయాదులైన యవయవములయొక్క యస్వాభావిక స్పందనములు, విక్షేపములు నగుట సాధకులుమాత్రమే తెలిసికొనఁ గలరు. క్రమముగా గుణకీర్తనముచే నోరు, చరణస్పర్శముచేఁ జేతులు, సత్తానుభూతిచే హృదయము స్నేహరసమున మునిఁగి తృప్తినొందును. అవి యమ్మయొక్క పరిచ్ఛిన్నతయెడ ముగ్ధములు కానొల్లవు.

## ఇపుడే, ఆది సంస్కారనాశమునకు గణేశపూజ.

మున్ను, కడుఁ జంచలమును, జగద్వ్యాపారమునకుఁ బ్రధాననియంతయు నైయుండిన యా మనస్సే, పరమశాంతముగా నుండుటకై, యసుర సంస్కారముల నడంచుటకై (బహుత్వానంద - బహుత్వవాంఛ) మహామాయాప్రసాదము వలనఁ బ్రాణశక్తిని మేల్కొల్పును. చాంచల్యము వీడుట యెంత సుఖమో యది, యే యానందమునకో, యా ప్రశాంతభావము నించుకంత రుచిచూడక యనుభవమునకు రాదు. జగన్మయ సత్యప్రతిష్ఠాఫలముగా, ప్రత్యేక పదార్థ మందును ఆత్మసత్తను జూచు ఫలముగా జగద్వ్యాపారమును రేఁగఁ గొట్టు సాధనము చేయకయే ప్రాణము మాతృయుక్తమగును. ఈ మాతృయుక్తతా ఫలమువలన నతిచంచలమైన మనస్సు సైతము చిరకాలాభ్యస్తమైన చాంచల్యము చేతినుండి తప్పు కొనుటకుఁ గడంగును. గాని, ఆదిసంస్కారము బహుత్వవాంఛ-(బహుత్వానందము) లనెడి యసురులు దానిని మఱల ననేకవిధములఁ గలఁతపెట్టుటకై రేఁగఁగొట్టును. అపుడు అమ్మయే శరణము.

మన యమ్మ దయచేసి జీవుని మోహనిద్రను దొలఁగింపనంతదాఁక - అమ్మ ప్రబోధరూపముతో వెలయనంత దాఁక, జీవుఁడు జాగతికధూళిని మేనఁ బులిమికొనుచు, అతి చంచలము నశ్వరమునైన సుఖముచే ముగ్ధుఁడై, తన్నుఁ గృతార్థునిగా నెన్నుకొనుచుండును. మఱి గీతాతత్త్వమున్మేషితమై, బుద్ధియోగమనెడి జగన్మయసత్యదర్శనము ఫలింపఁగా మాతృలాభముచే ధన్యుఁడగును. ఈ యవస్థయందు జీవుఁడు గుణమయియు భావమయియు నైన యమ్మ దర్శనమునే, జీవన చరమ చరితార్థతగా నెంచి, యాత్మతృప్తిచే నగు సంకీర్ణ మోహముచేఁ గ్రమ్మఁబడును. మెల్లమెల్లఁగాఁ జండీతత్త్వము ప్రకాశించును. ఒక్కొక్క యసురకుల మావిర్భవించుచుండును. బహుత్వ సంస్కారము సాధకునిఁ జంచలునిఁ జేయుచుండును. ఆ చంచలతనుండి విడివడుటకై భావములు గుణములు ననెడి యసురులను జంపి, భావాతీత గుణాతీత సత్తయందుఁ బ్రవేశించుటకై సాధకుఁ డసురులొడ్డి యుద్యమించును. ఈ యుద్యమము వెలికిఁ గానవచ్చునది కాదు. ఇది విజ్ఞానమయకోశ సాధనము. అక్కడ నేమి జరుగునో దానివలన విజ్ఞానమయ కోశమం దాత్మసంగ్రహము చేసినవారలే యనుభవింపఁగలరు. నిష్కపటమైన కాతరప్రార్థనము, పూర్ణాత్మసమర్పణము ననెడివే యా క్షేత్రమునకు సంబంధించిన (అందుఁ గాఁదగిన సాధనలు) ఉద్యమములు ఎంత విఫలత, ఎంత హతాశత్వము వచ్చి ప్రయాసపెట్టినను, నిర్భరత యొక్కటే ఆత్మార్పణఫలముగా నన్ని ప్రతికూలతలను దొలంచును.

## దౌర్బల్యమును దవ్వునెట్టుటే మొదటి సాధనము.

అనాదికాలమునుండి సంచితమైన యీ యజ్ఞానమును దొలఁగఁగొట్టఁగలనా ? అనెడి భావమే ప్రాణముయొక్క దౌర్బల్యమును సూచించునది గాన, అమ్మ యడుగులను గట్టిగాఁ బట్టుకొనుటచేతను, అమ్మ నెనరునే యథార్థముగాఁ గోరుటచేతను, అమ్మయే ప్రాణమునకు బలముఁ జేకూర్చును. అపుడు సాధకుఁడు "నేనే భగవంతుఁడను, నేనే విభుఁడును, నేనే సర్వసంహారకుఁడను, గావున నే నసుర కులమును నిర్మూలింపఁగలను. ఇదే పరమపురుషార్థము" అని యథార్థముగా ననుభవింపఁగలడు.

కాని, యీ యసురసంస్కారములతో నెంతకాలమో యుద్ధము చేయవలెను. ఏ కేంద్రమునుండి యైదువిధములైన, మఱి యసంఖ్యాభేదములుగల విషయముల యనుభవ మగునో యా కేంద్రమును గుర్తించి వాని నాకర్షింపవలమును.

సారాంశమేమనఁగా - 'బహుస్యామ్' 'నే ననేకమగుదును' అను నీ సంస్కారముయొక్క మూలమందు రెండు భావములున్నవి. ఒకటి యానందము; రెండవది బహుత్వేచ్ఛ. అవే (మధు కైటభులు) బహు బలీయములు. వానిని నశింపఁ జేసినపైని, అనేక భావముల కేంద్రస్థానమును లక్షించి, పలు సారులు గ్రహణశక్తి (ఆకర్షణశక్తి) ప్రభావముచే వాని నంత మొందింపవలయును. అనుభవములు ఆత్మరతితో నాత్మతృప్తములు కానంతదాఁక నీ లాగులాట తప్పదు. అనుభూతులు విషయములవంకఁ బరుగెత్తును. ప్రాణము వానిని

వెనుకనుండి లాగి తనలోఁ జేర్చుకొనుచుండును. అనుభూతి కేంద్రము అనేక జన్మములనుండి, అయిదు విధములైన (విషయ) తరంగములచేఁ గల్లోలపడు నలవాటు కలది. ఆ తరంగములు మఱల భిన్న భిన్న నామ రూప వ్యవహారములచే, నసంఖ్య భేద విశిష్టములై యావిర్భవించుచుండును. గావున నీ లాగులాట బహుకాలము తప్పదు. జీవత్వమునకు మూలములై యుపాదాన స్వరూపము లైన యా రెండుసంస్కారములు ప్రబలములు. ఈశ్వరభావీయ మైన యవస్థావిశేషములు కావున జీవభావీయశక్తివిశేషముచే వాని వినాశమును సాధించుటకై దీర్ఘకాలాభ్యాసమును వైరాగ్యమును అనెడి ప్రయత్నములే (సాధనములే) ప్రయోజ్యములు. వాస్తవముగా దీర్ఘకాలము శ్రద్ధాపూర్వక నిరంతరాభ్యాసమును, విషయవైరాగ్యమును లేక, జీవత్వగ్రంధి యేవిధముగాను నమూలముగా నశింపదు. "అభ్యాసేన తు కౌంతేయ వైరాగ్యేణ చ సిధ్యతి."

## మూల సంస్కారములు బహు బలీయములు

"సో ఽ కామయత, బహుస్యాం ప్రజాయేయ" అనెడి యీ బహుభావేచ్ఛాసంస్కారము, చూడఁగా - బృహత్తమ క్షేత్రమునుండి (బ్రహ్మమునుండి) పుట్టినది, కనుక నతి ప్రబలము. మఱల "బహుభావములతో వెలయు నేను, ఏకమై పోదును" అనెడి యిచ్ఛ జీవభావీయసంస్కారమువలనఁ బుట్టినది. కనుక దుర్బలము. దుర్బలునిచేఁ బ్రబలుని యుచ్ఛేదము కాఁజాలదు. కనుకనే ప్రాణ-మనస్సులు రెండును మఱల బహుత్వమును గోరనవుడే, మహామాయయైన యమ్మయొక్క అనంతమును, నిత్యమును,

ఉదారమును, శాంతిమయమును, సర్వభావరహితమును, నిరంజనమునైన సత్తయందుఁ జేరిపోవు నవుడే, సాధకుని కాతరప్రార్థనముచే బాధ్యయై మన యమ్మతన స్వరూపముచే నా సంస్కారములును దమంతన లయ మొందునట్లు చేయును.

నిజముగా మన యమ్మది అట్టి రూపమాధురియే. ఒక సారి చూచినవాఁడు మఱి దానిని మఱువఁజాలఁడు. అస్నిగ్ధ శ్యామను, ఆకోటిచంద్రసూర్యకాంతి తిరస్కారిణిని, ఆ సుధామధురను, అచిద్ఘనసుందరి నొక్కసారి దర్శించిన, మఱల నీ జగత్తు 'ఛీ' యనిపించును. ఎప్పటికిని దానిలోఁ జేరిపోవు వాసనయే యగును. అదే నా యథార్థస్వరూపము; అదే నేను; ఇక్కడ 'నేను, నేను' అనుచున్నది యథార్థమైన నేను కాదు. ఈ నేను కురూపినేను. కాలుసేతులు సంకెలలువడిన జీవుఁడైన నేను. అ నేను స్వతంత్రుఁడు, విభుఁడు, నిరంజనుఁడు, ఆనంద ఘనుఁడు; ఇంకేమి చెప్పను ! ఒక్కసారి, యా నేనును జూచి కొన్నచో, మఱల మఱెవ్వఁడేని, ఈ నేనును 'నేను' అననెంచునా ? కనుక బహుత్వసంస్కారములు మాతృసత్తచే విముగ్ధములై తమంతనే నశింపగడంగును.

## ఇంతే నేను గోరునది.

కొన్నాళు లనుభూతి కేంద్రమును లక్షించి, మాతృ స్వరూప దర్శనమం దలవాటుపడుటచే - అనఁగాఁ బ్రత్యేకాను భూతియు నమ్మయే యనెడి బోధము, సంశయవిపర్యయ ప్రతీతులు లేనిదగునప్పుడే, అ మూలసంస్కారములు - ఆదిమ

సంస్కారములు (బహుత్వానంద బహుత్వేచ్ఛలనెడి మధుకైటభులు) వధ్యులగుదురు.

సాధకా ! నీవును జూడుము. నీ యనుభూతికేంద్ర మెల్ల పుడును, వేలకొలఁది భేదములతో నుండును. నీ రెండు చేతులతో నా భావరాశిని బట్టుకొని, "నా తల్లీ ! రారమ్ము; నా యాత్మా ! రమ్ము; నా నేనా ! రమ్ము; నా సర్వస్వమా ! రమ్ము; రూపమయీ ! వచ్చితివా ? రమ్మమ్మా; రసమయి ! వచ్చితివా ? రమ్ము; శబ్దమయీ ! వచ్చితివా ? రమ్ముతల్లీ ! అని యీ రీతిని, అమ్మనే సర్వభావములుగా జూచితివేని, జయింపరాని యయ్యసు రులు తామే కోరి తమ మృత్యువు నడిగికొందురు.

అది యెట్లగును ? నీవు దృఢమైన యధ్యవసాయ బలముతో సంస్కారములను మాతృమయములుగాఁ జేసివైచితి వనియు, నీ యనుబూతికేంద్రమందు సత్యమనెడి యగ్ని మండు చున్నదనియు, మిడుతలదండువలె వచ్చి సంస్కారరాశి యా యగ్నిలోఁ బడి సత్యమయమై పోవుచున్నదనియు, అంతయును అమ్మయే యైపోయినదనియుఁ గనుగొందువు. అవుడు అమ్మకు ముద్దుబిడ్డఁడవైన నీవును "అమ్మా ! ఇంక ననేక భావములతో వికసింప నేల ? నీ యనేకత్వము నుపసంహరించుకొనుము" అని యమ్మతో ననఁగలవు. అపుడు సంతానవత్సల యమ్మ యనేక రూపముల నంహరించును. అమ్మ తానే బిడ్డనెయ్యముచే మతిపోయి, తన యాసురీమూర్తిని సంహరించుకొకున్నచో, నామె యంగస్పర్శమును జేయుట కెవ్వరికి నెట్టి సామర్థ్యమును లేదు. ఎంత యోగమే కానీ; ఎంత వృత్తినిరోధమే కానీ; మనోయోగ (దృఢాధ్యవసాయ) పూర్వకముగాఁ జిత్తవిక్షేపముఁ దొలఁగింప నెంత

ప్రయత్నింపనీ; ప్రకృతిస్వరూపిణి యమ్మ, తన యాసురీభావమును (పునఃపునః పరిణామ మనెడి బహుత్వమును) దనలో విలీన మొనర్చుకొనకున్నచో, నీజతనములెల్ల వితథమైపోవును. ఇదే యథార్థతత్త్వము.

"నేను సిద్ధిశక్తితో నలంకృతుఁడనై శక్తిమంతుఁడ ననెడి ప్రతిష్ఠ నొందఁగోరను. ప్రేమ భక్తి సత్కర్మాదులైన సర్వోత్తమభూషణములతో భూషితుఁడనై మహిమాన్విత మహాపురుషుఁడను గాఁగోరను. మేన మాసిన ముస్తాబును దీసి వేసి, యమూల్యరత్నాభరణములతో ముస్తాబగుటయు నా వాసన కాదు. సర్వవిధముల నీ చరణములందు నన్నర్పించు కొందును. నీ చరణములం దాత్మబలి యిచ్చి, యనంతజన్మ ములనుండి వచ్చుచున్న కృతఘ్నతకు రవ్వంతప్రాయశ్చిత్తము చేసికొనఁ బ్రయత్నింతును." అను నిట్టి నిష్కామతము యథార్థ ముముక్షుభావమును బ్రాణమందు వికసించుటతోనే, యసురులు (సర్వసంస్కారములు) మాతృమూర్తియందుఁ జేరి పోదురు. ఇంతే నేను గోరునది.

## బృందావనము - కైలాసము.

జీవులు మహామాయయెడ ముగ్ధులు కానంతవఱకే, యనేక జగద్భావములయెడ ముగ్ధులగుదురు. ఈ జగత్తునే యానందస్థాన మనుకొందురు. జీవులు, అత్యల్పకాలమేయుండు నింద్రియ భోగ్య విషయసుఖముతోనే కృతార్థుల మనుకొను చుండునంతదాఁక దాము వంచితులని తలంపనైనఁజాలరు. గాని యేనాఁడు మహామాయ తన స్వరూపమును వారి కంటి యెదుటఁ బ్రకటించి

నిల్చునో, యహానాఁడే "అయ్యో ! ఇన్నాళ్లను జగత్తున యథార్థసుఖము లేకుండఁ బోయితిమి కదా" యని తెలిసికొందురు.

వ్యాపనశీలమైన ధీవృత్తియందే (బుద్ధి తత్త్వమందే) పరమాత్మ విశేషించి యనుభూతము. సాధకులు దేహాదుల యం దాత్మబోధమును దొలఁగించి ధీతత్త్వమం దారోహింతురు; మఱి పరమాత్మ, జీవులయెడనైన స్నేహముచే బుద్ధి మయక్షేత్రమునకు దిగును. ఇచ్చోట జీవుఁడును బరమాత్మయుఁ జేరికొనుట యగును. ఇదే జీవన్ముక్తుల యానందని కేతనము. దీనినే వైష్ణవులు బృందావన మందురు. ఇచ్చటనే రాసలీల యగును. రసస్వరూపుఁడైన యాత్మ యింద్రియశక్తులనెడి గోపికలచేఁ జుట్టుకొనఁబడిన యా రాధిక యనెడి జీవప్రకృతితో నిచ్చటనే రమించును. ఈ యానందము మాటలతో వర్ణింప నలవికాదు. "ఆత్మారామో ఒప్యరీరమత్" ఆత్మారాముఁ డయ్యు నతఁ డేవిధముగా మనతో రమించునో యది యీ బృందావనమును జేరక యెట్లు తెలియఁబడును ? గోపులు - ఇంద్రియశక్తులు, ఆత్మయొక్క మహాకర్షణముచే, విషయము లనెడి యిండ్లను విడిచి, కడు వడిగా వేణుధ్వనిని బట్టి కృష్ణుని వెదకికొంచుఁ బరుగెత్తునపుడే, రాధిక - 'జీవుఁడు - నేను' పూర్తిగాఁ గృష్ణప్రేమమునెడ - పరమాత్మ మోహముచే ముగ్ధయై (ముగ్ధుఁడై) యీ బుద్ధిమయక్షేత్రమనెడి బృందావనమునందుఁ జేరునపుడే, అమ్మతోఁ జేరికొను మహాసంధి క్షణమని యెఱుంగునది. ఈ ధీక్షేత్రమే శైవుల భాషయందుఁ గైలాసము. ఇచటనే విజ్ఞానమయ శివుఁడు; పార్వతి యనెడి పరాప్రకృతితో నానందమున

విహరించును. ఇచ్చోటఁ జేరు నపుడే 'సర్వ మాపోమయం జగత్' జగత్తంతయు వ్యాపనశీల ధీమయముగా - బోధమయముగాఁ గనఁబడును. (శ్రీదేవీ సూక్త వ్యాఖ్యయందు సాయనాచార్యులు 'అప్' శబ్దమునకు వ్యాపనశీల దీవృత్తి - యనిరి.) అంతయు నిచటనే యున్నది. కేవల బోధఘటితము, చిన్మయము. జడత్వ మిచట బొత్తిగా మఱుఁగైనది. మఱియొక పక్షమున, 'అప్' అనఁగా రసమని యర్థము. 'రసోవై నః' శ్రుతి. పరమాత్మ యొక్కటే రస స్వరూపము - పరమాత్మ రసస్వరూపమే, ఆనందమయాత్మ దర్శనమైనపుడే, జగత్తు ఆపోమయముగా - రసస్వరూపముగాఁ దోఁచును. అయ్యాసురీ మూలసంస్కారములు (మధుకైటభులు) మహామాయా స్వరూపము నెడ ముగ్ధులగునపుడు జగమంతయు నాపోమయముగాఁ గనఁబడును.

ఆ సంస్కారములు రసనముద్రమందలి తరంగములే తరంగరూపమున మఱి వికసించుట జరుగదు.

వినుము - బుద్ధిమయక్షేత్రమందుఁ జేరినంతనే జగత్సత్త విలుప్తప్రాయమై పోవును. ఇచట జగత్తు బోధమయముగా వెలయును. ఈ బోధము ఆనందస్వరూపము. 'సర్వ మాపో మయం జగత్' అయిపోవును. ఎచట బోధమయ జగద్భావమును లేదో, ఎచట నిర్మలబోధము, ఆనందము మాత్రమై, యచటనే విషయసంస్పర్శమువల్ల నగు నానందమును బహుత్వమును దుదముట్టును. బుద్ధి-మహత్త్వము ఉదయించుటచే ద్రష్టనునేను (సాక్షిభావము) అను ననుభవము గలుగును. జగత్తు ఛాయవలె బుద్ధిసత్తచే భాసించుచుండును. సుఖము, దుఃఖము, ఏడుపు,

నవ్వు మున్నగు విరుద్ధభావములు సాధకునకు మఱి చాంచల్యమును గలిగింపఁజాలవు. "నేను సర్వ భావములకు సాక్షిమాత్రుఁడను" అను బోధ ముబుకును. ఈ యవస్థయందు - ఆత్మబోధమయమైన యుదాసీనక్షేత్రమందు జగత్సత్త క్షీణించును. ఇదే 'ఆపో మయం జగత్' ఆ విశుద్ధ బోధస్వరూపమందే సర్వభావములు సమాప్తమై పోవును.

## దీని పేరే బ్రహ్మగ్రంథి భేదము.

మూలసంస్కారవశమున ననంతకాలమునుండి వచ్చుచున్న జనన మరణ తీవ్రప్రవాహమందుఁ గొట్టుకొని పోవు చున్నాఁడు. అ య్యాదిసంస్కారమువల్లనైన బహుత్వమూల కానందమును, బహుభావేచ్ఛయు నిన్నాళ్లకుఁ బ్రాణశక్తి జాగరణముచే స్థూలదేహము నాశ్రయించియే బహుత్వము నుండి విముక్తము లైనవి. ఏ యజ్ఞానగ్రంధివశమున మన స్సెల్లప్పుడు బహుత్వసంకల్పము చేయునో దానియందే యానందము నొందును. ఆ గ్రంధి యుచ్ఛేదింపఁబడుట పేరే బ్రహ్మగ్రంథిభేదము. ఏ గ్రంథిచే మనస్సు కట్టువడెనో యా బ్రహ్మగ్రంథి భేదమైనపుడే సాధకుఁడు - ఈ జగత్తు, ఈ స్త్రీ పుత్రాదులు, ఈ దేహము మున్నగున దంతయుఁ గల్పనా మాత్రమేయని తెలియఁగల్గును. అమ్మయొక్క విరాణ్మనస్సు చేనైన తల్పనమే యీ విశ్వరూపముతోఁ బ్రతిభాసించు చున్నదని యపుడు స్పష్టముగ ననుభవమునకు వచ్చును. భవిష్యత్తునందు (కాఁగల) ఆశలు ఆకాంక్షలుఁ దొలఁగును. ఇదే యాగామి కర్మఫల ధ్వంసము. మున్ముందు సంచితప్రారబ్ధ కర్మఫలక్షయమనెడి విష్ణురుద్రగ్రంథి భేదములు వివరింపఁబడును.

## కర్మఫల ధ్వంసవిషయమున భగవంతుఁడు.

"జ్ఞానాగ్నిః సర్వకర్మాణి భస్మసాత్కురుతే౽ర్జున" మండు నగ్గి, కట్టెలను బూడిద చేయునటులే జ్ఞానమనెడి యగ్గి మూడువిధములైన కర్మములను భస్మము చేయును. శంకరాచార్యులు దీనికి వ్యాఖ్యవ్రాయుచు నిచటి సర్వశబ్దార్థమును సంకుచితము చేసిరి. జ్ఞానము లభించినంతనే యాగామి సంచితములనియెడి రెండువిధములైన కర్మములు క్షయించునుగాని ప్రారబ్ధకర్మక్షయము కాదనిరి.

దృష్టాన్తముగా - వ్యాధుని చరిత్రము నుల్లేఖించిరి. "ఒక వేఁటకాఁడు లేఁడిని లక్షించి వింట శరముఁ దొడిగెను. రెండవబాణ మెడమచేత నున్నది. అమ్ములతో నిండినపొది వెన్నున నున్నది. కొంచెము దూరమునఁ బరుగెత్తుచున్న లేడి నుద్దేశించి బాణము విడిచిన యుత్తరక్షణమందే భగవత్కృపచే వ్యాధునకు జ్ఞానముదయించి, అకస్మికముగా వైరాగ్యము గల్గుటచేఁ జేతి యమ్మును దూణీరమును సైతము విడిచిపెట్టి 'నేనింక బ్రాణిహత్య చేయను' అనెను గాని, చేతినుండి విడువఁబడిన బాణము గుఱిచేయఁబడిన యాలేడిని జంపెను. అటులే జ్ఞానము గల్గుటచే ఆగామి (భవిష్యత్కర్మమునకు బీజ భూతమైన వర్తమాన కర్మము - అనఁగా ఫలభోగారంభము కాని కర్మము) సంచితముగా నుండును. ఆరెండు విధములైన కర్మములే వినష్టమగునుగాని ఏ కర్మఫలముచే వర్తమానదేహ మారంభమైనదో దాని భోగము పూర్తి యగునంతదాఁక దేనివల్లను నది క్షయింపదు." అనిరి. ఇమ్మాట బహుయుక్తి సమ్మతమే. శాస్త్రమందును "నాభుక్తం క్షీయతే కర్మకల్ప

కోటి శతైరపి" 'అభుక్తకర్మము కోటికల్పములకైనను క్షయింపదు' అని యున్నది. పో. కాని భగవంతుఁడు "జ్ఞానాగ్నిః సర్వకర్మాణి భస్మసాత్కురుతే ఽర్జున" యన్నప్పుడు జ్ఞాన ప్రాప్తిచే సర్వ (ఆగామి సంచిత ప్రారబ్ధములు) కర్మములు క్షయించుననిమనకుఁ దేటపడుచున్నది. జ్ఞానమెంత యుజ్జ్వల మైనపుడు - జ్ఞాన మెట్టియవస్థను జేరినపుడు సాధకుని ప్రారబ్ధ కర్మఫలరూపమైన యీ స్థూలదేహపర్యన్తము విలయమై పోవునో; అట్టి యున్నత జ్ఞానావస్థను జేరఁగల్గునపుడే యథార్థముగా సర్వకర్మక్షయ మగును. జ్ఞానమెంత యుజ్జ్వలము కాఁగా ఆగామి సంచితకర్మమాత్రము క్షయించునో, యంత లాభమును సాధకుఁడు తన దృఢాధ్యవసాయముచేఁ బొందఁ గలఁడు గాని ప్రారబ్ధముదాఁక క్షయింపఁజేయునంతటి యుజ్జ్వల జ్ఞానమునొందుట దురూహవ్యాపారము. మాటిమాటికి సమాధిస్థుఁడై మఱల దేహాత్మబోధము రేఁగుచున్నవాని జ్ఞానము అట్టి యుజ్జ్వలతరక్షేత్రమున కెక్కలేదని తెలిసికొన వలసినదే. ఏమనఁగా ప్రారబ్ధానుభవక్షేత్రమైనవాని దేహ మలసిపోవును గాని సాధకుఁడు సమాధినిష్ఠుఁడై మఱల దేహాత్మబోధ రేఁగని యొక సుదినము వానికి వచ్చును. "యద్గత్వా ననివర్తంతే తద్ధామ పరమం మను" ఇదే జ్ఞానముయొక్క యుజ్జ్వల స్వరూపము. మఱి యీ యవస్థను జేరినపుడే యథార్థజ్ఞానము చక్కఁగా లభించినదని నిశ్చయింపవలయును.

జీవాత్ముఁడు బుద్ధిమయక్షేత్రమనెడి విజ్ఞానమయగురుని చరణముల నాశ్రయించి, క్రమముగా మహామాయా (మాతృ) ప్రభావమును గాంచి ధన్యుఁడగును. ఆగామి కర్మబీజములు

ధ్వంసమగునపుడే - మఱల మొలకెత్తశక్తిలేని వగునపుడే బ్రహ్మ గ్రంథి భేదమగును. "మఱి నా కేమియు నక్కఱలేదు. నే నేమి యుం గోరను. ఇహపరఫలభోగ కామన నాకులేదు". అను నిట్టి నిష్కామభావమే, 'ఒక్క నేను పెక్కగుదును' (అహం బహుస్యామ్) అనెడి యనాదిమనంస్కారమునకువిరోధి. శంకరాచార్యుల మాటలలో నిదియే 'ఇహాముత్రఫలభోగవిరాగము' ఇట్లగుట చేతనే పరమాత్మసాక్షాత్కారము ప్రాపించునని వారనిరి. మఱి దేవీమాహాత్మ్యమునందు, మహామాయ తామసీమూర్తితో నావిర్భవించి, ప్రాణశక్తిని (విష్ణుని) జాగరితను జేయుట చేతనే, యథార్థఫలభోగవిరాగముగల్గునని చెప్పఁబడినది. అమ్మ దర్శనము కాకమున్ను, మూర్తిగా నెవ్వఁడును వాననాత్యాగమును జేయఁజాలఁడు అని దీనిచే మనకుఁ దెలియుచున్నది.

## అమ్మను జూచు నుపాయ మేది ?

ఇచ్ఛయే యుపాయము. గట్టి యిచ్ఛ గల్గుటచేతనే కానఁబడును. అమ్మ మఱిచాటుకాదు. ఏదేనొక యుపాయముచే వెదకి, యామెను బయల్పెట్టుపని లేదు. అమె యంతటను జక్కఁగా వెలయుచున్నది. జీవుఁడు కోరకున్నచో నామె వానికిఁ గానరాదు. అమ్మను జూచు కోరిక పొడమినంతనే, యామె సద్గురురూపమునఁ దొల్త దర్శనమిచ్చును. సద్గురుఁడు లభించినంతనే, సాధకుఁడు తన తను మనః ప్రాణాది సర్వస్వము గురుచరణములం దర్పింపఁగడఁగును. క్రమముగా గురుఁడే వాని 'నేను' అయిపోవును. జీవభావీయకర్తృత్వబోధము సడలిపోవును. మంచికర్మమే కానీ, తాఁజేయునది చెడ్డకర్మమే కానీ; వాని యెడల "నేను కర్తను" అనెడి ధారణ మఱి చేయలేఁడు. అపుడు "కేనాపి దేవేన హృదిస్థితేన,

యథా నియుక్తో௨స్మి తథా కరోమి" అను నిట్టి తెలివితోనే జాగతిక కార్యములను జేయుచుండును. దీని ఫలముగా వర్తమాన కర్మమునందు, అనురాగమును విద్వేషమును నుండదు. గాన నవి భవిష్య త్కర్మబీజములుగా - బంధనరూపములుగా బరిణమింపవు. ఈ విధముగా సాంసారిక కర్మములయం దాసక్తి తఱుగుచున్న కొలఁది, హృదయస్థుఁడైన గురువునెడ, సాధకుని యాసక్తి పెఱుగుచుండును. ఆసక్తి పెఱుగుచున్న కొలఁది నాతఁడు వానియందు ముగ్ధుఁడగుచుండును. క్రమముగా సర్వవిధముల నాత్మార్పణముచేసి సాధకుఁడు నిశ్చింతుఁ డగును. అపుడతఁడు గురుఁడును అమ్మయు వేఱుకారని తెలియఁగల్గును. అతఁడే (అమ్మయే) లోపలినుండి సర్వానుష్ఠానములను నెఱవేర్చు చున్నాఁడనియుఁ దెలియఁగల్గును. అట్టివేళ సాధకుని త్రివిధ కర్మఫలములనుక్షయింపఁజేయుటకై యమ్మ విశిష్టభావముతోఁ గ్రమ క్రమముగా నావిర్భవించును. అపుడు మఱి వానికిఁ గర్తవ్యమేమియు మిగులదు. అహంభావముతో విశిష్టపురుష కారమును జేయుపని యుండదు. ఏదోయొక యలంఘ్యమైన నియమము కారణముగా, సమస్తకార్యములు నొకదాని వెనుక నొకటి నిష్పన్నములై పోవుచుండును. ఈ గ్రంథిభేదనమునకై యెపుడెట్టి యధ్యవసాయ మావశ్యకమో, యపు డట్టి భావముతో మన యమ్మ తన్నుఁ దా వెలయించుకొనుచుండును. ఇదే సాధనాజగత్తునందు యథార్థక్రమ సోపానము. సాధకుఁ డెట్టి సంప్రదాయమునకుఁ జెందినవాఁడే కానీ, వాని కిట్టి సాధారణక్రమమందు వచ్చి పడుటే యగును.

మఱొక్కమాట - ఈ విధముగా నొకసారి యయ్యెనా, క్రమముగా నదే తనంతట నగుచుండును. ఇదే సాధనమందు విడిపోని కట్టుబాటుతోడి పద్ధతి.

మన యమ్మ సచ్చిదానందస్వరూప. ఆమె జగన్ముఖ ప్రకాశము (సృష్టి) సచ్చిదానందస్వరూప మైనట్టులే, ఆత్మాభి ముఖాభివ్యక్తియు సచ్చిదానందస్వరూపమే. కావున సత్ (సత్య) ప్రతిష్ఠయే సాధనమునకు మొదటిమెట్టు. చిత్ప్రతిష్ఠ రెండవది. ఆనందప్రతిష్ఠ తుదిది. అనఁగా నిదే నిత్యము క్తభావము. సత్యప్రాణ (చిత్) ప్రతిష్ఠ యైనంత, నానందప్రతిష్ఠ తనంతనే యగును. అస్తిత్వానుభవమే యథార్థ సత్యప్రతిష్ఠ, ఇదే - "అమ్మ యన్నది" అను నీ విశ్వాసము ఘనీభూత మగుట చేతనే, జీవభావీయ కర్తృత్వము సడలిపోవును. ఆగామి కర్మము మూలముట్టుగా ధ్వంసమగును. దీనినే బ్రహ్మగ్రంథి భేదన మందురు.

## అమృతపుత్త్రకులారా! ముక్తి జలధిని మున్గుఁడు.

సాధకులారా ! క్షణస్థాయి విషయానంద జన్యమైన చాంచల్యముచేఁ బీడితుల మనుకొనుచున్నారా ? ఈ బహుత్వానందమును ఉత్పీడనము, ఆత్మవంచనము నని తెలిసి కొన్నచో, నిశ్చయముగానే మీరు సద్గురుకృపచే, మాతృ స్నేహమునెడ ముగ్ధులై కొలఁదికాలములోనే మాత్రంకమునకు లాగికొనఁబడుదురు. మీరు మోక్షశాస్త్రమును, ఉపనిషద్రహస్యము నైన గీతాసోపాన పంక్తిని మెల్లమెల్లఁగాఁ గడచి "సర్వధర్మాన్పరిత్యజ్య" పరమాహంతయందు - చిన్మయక్షేత్రమందు ప్రశాంతోదార

మాతృవక్షమందు - ముక్తిజలధియందు దూకిపోదురు. అందుఁ దప్పక మున్గిపోవుదురు. మూడు తరంగములే కనఁగలరు. అందు మొదటి కెరటపుఁ బొర్లునందు, ఇంచుకంత యవిశ్వాసనం దేహము లనెడి మాలిన్యములను గడిగివేసి, సర్వవిధముల వాసనాగ్నులను జల్లార్చు కొందురు. తరువాత, నెంత లోఁతులకుఁ బోయి వెదకినను, రవ్వంత కామన మీకు దొరకదు. అంతటను ఆనందమయ మాతృసత్తయందలి విశ్వాసము హిమాచలమువలె దృఢమై యచలప్రతిష్ఠిత మగును. ఇపుడు మనస్సును బహుత్వప్రియ మనియు, విషయాసక్తమనియుఁ దెలిసి "మేమేమి చేయఁగలము ? ఆత్మలాభమున కయోగ్యులము" అనుకొన్నవారే, తమ మనస్సును, బహుత్వ తన్మూలకానందములను దెగఁదీయు సాధనముగాఁ జేయుదురు. మీ యాగామి కర్మబీజములు నిర్మూలములైపోవును. బ్రహ్మగ్రంథి భేదమైపోవును. మీరు సత్యప్రతిష్ఠితు లగుదురు. అక్కడి కా కెరటము పొరలిపోయి నటులే. క్రమముగా మఱి రెండు కెరటములు వచ్చును.

అందులో నొకటి - సర్వమయాత్మసత్తయందు, మాతృ సత్తయందు మీకుఁ గల విశ్వాసమును బ్రాణ (చైతన్య) మయమునుగా నొనర్చివేయును. అంతటను ప్రాణలీలను గాంచి మిమ్ము మీరు మఱచు టారంభమగును. ప్రాణమయ (విష్ణు) గ్రంథి నుచ్ఛేదించు సాధన మగును. సంచితఖర్మ ఫలభోగము పట్టువలన దప్పుకొందురు. ప్రాణప్రతిష్ఠు లగుదురు. తుట్టతుదను మఱొక్క కెరటమే వచ్చును. అది విశ్వమయప్రసారముగల మహాహంత యనెడి యానందసముద్రములోని కీడ్చుకొని పోవును.

అందు ముంచివేయును. పరిచ్ఛిన్న జ్ఞానమయమైన రుద్రగ్రంథియు విడిపోవును. ప్రారబ్ధ కర్మఫలస్వరూప స్థూల దేహము వఱకు విస్మృతమే యైపోవును. మీ రానందమందుఁ బ్రతిష్ఠితు లగుదురు.

ఎవ రెచ్చట నున్నారో, సాధకసోదరులారా ! శాక్త బంధువులారా ! రండు; మనమందఱముఁ జేరి కోటికంఠములతో బిగ్గరగా, అమ్మా ! అమ్మా ! యంచు ముందంజ వేయుదము. శ్రీమాతృ ప్రభావమును, అమ్మ గొప్ప కథలను జెప్పికొంచు, అభూతపూర్వ సాధనసామగ్రిని నంచుల నించికొంచు ధన్యులమగుదము. మన యజ్ఞానాంధ నయనములు జ్ఞానాంజనముచే నున్మీలితమగుఁగాక. శ్రద్ధాభక్తులు లేని శుష్కహృదయములను బరాభక్తి యనెడి మందాకినియందు ముంచుదము. హతాశులును, గర్మహీనులును, అలసులు నైన జీవులు మఱల సత్కర్మపరాయణు లగుదురుగాక. జ్ఞానభక్తికర్మముల యపూర్వసమన్వయ పూర్ణావస్థ నొందుదుముగాక.

అమ్మా ! రమ్ము; బిడ్డనెయ్యముచే మతిపోయి యొక్క సారి సత్యలోకమును వీడి రా; మేము మిగుల వికృతులమై, మలినులమై కూరుచున్నాము. ఈ దేవతను ఈ మలినతను మే మే విధముగాను దొలఁగింప లేకున్నాము. నాలుగు వైపులనుండి మిథ్యాభ్రాంతుల చీఁకటి దట్టమై క్రమ్ముచున్నది. ఒక్కసారి చూడుమమ్మా ! నీ ప్రియతమ సంతానము కఱవు. మహామారి, విసూచి, మసూచి, తుఫానులు, వఱదలు మున్నగు పీడలచే జర్జరీభూతమై, అవిశ్వాసము, అశ్రద్ధ, సంశయము, ఉపేక్ష మున్నగు సుడిగాలులచే లోని సరసప్రశాంతభావ మెగిరిపోయి నిరానందమై ఏదే నొక

వేషమున మృత్యువే యీ యుగలక్షణమా ? యనుచున్నది. కనుక నీయుగసంధి మహాక్షణమందు, నీవొక్కసారి యావిర్భవింపు మమ్మా ! ఒక్కసారి స్నేహకరుణభారమమగు మూర్తితో మాయెదుట నిల్వుమమ్మా ! మేము విజ్ఞానమయియు, నానందమయియునైన తల్లి బిడ్డలమనియు, నీవు మాయెడ నెయ్యమునే కురియుదు వనియుఁ దెలియఁజెప్పు మమ్మాఁ అవిశ్వాసులు, అకృతజ్ఞములు నైన మా ప్రాణముల నాదరింపు మమ్మా ! ఆనందమే మా స్వరూపమని మా రోమరోమ కూపములందు ననుభవింపఁ జేయు మమ్మా ! బిడ్డనెయ్యము గల తల్లివి నీవొక్కర్తవే యని మాకుఁ జక్కఁగాఁ దెలియఁజెప్పుఁ మమ్మా ! మేము సత్యముగా సరళప్రాణులయిన శిశువులవలెఁ జేరుకొని, గొంతెత్తి యొక్కసారి అమ్మా ! యని పిలువఁగల్గుదుమో ! నీ మంగళమయ స్నేహాశీర్వాదము లెపుడు మా తలపై గురియునో ! ఎపుడు మేము సత్యమందుఁ బ్రతిష్ఠితులమై ధన్యులమగు దుమో ! మా భక్తిహీన ప్రణామముల నందుకొనవా ? తల్లీ !

"సర్వమంగళ మాంగల్యే శివే సర్వార్థసాధికే ।
శరణ్యే త్ర్యంబకే గౌరీ నారాయణి నమో உస్తుతే"

ఇది
శ్రీ శ్రియానందనాథా పరనామధేయుఁడు
ఈశ్వర సత్యనారాయణశర్మ
సంగ్రహించిన
సాధన సామగ్రి తొలిమూట.

# సాధన సామగ్రి

శ్రీ ఈశ్వర సత్యనారాయణ శర్మగారు

"ఆంధ్రదేశమునందు తంత్రశాస్త్రము తెలిసి సాంప్ర దాయికముగా దీక్షనంది, ఉపాసనలో అమ్మతో ముచ్చటలాడి ఆడించుచు నున్నవారు శ్రీ ఈశ్వర సత్యనారాయణ శర్మగారను శ్రియానందనాథులు. తెలుఁగు బాసలో స్వతంత్ర తంత్రశాస్త్ర రచనమునకు (నా యెఱింగినంతవట్టు) వీరిదే శ్రీ. 'అమ్మతో ముచ్చటలు' అను పద్యరచనము వీరికి శబ్దబ్రహ్మముతోడి బ్రహ్మణితోఁగల యెఱుక నెఱుకపఱచును. ఇది సజీవమైన గ్రంథము. ఇది అమ్మతలపై వాడనిపూవు. ఇది ఇంద్రనీలము మీఁది చెక్కడము".

"ఈ సాధన సామగ్రి సులభముగా జీర్ణించుకొనఁదగిన మేలిగ్రంథము. ఇది యెన్నియెా చాటుమాటల తెరను తొలఁగించి వానికి వెలుఁగొసఁగెను. ఈ సాధన సామగ్రి మొదటిపుట మొదలుకొని చివరపుట వఱకును సాధకులకొక క్రొత్త వెలుఁగును జూపుచు కరదీపికవలె నిది మనతో వయనించును. మొత్తముమీద నిది తంత్రశాస్త్ర ప్రవేశికయేయయ్యు చక్కని తంత్రకావ్యమువలె మనచే చదివించును. దీని సంపూర్ణ స్వరూపము తంత్రశాస్త్రమున కొక అలంకారముగను సాధకులకు కంఠమణిగను ఉండఁగలదు."

శతావధానులు :

శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారు.